# నికష

('విశ్వధర్మవాణి' సంపాదకీయాలు 1991-2009)

డా॥ సూరం శ్రీనివాసులు



సంకలనం - ప్రచురణ
డా॥ సిహెచ్.పి.సత్యనారాయణ
రాష్ట్రియ సంస్కృత విశ్వవిద్యాలయం,
తిరుపతి - 2009.

# నికష

('విశ్వధర్మవాణి' సంపాదకీయాలు 1991-2009)

## డా॥ సూరం శ్రీనివాసులు

*సంకలనం - ప్రచురణ*

**డా॥ సిహెచ్.పి. సత్యనారాయణ**

రాష్ట్రీయ సంస్కృత విశ్వవిద్యాలయం

**తిరుపతి - 517 064**

# ధర్మమార్గం

– పొత్తూరి వెంకటేశ్వరరావు

ఆంగ్ల పాత్రికేయ పరిభాషలో 'లీడర్' అనే మాటకు ప్రధానవ్యాసం అని అర్థం. ఎడిటర్ వ్రాసేది ఎడిటోరియల్. పెద్ద పత్రికలలో ఎడిటర్లకు బదులు లీడర్ రైటర్లు వ్రాయవచ్చు గనుక ఎడిటోరియల్కు ప్రత్యామ్నాయంగా లీడర్ పదం కూడా విరివిగా వాడుకలోకి వచ్చింది. 'ఎడిటోరియల్' పదానికైనా 'లీడర్' పదానికైనా తెలుగులో వాడుతున్నమాట 'సంపాదకీయం'. చిన్న పత్రికలలో, ముఖ్యంగా కాలిక (పీరియాడికల్) పత్రికలలో సంపాదకులే సంపాదకీయాలు వ్రాసుకొంటారు. ఎవరు వ్రాసినప్పటికీ సంపాదకీయం పత్రికలో ప్రాముఖ్యం, ప్రాధాన్యం కలిగిన వ్యాసం. దినపత్రికలలో సంపాదకీయాలు ప్రధానమైన వ్యాసాలే. ఐనప్పటికీ వాటిల్లో భద్రపరచుకొనదగినవి ఎప్పుడోగాని కనిపించవు. కాలిక పత్రికలు కొన్నింటిలో ఎప్పుడైనా మళ్ళీ చదువుకోవచ్చు అనిపించేవి తగినన్ని ఉంటాయి. మరీ ముఖ్యంగా ఆధ్యాత్మిక పత్రికలలో అలాంటివి ఎక్కువే ఉంటాయి.

ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న గ్రంథం అలా ఎప్పుడైనా చదివి, ఉపయోగం పొందదగిన 'విశ్వధర్మవాణి' సంపాదకీయాల సంకలనం. 'చదివి' అనే గాక 'ఉపయోగం పొందదగిన' అని కూడా అనడం ఉద్దేశపూర్వకమే. కొన్ని రచనలు వినోదం కలిగిస్తాయి, కొన్ని విజ్ఞానాన్ని పెంచుతాయి. కొన్ని ఈ రెండిటిని గాని, ఇందులో ఒకటిగాని అందించి బుద్ధిని వికసింపజేస్తాయి కూడా. 'పంచతంత్రం' అలాంటిదే. 'ఆధ్యాత్మికం' పరిధిలోకి వచ్చే కొన్ని రచనలు బుద్ధివికాసానికి దోహదపడటంతోపాటు సమస్యలతో సతమతమవుతున్న మనస్సుకు ఉపాయాలను స్ఫురింపజేయవచ్చు. ఊరట కలిగించవచ్చు. భగవద్గీత పద్దెనిమిదవ అధ్యాయం చివర సంజయుడు "…. సంస్మృత్య సంస్మృత్య సంవాదం ఇమం అద్భుతమ్…. ముహుర్ముహుః" అంటాడు. కృష్ణార్జునుల మధ్య సంవాదమే భగవద్గీత కనుక ఒకసారి చదివి అవతల పారేయకుండా మళ్ళీ మళ్ళీ చదవమనే సూచన ఈ మాటల్లో ఉంది. సంస్మృత్య శబ్దాన్ని రెండుసార్లు

అనడం కూడా గమనించవలసిన విశేషం. ఎప్పుడు ఏ క్లిష్టసమయంలో ఏ శ్లోకం జ్ఞాపకం వచ్చి ఉపయోగపడుతుందో చెప్పలేము గనుక మొత్తం మళ్ళీ మళ్ళీ చదవాలని ఇందులో ధ్వని. 'సుందరకాండ' పారాయణగ్రంథం కావడంకూడా ఇలాంటి ప్రయోజనం ఉంటుంది కనుకనే. సమస్యకు సూటిగా పరిష్కారాలు లభ్యం కాకపోయినప్పటికీ వెంటనే ఊరట కలిగించి, పరిష్కారానికి మార్గం స్ఫురించే పరిస్థితిని ఈ గ్రంథాలు.. కలిగించవచ్చు.

ధర్మస్వరూపాన్ని అర్థం చేసుకొనడం పండితుల నుండి పామరుల దాకా అందరికీ అసాధ్యంగా కనిపిస్తున్న కాలంలో 'ఆచరణీయమైన ధర్మస్వరూపాన్ని' వివరించడం తమ విధానమని సంపాదకులు స్వయంగా ప్రకటించారు (జూలై, 2001 సంచిక సంపాదకీయం). ధర్మస్వరూపం తెలిస్తే జీవిత సమస్యలకు పరిష్కారాలు వాటంతట అవే లభిస్తాయి. ఈ ప్రయత్నంలో సంపాదకులు రాగద్వేషాలను, ఆవేశకావేశాలను దగ్గరకు రానివ్వలేదు. ఎక్కడైనా ఒకింత ఘాటుగా చెప్పవలసిన వచ్చినా, అధిక్షేప పూర్వకంగా వ్యాఖ్యానించినా అది సమాజ హితాన్ని కోరి పలికిన హితోక్తో, ధర్మాగ్రహమో అయుంటుంది.

పాలకులు పడేపాట్లు, పన్నే ఎత్తుగడలూ ప్రజాహితం కోసమే అయుండాలని అంటూ "వాక్కుకన్నా బలహీనంగా చేష్ట, చేష్టకన్నా బలహీనంగా మనస్సు చాలామంది నాయకులలో కనిపించడం మాత్రం జాతికి సిగ్గుచేటు" అన్నారు ఒకచోట రచయిత. అది నాయకుల మీది చురక.

పర్యావరణ సమతౌల్యం లోపించటానికి పాలకులూ, పాలితులూ కూడా బాధ్యులన్న సత్యాన్ని గుర్తుచేస్తూ "మట్టి కనిపించకుండా సిమెంటు పరుచుకుంటున్నాం. అడ్డొచ్చిన చెట్లను అలాగే నరుక్కుంటున్నాం. పాలితులకూ, పాలికులకూ ఇద్దరికీ లేని అవసరం వానదేవుడికొచ్చిందా?" అన్నారు. మరో సంపాదకీయంలో 'రండి, అందరం కలిసి పెళ్ళలు పంచుకుతిందాం' అని కూడా అన్నారు అందులోనే. అది ధర్మాగ్రహం, ప్రజలకు వారి బాధ్యతను గుర్తుచేస్తూ వారి మీదనే వేసిన చురక..

సంపాదకులు డాక్టర్ సూరం శ్రీనివాసులు అధ్యాపకుడు, పరిశోధకుడు, కవి, అవధాని. ఆంధ్ర, ఆంగ్లం, సంస్కృతం, పాళీ, ప్రాకృతం, హిందీ భాషలలో ప్రావీణ్యం సంపాదించినవారు. ఇరవయ్యో శతాబ్దం చివరి దశకం మొదలు 'విశ్వధర్మవాణి' పత్రికకు సంపాదకులు. విద్వత్తూ, విజ్ఞానం అపారంగా ఉన్నవారు శ్రీనివాసులుగారు. సమాజాన్ని ధార్మికమార్గంలో నడిపించడం ఆయన ఆశయం.

తనకు తెలిసిన ఏ భాషలో వాఙ్మయాన్నయినా కొత్తకోణాలనుంచి చూడగల ప్రతిభ ఆయనకు ఉంది. ఉదాహరణకు మహాభారతం గురించి వ్రాస్తూ 'ఒక పాత్ర మరొక పాత్రలోని గుణదోషాలను ఎత్తిచూపటం, అధిక్షేపించటం, అవహేళన చేయటం ఈ ఇతిహాసానికి ప్రాణం' అన్నా రొక సందర్భంలో అరుదైన వ్యాఖ్య ఇది.

శ్రీనివాసులు గారు ఈ పుస్తకానికి 'నికష' అని పేరు పెట్టారు. తరచు వినపడే శబ్దం కాదు కనుక కొందరికి అర్థంకాకపోవచ్చు. నికష పదానికి ఒక అర్థం సాన. పదునుపట్టే సాధనం. పుస్తకంలోని వ్యాసాలను చదివిన కొలది బుద్ధి పదును తేలుతుందని ఈ పేరు పెట్టడంలో ఆంతర్యం కావచ్చు. బుద్ధి మనస్సును నియంత్రించే ఒక సాధనం అన్నారు శ్రీనివాసులు గారు ఒక సంపాదకీయంలో, మనిషి బుద్ధిజీవి స్థాయినుంచి హృదయజీవి స్థాయికి ఎదగాలని, అప్పుడతడు మహనీయుడు కాగలడని ఆయన ఆకాంక్ష. అలాంటి పరిణామానికి ఈ గ్రంథాన్ని మళ్ళీ మళ్ళీ పఠించడం దోహదం చేయవచ్చు.

ధర్మమార్గాన్ని అనుసరించదలచుకొన్న ఎవరికైనా ఇది పఠనీయ గ్రంథం.

★ ★ ★

# మాగాణి వేదాంతం

మానవజీవితం మనిషి చుట్టూ ఉన్న పరిసరాల ప్రభావానికి, మనిషిలోని పరిమితులకి మధ్య జరిగే సంఘర్షణల నుండి రూపుదిద్దుకుంటుంది. ఈ రూపు దిద్దుకోవటంలో మనస్సు గారడీశాతం మన గమనిక లేకుండా ఎక్కువే ఉంటుంది. మక్కువతోపాటు ఎక్కువైన ఆ గారడీభాగంలో మనం విలీనమైపోయి అహంకరించి మనవల్ల అంతా జరిగిందని, దానికి మనమే హక్కుదారులమనీ అభిజాత్యాన్ని ప్రకటించడానికి ప్రయత్నించడంలో జరిగే ఆటుపోట్లన్నీ సమస్యలకి మూలకారణాలు.

ఓ మంచినటుడు తను అభినయించవలసిన పాత్ర గుణగణాలను స్వభావాలను అవగాహన చేసుకొని ఆ పాత్రను అభినయించటం ద్వారా, దానిని తిలకిస్తున్న సహృదయుడు ఆ అభినయం నుండి పుట్టిన తరంగాల ప్రభావం వల్ల తనను తాను భౌతికంగా మర్చిపోయి పాత్రలో తాదాత్మ్యం చెందటం ద్వారా రసానుభూతి పొందేందుకు తోడ్పడాలే కానీ నటుడు తనను తాను మరచిపోవటంకోసం కాకూడదు. నటుడు మాత్రం తనను తాను 'నేను నటుణ్ణి' అనే 'ఎరుక'లో ఎప్పుడూ ఉండాలి. తాను పాత్రలో తన్మయం పొందటం తప్పటడుగు అవుతుంది.

వివిధదశలలో వివిధపాత్రలలో ప్రవేశిస్తున్న మనం పరిస్థితుల ప్రభావం వల్లో, వైయక్తిక పరిమితులవల్లో మనస్సు చేసే గారడీలో 'ఎరుక' మరచి వ్యవహరించటం వల్ల అహంకారం ఉద్భవిస్తోంది. ఆ ప్రభావం వల్ల అనర్థపు పంథాలను అనుసరించడం జరుగుతోంది. తద్వారా పాత్రానుగుణంగా అభినయించి సహృదయుణ్ణి ఆనందపరచి, శాంతి పొందాల్సిన మనం ఆ యా కార్యాలలో జయాపజయాలకు అతుక్కుపోయి రాగద్వేషాల మెట్లపై అడుగులేస్తున్నాము. ఈ రకమైన గమనంనుంచి వెలువడి బాధ్యత నిర్వహిస్తున్నామనే 'ఎరుక'లో కార్యనిర్వహణ చేయటమే ఆధ్యాత్మికం.

ఆచరణలో సాధ్యాసాధ్యాలను పరిగణనలోకి తీసుకోవటంలో వివిధ అభిప్రాయాలు, తారతమ్యాలు జీవితం పట్ల అవగాహనలో అస్పష్టతకు

కారణమవుతున్నాయి. దానిని అధిగమించడానికి ప్రయత్నించేవారికి సహకరించేవే. శాస్త్రాలు, వాఙ్మయ శాఖలున్నూ, అటువంటి వారికోసమే మాస్టారి ఈ మాటలు - "జ్ఞానులు దేహానికి విరుగుడుగా భావాన్ని కనుగొన్నారు. దేహంయొక్క వాస్తవిక స్థితి మోహానికి కారణమైతే భావనాత్మకస్థితి దానినుంచి బయటపడవేసే అవకాశం ఉంది" కదా!

జీవితంలో ఎంతో కొంత సంఘర్షణలకు గురయిన వ్యక్తే ఆగి అంతర్దృష్టితో పరిశీలిస్తే వీటి అవగాహన సులభతరమవుతుంది. సంఘర్షణ స్థాయి పెరిగేకొలది దానిని క్రమబద్ధీకరించే ఆలోచన తోడ్పడితే, అందులో పుట్టే ప్రతిమాటా ఓ గీటురాయి అవుతుంది. ఆ గీటురాయి ఈ నికష.

హిరణ్యంగా పరిగణనలోనికి తీసుకోవల్సిన ద్రవ్యంలో హిరణ్యపు శాతాన్ని నిర్ధారణ చేసేది ఈ గీటురాయి - నికష మనచుట్టూ ఉన్న ప్రపంచం, అంతకు మించిన తరతరాల వాఙ్మయం తన లక్ష్యం వైపు ప్రజలను - మనలను మరల్చడానికి ఇది ఉపకరిస్తుంది. వాఙ్మయలక్ష్యాన్ని ప్రపంచగమ్యాన్ని సుస్పష్టంగా చూపిస్తున్న భావాలపరిణతి భాషలోని పదును జీవితం చివరలో కాక, ఆజీవనం ఆనందాన్ని చవిచూసే వెలుతురునిస్తుంది. దేహానికి, భావానికి అనుబంధాన్ని అవగాహన చేసుకొని దేహం నుంచి మనసును విడిగాచేసి జీవనాన్ని ఆధ్యాత్మికంగా మలచటానికి వాఙ్మయం ఎంతో ఉపకరిస్తుంది.

'బ్రహ్మవిద్యా? కృష్ణార్జున సంవాదమా?' ఇది అర్థం కాకపోవటానికనే నానుడి బ్రహ్మవిద్యాదులు అర్థం కానివిగా ప్రచారం చేస్తోంది. అదీ, అటువంటివి మరేవైనా అభిప్రాయాలు ఉన్నా, వాటి అధ్యయనానికి నాందిగా ఈ 'నికష'ను పర్యాలోకనం చేస్తే ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత అనే ప్రస్థాన త్రయంలో ప్రవేశం సుగమమవుతుంది.

ఆలోచనలు అందరి మెదళ్ళలో ప్రయత్నంలేకుండా సాగేవే. అయితే వాటిని క్రమబద్ధీకరించే క్రమంలో శ్రేయోమార్గంవైపు ప్రసరింపజేసే ధోరిణి సాగితే ఓ అద్భుత గ్రంథం వెలువడుతుందనటానికి సాక్ష్యం ఈ నికష.

దాదాపు రెండు దశాబ్దాల కాలంలో(1991-2009) నిరంతరాయంగా జీవనదిలాగా సాగిన ఆలోచనా పరంపరల ప్రవాహరూపం అయిన ఈ రచనలో భాషలో పదును, భావాలలో పరిణతి రచన అంతటా సమంగా పరిచినట్లు కనిపిస్తోంది. కాలక్రమంలో మార్పులు చేసేందుకు అవసరంలేని ఆలోచనలలోని కూలంకష దృష్టితో వ్రాసిన గ్రంథాలే శాశ్వతంగా నిలుస్తాయన్నది మనం గమనిస్తున్న నిజం. వాల్మీకి, వ్యాసాదిమహర్షుల వాఙ్మయాల అవగాహనకు వాటిని సమన్వయపరుచుకోవలసిన పద్ధతికి ఈ రచన పరిశీలించటం అవసరం.

భౌతికజీవనానికి, ఆధ్యాత్మికజీవనానికి మధ్య నలుగుతోన్న అతి సున్నితపు పొరను చీల్చుకొని ఉభయతః స్పష్టతలేక సతమతమవుతున్న సాధారణ మానవునికి "జీవితంలో - లౌకికజీవితం, ఆధ్యాత్మికజీవితం అన్నది ఒకదానికొకటి భిన్నాలు కావని రెండూ ఒకటేనని, మనం బ్రతికివుండటం లౌకికమైతే బ్రతకవలసిన తీరే ఆధ్యాత్మికమని ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మన ఉనికి లౌకికం ఉనికిలోని ప్రతిస్పందన ఉండవలసిన తీరును చెప్పేది ఆధ్యాత్మికం" అని విశదపరుస్తున్న మాష్టారి మాటలు (ఆచార్య దేవోభవ పుట నెం.49) మన జీవితాలకు ఎంతో స్పష్టతను అందిస్తున్నాయి.

'విద్య అంటే సమాచారం అందివ్వటం - స్వీకరించడం కాదు, చుట్టూ పరిస్థితులను సమగ్రంగా అన్వయించుకొని బ్రతకటమ'న్న రవీంద్రనాథ్ ఠాగూర్ దర్శనాన్ని యాథార్థ్యం చేయడానికి పూనుకొని, ఆధ్యాత్మికత - ఇహానికా, పరానికా? అన్న మీమాంసకు సంపూర్ణ విరామం ఇచ్చేద్దాం, 'అవసరానికి మించి మాట్లాడక పోవడమే మౌనం' అంటున్న మాస్టారి మాటల్ని స్మరిస్తూ.

అనుమతించిన ఆచార్యునికి —

అనుకూలించిన అనుచరులకి —

రూపశిల్పులకు —

సమర్పణలతో

***అంతేవాసీ – సిహెచ్.పి.సత్యనారాయణ***

# శీర్షక మాలిక

# యుగే యుగే

బిందువుల కలయికయే సింధువు. పరమాణువుల కలయికయే విశ్వం. ఒక మనస్సు చేస్తే ఆలోచన. దాన్నే పదిమంది పంచుకుంటే ఆచారం. పరంపరగా కొనసాగి జాతికి చిహ్నంగా నిలిస్తే అదే సంస్కృతి. భిన్నసంస్కృతుల సమన్వయ రూపమే ధర్మం.

సృష్టిలో ఏ రెండూ పూర్తిగా ఒకటికావు. అన్నింటిలోనూ ఏకసూత్రత మాత్రం తప్పనిసరి. తానుగా నిలవటానికి ప్రతి పదార్థానికీ ఒక ధర్మ ముంటుంది. అయితే విశ్వధర్మంలో తాను లీనం కావటానికై ప్రతి రెండవ ధర్మంతో సమన్వయాన్ని సాధించుకొనవలసినవసరముంటుంది. సృష్టికంతటికీ ఇది అపరిహరణీయమైన ధర్మం. ప్రాణికోటికంతటికీ పరిరక్షించుకోవలసిన సూత్రం. మానవాళికంతటికీ పరిశీలింపవలసిన అంశం. భారతజాతికంతటికీ తన ముందున్న తక్షణ కర్తవ్యం.

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్న గీతావాక్యాన్ని మనమంతా నమ్ముతున్నాం. అయితే ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురు చూడటం చైతన్యంగల జాతి లక్షణం కాజాలదు. ధర్మ సంరక్షణకు దైవముంటుంది. కానీ వ్యక్తి, సమాజ రక్షణకు మాత్రం ప్రతివ్యక్తీ సిద్ధపడవలసినదే. సమాజం కోసం సమాజంలో నుండే ధార్మికచైతన్యం బయలుదేరాలి. ఈ సందర్భంగా తిక్కన పద్యాన్ని మనం స్మరించాలి -

**సారపు ధర్మమున్ విమల సత్యము పాపము చేత బొంకుచే**
**పారము చెందలేక చెడబారినదైన యవస్థ దక్షు**
**లె వ్వారలుపేక్ష సేసిరది వారలచేటగు కాని ధర్మ ని**
**స్తారకమయ్యుసత్య శుభదాయకమయ్యును దైవముండెడిన్**

(జనవరి - 1991)

# ధర్మం-పురుషార్థం

పగలంతా ఎక్కడున్నా చీకటిపడే వేళకు ఇంటికి చేరాలన్న తపన మనకు సహజం. బ్రతుకంతా ఎక్కడ గడిపినా పుట్టినచోటే కన్ను మూయాలన్న తాపత్రయం మానవులకు సహజం. అంటే ఎక్కడ నుండి ప్రయాణం ప్రారంభించామో అక్కడే ముగించాలన్న ప్రగాఢ వాంఛ మనలో పనిచేస్తుంది. ఇహజీవితానికి కూడా అదే సూత్రాన్ని వర్తింపజేస్తే ఎక్కడ నుండి వచ్చామో అక్కడకే చేరే ప్రయత్నం చేయాలన్నది ప్రాథమిక సత్యం.

ప్రాణులంతా పరమాత్మ సంకల్ప రూపాలని విశ్వాసం. అందరిలోనూ ఆ పరమాత్మ అంశవుండి జీవుడిని నడిపిస్తోంది. పరమాత్మ నుండి బయలుదేరిన ప్రయాణం పరమాత్మలోనే విలీనం కావటంతో ముగియాలని భారతీయ సంకల్పం. దీని కోసమే ధర్మ-అర్థ- కామ మోక్షాలని పురుషార్థాలను మార్గాలుగా సూచించారు మహర్షులు. మోక్షసాధనకు ధర్మ-అర్థ- కామాలు మార్గాలు.

అయితే ధర్మ- అర్థ- కామాలు పరమాత్మలో జీవాత్మను లీనం చేయటానికే కాదు. ఇహలోకంలో యోగ్యమైన జీవితాన్ని నడపటానికి నిర్దేశించిన సూత్రాలు. వ్యాసుడంతటివాడు చేతులెత్తి ఆక్రోశించాడట.

ఏమని ... **ఊర్ధ్వబాహుర్విరౌమ్యేషః, న కశ్చిత్ శృణుతే హి మాం ।**

**ధర్మాదర్థశ్చ కామశ్చ, స ధర్మః కిం న సేవ్యతే ॥** అని

నేను చేతులెత్తి ఆక్రోశించినా ఎవ్వరూ పట్టించుకోవటం లేదు. ధర్మం వలన అర్థకామాలు సిద్ధిస్తాయి. ఆ ధర్మాన్ని ఎందుకు ఆచరించరు.

సరియైన ధర్మాచరణ సక్రమమైన సామాజిక జీవనాన్ని అందిస్తుంది. ప్రకృతి దృష్టిలో కానీ ప్రకృతి గతిలో కానీ తేడాలకు, వైషమ్యాలకు, వైమనస్యాలకు తావులేదు. ఆ సత్యాన్ని అందరూ గుర్తించడం మనిషిని మనిషి పీడించే తత్వాన్ని, మనిషి మనిషిని ద్వేషించే మనస్తత్వాన్ని వీలయినంత త్వరగా వదిలించు కొనగలగాలి.

సామాజిక జీవితం అన్నది ఏ ఒక్కరి వలనా ప్రశాంతంగా సాగేదికాదు. అయితే అందరూ ఒక్కొక్కరుగానే నిర్ణయించుకుంటే అసాధ్యం కూడా కాదు.. 'చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష' అని ఏ ఒక్కడు అనుకున్నా. పీపాలో మనం మాత్రమే నీళ్ళుపోస్తున్నాం' అని అందరూ అనుకున్నా సంఘ జీవితం దుర్భర మవుతుంది. అందుకే అందరూ కలిసి అందరికీ ఉపయోగపడే పనులు చేసు కుంటూ, విడివిడిగా ఆలోచించినా అందరి ప్రతినిధులుగానే ఆలోచించే తత్త్వాన్ని పెంచుకుంటూ ముందుకు సాగినపుడే వ్యక్తికీ వ్యవస్థకు మానవత్వానికీ కూడా విలువ. అదే మానవ జీవితానికి అర్థం, పరమార్థం, మార్గం, గమ్యంకూడా....

(1991 ఫిబ్రవరి)

# మనము - మన జాతీయత

ఈనాడు యీ ప్రపంచంలో సుమారు 500 కోట్లకు పైగా మానవులున్నారని అంచనా. మానవులంతా ఒకటే అని యెవరైనా యెలుగెత్తి చాటితే యథార్థమే అని తల వూపుతాం. మనందరిలో ప్రవహించే రక్తం ఒకటేనని నినదిస్తే - వెంటనే ఔనని స్పందిస్తాం. మానవజాతి అంతా ఒకటేనని యెవరైనా గంభీరంగా గర్జిస్తే- అదేదో నిజమేనని నమ్ముతాం. ఒక మగ, ఒక ఆడ యిద్దరు కలిసి దాంపత్య జీవితం గడిపితే వారి శుక్ల శోణితాలే పంచుకొని పుట్టిన సంతానం ఒక్కటిగా వుంటారా? ఎక్కడైనా వుంటారా? చెప్పమంటే ఆలోచనలో పడతాం ఏమిటి విచిత్రం? ఎక్కడున్నది విశేషం? ఏది సత్యం? సత్య శోధనకు కావలసింది ఆవేశం కాదు ఆలోచన.

ఒక తల్లిదండ్రులకు పుట్టిన బిడ్డలలో ఒకడు సోమరిగావుంటే, ఒకడు చురుకుగా వుండవచ్చు. ఒకడు జ్ఞాని అయితే మరొకడు మందబుద్ధి కావచ్చు. ఒకడు వినయసంపత్తిగల వాడైతే మరొకడు అహంకారి కావచ్చు. ఒకడు శీలవంతుడైతే మరొకడు భ్రష్టజీవి కావచ్చు. ఒకడు సత్యసంధుడైతే మరొకడు అబద్దాలపుట్ట కావచ్చు. అనుభవంతో యిటువంటివెన్నో గమనించవచ్చు.

మానవులంతా ఒకటిగాదు, మానవరక్తం ఒకటి కాదు, మానవజాతి ఒక జాతిగా రూపొందలేదు. స్థూలంగా వర్గీకరణ చేసినప్పుడు బాధలతో వుండగా ఆవేశంలో వూహాలోకంలో విహరించేటప్పుడు, ఆత్మజ్ఞానిగా మహోన్నత భావాన్ని యిచ్చేటప్పుడు మాత్రమే మానవులంతా ఒకజాతి అనిపిస్తుంది గాని యథార్థంగా జాతులు, జాతీయతలు వేరు వేరుగానే స్థిరపడ్డాయి.

ప్రాణికోటిని వర్గీకరణ చేశారు శాస్త్రవేత్తలు. ఏమని? మానవులు, పక్షులు, జంతువులు, కీటకములు మొదలైన విధంగా రెక్కలు కలిగివుండి ఎగిరే శక్తివుంటే పక్షి అన్నారు. నాలుగు కాళ్ళుండి పిల్లలను కంటె జంతువులు అన్నారు. ఇదే విధంగా మిగిలినవికూడా. ఒక్క ఉదాహరణ తీసుకుందాం. పక్షులంతా ఒక్కటేనా? మైథున క్రియ అతిరహస్యంగా వుంచుతుంది కాకి, అతినీచంగా ప్రదర్శిస్తుంది పిచ్చుక. పాతివ్రత్యాన్ని ఖచ్చితంగా పాటిస్తుంది గువ్వ, ఏ నియమం లేకుండా బ్రతుకుతుంది బాతు. ఈ వైవిధ్యం యెట్లా వచ్చింది? గుణరీత్యా. మరొక రీత్యా విడదీస్తే పక్షులంతా ఒకటికాదు, అట్లాగే జంతువులు. విశ్వాసానికి కుక్క, ఓర్పుకు గాడిద, పరాక్రమానికి సింహం, సాహసానికి పులి - వాటికవే సాటి. కాబట్టి జంతువులన్నీ ఒక జాతి కాలేవు. కుక్కలు ఒక జాతి కావచ్చు. సింహాలు ఒక జాతి కావచ్చు. అదే విధంగా మానవులు వారి వారి సంస్కారాలు, సభ్యత, హావభావాలు, గుణగణాలు, విశ్వాసాలు, అనుభవాలు ఆధారంగా జాతులుగా రూపొందారు. భారతజాతి భారతజాతిగానే వుంటుంది, ఉండాలి. అది అమెరికన్ జాతి కాలేదు, కాకూడదు. అనేక సద్గుణాలతో, అనేక ఉత్తమ భావాలతో ప్రపంచానికే జ్ఞానభిక్ష పెట్టి గురుస్థానాన్ని ఆక్రమించిన ఈ జాతి ఆ ఉన్నతభావాల ప్రాతిపదికపైననే పరిణామం చెందాలి. మనము మన జాతీయత భూత, భవిష్యత్, వర్తమానకాలాలకు అతీతంగా సర్వకాలాలలో వుంటూ గుణాధిక్యత గలదై మనుగడ సాగించాలి. అదే మన వాంఛ.

(1991-మార్చి)

# సౌమనస్యం

లోకంలో అందరం నివసిస్తున్నాం. అయితే మనలో ప్రతివ్యక్తిలోనూ కూడా లోపల మరో లోకం - తన సొంత లోకం కనిపిస్తోంది. ఆ లోకానికి, ఈ లోకానికి శ్రుతి కలవక అది అనర్థాలకు దారి తీస్తోంది. ఇది ఒక్క నాటి సమస్య కాదు. ఈ నాడే క్రొత్తగా పుట్టుకొచ్చిన సమస్యా కాదు. యుగయుగాలుగా తత్త్వదర్శనం చేసిన వాళ్ళు ఆలోచించి నిర్ణయించిన విషయం. తరతరాలుగా ఎందరో మహనీయులు ఈ ఆంతర్యాలనూ, తేడాలను తొలగించాలని తాపత్రయపడిన విషయం. అయితే ఇన్ని అనర్థాలకూ, ఇంత అసంగతికి కారణం మహర్షుల మాటల్లో అరిషడ్వర్గం. మామూలు మాటల్లో చెప్పాలంటే స్వార్థపరత్వం. స్వార్థం లేకపోతే మనిషి మనుగడయే సంశయాత్మకం. నిర్జీవ మవుతుంది. కాబట్టి స్వార్థముండటం యథార్థానికి దోషం కాదు. మరి లోపం ఎక్కడుంది? స్వార్థానికి త్యాగానికి మధ్య విభజన రేఖను గీచుకోవటం లో వుంది. సరియైన విశ్లేషణను చేసుకోకపోవటంలో కనిపిస్తుంది.

భారత ధర్మశాస్త్రాల మేరకు ఆలోచిస్తే, పునర్జన్మ సిద్ధాంతం మేరకు పరిశీలిస్తే చేసుకున్న వారికి చేసుకున్నంత' అన్న సాధారణ వాక్యాలను గమనిస్తే తనకు నిర్దిష్టమైనదే తనకు దక్కుతుంది, కానీ తనది కానిది తనకు దొరకదు, చచ్చి గీపెట్టుకున్నా సరే! శాస్త్రాలు, సామెతలు చాదస్తమందామా? మన చట్టమైనా తనది కానిదాని మీద తనకు హక్కు ఇవ్వదు. ఇతరులకు చెందిన వాటిపై ఏ వ్యక్తి జోక్యాన్ని అంగీకరించదు. కాబట్టి తనకు చెందనిది తనకు కావాలి అనుకుంటే అది నిందించదగిన స్వార్థం. తనకు చెందిన దానిని అనుభవించాలను కున్నా, ఎవ్వరికీ చెందని దానిని తాను సాధించాలని అభిలాష పడినా అది ఆహ్వానింపదగిన స్వార్థం.

(1991 – సెప్టెంబరు)

# సత్యసూక్తి

"సత్యాన్నాస్తి పరో ధర్మః" అని ఆర్యోక్తి. సత్యాన్ని మించిన ధర్మం మరేదీ లేదు. హరిశ్చంద్రచక్రవర్తి సత్యవాక్య పరిపాలనలో ప్రథముడుగా మనం పరిగణిస్తాం. ఆడినమాట తప్పకపోవటం, దాన్ని పాటించటానికై ఆలుబిడ్డలను సైతం అమ్మటం, కడకు తానే తన స్థాయికి తగని రీతిగా అమ్ముడు పోవటంవల్ల హరిశ్చంద్రుడు అంతటివాడయ్యాడు.

అయితే సత్యరూపం ఏమిటని, హరిశ్చంద్రుడు పాటించిన సత్యమే సత్యమా? అని ఆలోచించాలి. అప్పుడు దాని స్వరూపం ఎంతో విశాలమైనదని, మనం జీవితంలో చేసే ప్రతి ఆలోచన, చేసే ప్రతి పని వెనుక దాని ఉనికి వుంటుందనీ, వుండాలనీ, మనకు తెలుస్తుంది.

త్రికరణశుద్ధి అన్నమాట మనం వింటుంటాం. అది సత్యం యొక్క సమగ్రరూపం. మనస్సు-వాక్కు-శరీరం ఒకే త్రాటిపై నిలవటం సత్యం. ఏది ఆలోచిస్తే అదే పలకగలగటం, ఏది పలికితే అది చేయగలగటం సత్యం యొక్క పారమార్థిక స్వరూపం. అలా త్రికరణశుద్ధిని - సత్యాన్ని- పాటించగలవారినే మనం మహాత్ములుగా పరిగణిస్తాం. "వచస్యేకం మనస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం" అని పెద్దలు ఎప్పుడో అన్నారు.

ప్రచారంలో మనకు కనిపించే సత్యపదార్థం వాక్కులకు పరిమితమైనది. 'సత్యం వద' అన్నది అందరూ ఎరిగినమాట. సత్యాన్ని పలకటమంటే ఎలా? చూచినది చూచినట్లో, విన్నది విన్నట్లో చెప్పటం - సత్యం చెప్పటం అని అనిపిస్తుంది. అయితే అది అత్యంత సూక్ష్మవిషయం. మనం చూచినదీ, మనం విన్నదీ సత్యం అయితీరాలన్న నియమం లేదు. మన కళ్ళు, మన చెవులు మనలను మోసం చేయవచ్చు. అయితే మన బుద్ధిమాత్రం మనలను మోసం చేయదు. సత్యనిర్ణయంలో దాని ప్రమేయం చాలా ఎక్కువ.

(1991- అక్టోబరు)

# జీవన్ భద్రాణి పశ్యతి

నాటి త్రేతాయుగంలో విషయం. రావణుడు మదమోహాదులకు లోనై సీత నపహరించాడు. లంకలో అశోకవనంలో ఆమెనుంచాడు. అది సముద్రానికావలి తీరం. సీతకు రాముడి శక్తి సామర్థ్యాల మీద ఎంత విశ్వాసం ఉన్నా సాగరలంఘనం, రావణవిజయం అసాధ్యమేమో అనే అభిప్రాయం కలుగకపోలేదు. పదినెలలు గడిచినా రాముడి జాడ తెలియలేదు. ఆ సమయంలోనే రామదూత ఆమెకు ఆనందహేతువయ్యాడు. అప్పుడు సీత ఇలా తలచింది: "లోకులనుకునే ఈ మాటలు నిజమే. బ్రతికుంటే నూరు సంవత్సరాలకైనా ఆనందం కలుగకపోదు"

యుగాలు మారినా మానవుల్లో మదమోహాలు మారలేదు. వాటికి లోనై అలమటించే ప్రవృత్తి మారలేదు. అయితే సీతలాగా నిరీక్షించి నిలకడగా భావించగల స్థితిమాత్రం తగ్గిపోతోంది. నిరాశా నిస్పృహలూ, ఆవేశకావేశాలూ, అనుకున్నది అంతలోనే సాధించాలనే తపనా, సాధించటంలో వైఫల్యమూ ఇవన్నీ మనిషికి అస్థిరతకు లోనుచేసి అటు అమానుషచర్యలకో ఇటు నిరాశా నిస్పృహలకో గురి చేస్తున్నాయి. తమ వైఫల్య మనఃస్థితిలోనుంచి సంభవించే పరిణామాలను ఊహించగలిగితే మనిషికి నిలకడ దక్కకపోదు. ఆంజనేయ దంతటివాడికి కూడా సీత కన్పించకపోవటంతో ఆత్మహత్య చేసుకుందామనే అభిప్రాయం కలిగింది. అయితే క్షణకాలం ఆగి ఆలోచించిన మారుతి తన ఆత్మత్యాగం ఇటు వానర కులాల్ని అటు సూర్యవంశాన్ని కూడా మిగల్చకుండా చేస్తుందేమోనని ఆలోచించటంతో ఆ ప్రయత్నాన్ని విరమించి కర్తవ్యంపై దృష్టి సారించాడు. ఆ నిశ్చలత, ఆ అవగాహన, ఈనాటి ప్రజలకు ఎంతో అవసరం. నిరాశా నిస్పృహలూ, ఆవేశకావేశాలూ అనుక్షణమూ పెచ్చరిల్లే అవకాశాలు చుట్టూ కమ్ముకుంటున్నాయి. అయినా ఆగి ఆలోచించాలి. జీవన్ భద్రాణి పశ్యతి.

(నవంబరు, 1991)

# తారుమారు

**"అయాచితాని దేయాని సర్వద్రవ్యాణి భారత ।**

**అన్నం విద్యా తథా కన్యా అనర్థిభ్యో న దీయతే ॥"**

అన్నాడు వ్యాసుడు. సమస్త వస్తువులూ ఇతరులు అడగకపోయినా ఇవ్వవచ్చునట. కానీ 'అన్నం - విద్య - కన్య' ఈ మూడింటి విషయంలో మాత్రం అడక్కుండా ఇవ్వకూడదట.

'అడగందే అమ్మయినా పెట్టదు' అన్నమాట తెలుగువాళ్ళ కందరికీ పరిచయమే. ఆ తల్లి వ్యాసుడి మాటలు చదివిందో లేదో తెలీదు కానీ, ఆకలి అని అడగని పిల్లలకు అన్నం పెట్టబోతే వాళ్ళుచేసే అల్లరి స్థాయి ఎటువంటిదో ఆమెకు తెలుసు. అందుకే పాతరోజుల్లో తల్లులు, అర్ధాస్తమయ సమయంలో ఆరుబయట కబుర్లు చెప్పుకుంటూ 'అన్న'మని పిల్లలు మొదటిసారి అడిగితే, అప్పుడే పొడుస్తున్న చుక్కలను లెక్కపెడితే పెడతానని కొంత జాప్యంచేయటం, ఆ తర్వాత అన్నం పెట్టడం ఆ వాతావరణంలో పెరిగిన వాళ్ళకు తెలుసు.

విద్య విషయం అందరికీ నాడూ, నేడూ కూడా తెలుసు. విద్యార్థి అడగనప్పుడూ, వినే ఆసక్తి లేనప్పుడూ మేష్టారు ప్రపంచ రాజకీయాలు చెప్పినా వినడు, పంచదార చిలకలను గురించి చెప్పినా వినడు. వాళ్ళకు అవసర మనిపించినప్పుడు, అభ్యసించక తప్పనప్పుడు వేలకు వేలు వెచ్చించి అయినా సరే భక్తి శ్రద్ధలకు లోటులేకుండా చూచుకుంటూ ముందుకు వెళ్తారు. కార్తిక మాసంలో ఉదయం స్నానానికి బద్ధకించే ఇంటర్మీడియట్ విద్యార్థి ట్యూషన్ కోసం మాత్రం ఉషఃకాలంలోనే సిద్ధమై సైకిల్ బెల్ మ్రోగించుకుంటూ వెళ్ళటం మనకు తెలుసు.

కన్య విషయంలో ఇది మరీ విచిత్రంగా తయారైంది. ఒకప్పుడు వ్యాసుడి మాట మేరకే అడిగితేనే అమ్మాయి నిచ్చేవారు. ఇప్పుడు ఆడపిల్లల తండ్రులే చెప్పులరిగేలా తిరిగి, ఇస్తానని బ్రతిమిలాడవలసి వస్తోంది. అందుకే కోడలు చులకనవుతోంది. (డిశంబరు, 1991)

# అయిదు వకారాలు

మనిషికి తోటివారిలో గౌరవాన్ని సంపాదించి పెట్టేవీ, ఆత్మీయతను పంచి పెట్టేవీ, అభిమానాన్ని సాధించిపెట్టేవీ అయిదు వకారాలని పెద్దల అభిభాషణ. వస్త్రం, వపువు, వాక్కు, విద్య, వినయం ఈ అయిదు వకారాలూ..

బట్టలు (వస్త్రాలు) మానసంరక్షణ లక్ష్యంతో అనాదిగా ఆదరించబడ్డవి. ఆ లక్ష్యసిద్ధితోపాటు లక్ష్యశుద్ధిని కూడా తర్వాత్తర్వాత గుర్తించటం జరిగింది. తాహతకు, సంపదకు అభిరుచులకూ అనుగుణంగా వస్త్రధారణ జరుగుతుంటుంది. అయితే అన్నింటికన్న మిన్నయైన మరో లక్షణం- దేశకాల పాత్రలకు తగినట్లుగా వస్త్రధారణ వుండటం. విశేషం కనిపించక పోయినా పరవాలేదు, కానీ వికారం కనిపించకూడదు. చూపరులను వెంటనే ఆకట్టుకొనేది. వస్త్రం, కాబట్టి అది గౌరవాన్ని ఇవ్వటంలో మొదటిది.

రెండవది శరీరం. ఇది శుచి, శుభ్రతలకు సంబంధించినది. పుట్టుకతో వచ్చిన శరీరాన్ని మనం మార్పు చేయలేము కానీ ఆ శరీరంలో పరిశుభ్రతను ప్రదర్శించగలిగితే అది గౌరవహేతువు అవుతుంది.

మూడవ వకారం వాక్కు. ఇది నిత్య జీవితంలో అత్యంత ప్రధానమైన విషయం. మాటతీరులోనే మొత్తాన్ని సాధించగలవారెందరో వున్నారు. నోరు మంచిదైతే వూరు మంచిదని అందుకే అన్నారు. ఇతరుల మనస్సులను నొప్పించకుండా, మర్యాదామన్ననలకు లోటు రానీయక తనకు నచ్చిన అభిప్రాయమైనా, నచ్చని అభిప్రాయమైనా వ్యక్తీకరణలో మాత్రం తేడా లేకుండా మృదువుగా మాటాడటం ఎంతో గౌరవాన్ని ఇస్తుంది. మాట పెరిగేకొద్దీ వ్యర్థప్రసంగాలూ, అనుచితవాక్యాలూ వచ్చే అవకాశముంటుంది. అందుకే మిత భాషణం అలవాటు చేసుకోవాలి. అది స్మితభాషణం కూడా కావాలి. ఇతరులను మిత్రులుగా చేసుకోవాలన్నా, ఇతరులు శత్రువులు కావాలన్నా ఈమాట మీదే ఆధారపడి వుంటుంది.

నాల్గవ వకారం విద్య. విద్య అంటే శాస్త్రాది పాండిత్యం కావచ్చు. ఇప్పటి డిగ్రీలు కావచ్చు. వీటన్నింటికి మించి జీవితం యొక్క అవగాహన విద్య - అదే విజ్ఞానం - అనవచ్చు. మనుష్యులనూ, పశువులనూ విడివిడిగా పరిగణించటానికి కొలబద్ద ఈ విద్య. లౌకిక విషయాలన్నింటిలోకి పెద్ద పీట వేయవలసిన స్థానం ఈ విద్యది. అందుకే విద్యావంతులకు ప్రభువులైనా తలవంచక తప్పదు.

ఇక కడది వినయం. వినయమంటే వంగి వుండటం కాదు, లొంగి వుండటం కాదు. తన వ్యక్తిత్వానికి భంగం రాకుండా కాపాడుకుంటూనే, తన వ్యక్తిత్వమే సర్వస్వమన్న భావానికి లోనుకాకపోవటం వినయం. అహంకారం, గర్వం వంటి పదాలకు ఇది దూరం. విద్యయొక్క పరమార్థం వినయమే అని జ్ఞానుల నిర్ణయం. విద్య ఎంతవున్నా వినయం లేకపోతే పాత్రత లభించదు. వినయవంతుడిని అందరూ ప్రేమిస్తారు, అభిమానిస్తారు, గౌరవిస్తారు.

ఈ అయిదు వకారాలనూ యథాశక్తి ఒక్కొక్కటిగా అయినా ఆచరించగలిగితే గౌరవప్రదమైన జీవితాన్ని అప్రయత్నంగానే గడపవచ్చు.

(ఫిబ్రవరి, 1992)

# కృతజ్ఞత - కృతఘ్నత

మనిషి సంఘజీవి అంటుంటారందరూ. కాని మనిషి స్వార్ధజీవి అంటే అతికినట్టుంటుందేమో అనిపిస్తోంది. అనాదిగా చరిత్ర నిరూపిస్తున్న సత్యమిదే. అయితే దానిని కాదని నిరూపించటానికి మనిషి పడే తాపత్రయం పేరు సంస్కృతి, సంఘజీని లక్షణం, స్వార్ధజీవి లక్షణం ఏది ఎంత మోతాదులో వుందో తెలుసుకునే నీల్లేకుండా మనిషి కలిసుంటాడు. అట్లాగే చరిత్ర, సంస్కృతి ఏది ఎంతవరకో విడదీయరానంతగా కలిసివుంటాయి.

ప్రాణికి స్వార్ధంతో బ్రతకటం సహజాత లక్షణమైతే దాన్ని వీలున్నంత వరకు తగ్గించుకొని బ్రతకాలన్నది సమాజజాతమైన లక్షణం. అందరిలో వుండి తీరవలసిన ప్రాథమిక ధర్మం. అయితే కాలం మారుతోంది. (పట్టించుకోకండి. దీని కర్థం ఇంతవరకూ నాకే తెలీదు). మనుషులూ మారాలి అంటుంటారు. నిజంగా మనుషులు మారాలి. మారుతున్నారు కూడా. అయితే సంఘజీవిగా కాదు. స్వార్ధజీవిగా. ఆ స్వార్ధజీవితాన్ని రోజురోజుకూ పాదుచేసి నీరుపోసి పెంచుకుంటున్నారు.

స్వార్థాన్ని మాని ఇతరులకు సహాయం చేయకపోతే పరవాలేదు. అది కొంత మెరుగే. అయితే ఇతరులనుండి సహాయం పొందితే మాత్రం దాన్ని కనీసం గుర్తు పెట్టుకోవాలి. అవకాశం వచ్చినప్పుడో మనకు సహాయపడ్డవాళ్లకు అవసరం వచ్చినప్పుడో వారికి సహాయం చేయగలగటం ఉత్తమ ధర్మం. ఉడుతలో రాముడికి, రాముడిలో వాల్మీకికి, వాల్మీకిలో సంఘానికి కనిపించిన ధర్మం అదే. దాన్నే కృతజ్ఞత అన్నారు.

కృతజ్ఞత వుండటం ఉత్తమధర్మం. అయితే లేకపోవటం ఆధమ ధర్మ మేమీకాదు. మేలు పొందినా మరచిపోయి ఎవరి మానాన వాళ్ళు బ్రతకటం నేరమేమి కాకపోవచ్చు. అయితే మరొక జాతిలో కనిపించే లక్షణ మొకటుంది. కృతజ్ఞత లేకపోగా మేలు చేసిన వారికే కీడును కోరటం. అన్నం పెట్టిన చేతినే తెగ నరకటం, నీడనిచ్చిన చెట్టునే నిలువుగా కూల్చటం. దీన్నే కృతఘ్నత అంటారు. మనం కృతజ్ఞులం కాకపోయినా ఫరవాలేదు. కృతఘ్నులం కాకూడదు. ముక్కోటి దేవుళ్ళకూ మొక్కుదాం - మనలో ఆ లక్షణం ఏర్పడకుండా చూడమని -

(మార్చి, 1992)

# గీతామృతం

భారతీయమైన ఆధ్యాత్మిక సంపత్తికి మూలగ్రంథాలు మూడు. బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీత. వీటినే ప్రస్థానత్రయం అని వ్యవహరిస్తుంటారు. వ్యాసభారతంలోని అనేక గీతల్లో భగవద్గీత ఒకటి. అటు బ్రహ్మసూత్రాలూ, ఇటు ఉపనిషత్తులూ చదవటానికీ, వినటానికీ సరియైన అవకాశాలు లేని సాధారణ జన జీవితాలకు కూడా అందుబాటులో వున్నది భగవద్గీత. కురుక్షేత్ర సంగ్రామం ముగిసిన తర్వాత మరో మారు వినాలని అర్జునుడు ప్రార్థించినా శ్రీకృష్ణుడే మరలా ప్రబోధించటం అసాధ్యం అని అన్నాడంటే ఆ సమయంలో దానికి సిద్ధించిన పొందిక ఎటువంటిదో అర్థమవుతుంది.

అయితే చాలా మందికి అర్థం కానిదీ, అందరూ అవగతం చేసుకొనవలసినదీ మరో అంశం వుంది. గీత కేవలం ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించినదేనా? భౌతిక జీవితంలో దాని ప్రమేయం లేదా? గీత ప్రవృత్తి మార్గాన్ని చెప్తున్నదా? నివృత్తి మార్గాన్ని ప్రబోధిస్తున్నదా? అన్నది ఆ అంశం.

యథార్థానికి గీతా ప్రాదుర్భావ సందర్భాన్ని పరిశీలించితే మనకు కొన్ని విషయాలు స్ఫురిస్తాయి. కర్తవ్యవిమూఢుడైన అర్జునుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేయటానికి సంకల్పించిన భగవద్గీత ప్రవృత్తిమార్గాన్నే బోధించేది అవుతుంది. కానీ నివృత్తిమార్గాన్ని బోధించేది కాదు. రచయితగా వ్యాసుడూ, వక్తగా శ్రీకృష్ణుడు ఉద్దేశించింది ఈ అంశాన్నే. అయితే తర్వాత్తర్వాత వివిధ సంప్రదాయాలకు చెందిన ప్రవక్తలు తమ తమ సిద్ధాంతాలకు అనుగుణంగా గీతకు వ్యాఖ్యలు వ్రాసి గీతను ఎత్తువారి చేతి బిడ్డను చేశారు. క్రమంగా ఒకరితో ఒకరు పోటీపడి దాన్ని కేవలం ఆధ్యాత్మికం, నివృత్తిమార్గదర్శనం అని అన్నారు.

(ఏప్రిల్, 1992)

# శకటాసురం

భాగవత కథల్లో మనం చదివివుంటాం. ఎవరో రాక్షసుడట. బండి రూపాన్ని ధరించివున్నాడట. శ్రీకృష్ణుడు రహస్యాన్ని గుర్తించి ఆ రాక్షసుణ్ణి సంహరించాడట. ఆనాడు అట్లా ప్రాణాలు పోగొట్టుకున్నా శకటాసురుడు పగతీర్చుకోదలచుకున్నాడు. మానవజాతి వ్యక్తిత్వ వికాసానికి శ్రీకృష్ణుడు పెట్టిందే భిక్ష కాబట్టి మానవజాతి మీద పగతీర్చుకోదలచుకున్నాడు. ఇంకేముంది, వివిధ రూపాలు ధరించాడు కలియుగంలో.

రెండు చక్రాల శకటాలు, మూడు చక్రాల శకటాలు, నాలుగు, ఆరు, ఎనిమిది చక్రాల శకటాలు, లెక్కలేనన్ని చక్రాల శకటాలు. నేలమేద నడిచేవి, గాలిలో ఎగిరేవి, పట్టాలపై పరుగెత్తేవి. అన్నీ ఎన్నో రకాలుగా ఆ శకటాసురుడి రూపాలే. ఎప్పుడు ఏ శకటం ఎంతమందిని పొట్టనబెట్టుకుంటుందో తెలీదు. అందరూ శాఖాహారులే, కానీ బుట్టలోని రొయ్యలన్నీ మాయమన్నట్లు అందరూ విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించేవారే, అందరూ వాహన నిబంధనలను అనుసరించేవారే, అందరూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని బ్రతుకుతూండేవారే. అయితే శకటాసురుడి విజృంభణ మాత్రం రోజురోజుకూ పెరుగుతూనే వుంది.

ఎంతో రద్దీ మధ్యలో నడిచే వాహనాలకూ ప్రమాదాలే. ఎదురు లేకుండా పరుగెత్తే వాహనాలకూ ప్రమాదాలే. ఎగిరిపడే వాహనాలకూ ప్రమాదాలే. జలకాలాడే వాహనాలకూ ప్రమాదాలే. మానవులలో ఆధ్యాత్మిక చింతన పెరిగిపోయి ప్రాణభయం తగ్గిపోయిందందామా? జాగ్రత్త ఎక్కువైపోయి తడబడి పోతున్నామందామా? ఇంత లోతైన పరామర్శ అనవసరమందామా?

వర్తమాన కాలంలో మానవుడికి నిర్లక్ష్యం, అశ్రద్ధ, మూర్ఖత్వం - వాటి మూడింటినీ ముడిపెట్టే స్వార్థభావం ఎక్కువైపోయింది. మన ముందువాడికన్నా ఒక్క క్షణం ముందుంటే లాభం నిక్కచ్చిగా ఏదో తెలీదు గానీ, ఆ ఒక్క క్షణం ముందుండాలన్న ఆరాటం ప్రతివాడిలో కనిపిస్తోంది. ఆ ఆరాటమే లక్ష్యంమీద శ్రద్ధను తగ్గిస్తోంది. మూర్ఖత్వాన్ని ముందుకు నడిపిస్తోంది. వాహనాలలో ప్రయాణించే వారంతా అడ్రస్సులు వ్రాసుకొన్న స్లిప్పులు దగ్గరపెట్టుకొనీ, లేకపోతే అరచేతుల్లో అడ్రసు వ్రాసుకుని సిద్ధంగా వుండవలసి వస్తోంది. ఇంకా ఎంత కాలమో ఈ శకటాసురుడి కక్ష సాధింపు చర్య? (మే. 1992)

# మెట్ట వేదాంతం

పొలాల్లో మెట్ట, మాగాణి అని రెండు రకాలున్నాయి. తామరల్లో మెట్ట తామర, నీటి తామర అని రెండు రకాలున్నాయి. పవిత్ర స్థలాల్లో పుణ్యక్షేత్రాలు, పుణ్యతీర్థాలు అని రెండు రకాలున్నాయి. అయితే, మనకు పదే పదే వినిపించే మాటల్లో మెట్ట వేదాంతం ఒకటి. ఆమాట వినగానే మాగాణి వేదాంతం అని మరొకటి వుందేమో అని అనుమానం కలుగుతుంది. కలగాలి కూడా! ఈ మెట్టవేదాంతం ఏ స్థాయికి చేరిందంటే అసలుమొక్కల్ని పీల్చి పిప్పిచేసే కలుపుమొక్కల స్థాయికి ఎదిగింది. మనస్తత్త్వం మరీ సున్నితమైతే వేదాంతం పేరు చెప్తే చాలు విరక్తిపుట్టే స్థాయికి చేరింది.

ఇంతకూ మెట్ట వేదాంతమంటే ఏమిటి? దాని గుణగణాలు, స్వరూప స్వభావాలూ ఏమిటి - అన్నది ఆలోచించాలి. ఆ లక్షణాలకు మనం దూరంగా వెళ్ళేందుకైనా దాన్ని గురించి తెలుసుకోవాలి. అసలు వేదాంతంలో ప్రధాన సూత్రమొక్కటే. విశ్వం మొత్తం ఒక్కటే విరాట్స్వరూపం. కాబట్టి అహంకార మమకారాలకు అవకాశం లేదని. అయితే ఆ సూత్రాన్ని ఎప్పటికప్పుడు అన్వయించుకోవటంలో చాలా తేడాలు చోటుచేసుకున్నాయి.

మానవుడు తన అసామర్థ్యాన్ని కప్పిపుచ్చుకొనేందుకో, తన ప్రయోజనాన్ని సాధించుకొనేందుకో, తాను తప్ప మిగిలిన అందరూ తెలివితక్కువ వాళ్ళని భావించినప్పుడో, తనకుతాను కనిపించని కంటిలాగా తనను తప్ప ఇతర ప్రపంచాన్నే చూస్తూ మాటాడుతున్నప్పుడో వాడుకొనే వేదాంత సూత్రాలు మెట్ట వేదాంతం అనిపించుకోవడం ప్రారంభించాయి.

"అన్నమైతే ఏమిరా మరి సున్నమైతే ఏమిరా" అన్నంతవరకున్న వేదాంతం "అందుకే మనమందరం అన్నమే తిందాముర" అన్నప్పుడు మెట్ట వేదాంతమై పోయింది. 'ఆడపిల్లలైతే ఏం, మగపిల్లలైతే ఏం' అంటే అది వేదాంతం. అయినా సరే. మగపిల్లలే కావాలంటే మెట్ట వేదాంతం.

అందుకే ఆధ్యాత్మికతను ఆకళింపు చేసుకోవల్సిన మనం వేదాంతాన్ని వల్లెవేసుకొంటే పరవాలేదు. కానీ మెట్ట వేదాంతం సూత్రాలు వదలిపెట్టాలి. కులాసాగా బ్రతకాలంటే మెట్టవేదాంతమే అవసరమంటారా? కాదనను. అప్పుడు వేదాంతం జోలికి వెళ్ళకండి. మెట్ట అయితేనేం, కాకపోతేనేం అని మళ్ళీ వేదాంతప్పాటలు పాడకండి.

(ఆగష్టు, 1992)

# శక్తి ఉపాసన

"బలమే జీవనము, బలహీనమే మరణము". "మన సమస్యలలో చాలా వాటికి బలహీనతయే కారణం. మొట్టమొదట మన యువకులంతా శక్తిమంతులై యుండాలి. శక్తిసముపార్జన ద్వారా మోక్షానికి అర్హులౌతారు" అంటారు స్వామి వివేకానంద.

శ్లో ॥ "**శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం**
**న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి**".

- అని "సౌందర్య లహరి"లో జగద్గురు శంకర భగవత్పాదులు అంటారు. శివుడు శక్తితో కూడుకున్నప్పుడు మాత్రమే ఏదైనా చేయటానికి సమర్థుడౌతాడు. శక్తిలేకపోతే ఆ మహాదేవుడు కదలుటకు కూడా సమర్థుడు కాలేడు అని. "శివుని ఆజ్ఞలేనిదే చీమైనా కదలదు" అంటారు పెద్దలు. అట్టి శివుడే శక్తిలేనప్పుడు ఏమీచేయలేకపోతే సాధారణ ప్రజల సంగతి చెప్పవలసిన పనే లేదుగదా! కాబట్టి ప్రతివారు శక్తిని ఉపాసించాలి.

సృష్టి, స్థితి, లయాలకు మూలకారణం ఆదిపరాశక్తి. ఆమెనే పోతనామాత్యుడు "అమ్మల గన్న యమ్మ, ముగ్గురమ్మల మూలపుటమ్మ, మేటి పెద్దమ్మ" అన్నారు. ఆమెను కొందరు "పురుషరూప" అని, మరి కొందరు

"స్త్రీరూప" అని అంటారు. కాని, దేవీభాగవతంలో ఆమె "పురుషుడను నేనే. స్త్రీని నేనే. ఇరువురులో భేదములేదని ఎవడు తెలుసుకుంటాడో, అతడు ధీశాలి". అంటుంది. బ్రహ్మకు సృజించు శక్తి, విష్ణువుకు రక్షించి పాలించేశక్తి, శివునికి శక్తిప్రదాత ఈ ఆదిశక్తియే. సర్వదేవతలయందు, సర్వనామధారియై శక్తి ప్రకాశిస్తుంది. చేతనపదార్థాలలోనే గాక జడపదార్థములలో కూడా శక్తి గోచరిస్తుంది. శక్తిలేనిదే ఎవ్వడూ ఏ పని చేయలేడు. 'చిచ్ఛక్తి: చేతనా రూపా, జడశక్తిర్జడాత్మికా' అని అని లలితా సహస్రనామాలలో చెప్పబడింది.

శక్తి పరబ్రహ్మ స్వరూపమే. ఈ శక్తినుండే ప్రకృతి పురుషాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము - రెండూ శక్తినుండే వచ్చాయి. ఈ శక్తి సత్వరజస్తమోగుణాలుగా మారుతుంది. సరస్వతి సత్వగుణరూపిణి. ఈమె జగదుత్పత్తి చేస్తుంది. విద్యా జ్ఞానదాత్రి. లక్ష్మి రజోగుణ ప్రధాన. జగత్తును పెంచి పాలిస్తుంది. కాళి లేక దుర్గ తమోగుణ రూపిణి. రౌద్రరూప దుష్టసంహారం చేస్తుంది. ఈ ముగ్గురు దేవతలు జీవయాత్రకు అవసరమైన విద్య, సంపద, శక్తిని ప్రసాదిస్తారు.

శక్తి ప్రధానంగా మూడు విధాలు - ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి. ఇచ్ఛాశక్తినే will power అంటారు. మనము సాధించదలచిన పనియొక్క విజయం ఈ ఇచ్ఛాశక్తిపైనే ఆధారపడివుంటుంది. "Where there is a will, there is a way". తీవ్రమైన కోరికవున్నప్పుడు ఏదో ఒక మార్గం తప్పక లభిస్తుంది. ఇచ్ఛాశక్తి బలంగా వున్నప్పుడే అతని వాక్కుకు తగినంత బలం చేకూరు తుంది. వాక్కు ఎప్పుడైతే శక్తిమంతంగా వుంటుందో ఆ వాక్కు యొక్క ప్రభావం ఇతరులపై అంతగా వుంటుంది. ఇచ్ఛాశక్తి యొక్క చివరి పరిణామమే క్రియాశక్తి. మనసులోని ఆలోచన, దానిని గురించి పరిజ్ఞానం సంపాదించి క్రియారూపంలో ఆచరించుటయే, ఇచ్ఛాశక్తి క్రియాశక్తుల పరిణామం. దేవీనవరాత్రులలో శక్తిని పూజించి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులను సంపాదించుదాం. దేశాన్ని, ధర్మాన్ని, సంస్కృతిని పరిరక్షిద్దాం. ఇదే నవరాత్రి సందేశం.

(సెప్టెంబరు, 1992)

# యచ్ఛ్రేయస్తదస్తు మే

మానవుడు కోరికలకు దాసుడు. కోరికలు మాత్రం కాలానికి దాస్యం చేస్తుంటాయి. అయినా మనిషి కోరికలతో సతమతమవుతుంటాడు. కోరికలు తీరితే అదృష్టంగా భావిస్తాడు. కోరికలు తీరనప్పుడు చెప్పరాని వేదనకు లోనవుతాడు. ఆ అదృష్టమైనా, ఈ ఆవేదన అయినా తాత్కాలికాలే కానీ శాశ్వతాలు కాదనీ, భవిష్యత్తులో అదృష్టమే దురదృష్టంగా మారినా ఆశ్చర్యం లేదనీ మనిషికి తెలుసు. అయినా సరే, తన ప్రవృత్తిలో మార్పుండదు.

కోరికలు తీరడానికి పురుషకారం మాత్రమే చాలదని అందరికీ తెలుసు. దానికి దైవసహకారం కలియాలి. అందుకే దేవుళ్ళకు లంచాలిచ్చి ఆశపెట్టడానికి మనిషి వెనుకాడడు. నిలువుదోపిడి ఇవ్వడానికీ, ముడుపులు చెల్లించడానికీ, ఆకు పూజతో ప్రారంభించి అఖండవైభవంగా కళ్యాణం జరిపించడానికీ సిద్ధపడతాడు. తన కోరికలలోనే పరస్పరం వైరుధ్యమున్నా, ఇతరుల కోరికలతో తన కోరికలు సంఘర్షించినా సరే తనకేమీ పట్టనట్లు ముందుకు సాగుతూనే వుంటాడు. ఎప్పటికప్పుడు భంగపడుతూనే వుంటాడు.

'అంతా మన మంచికే' అన్నది తెలుగు సామెత. వాన రాకడ తెలిసీ గొడుగు తీసుకువెళ్ళనివాడు దురదృష్టవంతుడనుకుంటే, తీసుకొనిపోయి తిరిగి తేవటం మరిచిపోయిన వాడి పరిస్థితి ఏమిటి? పోటీలో ఉద్యోగం సాధించలేనివాడు దురదృష్టవంతుడనుకుంటే, ఉద్యోగం సాధించినా అనుకున్నచోట రానందుకు దురదృష్టవంతుణ్ణి అనుకుంటాడు మరొకడు. ప్రమాదవశాత్తు అంగహీనత ఏర్పడి దురదృష్టం అనుకున్నవారే, ఆ అవిటితనమే నరబలి ఇచ్చే తాంత్రికుల నుండి తన ఆ ప్రాణాన్ని కాపాడితే మహాదృష్టంగా పొంగిపోయిన జానపదకథలు మనకున్నాయి. కాబట్టి స్పష్టంగా చెప్పుకోవాలంటే మనషికి తనకేది అవసరమో తనకే తెలియదు. తనకు ఏది తగినదో తనకే తెలియదు. తనకు ఏది లాభమో, ఏది నష్టమో తనకే తెలియదు. అందుకే పెద్దలన్నారు - మన కోరికల లిస్టు భగవంతుని ముందు పెట్టకండి అని, 'నాకేది శ్రేయస్కరమో అదే జరగాలి' అని ఆశించమని. ఆ బాటలోనే పయనిద్దాం, 'యచ్ఛ్రేయస్తదస్తు మే'. (1992 - అక్టోబరు)

# పై చెయ్యి

సృష్టిలోని ప్రాణికోటి మొత్తంలో మానవుడు పైచెయ్యిగా బ్రతుకు తున్నాడు. అసలు మానవజన్మను పొందటమే ప్రాణులన్నిటికన్న పై చెయ్యిగా మనిషి భావిస్తున్నాడు. ప్రాణులన్నీ సమావేశమై పరస్పరం భావవినిమయం చేసుకొనే రోజువస్తే, ఆ ఆలోచనను అన్నీ అంగీకరిస్తాయో లేదో తెలీదు కానీ అలా సమావేశమయ్యే అవకాశం లేకపోవటాన్నే ప్రస్తుతం మనిషి పైచెయ్యిగా అనుకొంటున్నాడు.

ఈ మానవుల్లో కూడా ఒకరికన్నా ఒకరు పైచెయ్యిగా బ్రతకాలని అనునిత్యం తహతహ పెరిగిపోతోంది. ఒకడు లక్షాధికారి అయితే మరొకడు కోటీశ్వరుడు కావాలనీ, ఒకడు పదెకరాలు సంపాదిస్తే మరొకడు వంద ఎకరాలు సంపాదించాలనీ, ఒకడు నిరుద్యోగి అయితే మరొకడు చిరుద్యోగి అయినా చాలనీ కోరుకుంటూ పొరుగువాడికన్న అధికంగా తానుండాలని తాపత్రయపడు తుంటాడు.

అయితే అందరికన్న పై చెయ్యిగా బ్రతకగల్గినవాడు నిజానికొక్కడే. ఎవడి చేతిక్రింద ఇతరుల చేతులుంటాయో వాడు మాత్రమే అందరికన్నా పైచెయ్యిగా బ్రతకగల్గినవాడు.

వామనావతారం ధరించి విష్ణుమూర్తి బలిచక్రవర్తిని మూడడుగులనేల కోరాడు. వాగ్దానం అందుకున్నాడు. ఆ మధ్యలో శుక్రాచార్యునికి రహస్యం తెలిసింది. బొంకితే తప్పులేదని చెప్పి వాగ్దానాన్ని వెనక్కు తీసుకోమని బలిచక్రవర్తికి బోధచేశాడు. అయితే బలి వినలేదు. "ఆదిన్ శ్రీసతి కొప్పుపై, తనువుపై ..." అంటూ ప్రారంభించి అటువంటి విష్ణుమూర్తి చేయి క్రిందయి, తన చేయి మీదుగా వుంటే అంతకన్న కావలసిందేముందని ఆనందంగా చెప్పాడు.

కాబట్టి అందరికన్న పైచేయిగా బ్రతకాలంటే ఉన్నదారి ఒక్కటే. ఎంత సంపాదించామో లెక్కలేసుకుంటే అది కుదరదు. ఆ విషయంలో తాడినెక్కే వాడి

తలదన్నే వాడొకడు వుంటాడు. ఏ ఒక్క త్యాగభావంవల్లో, దానగుణంవల్లో మాత్రమే మనిషి పైచెయ్యిగా బ్రతకగల్గుతాడు. జలధారతోపాటు 'మమ' అన్న భావధారను కూడా వదిలి 'సమ', 'నమమ' అన్న భావాలతో బ్రతుకగల్గినప్పుడే మనిషి అందరికన్న పైచేయిగా బ్రతుకుతాడు. అటువంటి వ్యక్తి ముందు పరాత్పరుడయినా చేయిచాచి నిలబడతాడు. (నవంబరు, 1992)

## మాట

మనిషికి జ్ఞానేంద్రియాలు అయిదున్నవి. కన్ను, ముక్కు, చెవి, నోరు, చర్మం. కన్ను, ముక్కు, చెవి- యివి మూడూ జంటలు. చర్మం సర్వత్ర వ్యాపించి వుంటుంది. నోరు మాత్రం ఒక్కటే. అయితే మాత్రం కొండల్ను మింగాలన్నా మనం వెనుకంజ వేయటం లేదు. కొండెములు చెప్పాలన్నా కొంచెం కూడా వెనుదీయటం లేదు. నోట్లో నాలుక ప్రధానమైన అవయవం. అది లేకుంటే అమాయకుడి క్రింద లెక్క. అది ఎక్కువగా కదులుతుంటే అతి ప్రమాదకరమైన వ్యక్తికింద లెక్క.

ఎంత చూచినా, ఎంత విన్నా. అవసరమైనంతవరకే అనాలి. ఆ భావంతోనే నోరు, నోట్లో నాలుకా ఒకటే వున్నాయి. కానీ, మనిషికి ఆ తత్త్వం ఒంటబట్టడం కష్టమవుతోంది. ఆ ఒక్క నాలుకతోనే అన్ని రకాల డ్యాన్సులూ చేయించ గల్గుతున్నాడు.

హరిశ్చంద్రులను గురించి పద్యాలు పాడుతాం. అహింసామూర్తులను ఆరాధిస్తాం. ఆధ్యాత్మికోపన్యాసాలు అవిచ్ఛిన్నంగా కొనసాగిస్తాం. అయితే అదే నాలుక, అదే నోరు మరల మరునాటికి మరోరూపాన్ని ఎత్తుతుంది. మాట మారుతుంది. స్వలాభం కొంచెం కనిపిస్తే ఎన్ని మెలికలైనా తిరుగుతుంది.

స్త్రీల విషయంలో, మాటలలోని మంచి విషయంలో ఈ ప్రజలు అతి దుర్జనులని మహాకవులు ఆక్రోశించారు. బ్రహ్మాండాన్ని కప్పడానికైనా మూకుడుంది కాని నోరు కప్పడానికి లేదని అనుభవం చెప్పింది. ఇవన్నీ అందరికీ

తెలుసు. అందరూ అంటారు. కానీ, ఎవ్వరూ పట్టించుకోరు. చివరకు అందరూ మాటాడుతూ ఎవ్వరూ పట్టించుకోనివి ధర్మాలు అయి, అందరూ పట్టించుకుంటూ ఎవ్వరూ ఆలోచించనివి సామాజిక ధర్మాలయిపోతున్నాయి. అదే దుఃస్థితి మాటకు, మంచితనానికీ పట్టింది. మనమైనా ప్రయత్నిద్దాం. నోటిని, నాలుకను ఎంత హుందాగా వాడుకోవచ్చో అర్థం చేసుకుందాం. వీపును కాపాడుకుందాం.

(డిశంబరు, 1992)

# అందరూ దేశభక్తులే . . . !

మనది భారతజాతి. తరతరాలుగా దాని కొక రీతి వుంది. ఒక నీతి వుంది. ఆనీతి, రీతి కారణంగా విశ్వవ్యాప్తమైన ఖ్యాతి కూడా వుంది. అయితే ఆ నీతిలో, ఆ రీతిలో ఈ మధ్య తేడాలు కనిపిస్తున్నాయి. విశ్వవ్యాప్తమైన ఖ్యాతిలో ఏవో అపశ్రుతులకు నాంది పల్కుతున్నాయి.

తప్పుచేస్తే కన్నబిడ్డనైనా తీవ్రంగా శిక్షించగల న్యాయమూర్తులు, పాలకులు; ఆడిన మాటకోసం ఆలుబిడ్డలనైనా అమ్మి, ఆత్మార్పణకైనా సిద్ధపడిన సత్యమూర్తులు పుటపుటకు ఊపిరిపోసి చరిత్ర పుస్తకాలు అందించిన జాతి మనది. అయితే మాత్రం ఏం? అన్నీ తలక్రిందులవుతున్నాయి. మాటతప్పే మహాత్ములకైనా రాముడే ఆరాధ్యదైవం. కర్తవ్యంనుండి పారిపోయే తీవ్రకర్మిష్ఠులకైనా శ్రీకృష్ణ జయంతియే ముఖ్యం. ఆ రాముడి ఆచరణ, ఆ కృష్ణుని ఆలోచన మంటగలిసి పోతున్నాయి. మైలపడి పోతున్నాయి.

పెదవులపై తీయనిమాటలు, కళ్ళలో కృత్రిమమైన తేనెపోసలు. హృదయాంతరాలలో మాత్రం స్వార్థమే పరమార్థంగా భావించే క్రౌర్యాలూ, ద్వేషాలూ, కనిపిస్తున్నాయి. మనిషి మనిషికి మధ్య, మనసు మనసుకు మధ్య కత్తుల వంతెనలు కదంతొక్కుతున్నాయి. కత్తిమీద సాముచేస్తూ ఎందరు బ్రతుకగలుగుతారో, ఎందరు బలియైపోతారో అర్థం కాని అంతులేని అయోమయ

పరిస్థితి ఏర్పడుతోంది. మహాత్ములైనా, మామూలు ఆత్ములైనా తేడా లేకుండా ఈ సుడిగుండాల్లో చిక్కుకుపోతున్నారు. **'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే'** అన్న హామీ? తలచుకుంటూ ఆ అవతారమూర్తి రాకకోసం, ఎదురుచూస్తున్నారు. తానొక్కడు తప్ప మిగిలిన అందరూ ఆ అవతారమూర్తి ఆగ్రహానికి గురికావాలని ఆక్రోశిస్తున్నారు. అంతేగాని, ఆ అధర్మవ్యాప్తిలో తనకూ భాగముందని కానీ, లేదా ధర్మసంస్థాపనలో తానే అవతారమూర్తి కాగల అవకాశముందని కానీ ఎవ్వరూ అనుకొన్న పాపాన పోవటంలేదు. అందరూ దేశభక్తులే. రాజుగారి పీపాలలో మాత్రం, నీళ్ళు మాత్రమే మిగులుతున్నాయి.

(జనవరి, 1993 )

# మనమంతా వాహికలం

"ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" అని తైత్తిరీయోపనిషత్తు ఘోషించింది. నిస్సంతుగా నిలిచిపోవద్దని ఆదేశించింది. దానిని అక్షరాలా పాటిస్తున్నాం మనం. బిడ్డలుగా పుట్టి, భర్తలుగా మారి, తండ్రులమై తిరిగి మరో తరానికి ఊపిరిపోసి మన కర్తవ్యం పూర్తయినట్లు మురిసిపోతున్నాం. నిజమే. తైత్తిరీయోపనిషత్తే వాచ్యంగా చెప్పిన మాటను నూటికి నూరుపాళ్ళు పాటించాం. అయితే, ఆ తైత్తిరీయం అలా ఎందుకు చెప్పింది. మరో తరాన్ని మనం సృష్టించకపోతే ఎవరికి నష్టం? ఎందుకు నష్టం? తరం తరంగానే నిలవాలా లేక తరంగంలా ఒక దానిలో ఒకటి కలవాలా? అన్నది ఆలోచించగల స్థాయికి చాలా కొద్దిమంది మాత్రమే చేరుతున్నారు.

ఒక కాలువ వుంది. ఆ కాలువకు క్రింద తూములు పెట్టి వంతెన కట్టాం. ఆ తూము ఆ తీరంనుండి ఈ తీరందాకా వ్యాపించివుంది. అయితే దాని లక్ష్యం ఆ తీరానికి, ఈ తీరానికి మార్గాన్ని నిర్మించటంతో పూర్తికాదు. అదే లక్ష్యమయితే ఆ తూము లేకుండా కాలువనే శాశ్వతంగా పూడ్చివేయవచ్చు. కాబట్టి దాని లక్ష్యం వేరే. దానిద్వారా జీవజలం ఆవైపు నుండి ఈ వైపునకు ప్రవహిస్తూనే వుండాలి. అది

అవిచ్ఛిన్నంగా సాగాలి. తనమీదుగా నడిచి తీరాలు దాటే వారికి తాను అంతర్వాహినిగా వుండి జీవనాన్ని, జీవితాన్ని ఇవ్వగలగాలి. అది పూడిపోతే పైన నడవటం చాలా తేలిక. కాని నడవటానికి మనం మిగలాలి.

ఇదీ అంతే. తరాలు మరో తరాన్ని సృష్టించితే సరిపోదు. ఆ తరంనుండి ఈ తరానికి తరతరాలుగా వస్తున్న సంస్కృతి, జీవనవిధానం, జీవితలక్ష్యం, తాత్వికచింతన వగైరా వగైరా అన్నీ అందించగలగాలి. ఇవి అందించటంలో మనం ఎక్కడ నిర్లక్ష్యం చేసినా మనం నష్టపోవటం మాట అటుంచి ఈ జాతి మనపై వుంచిన కర్తవ్యాన్ని విస్మరిస్తున్నామన్న సంగతి గుర్తుంచుకోవాలి. మనం చూపించే నిర్లక్ష్యాన్ని మన ముందుతరమే ప్రదర్శించి వుంటే మన మీ స్థాయిలో కూడ మనగలిగే వారం కాదన్న సత్యాన్ని గమనించగలగాలి. అందుకే ముందుగా మనం ఈ జాతీయతకు, సంస్కృతికి వారసులమని గ్రహించి, దాన్ని అలాగే అంతకన్నా నిర్దుష్టంగా సాగించే వాహికలమై మనం నడచుకోవాలి. అప్పుడే విశ్వధర్మసంస్థాపనలో మన పాత్రకు న్యాయం చేకూర్చినట్లు. (మార్చి, 1993)

## ఈ మత్తైనా ఆపుదాం

మన రాష్ట్రప్రభుత్వం సారా నిషేధాన్ని ప్రకటించింది. సంపూర్ణ మద్యపాన నిషేధంలో ఇది తొలి మెట్టుగా అందరూ భావిస్తున్నారు. మద్యపానం అంటే ఏమిటో తెలీని ఒకజాతి, ఒకరోజు కోసం అందరూ ఎదురు చూస్తున్నారు.

మనిషికి తన అహాన్ని లేక ఆవేదనను పెంచటానికో, చంపటానికో ఏదో ఒక మత్తు అవసరమవుతుంటుంది. శరీరంలో ఉష్ణోగ్రత నియతంగా వుంటుంది. అది పెరిగినా, తగ్గినా అనారోగ్యం. అలాగే మనస్సులోని అహం కూడా ఒక స్థాయిలో వుండాలి. పెరిగినా, తరిగినా మనుగడలో మార్పు వస్తుంది. అయితే మనిషి శరీర ఉష్ణోగ్రత నియంత్రించటానికి తీసుకునే జాగ్రత్తలో సహస్రాంశం కూడా మనస్సును నియంత్రించడానికి తీసుకోవటంలేదు. అందుకే అది ఎప్పుడూ నియంత్రణలేని అసాధారణస్థితిలోనే కొనసాగుతోంది.

ఒక్కొక్కడు ఒక్కొక్క దానికి, అలవాటుకు దాసుడైపోతాడు. ఒకడికి ఎప్పుడూ ఏదో పదవిమత్తు. లేకుంటే నిద్రపట్టదు. దానిని సాధించటానికి ఎన్ని ఘాతుకాలకైనా సిద్ధపడతాడు. మరొకడికి ఎప్పుడూ ప్రచారం కావాలి. ఆధునిక యుగంలో ఏర్పడ్డ క్రొత్త మత్తు ఇది. పత్రికలలోనో రేడియోలలోనో ఎప్పుడూ పేరు, ఫోటో నానుతూండాలి. లేకుంటే ముద్ద దిగదు. దానికోసం ఎంత సిగ్గులేకుండా ప్రవర్తించటానికైనా సిద్ధపడతాడు. మరొకడికి డబ్బు మత్తు. డబ్బు ఎక్కువయ్యే కొద్దీ కుచేలుడికన్నా హీనంగా కనిపిస్తాడు. డబ్బు సాధించటానికి ఎన్ని ఎత్తుగడలైనా వేస్తాడు. ఎందరి కొంపలైనా కూలుస్తాడు. లేకుంటే నీళ్ళుకూడా మింగుడు పడవు. ఇలా చెప్పుకుంటూ పోతుంటే ఎన్నో రకాల మత్తు అలవాట్లు మనలో వున్నాయి. అవన్నీ నిషేధించలేం. ఎందుకంటే వాటిని నిషేధించమని ఎవ్వరూ అడగరు. అడగలేదు.

ఇక్కడొక విశేషముంది. ఈ రకరకాల మత్తులవాళ్ళు తాము బాగుపడి సంఘాన్ని పాడుచేసేందుకు సిద్ధపడినవారు. సారాప్రియులు మాత్రం తాము చెడిపోతూ సంఘాన్ని ఆర్థికంగా బాగుచేసే వాళ్ళు. సంఘద్రోహులను ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో వున్నాం కాబట్టి తమకు తాము చేసుకునే ద్రోహంనుండి అయినా కొందరిని కాపాడినట్టు అవుతుంది. సారాపానాన్ని - సురాపానాన్ని మానమంటూ మనంకూడా చేతనైనంత చేద్దాం. సామాజిక జీవితంలో మనపాత్రను మనమూ పోషిద్దాం.

(ఏప్రిల్, 1993)

## ఆశా బలవతీ రాజన్!...

మహాభారత సంగ్రామం చివర చివరకు వస్తోంది. భీష్ముడు అంపశయ్య చేరాడు. ద్రోణుడు మరణించాడు. కర్ణుడు కాలధర్మం చెందాడు. అయినా సుయోధనుడిలో ఆశ చావలేదు. శల్యుడు పాండవులను గెలువలేకపోతాడా అని ఎదురుచూస్తున్నాడు. కాబట్టి ఆశ ఎంత బలవత్తమమైనదో మనం అర్థం చేసుకోవచ్చు.

ప్రాణితోపాటు పుట్టి ప్రాణితోపాటే నశించేది ఆశ. అది మనిషి అస్తిత్వానికి ఒక గుర్తు, పెరుగుదలకు ఒక మూలం. ఆశ, ఆశయం రెండూ దగ్గర సంబంధం గలవి. ఆశ ఒక ఉదాత్త స్థాయిలో సాగితే ఆశయం అవుతుంది. ఆ ఉదాత్తత లోపిస్తే దాన్ని దురాశ అంటాం. ఆశయాల సాధన కోసం ఆశపడటం తప్పుకాదు. ఆశను పూర్తిచేసుకోవటం కోసం ఆశయాలు ఏర్పరచుకోవటం మధ్యరకం. అసలు ఆశయమంటూ ఏమీ లేకుండా ఆశ స్వేచ్ఛగా విహరిస్తే అది అధమస్థితి.

ఆ దురాశాస్థితి మనిషిని ఉన్మాదిని చేస్తుంది. క్రూరుణ్ణి చేస్తుంది. హీనుణ్ణి, దీనుణ్ణి కూడా చేస్తుంది. ఆ దురాశను పూర్తి చేసుకోవటానికి పదిమంది కాళ్ళుపట్టడానికైనా, పదిమంది నోళ్ళు కొట్టడానికైనా మనిషి సిద్ధపడే పరిస్థితి వస్తుంది. స్వపర భేదం లేకుండా అందరినీ వంచించడానికి, తన మన లేకుండా అందరినీ తప్పించుకొని తిరగటానికి అది కారణమవుతుంది. అయితే ఆశ వదలకండి. దాన్ని ఆశయంగా మార్చుకోండి. దురాశగా మాత్రం నిలవనీకండి.

(మే 1993)

# గమ్యమా? గమనమా?

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ ధనవంతుడి చుట్టూ తిరుగుతోందని ఒక కవి మాట. అయితే ఇప్పుడు ఇంకా స్థాయి పెరిగింది. ధనవంతుడి చుట్టూకాక ధనం చుట్టూనే తిరుగుతోంది. ఈ తిరగడంలో దానికి అక్షాంశ, రేఖాంశ నియమాలేవీ వుండవు. ఎటు వీలయితే అటు, ఎటు వాలయితే అటూ తిరుగుతూనే వుంటుంది. అందుకే అది అశాంతివలయమైనా ప్రశాంతి నిలయమైనా ఈర్ష్యాసూయలకూ, ఆవేశకావేశాలకూ, కక్షాకార్పణ్యాలకూ ఆలవాలం అవుతోంది. రక్తతర్పణాలకూ కారణమౌతోంది. మనలోని ద్వంద్వ విధానమే దీనికంతటికీ కారణమేమో!

"**వేదాః ద్వేధా భ్రమం చక్రే**, **కాంతాసు కనకేషు చ**,
**తాసు తేష్వప్యనాసక్తః**, **సాక్షాద్భర్గో నరాకృతిః**''.

- అని ఆర్యోక్తి, బ్రహ్మదేవుడు మానవుల బుద్ధిని రెండింటితో కట్టేశాడు. అవి కాంతా కనకాలు. అయితే మనం అందరం తెలిసో తెలియకో, కలిసో కలియకో ఒక అభిప్రాయంలో వున్నాం. పరకాంతావ్యామోహాన్ని ఈసడించాం. పరధనాభిలాష వుంటే మాత్రం ప్రయోజకుడంటాం. ఒకే విధమైన రెండు అవలక్షణాలతో ఒకదాన్ని పరమ పాపంగాను, రెండోదాన్ని పరమ ప్రయోజకత్వంగాను భావించే స్థాయికి మనం తరిగాం. పెరిగాం అనుకుంటారు చాలామంది. **"మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాని లోష్టవత్"** అని పరధనాన్ని మట్టి గడ్డల్లాగా చూడాలని చెప్పుకున్న ఈ దేశంలో, ఈ కాలం ధనవంతుడే ధర్మవంతుడవుతున్నాడు. తానే ధర్మవంతుడనుకుంటున్నాడు. కారణమేదైనా, సాధించదలచుకున్న కార్యమేదైనా అటువంటి ధర్మాత్ముల ధనాల అండదండలతో ఎన్నో వ్యవహారాలు జరగవలసిన పరిస్థితి, దుఃస్థితి ఏర్పడింది. మన భారతీయ విశ్వాసాల పరిధిలో ఆలోచిస్తే పాపిష్టి సొమ్ములతో పుణ్యకార్యాలు సంకల్పించవలసిన స్థితి, ఆ సొమ్మే లేకుంటే సాగించలేని స్థితి ఏర్పడింది. ఆ పాపపుఛాయలు సాగే పుణ్యకార్యాలపై పడకమానవు. వాటి ఫలితాలను అవి కనిపింపజేయకమానవు. అందుకే గమనమేదైనా సరే గమ్యం చేరటమే ముఖ్యమా? లేక గమ్యంతోపాటు గమనం కూడా పరిశుద్ధంగానే వుండాలని నిర్ణయించి సాగటం ముఖ్యమా? తేల్చిచెప్పవలసిన కర్తవ్యం, పెద్దలమీద, తేల్చుకొని బ్రతకవలసిన అవసరం ప్రజలకూ వుంది.

(జూలై - ఆగష్టు, 1993)

# పరోపదేశ పాండిత్యం

**"పరోపదేశపాండిత్యే సర్వే వ్యాసపరాశరాః"** అని సూక్తి. ఇతరులకు ఉపదేశాలు చేసే విషయంలో అందరూ వ్యాసుడికన్నా, వ్యాసుడి తండ్రి పరాశరమహర్షికన్నా కూడా గొప్పవారే అని తాత్పర్యం. ఎదుటి మనిషికి చెప్పటానికే నీతులుంటాయని అందరికీ తెలుసు. దానికి కారణం ఒక్కటే. "చెప్పుట సులభమ్ము చేయుట కష్టమ్ము, ధాతకైన వాని తాతకైన" అన్న సత్యమే.

మన దేశానికి ప్రపంచ దేశాలలో గొప్పతనం ఒకనాడు సిద్ధించిందంటే దానికి కారణం చెప్పేవాళ్ళకన్నా చేసినవాళ్ళు ఎక్కువగా వుండటం. ఈనాడు

ప్రపంచ దేశాల ముందు భారతదేశం వెలవెల పోయే పరిస్థితులు ఏర్పడుతున్నాయంటే దానికి కారణం చేసేవాళ్ళ కన్నా చెప్పేవాళ్ళ సంఖ్య ఎక్కువ కావటం.

మన ఆధ్యాత్మిక భావసంపద - విపరీత వ్యాఖ్యానాలనూ, అన్వయాలనూ వదలి పెడితే - ఈనాటికీ తత్త్వశాస్త్రంలో తిరుగులేనిది. అయితే అది కూడా ఈ రోజు వ్యాపార విషయంగా మారిపోతోంది. ధనసంపాదనకోసమో, పేరు ప్రతిష్ఠలకోసమో, కాలక్షేపంకోసమో ఇతర విషయాలలాగే ఆధ్యాత్మిక విషయాలు కూడా ఉపయోగపడుతున్నాయి. ఉపయోగించుకొనేవాళ్లు నిర్భీతితో, నిర్లజ్జగా వాటిని ఉపయోగించుకుంటున్నారు. ఇతర వ్యాపారాలన్నిటికన్న ఆధ్యాత్మికవ్యాపారం ఎక్కువ లాభసాటి. ఎందుకంటే మంచివారు, గొప్పవారు, గొప్ప ఆధ్యాత్మిక భావం కలవారు అన్న మంచిపేరు, ప్రచారం దీన్లో అదనపు లాభం. తద్వారా వచ్చే గౌరవం అదనపు బోనస్. కాబట్టి ఎక్కువ మంది ఇటు మొగ్గుచూపుతున్నారు. అటువంటి వారికి చిన్న మనవి- వేటికి అతీతంగా వుండటానికి ఆధ్యాత్మిక భావాలు ఏర్పడ్డాయో వాటిని పొందటానికై ఆ ఆధ్యాత్మికభావాలను వాడుకోవటం క్షమించరాని విషయం. పాండిత్యలక్ష్యం పరోపదేశం కాదు. ఆత్మజ్ఞానం. అది కల్గిన తర్వాత, అప్పటికీ ఏదైనా చెప్పాలనిపిస్తే అప్పుడే అది ఉపదేశమవుతుంది. గమనిస్తారు కదూ!

(సెప్టెంబరు, 1993)

## శారద రాత్రులు

ఈ నెలలోనే శరదృతువు ప్రారంభమవుతోంది. పిండి ఆరబోసినట్టుండే వెన్నెలలకూ, నిర్మల జలాశయాలకూ అది పెట్టింది పేరు. భావుకుల ఊహలలో శరత్కాలానికీ, శారదచంద్రికకు, ఆ చంద్రికతో కూడిన శారదరాత్రులకు ఎంతో ప్రాధాన్యముంది. అయితే అదంతా భావనాలోకానికి సంబంధించిన అంశం.

వాస్తవ జగత్తులో మనమందరం ఆచరిస్తున్నదీ, అయితే ఆలోచించలేకపోతున్నదీ మరోవిశేషం. శరన్నవరాత్రముల పేరుతో దేవీ పూజచేయటం మన తరతరాల సంప్రదాయం, సంస్కృతి.

శరన్నవరాత్రాలు ఒక వైపు పరానికి, మరోవైపు ఇహానికి సంబంధించిన ఉత్సవాలు. బొమ్మల కొలువులూ, పులివేషాలూ, ఇవన్నీ ఒక ఎత్తు. చిన్న పిల్లలలో కళాత్మకతని, వ్యూహాత్మక మేధాశక్తిని పెంచేవి బొమ్మల కొలువులు మొ॥ అయితే రకరకాల టీవీలు వాటినన్నింటిని త్రోసిరాజంటున్నాయి. ఈనాడు ఆ కోణంలో నుండి కొంత నష్టపోతున్నాం..

ఇక ఆముష్మికంగా దేవీ నవరాత్రముల పేర పూజలు చేస్తాం. ఇళ్ళలో, గుళ్ళలో, కొన్ని గ్రామాలలో పందిళ్ళలో కూడా ఈ పూజలు చేస్తుంటాం. ఆ పూజలో ఆరాధ్య దేవత శక్తిస్వరూపిణియైన స్త్రీమూర్తి. పురుషుల కసాధ్యమైన దుష్టసంహరణకార్యాన్ని నిర్వర్తించినందుకు కృతజ్ఞతతో, భక్తితో శక్తిని పూజిస్తున్నాము. కాని స్త్రీని మాత్రం ఈ దేశంలో పూజించనక్కర లేదు, కనీసం గౌరవించలేకపోతున్నాం.

అందుకే పూజచేస్తే చాలదు, స్ఫూర్తి పొందగలగాలి. నివేదిస్తే చాలదు, నిర్మలంగా వుండాలి. కర్పూర హారతులతోనే కాలం చెల్లకూడదు. కళ్యాణభావాలు కలకాలం నిలుపుకోగలగాలి.

(అక్టోబరు, 1993)

## బుద్ధిజీవి

మానవుడు బుద్ధిజీవి - నిజంగా ఈనాటి మానవుడు కేవలం బుద్ధిజీవి. ఒకనాడు ఈ బుద్ధి కారణంగానే మనిషి తాను అనంత సృష్టిలో ఉన్నతుణ్ణని భావించుకున్నాడు. ఆ మేరకు తీర్మానాలు చేసుకున్నాడు. అయితే ఈనాడు ఆ కారణంగానే తనను తానే చిన్న బుచ్చుకుంటూ వ్యవహరిస్తున్నాడు.

బుద్ధి ఒక గుణం. యుక్తాయుక్త విచక్షణకు ఉపకరించే ఒక సాధనం. మనిషి పొరపాట్లు చేస్తున్నాడేమో అని అనుమానం కలిగినపుడు తనకు తాను సమాధానం చెప్పుకోవటానికి, ధర్మమార్గంలో తన ప్రవర్తనను సంస్కరించు కోవటానికి అవసరమైన గుణం - మన శరీరంలోని ఒక వరం - బుద్ధి. అయితే

ప్రస్తుతం తనకు తాను సమాధానం చెప్పుకోవలసిన అవసరాన్ని పూర్తిగా విస్మరించిన మనిషి ఇతరులకు అందంగా సమాధానాలు చెప్పటానికి మాత్రమే బుద్ధిని ఉపయోగిస్తున్నాడు. దానికి పదును పెడుతున్నాడు. అసలు దాని కర్తవ్యాన్ని విస్మరిస్తున్నాడు.

అవును, బుద్ధి ఒక రెగ్యులేటర్, మనస్సును నియంత్రించేందుకు అవసరమైన సాధనం. ఆ విషయాన్ని మరచిపోతున్నాడు మనిషి.

చరాచర సృష్టి అంతా చరాచర జీవాలతో నిండివుంది. అవన్నీ కూడా. హృదయ జీవులు, మనిషి కూడా మౌలికంగా హృదయ జీవి. అతనికున్న విశిష్టవరం బుద్ధి. ఈ విషయాన్ని, హృదయ ధర్మాన్ని మరచి మనిషి బుద్ధిజీవిగానే బ్రతుకుతున్నాడు.

బుద్ధి జీవి అయితే ఎంత ఎత్తుకెదగవచ్చో అంత క్రిందికి జారవచ్చు. తన మనస్సు నమ్మని విషయాలను సత్యాలుగా ఇతరులచేత నమ్మించటానికి బుద్ధి ఉపయోగపడుతుంది. తాను ఆచరించటానికి సిద్ధపడని ధర్మాలను ఆచరిస్తున్నట్లుగా కనిపింపజేయటానికి బుద్ధి ఉపయోగపడుతుంది. తన మనస్సు తన బుద్ధిని పూర్తిగా వ్యతిరేకిస్తున్నా ఇతరుల మనస్సులపై మన ఆధిపత్యాన్ని కొనసాగించటానికి బుద్ధి సహకరిస్తుంది. అందుకే చాలామంది బుద్ధి జీవులుగా వుండటానికే ఇష్టపడుతున్నారు. వీరంతా హృదయ జీవులు కావాలి. అప్పుడే మనిషి మహనీయుడు అవుతాడు. (నవంబరు, 1993)

# పర్యావరణం

శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం పెరిగిన కొద్దీ, పర్యావరణ పరిరక్షణ ఆర్తనాదం పెచ్చరిల్లింది. ప్రపంచం అంతా ఈనాడు పర్యావరణ పరిరక్షణ గురించి తలలు పట్టుకుంటున్నది. అయితే పర్యావరణం అంటే యేమిటి? దేనిని పరిరక్షించాలో స్పష్టంగా చెప్పగల వారెవరైనా వున్నారా? సందేహమే. ఎక్కడో ఒకచోట హద్దులు

మీరిన పరిశోధన, పరివర్తన తరువాత సమతుల్యత దెబ్బతింటే, అప్పుడు అర్థమౌతున్నదే గాని సమగ్రరూపం యేనాడూ యెవరికీ అర్థం కాదు, అర్థం చేసుకోలేరు. అడవులు నరకివేయడం పెచ్చరిల్లితే చెట్ల పెంపకం గుర్తుకు వచ్చింది. పారిశ్రామికీకరణ, వాహనాల పెంపకం కారణంగా వాతావరణం చెడితే మాస్కులు ధరించడం అనివార్యమైంది. నగరాలలో మురుగునంతా నదులలో కలపటంవల్ల, కోట్ల రూపాయలు వెచ్చించి జలకాలుష్య నివారణకు పూనుకోవడం తప్పనిసరి అయింది. మరి యేమిటీ శాస్త్రవిజ్ఞానం? విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ ప్రకృతి సమతుల్యత దెబ్బతింటున్నదనే ఆక్రందన పెరుగుతున్నది. ఇది విజ్ఞానమా? అజ్ఞానమా? వాతావరణ కాలుష్యాన్ని పరిశీలించిన శాస్త్రజ్ఞులు ఇదే రేటున వాతావరణం కాలుష్యానికి గురైతే బొంబాయిలో పదేళ్ళ తరువాత ఒక్క ప్రాణి కూడా బ్రతకదంటున్నారు. పదేళ్ళ తరువాత ప్రాణి బ్రతకలేకపోతే, అదే సత్యమైతే ఓ పాతికేళ్ళ తరువాత ప్రపంచంలో యే ప్రాణీ వుండకపోవచ్చు. వాతావరణంలో గల ఓజోన్ పొర దెబ్బతింటే సూర్యుని నుండి ప్రాణాంతకమైన అతినీలలోహిత కిరణాలు భూమిని తాకకుండా ఆపే శక్తి లేక, భూమిని తాకితే ఒక్క ప్రాణి బ్రతకదు - బ్రతకలేదు. కనుక ప్రకృతి సమతుల్యత దెబ్బతింటే యెంత హానికరమో ఒక దృష్టికోణంలో నుండే ఈనాటి శాస్త్రజ్ఞులు చూడగల్గుతున్నారు లేదా రెండు, మూడు, నాలుగు దృష్టికోణాలలో చూడగలరేమో. అది వారి దోషంకాదు. పంచేంద్రియాల శక్తి పరిమితం. ఆత్మజ్ఞానం గల మహాద్రష్టలు ఏనాడో చెప్పారు. ఆత్మకు చుట్టూ ప్రాణికోటియొక్క శరీరం వున్నట్లే పరమాత్మ చుట్టూ పాంచభౌతిక ప్రకృతి వున్నదని భావించి విశ్వరూపం గురించి, విరాట్ పురుషుని గురించి భావన చేశారు. శరీరారోగ్యం కాపాడటానికి సమతుల్యత యెట్లా అవసరమో ప్రకృతి సవ్యంగా వుండాలంటే సమతుల్యత అంతే అవసరం. ఆ సమతుల్యతను గురించిన సమగ్రమైన అవగాహన ఆత్మజ్ఞానం గలవారికే అర్థమౌతుంది. పదార్థాలతో కూడిన పంచేంద్రియాలకు పరిశోధన చేసిన తరువాతనే అర్థమౌతుంది. ఆవేశానికి గురికాక, అహంకారం దరిచేరనీయక ప్రశాంతమైన మనసుతో పరిశోధన చేయాలి. ఆత్మజ్ఞానం గల ద్రష్టలు మార్గదర్శకులు కావాలి. అంతవరకు పర్యావరణం అర్థం కాదు - పరిరక్షణ పరిపూర్ణం కాదు- ప్రాణికోటి విలవిలలాడక తప్పదు.

(జనవరి, 1994)

# భావకాలుష్యం

మనం పర్యావరణ కాలుష్యాన్ని గురించి, వాతావరణ కాలుష్యాన్ని గురించి ఎంతో బాధపడుతున్నాం. మరింతగా భయపడుతున్నాం. ఎన్నో ప్రణాళికలు, ప్రాజెక్టులూ చేపట్టి వాటిని నిరోధించాలని ప్రయత్నిస్తున్నాం. అయితే వాటన్నిటికన్నా ప్రమాదకరమైన భావకాలుష్యం సమాజంలో అన్ని రంగాలకూ ప్రాకి అణువణువునా విస్తరించివుంది.

భావస్వాతంత్ర్యం మిక్కుటంగా వున్న దేశంలో అది వికృతరూపాన్ని ధరించి, సంఘాన్ని కొల్లగొడుతోంది. ఏ రంగంలో చూచినా చట్టబద్ధాలూ, ధర్మసంగతాలూ అయిన నైతిక సూత్రాలు ఒకవైపు, స్వార్థసిద్ధాలూ, ధన సంగతాలూ అయిన వ్యక్తినిష్ఠ సూత్రాలు మరోవైపు ఘర్షణపడుతున్నాయి. ధర్మాతిక్రమణం చేయరాదని చెప్పటానికి నోరులేని శాస్త్రాలూ, చట్టాలూ తప్ప మరేవీ కనిపించటం లేదు. ధర్మాతిక్రమణం జరిగితే శిక్షించటానికి కళ్ళులేని కోర్టులు తప్ప మరోమార్గం లేదు. ఏ వ్యక్తి ప్రవర్తననూ కూడా నలుగురూ ఎక్కడికక్కడే నిలదీయగల ప్రమాణాలు కానీ, నిలదీసి మాటాడగల వ్యక్తులు కానీ కరువైపోయారు.

ఏ కోణంలో నుండి చూచినా 'ఎవరిలాభం వారిది' అన్న ఏకైక సూత్రమే సంఘంలో వేద వాక్యమై పోయింది. తనకూ కొంత వాటా దొరుకుతుందంటే తెలిసితెలిసి తానూ అధర్మాన్ని సమర్థించటానికీ, ఆచరించటానికీ కూడా సిద్ధపడే దౌర్భాగ్య పరిస్థితి ప్రస్తుతం సంఘంలో నరనరాన జీర్ణించుకుపోయింది. అందరూ సొంత లాభంకోసం మనస్సులో ద్వేషిస్తూ కూడా పైకి చిరునవ్వులు చిందింపగల మహానటులు రంగస్థలంమీద మిగులుతున్నారు.

సంఘం, జీవితం ప్రశాంతంగా సాగటానికి పరస్పరం భావాలను గౌరవించుకోవటం, సహకరించుకోవటం కోసం పూర్వికులు అందించిన ఆదర్శ సూత్రం వికృత రూపాన్ని పొంది, పరస్పరలాభాలకోసం సంఘ వాతావరణాన్ని కలుషితం చేయటానికి ఎవ్వరూ వెనుకంజ వేయటం లేదు, జంకటంలేదు.

ఈ పరిస్థితులలో ఎవరిమట్టుకు వారే తనను సంఘానికి ధర్మకర్తగా భావించుకుంటే తప్ప ఈ జాతికి నిష్కృతి లేదు. అయితే అందరూ రాజుగారి పీపాలో నీళ్లుపోసే ప్రయత్నమే చేస్తున్నారు? విజ్ఞులైనవారు కదలండి. చేతనైనంత వరకు ఈ భావకాలుష్యాన్ని అరికట్టే మార్గాలు అన్వేషించండి. (ఫిబ్రవరి, 1994)

# రజసో మా సత్త్వం గమయ

ఆనాడు ఉపనిషత్తులు వ్రాసిన మహర్షులు ఊరికి దూరంగా బ్రతికారు కాబట్టి వారికందుబాటులో వున్న ఆలోచనలతో ప్రార్థనలు చేసుకునేవారు. **'అసతో మా సద్గమయ' 'తమసో మా జ్యోతిర్గమయ' 'మృత్యోర్మా అమృతం గమయ'** అని తృప్తిపడ్డారు. అసత్తు నుండి సత్తుకు, చీకటి నుండి వెలుగుకు, మృత్యువు నుండి అమృతత్వానికి నడిపించమని ఆకాంక్షించారు.

అయితే ప్రస్తుత పరిస్థితి వేరు. ముక్కు మూసుకొని ఆ పద్ధతిలో తపస్సు చేసుకోవాలన్నా అరణ్యాలకు కొదవ ఏర్పడింది. ఉద్యమరూపంలో మొక్కలను, చెట్లను నాటలేం గదా - నాటుకునే స్థితి వచ్చింది. జనారణ్యాలు పెరిగిపోతున్న దేశంలో వనారణ్యాలకోసం ప్రయత్నించటం అవివేకమయ్యే దశ వచ్చింది.

అందుకే ఇప్పుడు తపస్సు చేయాలంటే అరణ్యాలు అవసరం లేదు.. ప్రజల మధ్యలో, పంచాగ్ని మధ్యలో నిలిచినట్లు నిలిచి మౌనజీవనులు మూగ వేదనలు అనుభవించి ఆక్రోశించే రోజు లివి. పాత ఉపనిషత్తులకు క్రొత్త అర్థాలు చెప్పుకుంటే సమన్వయం కుదరకపోతే సంఘర్షించే పరిస్థితి. అహింసా సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తూ కూడా ప్రచారంలో పోటీపడి తలలు పగులకొట్టుకునే దుర్దశ ఇది. ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రచారం చేస్తూ ఆర్థాకర్షణ అంతస్సూత్రంగా బ్రతికేస్తున్న దినాలివి. శాసనసభల్లో సైతం అనుశాసనానికి లొంగని అఖండ మేధాశక్తి మనది.

పాత ఉపనిషత్తులు, వేదాంత సూత్రభాష్యాలు విలువైనవి, విలువ కట్టలేనివి. వాటిని త్రికరణశుద్ధిగా నమస్కరించి ప్రక్కకు నెట్టేద్దాం. అవసరమైతే ఇప్పుడు మనకు, మానవజాతికి కావలసింది ఒకే ఒక ఉపనిషద్వాక్యం -

"రజసో మా సత్త్వం గమయ",
'రజోగుణం నుండి సత్త్వగుణానికి నడిపించు'.

(మార్చి, 1994)

# నోరు మాట్లాడుతుంటే ....

.... నొసలు వెక్కిరిస్తుందన్నది చక్కని తెలుగు సామెత. ఆ మాటాడే నోటికి గానీ, వెక్కిరించే నొసటికి గాని విడిగా జ్ఞానం లేదు. ఆ రెండూ కలిగివున్న మనిషికి జ్ఞానం వున్నా సిగ్గు, లజ్జలాంటి పౌరుషగుణాలు కానీ; ధర్మం, ఔచిత్యం వంటి మానవీయగుణాలు కానీ వుండటం లేదు. అందువల్లనే మాటాడకపోతే వచ్చే లాభాలు ఎక్కడ పోతాయో అన్న భయం, వెక్కిరించకపోతే తనకు సహజమైన వెకిలి క్రూర - లక్షణాలు అణగారిపోతాయేమో అన్న ఆరాటం, ఆ రెండూ కలిసి మనిషిని అధోగతికి తీసుకొని పోతున్నాయి.

ఈ విధమైన విపత్కర పరిస్థితికి లౌక్యం అని మనకన్న కొంత ముందు తరంవారు పేరు పెట్టుకున్నారు. 'తాను చేస్తే లౌక్యం- ఇతరులు చేస్తే మోసం' అని వివరణ ఇస్తూ గురజాడ ఆజాతి వారిని సున్నితంగా చెప్పుతో కొట్టాడు. ఈ రోజుల్లో నాగరకత బాగా పెరిగిపోయిన తర్వాత మనం ఆ లౌక్యానికి చాలా పేర్లు పెట్టుకుంటున్నాం. కలిసిపోవడం, సంస్కారం, సర్దుకుపోవటం, వగైరా వగైరా. యథార్థానికి ఈ పదాలన్నీ ఆ లౌక్యం బాపతుగాళ్ళతో కలిసి జీవించటానికి వచ్చిన పేర్లు కాదు. అభిప్రాయాల్లో భేదాలు - ఏ అభిప్రాయంలోనూ దోషం లేనప్పుడు - ఆలోచనల వైవిధ్యాలు గలిగిన వ్యక్తులు కలిసి జీవించటానికి ఏర్పడిన పదాలు మాత్రమే.

అయితే ప్రస్తుతం మనిషి మనుగడ స్వప్రయోజనం ప్రధానంగా, పరమార్థంగా సాగుతుండటంవల్ల ప్రతివ్యక్తికీ అనేక ముఖాలు ఏర్పడుతున్నాయి. గతంలో మాటా, మనసూ వేరుగా వుంటే ద్వంద్వప్రవృత్తి అనేవారు. ఇప్పుడు ద్వంద్వస్థానంలో అనేకత్వం ఏర్పడింది. ఏ ఎండకా గొడుగు పట్టినట్టు ఏ సన్నివేశానికి ఆ ముఖం పెట్టుకొని పని పూర్తిచేసుకొని పోయేవారు ఎక్కువయ్యారు. దీనివలన త్రికరణశుద్ధి అని మన సంస్కృతి ప్రముఖంగా ఘోషించిన ఉదాత్త జీవన విధానానికి పతనావస్థ వస్తోంది. వచ్చిందేమో కూడా. దీనివల్ల భవిష్యత్తులో జాతి ఎదుర్కొనే దయనీయ పరిస్థితిని మనమంతా కర్మసాక్షులవలె నిలిచి చూడక తప్పదేమో! ఆ పరిస్థితిని చూడలేమంటే - ఓ కుహనా మేధావుల్లారా! ఇప్పటికన్నా కళ్లు తెరవండి. సత్యాన్ని సత్యంగా, అసత్యాన్ని అసత్యంగా; ధర్మాన్ని ధర్మంగా, అధర్మాన్ని ఆధర్మంగా చెప్పకపోతే పోయేరు- కనీసం తొలిమెట్టుగా గ్రహించటమైనా నేర్చుకోండి. (ఏప్రిల్, 1994)

# ఏడు చేపల కథ

అనగా అనగా ఒక రాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు. ఏడుగురూ వేటకు వెళ్ళి ఏడు చేపలు తెచ్చి, ఎండబెట్టారు. అందులో ఒక చేప ఎండలేదు. .... 'నా బంగారు పుట్టలో వేలు పెడితే నేను కుట్టనా' అని చీమ జవాబివ్వటంతో ఈ కథ ముగుస్తుంది.

తెలుగు నేలలో ఊంకొట్టే వయస్సులో ప్రతిమనిషి ఈ కథకు శ్రోతయే. ఈ కథ చెప్పిన వాళ్ళు, విన్నవాళ్ళు ఏమవుతారో ఫలశ్రుతి చెప్పలేదు కానీ ఏదో అవుతారనో, ఏదో కావాలనో ఆశించే చెప్పి వుంటారు? ఆ అంతస్సూత్రమేమై వుంటుంది?

'రాజకుమారులు వేటకు వెళ్ళి చేపలు తెచ్చుకోవటమేమిటి?' లాంటి సందేహాలను ప్రక్కనబెట్టి ఆలోచిస్తే ఈ కథలో ప్రధానమైన అంశాలు రెండు కనిపిస్తాయి. ఒకటి - ఒకరిమీద మరొకరు ఆధారపడి బ్రతుకుతున్న ఈ సామాజిక జీవితంలో ఏ ఒక్కడు తన కర్తవ్యాన్ని విస్మరించినా ఆ గొలుసుకట్టు అలాగే కొనసాగి ఫలితాన్ని దెబ్బతీస్తుందని. రెండవది - నిష్కారణంగా బంగారు పుట్టలో వేలు పెట్టి దానిని పాడుచేయాలని ఆశించిన ఆ చిన్నపిల్లల తత్త్వం చివరకు తమకే బాధ కలిగిస్తుందనీ.

దేశప్రజలందరూ జాతీయమైన ఆదాయవ్యయాలను సమంగా, చట్టబద్ధంగా అనుభవించటానికి వీలుగా ఆ ప్రజలలోనే కొందరు ఉద్యోగులు అవుతారు. మరికొందరు ఆయా అవసరాల కనుగుణంగా ప్రభుత్వ ఉద్యోగం లేకుండా స్వతంత్రంగా జీవిస్తున్నా, ఆ పరిధిలో భాగస్వాములే అవుతారు. అయితే వీరందరూ కలిసి 'ఇతరులు కూడా ప్రజలే. వారికోసమే తామున్నామన్న' అంశాన్ని మరచిపోతారు. కర్తవ్యాలను ఐచ్ఛికంగా విస్మరిస్తారు. దానితో చైనులోని లింకులు తెగి బాధపడేవారి సంఖ్య అనంతం. ఆ బాధలు కళ్ళల్లో కనిపిస్తున్నా వ్యక్తుల్లో మార్పు రాకపోవటం దురదృష్టం. ఈ బాధ్యతగల ఉద్యోగులు పరస్పరం సహకరించుకున్నట్టే పరస్పరం పీడించుకుంటూ కూడా వుండటం సర్వసాధారణం.

'నా బంగారు పుట్టలో వేలు పెడితే నేను కుట్టనా' అన్నమాటతో మనం కథను పూర్తిచేసుకున్నాం. అలా కాకుండా "పాపా పాపా బంగారు పుట్టలో వేలెందుకు పెట్టావ్" అని అడిగి వుంటే ఆనాటి పాప ఏమి చెప్పి వుండేదో తెలీదు. కానీ ఈనాడు పాపల విషయమెట్లున్నా పెద్దలే సమాధానం చెప్తారు నిక్కచ్చిగా, 'చీమపుట్ట అంత అందంగా వుంటే నా కన్నుకుట్టి నేను వేలు పెట్టానని'.

కాబట్టి వర్తమాన ప్రజలంతా మరొకసారి ఆ చిన్ననాటి కథను గుర్తుతెచ్చుకొని ఏం చెప్పారో అని కాకుండా, ఎందుకు చెప్పారో ఆలోచించి బ్రతుకుబాటను దిద్దుకుంటే తమకూ, దేశానికీ క్షేమం. (మే - జూన్, 1994)

# 'బృహ' త్పలాయనులు

ఒకప్పుడు ఈ తెలుగు నేలనేలిన రాజవంశాలలో బృహత్పలాయన వంశ మొకటని చరిత్ర చెప్తోంది. 'పలాయన' వాదమన్నది అందరికీ పరిచయమైనదే. పలాయన అంటే తప్పించుకునేవారు లేదా పారిపోయేవారని అర్థం. బృహత్పలాయనులంటే ఆ కళలో నిష్ణాతులని భావం.

ఆ రోజుల్లో ఆ బృహత్పలాయనులు నిజంగా బృహత్పలాయనులో కాదో తెలియదు కానీ ఈ రోజుల్లో పాలకులూ, పాలితులూ, అందరూ బృహత్పలాయనులై గత వైభవాన్ని తిరగదోడుతున్నారు.

ఈ బృహత్పలాయనం ప్రధానంగా రెండు అంశాలలో కనిపించటం జాతికీ, నీతికీ, జాతీయతకూ కూడా ప్రమాదసూచకం. ఒకటి ధర్మపలాయనత్వం - రెండోది కర్మపలాయనత్వం.

అసలు ఈ జాతి ధర్మపరాయణులకూ, కర్మపరాయణులకూ పెట్టింది. పేరు. ధర్మ సంస్థాపనం కోసం, కర్మ ఆచరణంకోసం సర్వస్వాన్ని అయినా పణంగా పెట్టడం, స్వార్థాన్ని సర్వాత్మనా త్యజించగలగటం వారికి వెన్నతో పెట్టిన విద్య.

ఆ జాతికీ, ఆ రీతికి వారసులమైన మనలో మాత్రం ఈ రోజుల్లో ధర్మ కర్మ పలాయనత్వం నరనరాన జీర్ణించుకొని పోవటం ఆందోళనకరం. ఈ ధర్మపలాయనంలో తరతమ భేదం కనిపించటంలేదు. ధర్మవేత్తలూ, ధర్మబోధకులూ, ధర్మారాధకులు, అందరూ కూడా తనదాకా వచ్చినప్పుడు ధర్మ స్వరూపానికి అర్థాలు మారుస్తున్నారు. వ్యాఖ్యానాలు వినిపిస్తున్నారు. 'తాను చెప్పిందే వేదం, తాను చేసిందే వాదం' అన్న దృఢసంకల్పంతో బ్రతికేస్తున్నారు. ధర్మశ్రోతలు మాత్రం ఆ బోధనలకూ, ఆచరణలకూ లంకె కుదరక, అనునిత్యం ధర్మసందేహాలతో, ధర్మసంకటాలతో కలవరపడిపోతున్నారు. అయితే తిక్కన చెప్పినట్లు, ధర్మాన్ని కాపాడుకోవటానికి దైవముంది. మనలనుండి మనలను కాపాడుకోవలసిన అవసరముంది. దానికి మార్గం కర్మాచరణం.

ప్రస్తుతం అదికూడ ప్రమాదంలో పడింది. కర్మ ప్రవచనం చేసే వారే కానీ నియమబద్ధంగా, ధర్మసిద్ధంగా కర్మాచరణం చేసే వాళ్ళు కనిపించటం లేదు. ఏ కర్మను జీవికగా చేసుకొని బ్రతుకుతున్నామో దానికి న్యాయం చెయ్యాలన్న భావం కూడా లేని కర్మపరులు తయారవుతున్నారు. అందుకే మనమంతా బృహత్పలాయనులపై చరిత్రను మళ్ళీ వ్రాసే ప్రయత్నం చేస్తున్నామేమో అన్న భయం క్షణక్షణం కలుగుతోంది. (జూలై, 1994)

# విద్య - సుఖం

"సుఖార్థీ చేత్ త్యజేత్ విద్యాం - విద్యార్థీ చేత్ త్యజేత్సుఖమ్" అని ఆర్యులన్నారు. సుఖం కావాలంటే విద్యను వదిలి పెట్టాలని, విద్య కావాలంటే సుఖాన్ని వదిలిపెట్టాలని దాని తాత్పర్యం. ఆ రోజుల్లో ఆశ్రమాలలోనో, దూరతీరాలలోనో పాఠశాలలుండేవి. అక్కడ వివిధ కార్యక్రమాల మధ్య విద్యాధ్యయనం కూడా ఒకటిగా వుండేది. అంటే, విద్య నేర్చుకోవటమంటే గిరీశం, వేంకటేశాల్లాగా ఒక పుస్తకాల పట్టిక వ్రాసుకొని వాటిని కంఠతా పెట్టటమో, మొత్తంగా జీర్ణించుకోవటమో కాకుండా, నేర్చుకున్న విద్యద్వారా జీవితాన్ని తీర్చిదిద్ద

కొనవలసిన తీరు ప్రధానమయ్యేది. అందుకే ఆ రీతిగా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుతూ, వారి వారికి అభీష్టాలైన శాస్త్రాది విషయాల్లో పరిజ్ఞానాన్ని కూడా కలిగించేవారు.

ఈనాడు కూడా మామూలు పాఠశాలలు అంతరించి, ఆశ్రమ పాఠశాలలు విస్తరించటం కన్నుమూసి తెరిచేలోగా చూపు కందనంత వేగంగా జరుగుతోంది. పిల్లలను గురించి పట్టించుకొనే ఓపిక, తీరిక లేని పెద్దలూ; ఈ పోటీ ప్రపంచంలో దాని కనుగుణంగా తమ బిడ్డలను ఎలా తీర్చిదిద్దాలో తెలియని తల్లిదండ్రులూ; తమ భారాన్ని మోసే వాడుంటే, ఇతరుల మీద వేసి నిశ్చింతగా వుండటంలోని సుఖాన్ని అర్థం చేసుకున్న ఆనందజీవులూ ఆశ్రమ పాఠశాలల నిత్యకళ్యాణాలకు, పచ్చతోరణాలకు కారకులవుతున్నారు. సామాజిక పరిస్థితుల కనుగుణంగా నడవకపోతే తామెక్కడ వెనుకబడిపోతామో అన్న భయం అందరిలో కనిపిస్తోంది. ఈ పరిణామాల పర్యవసానం సుఖాంతం కాదా? అంటే ఒక విధంగా అవుతుందనే అనాలి. అవుతుందా? అని ఎదురు ప్రశ్నిస్తే పరిపూర్ణంగా కాదని ఒప్పుకోక తప్పని పరిస్థితి ఏర్పడుతోంది.

అసలు కాలేజీలో పాఠాలు చెప్పటానికి ఆపసోపాలు పడే మేష్టర్లు, కొసరు కాలేజీకి ఆగమేఘాల మీద ఉరుకులు పరుగులతో వెళ్ళి చెమటోడ్చి పాఠాలు చెప్పటం చూస్తుంటే ఆశ్చర్యం కలగటం లేదు. మానవ స్వభావాలలో వుండవలసిన మౌలిక నైతిక విలువలు తమ సాంద్రతను కోలుపోయే క్రమం ఎప్పటికీ ఆగదా అన్న భయం మాత్రం కలుగుతుంది.

అయితే, ఈ అంశంలో ఎవరిని నిందించవలసిన పనిలేదు. ఎవరినీ అధిక్షేపించటమో, వ్రేలెత్తి చూపటమో నా అభిమతము కాదు. కానీ, అందరం కలిసి ఎక్కడో పోగొట్టుకున్న విద్యావ్యవస్థను అందరం కలిసి మరెక్కడో వెతికి సాధించుదామని ఆలోచించటం మాత్రమే ఆందోళన కలిగిస్తోంది. విద్యకు సుఖం లేదు. విద్యార్థికీ సుఖం లేదు. వ్యక్తిత్వ వికాసం దృష్ట్యా లాభమూ లేదు. మాస్టర్లకూ అటూ ఇటూ తిరిగే ఆటుపోటుల మధ్య సుఖం లేదు. దీని గురించి ఆలోచించి, ఆలోచించి నిస్సహాయులయ్యే విద్యావంతులకూ సుఖం లేదు. అయినా, ఈ వ్యవస్థ కొనసాగుతూనే వుంటుంది. ఈ పాటి అయినా ఆలోచించటానికి అదే మూలం కాబట్టి.

(1994 - ఆగష్టు)

# మదం - దమం

రాయి ఒకటే అయినా దానితో పళ్ళు (ఫలాలు) రాల గొట్టుకునే వాళ్ళూ, పళ్ళు (దంతాలు) రాలగొట్టుకునే వాళ్ళూ వుంటారు - వస్తువు ఒకటే అయినా వినియోగించుకునే వ్యక్తులస్థాయి, భావభేదాలను బట్టి వినియోగంలో భేదం, ఫలితంలో భేదం వుంటాయి. అలాగే మనుషుల్లో వుండే చాలా లక్షణాలు ఒక్కొక్కరికి ఒక్కొక్కరకమైన ఫలితాల నందిస్తాయి.

నాలుగక్షరాలు చదువుకున్నందుకే గర్వించేవాడొకడైతే, నాలుగక్షరాలూ చదువుకొని కూడా వినయంగా వుండేవాడొకడు. చదువుల లక్ష్యం, సారం, ఫలితం తెలిసినవాడికీ, తెలియనివాడికి వుండే భేద మేమి? అలాగే నాలుగు కాసులు సొంతం కాగానే కుబేరుడితో కలిసి వ్యాపారం చేద్దామని భావించేవాళ్ళు కొందరైతే, ఎంత సొమ్మున్నా దానికి తాము కేవలం ధర్మకర్తలమన్న భావంతో వుండేవాళ్ళు మరి కొందరు. అయితే ఈ జాతి సంఖ్య తక్కువ వుండవచ్చు.

ఇదంతా గమనించే క్షేమేంద్రుడు చారుచర్యలో మంచి మాటలు కొన్ని చెప్పాడు.

**కులం విత్తం, శ్రుతం రూపం, శౌర్యం దానం తపస్తథా।**
**ప్రాధాన్యేన మనుష్యాణాం, సప్తైతే మదహేతవః ॥**

కులమూ, ధనమూ, పాండిత్యమూ, రూపమూ, శౌర్యమూ, దానమూ, తపస్సు మనుష్యులకు మదహేతువులవుతాయి. అయితే సజ్జనులకైతే అవే దమహేతువులవుతాయి. దమమంటే సంయమనం, నమ్రత.

ఇవన్నీ పాతరోజుల్లో మాటలు. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. రూపాన్నీ, శౌర్యాన్నీ, దానాన్నీ, తపస్సునూ పెద్దగా పట్టించుకొనేవారు లేరు. అక్కడక్కడ పట్టించుకున్నట్లు కనిపించినా ఆయా సందర్భాలలో వేరే కారణాలుంటాయి కానీ, యథార్థానికి అవే కారణాలు కావు.

ఇక పాండిత్యం దశను చేరుకోక ముందునుంచే మదహేతువవుతోంది కులం. (ప్రాచీనులు వంశమన్న అర్థంలోనే వాడారు) ప్రస్తుతం విరాట్స్వరూపాన్ని ధరించి, అర్థాన్ని మార్చుకొని, విత్తాన్ని తోడుచేసుకొని రాజ్యాన్ని ఏలుతోంది. కులం సమూలంగా అంతం కావాలని కొందరు కోరుకుంటున్నా అందరినీ సమూలంగా అంతం చేసే దాకా అది కరాళనృత్యాన్ని ఆపదేమో అనిపిస్తోంది.

(సెప్టెంబర్, 1994)

# ఎన్నికల పండుగ

అయిదేళ్ళకోసారి - అదృష్టముంటే ఎప్పుడు పడితే అప్పుడు ఏ లెక్కా లేకుండా వచ్చేది ఎన్నికల పండుగ. ఈ జాతికి, ఈ దేశానికీ, జీవనసూత్రం ప్రజాస్వామ్యమే. అయితే దాన్ని గుర్తించి, దాని ఫలితాలను అందుకునేందుకు మన ముందున్న ఏకైక మార్గం ఎన్నికలే కాబట్టి అది పండుగరోజే. ఈ రోజుకూ స్వాతంత్ర్య దినోత్సవాన్ని, గణతంత్ర దినోత్సవాన్ని పండుగరోజులుగా నిజంగా భావించి ఆనందించేవారు మనకు లేకపోలేదు. ఆ స్ఫూర్తితోనే ఆలోచిస్తే ఎన్నికలొచ్చిన ప్రతిసారీ ప్రజాస్వామ్యానికి పండుగరోజే.

అయితే ప్రజాస్వామ్యానికి అది పండుగ రోజే కానీ ఓటర్లకు పరీక్షరోజు. ఎన్నికలలో పోటీచేసిన అభ్యర్థులు ఎవరిమట్టుకు వాళ్ళు గెలుస్తామా? లేమా? అని పరీక్షగా దాన్ని భావిస్తుంటారు. కానీ, మన ప్రజాస్వామ్యంలో ఓటరు గెలుస్తాడా? ఓడిపోతాడా? అన్నది ప్రధాన ప్రశ్న, పరీక్ష అవుతోంది.

ఎందుకంటే పోటీచేసే అభ్యర్థులందరూ పాపం తమకు తెలిసీ, మనకు తెలీదనుకొని ఎన్నో అసత్యాలు, అసంగతాలు మాటాడుతుంటారు. ప్రచారం చేస్తుంటారు. ఒక దేశం లేదా ఒక రాష్ట్రం భౌతిక - ఆర్థిక పరిస్థితి, వర్తమాన వాస్తవస్థితి రెండూ తెలిసి కూడా ఈ రెండింటికి పొంతనలేని వరాలను, దీవెనలను ఓటర్లపై కుమ్మరిస్తారు. ఈ విషయంలో ఎవ్వరికీ మినహాయింపు లేదు. అవన్నీ నమ్మినా, నమ్మకపోయినా ఓటరు వినకతప్పదు. "నేను నమ్మటం లేదు బాబోయ్" అని అరిచి చెప్పే అవకాశం ఓటరుకు లేదు. అంత జనాభాను పోగేయటమూ చేతకాదు. మీరు చేసే వాగ్దానాలు ఎలా కుదురుతాయో వివరించగలరా అని అడిగే సత్తా, శ్రద్ధ, వాతావరణం ఈ దేశంలో ఓటరుకు లేవు. అందుకే చిటికెన వ్రేలితో గోవర్ధనగిరి నెత్తిన శ్రీకృష్ణుడి కథను పురాణాలలో విన్నట్లే హిమాలయాలను ఐస్క్రీమ్ ముక్కలుగా చేసి మీకందరికి పంచిపెడ్తాం అన్నా, కాబోలని వింటుంటారు. చివరకు 'ఏరాయి అయితేనేం పళ్ళురాలగొట్టుకునేందుకు' అనే అద్వైత భావానికి లోనయిపోతారు.

కానీ అది కాదు ఎన్నికల ఉద్దేశ్యం. నువ్వు నోటితో చెప్పలేనివి, ఎదురుగా అడగలేనివి, ధైర్యంగా ఎదుర్కొనలేనివి అన్నింటికి పరిష్కారం నీ ఓటు. ఎంతటి యోధానుయోధుడైనా దాని ముందు తలవంచక తప్పదు. అందుకే ఈ ఎన్నికల పండుగను ఓటరు పరీక్షగా తీసుకోవాలి. ఉత్తమ ప్రజాస్వామ్య నిర్మాణ బాధ్యత తనమీదే ఉందని భావించి, దానికనుగుణంగా స్పందించాలి. స్పందింపజేయాలి.

(అక్టోబరు, 1994)

# జీవన్మృతుడు

ఈ మాట మనం తరచుగా వింటుంటాం. బ్రతికి చెడ్డవాళ్ళను గురించి మాట్లాడేటప్పుడో, ఆశలు కూలి నైరాశ్యంతో బ్రతుకుతున్న వాళ్ళ గురించో, మహాప్రయత్నంనుండి విఫలమై పతనం చెందిన వాళ్ళగురించి ప్రస్తావిస్తున్నప్పుడో... వగైరా వగైరా సందర్భాలలో మనం ఆ మాటను వింటుంటాం, వాడుతుంటాం.

అయితే జీవన్మృతులంటే నిజానికి అటువంటివారేనా? లేక సజావుగా బ్రతికేస్తున్నవారిలోనో, బ్రతుకేస్తున్నా మనుకుంటున్న వారిలోనో జీవన్మృతు లుండరా? పవిత్ర భారతదేశంలో మనకులాగానే మహాభారతంలో యక్షుడికి కూడా ఇదే అనుమానం వచ్చింది. అప్పుడు ధర్మరాజు నడిగాడు “జీవన్మృతుడంటే ఎవరని”? దానికి ధర్మరాజు చెప్పిన సమాధానం “దేవతలకు, అతిథులకు, పితరులకు, సేవకులకు పెట్టకుండా తినేవాడే జీవన్మృతుడ”ని.

దేవతలు, పితరులు ఇక్కడ ఇహలోకానికి చెందినవారు కాదు. పరలోకానికి సంబంధించిన వారు. దైవయజ్ఞం, పితృయజ్ఞం మనకు శాస్త్రవిహితాలైన ధర్మాలు. ప్రకృతిని ప్రసాదించినవారు దేవతలు కాబట్టి, ప్రకృతిలో మనవాటా మనం వారికి నివేదించాలి. తదర్పితంగానే సర్వస్వాన్నీ భావించి స్వీకరించగలగాలి. ఈ భావనవల్ల మనకు ప్రత్యక్షంగా కలిగే నష్టమేమీ లేదు. కొంచెం శ్రద్ధాసక్తులను ప్రదర్శిస్తే చాలు.

అయితే మనకు ప్రత్యక్షంగా నష్టమనిపించే మరో ఇద్దరికీ పెట్టకపోవటాన్ని కూడా ధర్మరాజు జీవన్మృతుడి లక్షణంగానే చెప్పాడు. ఆ ఇద్దరూ అతిథులూ, సేవకులూ. 'అతిథిదేవో భవ' అని ఉపనిషత్తులు అతిథిని దైవంతో సమానంగా చూడమని ఘోషించాయి. ఎవరైనా ఎవరింటికైనా రావటం, వారిని ఆప్యాయంగా ఆహ్వానించగలగటం సమైక్య సమన్విత సహజీవనానికి గుర్తులు. ఆ భావాలున్నంత వరకు అతిథిసేవ చేస్తాం. ఆ భావం లోపిస్తే అతిథిని ఆదరించలేం.

**'అతిథి కడు నల్పుఁడైన నత్యధికుఁడైన**
**నింటికేతేరఁ బ్రియమందు? నెవ్వఁడేని**
**వాని గౌరవ మది గౌరవంబు కాని**
**కాదు గౌరవ మాకార గౌరవంబు'** అన్నాడు శ్రీనాథుడు.

ఇక సేవకులకు పెట్టి తాను తినటం సహభావానికి, సామ్యవాద విధానానికీ గుర్తు. ఆ ఆలోచనలు లేనివారు సేవకులను తక్కువగానే చూడగలరు, కానీ దేన్నీ వాళ్ళతో కలిసి పంచుకోలేరు.

అందుకే సమైక్య సామ్యవాద జీవనం కావాలంటే ముందుగా అతిథులను, సేవకులను ఆదరించటం నేర్చుకుందాం. జీవన్మృతులం కాకుండా బ్రతుకుతున్న వారి లెక్కలో చేరుదాం. (నవంబరు, 1994)

## ఎరలు - చేపలు

ఎరవేసి చేపలు పట్టటం క్రొత్త విషయ మేమి కాదు. చేపల్ను పట్టాలి అన్న ఆలోచన మానవుడికి లేదా ఇతర జంతుజాలానికి కలిగినప్పుడే మార్గాల అన్వేషణ ప్రారంభమై వుంటుంది. అయితే మానవుడు ప్రాణికోటిలో తెలివైనవాడు కాబట్టి ఎరవేసి, దగ్గరకు రప్పించి, ఒప్పించి మరీ పట్టుకోవటాన్ని నేర్చుకున్నాడు. ఆనాటినుండి ఈనాటి వరకు ఎర - చేపల సిద్ధాంతం అవిచ్ఛిన్నంగా సాగుతూనే వుంది. ఎరవేసేవాళ్ళు వేస్తూనే వున్నారు, చిక్కే చేపలు చిక్కుతూనే వున్నాయి.

అయితే ఎరలలో రకాలు, వేసేవాళ్ళలో వైచిత్ర్యాలు రోజురోజుకూ పెచ్చు పెరుగుతున్నాయి. 'ఎరలుగా ఎప్పుడూ వానపాములనే వాడితే ఎలా? అవి కూడా బ్రతకాలి గదా పాపం'. అందుకే పడవలసిన చేపల స్థాయినిబట్టి ఎరలలో మార్పు. ఒకే చెరువులో పదిమంది పది గాలాలతో సిద్ధపడుతున్నారు. అందరూ వేసేది ఎరలే. అందరికీ కావలసింది చేపలు. ఏ వేటగాడూ, ఏ చేపనూ పెంచి పోషించాలని కానీ, స్వేచ్ఛగా బ్రతకనివ్వాలని కానీ ఎరవేయటం లేదు. ఆ విషయం ఎరకూ తెలుసు, వేటగాడికీ తెలుసు, చేపలకు తెలుసు. అయితే 'కర్మ' సిద్ధాంతం ప్రకారం ఆ చేపలు గూడా వేటకోసం ఎరల వైపు వెళ్ళకా తప్పదు. ఇది అనంతంగా సాగుతున్న, సాగనున్న వేట.

చేపల్లోనూ వాటి వాటి స్థాయినీ, ఆకారాన్ని, అవసరాన్ని బట్టి ఒకదాని కొకటి ఎరచూపించటం, వేటాడటం అలవాటే. అందుకే ఈ వేటంటే వాటికీ మోజే. బ్రతికినా, చచ్చినా అనుభవించి అంతమయ్యామన్న తృప్తి మిగుల్తోందో ఏమో! లేక అంతంకాక తప్పదన్న విరక్తి కలుగుతోందో ఏమో! కాకుంటే ఇదంతా కూడా ప్రాణికోటి జీవితంలో ఒక భాగమే అని నిర్ణయానికి రావటం జరిగిందో ఏమో!

ఏది ఏమైనా చేపలున్నంత కాలం ఎరలుంటాయి. ఎరలున్నంత కాలం చేపలు చిక్కుతాయి. వేటలో పాల్గొనే ఇష్టం లేనివాళ్ళు విషాదంగా అయినా ఆ వినోదాన్ని చూడక తప్పదు. నిన్నటి ఎర, నేడు చేప కావచ్చు. నేటి చేప రేపు ఎరయై పోవచ్చు. ఎవరి గురించి వాళ్ళే జాగ్రత్తపడాలి. ఎవరి ఆటలో వారే గెలుపుకై ప్రయత్నించాలి. (1994 - డిశంబరు)

# నేను తప్ప

"ఈ దేశం పాడైపోయింది", "ఈ దేశాన్నెవ్వడూ కాపాడలేడు" "మంచికి విలువ లేకుండా పోయింది", "మంచికి రోజులు కావు" - ఇటువంటి మాటలు మనం ప్రతిరోజూ వింటుంటాం. ఆవేదనతో, ఆర్తితో ఆక్రోశించే సామాన్యులూ; నిర్వేదంతో పెదవి విరిచే మేధావులూ, ప్రజలూ, ప్రజాప్రతినిధులు, ప్రజా నాయకులు ఒకరేమిటి - అందరూ అవే భావాలు ప్రకటిస్తుంటారు. అయితే దేశమంటే ఏమిటి?

అది ఎక్కడ నుండి ఎక్కడదాకా చెడిపోయింది? అని ఆలోచించే సాహసానికి మాత్రం ఎవ్వరూ సిద్ధపడరు. ఎందుకంటే తీగలాగితే డొంకంతా కదులుతుందన్న భయం. సూదికోసం సోదికి వెళ్ళిన తంతు అవుతుంది. అయితే కొందరు తెలియకో, అజ్ఞానంతోనో, ఆశాపాశం గట్టిగా బిగుసు కుంటున్నప్పుడు తీగ లాగుతూనే వుంటారు. డొంక కదులుతూనే వుంటుంది.

ఈ ఆశల ఆరాటంలో, జీవనపోరాటంలో అందరూ విస్మరిస్తున్న అంశం ఒకటుంది. పాత కథల లెక్క ప్రకారం ధర్మరాజుకు దుర్మార్గుడు ఒక్కడూ కనబడ లేదట. సుయోధనుడికి మంచివాడు ఒక్కడూ కనబడలేదట. ఆ లెక్కన దేశం బాగుపడటమంటే తాను బాగుండటంతోనే ప్రారంభమవుతుందని, కావాలనీ మనకు తెలీకపోలేదు. కాకపోతే అది తెలియనట్లూ, అసలు ఆలోచించవలసిన అవసరం లేనట్లు, ఆలోచించటమే అవివేకం అన్నట్లు ప్రవర్తిస్తుంటాం. మనలను మనం వేరుచేసి చూచుకోవటం అలవాటు చేసుకుంటాం. 'నేను తప్ప' అన్నది జీవన సూత్రంగా భావిస్తాం. అంతా నిజాయితీగా వుండాలి (నేను తప్ప). అందరూ త్యాగం చేయాలి (నేను తప్ప). అందరూ మంచిగా, సత్యశీలురుగా వుండాలి (నేను తప్ప)...ఇలా "నేను తప్ప"... సిద్ధాంతాన్ని అన్వయించి వ్యతిరేక వ్యాఖ్యలన్నీ చేస్తుంటాం.

వెనుకటికో పండితుడుండేవాడు. మా మిత్రుడు కూడా. పదిమంది కనిపిస్తే చాలు అక్కడికెళ్ళి ఏదో విషయంలో 'ఛాలెంజ్' చేసేవాడు. ఎవరైనా ముందుకు వస్తే 'నువ్వు తప్ప మిగతా వాళ్ళతో'' అంటుండేవాడు. అప్పటికది గొప్ప ఛలోక్తిగా కనిపించేది నాకు. ఇప్పుడు ఆలోచిస్తుంటే ఆ "నువ్వు తప్ప.... కంటే ఈ 'నేను తప్ప' మరీ గొప్ప జోక్ అనిపిస్తోంది.

(ఫిబ్రవరి, మార్చి, 1995)

# చిత్ర ప్రపంచం

ప్రపంచం చిత్రమైందని అనాదిగా అనుకొంటున్నాం. కాని ప్రస్తుతం చలనచిత్ర ప్రపంచం అంతకంటే విచిత్రంగా కనిపిస్తోంది. అది ఎక్కని శిఖరాలు లేవు. రోజురోజుకూ పడిపోని పాతాళాలు లేవు. నాటక ప్రపంచాన్ని గురించి గతంలో ఓ మహాకవి పాతాళం కన్నా అధోగతిలో ఉన్నట్లు అన్నాడు. ప్రస్తుతం చలనచిత్ర ప్రపంచం అంతకన్నా అధోగతిలోనికి ఆగకుండా పరుగులు తీస్తున్నది.

ఏ సినిమాను చూసినా ప్రారంభ సమయంలో వెరైటీ చిత్రమని దర్శకుడు, వెరైటీ పాత్ర అని నటుడు చిరునవ్వులతో అభిప్రాయాలు గుప్పిస్తారు. విడుదలయిన తర్వాత సినిమా చూస్తున్న ప్రేక్షకుడికి మాత్రం పాతమాట, పాతబాటగానే కనిపిస్తుంది. కాకపోతే, తేడా ఎక్కడుందంటే, అంతకుముందు సినిమాలో వందదెబ్బలకే చచ్చిపోయిన విలన్, ఇప్పుడు రెండొందల దెబ్బలదాకా కూడా బతికి ఉంటాడు. నిత్య జీవితంలో ఒక గట్టి దెబ్బ తగిలితే ప్రాణాంతకమయ్యే మనకు ఇదేదో వెరైటీగానే కనిపిస్తుంది.

తెలుగుతనం ఉట్టిపడేలా తీసిన చిత్రంలో ఒంటినిండా బట్టకూడా కరువే. కారణం ఏంటంటే పాత్రకోసం ఎంతవరకు బట్ట చాలో అంతవరకే కట్టించామంటాడు దర్శకుడు. ఈ పోటీ ప్రపంచంలో, సూటిపోటీ ప్రపంచంలో పాప మా హీరోయిన్లు సర్దుకుపోక తప్పదు. అయినా సర్దుకోడానికి అక్కడ ఏ కొంతైనా చాటుమాటు ఉంటేనే కదా!

ఇంతకూ ఇదంతా సమాజసేవలో భాగం. 'కోట్లతో చేసే వ్యాపారం కాబట్టి భద్రత అవసరం కదా' అన్నది నిర్మాతల భావం. ఆ భద్రత ఎక్కడ దాగి ఉందో, దాన్నెలా బయటకు లాగాలో దర్శకుడికి బాగా తెలుసు. ఇంతచేసి అది వ్యాపారమో, పరిశ్రమో, కళో, కాంతాకనకాల కొలువో ఎవరికీ అర్థంకాని అయోమయపరిస్థితి. పైగా ఇందులో వారసత్వాలు, వారసత్వపు హక్కులు. పాపం! ఎందుకు సంతకాలు చేస్తున్నారో, ఎలా ఆమోదిస్తున్నారో తెలియని సెన్సార్ సభ్యులు.

బహుశః వీటికన్నిటికీ పరిష్కారం ఒకటే. కొడుకులను హీరోలుగా, వారసులుగా నిలబెట్టే నటులు, నిర్మాతలు, దర్శకులు కూతుళ్ళను హీరోయిన్లుగా పరిచయం చేయగలగటమే. అలా చేస్తారా మరి? చేసి చూపిస్తారా మరీ మరీ.

(ఏప్రిల్, 1995)

# సూక్ష్మంలో మోక్షం

మానవజన్మ జన్మలన్నింటిలోకీ ఉత్తమం అని మానవులం మనమే పుస్తకాల నిండా వ్రాసుకుంటున్నాం. ఇతర ప్రాణులు అంగీకరిస్తాయో లేదో మరి. చెప్పగల నోరు వాటికి లేదు. నోరుంది కాబట్టి మనం ధాటిగా బ్రతికేస్తున్నాం. పోనీ, ఆ సిద్ధాంతాన్ని ఒప్పుకుందాం.

ఇంత ఉత్తమమైన నరజన్మ పొందిన తర్వాత ఏం చేయాలో తెలుసుకోవటంలో మాత్రం మనం విఫలమవుతున్నాం. విలువైన వస్తువులను కొనుక్కొని వాడుకోవటం చేతకాక పాడుచేసుకుంటున్నాం. ఇది మనం వాడే వస్తువులకూ, మనకూ కూడా వర్తించే సూత్రం.

ఇక్కడనుండి - ఈ జన్మనుండి - ఎక్కడకు పోవాలో తెలీదు. ఎలా పోవాలో తెలీదు. అసలు ఎందుకు పోవాలో తెలీదు. ప్రాణి ఎప్పుడూ గతిశీలం కాబట్టి ఎక్కడికో ఒక చోటికి పోవాలి. ఆ గమ్య నిర్ణయంతోనే జీవితకాలమంతా గడిచిపోతుంది. ఇక తదభిముఖంగా నడవటానికి సమయ మెక్కడ?

మానవత్వం తర్వాత దివ్యత్వాన్ని / దివ్యతత్త్వాన్ని (?) పరమాత్మత్వాన్ని పొందాలని అదే మోక్షమని విపుల వ్యాఖ్యానాలతో వ్రాస్తుంటాం. మోక్షమంటే అర్థమేమిటో ఒకే పదంతో చెప్పాలంటే వదలివేయటం. మరి వదలివేయటం అన్న చిన్న పదంతో సరిపోయే దానికి ఇన్నిన్ని వేలపుటల గ్రంథాల్లో చెప్పవలసిన అవసరమే మొచ్చింది. అంటే అక్కడే మానవుడి మేధాశక్తి పనిచేస్తోంది. నిజంగా అన్నీ వదిలేసినవాణ్ణి చూస్తే - అక్కడక్కడ తగుల్తుంటారు - మనకు నవ్వు వస్తుంది. వారిని హేళన చేస్తుంటాం. కాబట్టి వదలాలి అన్న భావాన్ని పదిలపరచుకోవటంలో మనకున్న ఆసక్తి, ఆర్తి, ఆందోళన, ఆవేదన వదలటంలో లేదు. కాబట్టి మనకు మనమే నిర్ణయించుకోవాలి. సూక్ష్మంలో మోక్షాన్ని పొందే మార్గమేది? వదలాలి అన్న భావాలను మాత్రం పెంచి పోషించుకుంటూ ఇంకా ఇంకా గట్టిగా ముడులు బిగించుకోవటమా? లేక యథార్థంగా వదలటాన్ని ఆచరించటమా? సిద్ధాంతమా? ఆచరణమా? ఏది కర్తవ్యం? (మే, జూన్, 1995)

# సాహచర్యం

ఎవరు ఎవరికి శత్రువో, ఎవరు ఎవరికి మిత్రుడో ఎవ్వరికీ తెలీదు. మిత్రత్వం, శత్రుత్వం రెండూ ధర్మాలే కానీ ఒకదానికొకటి వ్యతిరేక పదాలు కావు యథార్థానికి. ఎందుకంటే సృష్టిగతమైన ప్రాణుల్లో భౌతికధర్మాల లాగా మనోధర్మాలు కూడా విలక్షణంగానే ఉంటాయి. ఏ రెండు దేహాలూ పూర్తిగా ఒకటి కానట్లే ఏ రెండు మనసులూ పూర్తిగా ఒకటి కావు. ఏ రెండూ పూర్తిగా ఒకటి కానప్పుడు ఏ రెండిటికీ కూడా నియమిత లక్షణమంటూ ఒక్కటి ఉండదు. ఆ పరిస్థితిలో ప్రతి మనోధర్మం మిగిలిన ధర్మాలకంటే భిన్నంగా ఉంటున్నప్పుడు దేనితో దేనికి మైత్రి ఉందనగలం? దేనితో దేనికి శత్రుత్వ ముందనగలం? అందుకే ప్రతి ఇద్దరి మధ్యా మనకు కనిపించే మిత్రధర్మాలు కానీ, శత్రుత్వం కానీ (మనం భావిస్తున్నట్లు) నియమబద్ధంగా ఉండవు. అందుకే ప్రతి ఇద్దరి మధ్యా సంబంధం వేరే. ఒకే ఇద్దరి మధ్య కూడా సమయం, సందర్భం, అవసరం, అవకాశం వీటన్నిటినీ బట్టి మిత్రత్వమో, శత్రుత్వమో మారుతూనే ఉంటుంది. ఈ తత్త్వం ఇంత విలక్షణమైనదిగా ఉన్నప్పుడు మైత్రి అని పొంగిపోవడమో, శత్రుత్వమని రెచ్చిపోవడమో అనవసరం కదా?

ప్రాణి మాత్రానికి దైనందిన జీవితంలో ఇతరప్రాణులతో సంబంధ ముంటుంది. అది ప్రత్యక్షంగా కావచ్చు. పరంపరగా కావచ్చు. అలాగే మానవుడికి కూడా ఇతర మానవులతోను, ఇతర జంతుజాలంతోనూ సాహచర్యం, సంబంధం తప్పనిసరి. సహచరమానవుడితో సాహచర్యం తప్పనప్పుడు దాన్ని సాహచర్య మాత్రంగా పరిగణించి, ఆయా ధర్మాల కనుగుణంగా మన ప్రవర్తనని మలచుకుంటే వివాదాలకు, విఘాతాలకు, విద్వేషాలకూ కారణమైన ఈ మిత్రత్వ, శత్రుత్వ భావాలనుండి విడివడి, వాటికి రెండింటికీ అతీతమైన సాహచర్య స్థితి కలిగి, శాంతికి మార్గమవుతుందేమో! ఆలోచించి చూడండి.

(జులై, 1995)

# ఎగిరే గాలిపటాలు

తరతరాలుగా మనకు తెలిసిన ముచ్చటైన ఆట గాలిపటాలు ఎగరవేయటం. ఆ సీజను వస్తే చాలు ఒకరికి తెలియకుండా ఒకరు, ఎవరికి తెలియకుండా వారు గాలిపటాలు కట్టి, సూత్రబద్ధం చేసి, ఎగరవేసి ఆనందిస్తూ కేరింతలు కొడుతుంటారు. పిల్లలూ, పెద్దలూ గూడా దీనిలో భాగస్వాములే. ఎవరి మట్టుకు వారు తన గాలిపటమే అందరి గాలిపటాలకన్నా ఎత్తు ఎగరాలని, దారం వదుల్తూ క్రింద నుండి నియంత్రిస్తుంటారు. గాలిపటం ఎగురుతుంది. మరో వాతావరణంలోనికి, మనకు అందనంత ఎత్తుకు ఎగురుతుంది. వాతావరణం అనుకూలించక అది దారం తెగి ఎగిరిపోయినా, ఎక్కడో వాలిపోయినా మనం అంగలారుస్తాం. విధినీ, గాలిపటాన్నీ నిందిస్తాం. కానీ అన్నింటికన్నా ఎత్తుగా దాన్ని చూడాలని మనం అదుపు లేకుండా దారాన్ని వదలటమే దానికి కారణమని గ్రహించం.

నేటి పెద్దల పరిస్థితి ఇలాగే కనిపిస్తోంది. తమ పిల్లలు అందరికన్న ఉన్నతంగా వుండాలనీ, ఎంత దూరంలో - ఎంత దూరదేశాల్లో వుంటే అంత గొప్ప అని భావించి పిల్లలను దేశాంతరాలకు పంపించాలని ఆత్రుతపడుతున్నారు. అదే గొప్పగా భావిస్తున్నారు. దానిలోనే తాము సాధారణ మానవులకన్న ఒక మెట్టుపైన నిలిచివున్నామని గర్విస్తున్నారు. తీరా వారు ఆ వాతావరణంలో ఇమడటంలో పడే సాధకబాధకాలను గమనించకుండా వారు తమను నిర్లక్ష్యం చేస్తున్నారనీ, పెద్దవాళ్ళంటే గౌరవం లేకుండా ప్రవర్తించి తమను తృణీకరిస్తున్నారని ఆక్రోశిస్తున్నారు. ఉత్తరం ముక్క కూడా వ్రాయటం లేదని నిష్ఠురాలాడుతున్నారు.

గాలి పటాన్ని ఎగరవేసింది మనం. ఆకాశమంత ఎత్తుకు పంపింది మనం. గర్వంగా తలెత్తుకున్నది మనం. అది అక్కడ పరిస్థితికి అలవాటుపడితే - లేదా పడేలోగా ఆక్రోశించేదీ మనం. ఆలోచించండి. ఆటే మానుతారో అలవాటే చేసుకుంటారో నిర్ణయించుకోండి. ...

(ఆగష్టు, 1995)

# ఆచార్యదేవో భవ

ఉపనిషత్తులు ఆనాడు మనకు బోధించిన జీవనసూత్రం ఆచార్యదేవో భవ. గురువునే దైవంగా భావించమని, కన్నవారి తర్వాత స్థానం ఆ ఆచార్యునిదే అనీ. ఆ 'గురు' స్థానంలో నేడు ఉపాధ్యాయులు, అధ్యాపకులు, చదువుకు (తు) న్న వాళ్ళు (రీడర్స్) చివరగా ఆచార్యులు (ప్రొఫెసర్స్) కనిపిస్తున్నారు. వీరంతా ఆ స్థానానికి ప్రతినిధులు. గురుపూజోత్సవాలంటూ వీరికి మనం సన్మానాలు, సత్కారాలూ జరుపుకుంటున్నాం. పాలకులం, పాలితులం కూడా.

వీరంతా గురువులయితే - ఈ గురువులు కూడా ఆశ్రయించి, ఆశీస్సులు పొందేవారు మరి కొందరున్నారు. వారిని సద్గురువులనీ, జగద్గురువులనీ, మహరాజ్‌లనీ మనం పిల్చుకుంటున్నాం. వారు సద్గురువులయితే మనం పూజలు జరుపుకుంటున్న వారంతా సద్గురువులు కాదా? కాకపోతే ఎందుకు జరుపుకుంటున్నట్లు. అందుకే కొందరు దీక్షాగురువులు, ఆధ్యాత్మిక విద్యా గురువులు, ఇక మామూలు గురువులు (పాఠాలు చెప్పి ప్యాసు చేయించినవాళ్ళు) అనీ, విభజించి చెప్పుకొని తృప్తిపడుతుంటారు. కాబట్టి మనం చెప్పుకునే ఉపాధ్యాయులు వగైరా ఏదో కోణంలో నుండి మాత్రమే విద్యార్థులను గురించి ఆలోచిస్తున్నా రనవలసివస్తుంది.

అసలు విద్య, విద్యాలక్ష్యం రెండూ ఏమిటో స్పష్టంగా తెలిస్తే ఈ తకరారు ఉండేది కాదేమో. లౌకికంగా, ఆధ్యాత్మికంగా విద్య వేరు వేరుగా ఉంటుందన్న ఆలోచన, శిలాక్షరాలుగా నిలిచిపోయిన నిర్ణయాలూ మనలో ఈ భావసంక్లిష్టతకు దారితీస్తున్నాయి. జీవితంలో లౌకికజీవితం, ఆధ్యాత్మిక జీవితం అన్నవి ఒకదాని కొకటి భిన్నాలు కావనీ, రెండూ ఒకటేననీ, మనం బ్రతికివుండటం లౌకికమయితే బ్రతకవలసిన తీరే ఆధ్యాత్మికమనీ - ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మన ఉనికి లౌకికం, ఆ ఉనికిలోని ప్రతిస్పందన వుండవలసిన తీరును చెప్పేది ఆధ్యాత్మికం అని గ్రహిస్తే, రెండూ ఒకటే అని తెలుస్తుంది. అందుకే నేటి ఉపాధ్యాయులు బ్రతుకు తెరువును కాకుండా బ్రతుకుగమ్యాన్ని విద్యార్థులకు బోధించగలిగితే అప్పుడే 'గురు' పదం సార్థక మవుతుంది. గురుపూజ శోభాయమాన మవుతుంది.

(సెప్టెంబరు, 1995)

# అధోముఖంగా

మనిషి పతనం ప్రారంభమైంది. ఉన్నత శిఖరాలనుండి మనిషి జారాడు. ఇంకా పూర్తిగా క్రిందకు వచ్చిపడలేదు. అందుకే జారకుండా ఆపే అవకాశమూ లేదు, జారిపడిన తర్వాత చేయవలసిన చికిత్సల అవసరమూ లేదు. ఈ పతనం పూర్తి అయిన తర్వాత ఏర్పడ్డ గాయాలను మార్చుకునే ప్రయత్నం, తిరిగి నవజీవనం వైపు చేయవలసిన ప్రయాణం నిర్ణీత మవుతాయి.

అయితే ఈ మధ్య కొన్ని కొన్ని వింతలూ, వాటి ప్రచారాలూ ప్రజలను చుట్టుముడుతున్నాయి. కొందరు మహాప్రళయాన్ని గురించి మాట్లాడుతుంటే, మరి కొందరు బెదిరిస్తున్నారు. చాలామంది భయపడుతున్నారు. కొందరు యుగాంతం వచ్చేస్తోందంటే, కొందరు 2000 సం॥ దాటమటగదా! అని ఆందోళన పడుతున్నారు. ఈ భయాలూ, ఆందోళనలను తమదైన శైలితో సొమ్ము చేసుకోవటం చేతనైనవారు వింతలూ, విచిత్రాలూ కల్పించి, వ్యాప్తిచేసి, ప్రజలనింకా భీతావహులను చేసే ప్రయత్నం చేస్తున్నారు.

"జాతస్య హి ధ్రువో మృత్యుః" అన్న మాట అందరూ ఎరిగినట్లే, తప్పని మరణాన్ని గురించి తలచుకుంటూ కూర్చుంటే చేయగలిగిన దేమీ లేదు. యుగమైనా, జగమైనా ఆగిపోయి అంతమయ్యే రోజువస్తే ఎవ్వరూ చేయవలసినదీ, చేయగలిగినదీ కూడా లేదు. ప్రకృతివిలయం వస్తే తాత్కాలికంగా కొద్దిసేపు మాత్రమే ఆత్మరక్షణ చేసుకోగలగటమే కానీ, అంతకు మించిన శక్తి ఇంతవరకూ కూడా మనిషి సొంతం కాలేదు. కాబట్టి అటువంటి విపత్తులే వస్తే అందరం కలిసి అనుభవించటమే కానీ మరో మార్గంలేదు. అంతా తెలిసి కూడా మనం ఎందుకు భయపడుతున్నాం? ఎందుకు భయపెడుతున్నారు? భయపడేవాళ్ళుంటే భయపెట్టేవారి సంఖ్య పెరుగుతుంది. అవకాశముంటే అందరూ దాన్ని సొమ్ముచేసుకునే ప్రయత్నం చేసేవాళ్ళే.

ఈ దేశంలో ఆధ్యాత్మికత, దైవభావం, భక్తితత్వం ఇప్పటికే హాస్యాస్పద స్థితికి చేరుకున్నాయి. వ్రేలితో కన్నుపొడుచుకునే వాడిలాగ అవి నవ్వుల పాలవుతున్నాయి. ఆధ్యాత్మికత, భక్తితత్వం ఎత్తువారి చేతిబిడ్డ లవుతున్నాయి. వాటినింకా మట్టిబొమ్మల స్థాయికి తీసుకొనిపోయే ప్రయత్నాలు ఎవరు చేసినా ఈ జాతికి, ఈ రీతికి నిష్కృతిలేని స్థితి వస్తుంది. మంచి చేయకపోతే పరవాలేదు. చెడు చేసే ప్రయత్నాలు ఎవ్వరూ చేయకండి. ఎండిన గొంతులో మంచినీళ్ళు పోయకపోతే మానె, నొక్కే ప్రయత్నం మాత్రం చేయకండి - (అక్టోబరు, 1995)

# గాలిచెట్లు

గాలిచెట్లు అన్న పదబంధం కొంచెం వింతగా, విచిత్రంగా కనిపించవచ్చు. గాలిపటాలు, గాలిమనుషులు వగైరా పదాలను వినివున్నాం. కానీ గాలిచెట్లు పదం కొంత క్రొత్తగా వినిపించేది. అసలు చెట్లు వున్నదే గాలి నివ్వటానికి కాబట్టి గాలిచెట్లు మరల వేరుగా వుండట మేమిటని కూడా సంశయించవచ్చు.

యథార్థానికి చెట్లు రెండు రకాలుగా కనిపిస్తాయి. గాలినిచ్చే చెట్లు, గాలిని పోగుచేసుకొనే చెట్లు. మొదటి రకం చెట్లు మనందరికీ తెలిసినవీ, మనమంతా గుర్తించినవీను. ఇక రెండవ రకం చెట్లు మనమంతా మనకు తెలియకుండానే పెంచి పోషిస్తున్నా కూడా మనం గుర్తించనివి. ఇవి సహజంగా పల్లెటూళ్ళలో, పల్లెటూళ్ళలాంటి పట్టణాలలో, ఇంకా పెద్ద ఊర్లలో ఏ ఆఫీసులలోనో వుంటాయి. ప్రధానంగా వీటి వునికి మాత్రం పల్లెల్లోనే.

పల్లెటూళ్ళలో ఒకటో, రెండో చెట్లు, ఊరి జనాభానుబట్టి, ఊరి కేంద్రస్థానాలనుబట్టి - బాగా విశాలంగా పదిమందికీ నీడ నివ్వగల స్థాయిలో ఎదిగి వుంటాయి. ఆ నీడను అనుభవిస్తున్నారు కాబట్టి అక్కడ చేరే వారంతా ఋణవిముక్తులు కావటానికి తలా కొంచెం గాలి పోగుచేసి ఆ చెట్టును సమృద్ధం చేస్తుంటారు. పంచాయతీ రాజకీయాలనుండీ, ప్రపంచ రాజకీయాలదాకా, తలనొప్పి నుండి ఎయిడ్స్ దాకా, లేవలేని వాళ్ళనుండి లేచిపోయిన వాళ్ళదాకా, ఎవరికీ పట్టని విషయాలనుండీ ఎవరూ పట్టించుకోకూడని విషయాలదాకా అక్కడ చర్చకు రాని విషయముండదు. ఇదమిత్థంగా అక్కడ తేలే విషయమూ వుండదు. అయితే అలా పోగుబడే గాలివల్ల ఊపిరాడక సతమతమయి పోవలసిన పరిస్థితి కొందరికి కలుగుతుంది. అందరినీ అజమాయిషీ చేయాలన్న దర్పం కొందరిలో మిగులుతుంది. మూడు ఆరోపణలు, ఆరు పంచాయితీలుగా అప్పుడప్పుడు తీవ్రస్థాయిలో చర్చలు జరగటం కూడా కద్దు.

ఆ చెట్టుక్రింద రోజులో కొంతసేపైనా గడపనిదే అన్నం సహించనివాళ్ళు కొందరు, కన్ను మూతపడనివాళ్ళు కొందరు రకరకాలుగా ఉంటారు.

గాలిని పోగుచేయటంవల్ల కొన్ని కష్టాలు, నష్టాలు కలిగే మాట వాస్తవమే అయినా అంతకన్నా తీవ్రమైన ఘర్షణలు, కొట్లాటలు ఈ చెట్లక్రింద జరగక పోవటం ఆనందకరం. - (నవంబరు, 1995)

# దానం - వాగ్దానం

దానానికీ, దానంచేసే వ్యక్తికీ చాలా ప్రత్యేకమైన గౌరవం, గుర్తింపూ దాదాపు అన్ని దేశాల ప్రజల స్వభావాలలోనూ కనిపిస్తుంది. భారతీయులం - మనం దధీచినో, బలినో, శిబినో, కర్ణుడినో తలంచుకుంటూ, వారిని గురించి చెప్పుకుంటూ మురిసిపోతుంటాం. అయితే దానమన్నది ఇచ్చేవాడి గొప్పతనాన్ని తెలుపుతుందా? లేక తీసుకునేవాడి చిన్నతనాన్ని తెలుపుతుందా? అన్నది జాగ్రత్తగా ఆలోచించవలసిన అంశం. వామనావతారాన్నెత్తి విష్ణుమూర్తి బలిచక్రవర్తిని మూడడుగుల స్థలం దాన మడిగేటప్పుడు విష్ణుమూర్తికూడా వామనుడై పోవడానికి కారణం అడిగేవాడి చిన్నతనమేనేమో!

దానాన్ని గుప్తంగా చేయాలనీ, చేసిన దానాన్ని చెప్పకూడదనీ, అలా వున్న వాడే మహాదాత అనీ సూక్తులు చెప్పుకున్నాం. అలా అయితే పైన చెప్పిన దాతలంతా చేసిన దానాన్నెందుకు చెప్పుకున్నారు? మూడు రూపాయలు దానం చేస్తూ ముప్పై రూపాయలు ఖర్చు పెట్టి పేర్లు చెక్కించుకుంటున్నారు? కాబట్టి దానం విషయంలో ఏకాభిప్రాయం ఒకవేళ కుదిరినా దానిని ప్రచారం చేసుకోవటమా? మానటమా? అన్న విషయంలో ఏకాభిప్రాయం కుదరదు. సరే, అది వ్యక్తి బలహీనత అనుకుందాం. చేసిన దానాన్ని చెప్పకూడదన్నది దానసిద్ధాతం. ఎందుకు?

దాన్నే కొంచెం తిరగవేసి చూద్దాం. అప్పుడు దాని పరిస్థితి ఇది. చెప్పిన దానాన్ని చేయకూడదని. అది యథార్థంగా దానాలన్నింటికన్న గొప్పది. దాన్ని మనం వాగ్దానం అంటున్నాం. ఆ దానంలో చెప్పటమే కానీ చేయటముండదు. నీటిని ధారపోయటమే కాని నిలబెట్టి వస్తువిచ్చే పరిస్థితి లేదు. నోటికి మాత్రమే ఖర్చు కానీ జేబుకు కానీ, ఖజానాకు కానీ ఖర్చుండదు. వినేవాళ్లు బలహీనులయితే ఆ వాగ్దానాన్ని చూపించి మరికొన్ని లాభాలు కూడా పొందవచ్చు. కాబట్టి అన్ని దానాలలో దాత తనకంటూ వున్నదాన్ని దేన్నో కోల్పోతే వాగ్దానంలో మాత్రం దాత ఏమీ కోల్పోకపోగా మరింత లాభపడటం కూడా జరుగుతుంది. అయితే వాగ్దానం చేసి (చెప్పి) దానం చేయకపోతే పరువు, ప్రతిష్ఠ మంటకలిసిపోతాయి కదా! ఆ నష్టమున్నది గదా! అని అల్పబుద్ధులకు అనుమానాలు రావచ్చు. కానీ అసలు

అవంటూ (పరువు, ప్రతిష్ఠ) ఏవో వున్నాయని తెలిసినవాడు చేయలేని వాగ్దానాలు చెప్పడు గదా! కాబట్టి ఆ కోణంలోనుండి అతనేమీ నష్టపోనట్టే లెక్క.

ఏతావతా అన్ని దానాలలో వాగ్దానమే గొప్ప అని, చేసింది చెప్పకపోవడం చేతకాకపోయినా, చెప్పింది చేయకపోవటమైనా చేతనైనందుకు ఆనందించాలని సారాంశం. - (డిశంబరు, 1995)

# శేష ప్రశ్న

ముల్లోకాలను గడగడలాడించిన హిరణ్యకశిపుడు కూడా తన బిడ్డ ప్రహ్లాదుణ్ణి చదువుకొనిరమ్మని ఆశ్రమానికి పంపించాడు. ధనమా? ధాన్యమా? వర్ణమా? సువర్ణమా? పేరా? ప్రఖ్యాతులా? వీటిలో ఏది తక్కువని ప్రహ్లాదుణ్ణి గురుకులానికి పంపవలసి వచ్చింది. ఏం సాధించుకొని రావాలని రాక్షసరాజు కోరింది. ఆలోచిస్తే వీటన్నిటికన్న అతీతమైనదీ, మించినదీ మరేదో వుందనీ, దాన్ని సొంతం చేసుకుంటేనే వీటన్నిటికీ విలువనీ, హిరణ్యకశిపుడు ఆలోచించాడుగదా!

తీరా ఆ కుమారుడు ప్రహ్లాదుడు కూడా ఆ గురుకులంలో కొద్ది రోజులు గడిపి వచ్చిన తర్వాత "చదువులలో సారమెల్ల చదివితి తండ్రీ!" అని తండ్రితో అన్నాడు. చదువుల్లో సారంగా ప్రహ్లాదుడు భావించిన అంశం అటుండగా ఆ మార్గం విషయంలో తండ్రీ కొడుకులకు తేడా వచ్చి, అభిప్రాయభేదాలకు అవకాశమేర్పడి, అది ప్రధానసమస్యగా మారి మలుపు తిప్పింది. అయితే కథ తిరగవలసిన మలుపు అదే కాబట్టి చదువూ, చదువులలో సారం రెండూ అప్రధాన విషయాలుగా మిగిలిపోయాయి.

అయినా ఆనాటికీ, ఈనాటికీ కూడా ఆలోచనల్లో నలుగుతూ, ఇంకా ఇంకా ఆలోచించి తీరవలసిన సమస్య, శేషప్రశ్న చదువులలో సార మేమిటన్నది? ధన ధాన్యాదుల అపేక్ష కాదు. పేరు ప్రతిష్ఠలకై ప్రాకులాట కాదు. కులగోత్రాల కుమ్ములాటలు కాదు. ఎందుకంటే వీటిని సాధించటానికి మనమనుకునే చదువు అక్షరం రాకపోయినా ఇబ్బంది లేదు. అయితే అవి సాధింపగలదే చదువా? మనం చెప్పుకునేది చదువు అవుతుందా? కాదా? అంతా అయోమయంగా కనిపిస్తుంది

ఆలోచించేవారికి. అన్నీ వున్నవాళ్ళూ, ఏమీ లేనివాళ్ళు కూడా చదువును ఆశ్రయిస్తూనే వున్నారు కాబట్టి వుండటం, లేకపోవటంతో చదువుకు నిమిత్తం లేదు. అయితే అన్నీ వున్నవాళ్ళూ, ఏమీ లేనివాళ్ళు కూడా ఏదో ఆరాటంతోనే బ్రతుకుతున్నారు. కాబట్టి దానికి చదువుతో సంబంధాన్ని కల్పించవచ్చు. ఎందుకంటే "నిజంగా" చదువుకున్నవాళ్ళు ఏ ఆరాటం లేకుండా బ్రతుకగలరు కాబట్టి.

ఏతావతా ఏ ఆరాటం లేకుండా మనం బ్రతకటానికి అవకాశ మిచ్చేది చదువు. ఇంకా వివరంగా కావాలంటే ఆలోచించండి. ఆ పై పరామర్శించుకుందాం.

(జనవరి, 1996)

# ప్రతినాయకుడు

ప్రతి కథలోనూ ఒక నాయకుడుంటే ఒక ప్రతినాయకుడుంటాడు. నాయకుడికి వ్యతిరేకంగా లేదా ప్రజలకు వ్యతిరేకంగా ప్రవర్తించి, అందరినీ ఇబ్బంది పెట్టడం ప్రతినాయకుడి స్వరూపం.

రామాయణంలో అయినా మహాభారతంలో అయినా ప్రతినాయకుడి పాత్ర తప్పనిసరి అయింది. అంతే కాదు, ప్రతినాయకుడి స్థాయిని బట్టి నాయకపాత్రకు కూడా విలువ పెరుగుతోంది. అయితే రామాయణ, మహాభారతాది గ్రంథాలలోని ప్రతినాయకులు నిజంగా ప్రతినాయకులు, అంటే నాయకుడికి ఎదురు నిలువగల నాయక లక్షణాలతోపాటు చిన్న లేక పెద్ద లొసుగులు తమ వ్యక్తిత్వంలో వుండి పతనమైనవారు. ఈ రోజుల్లో ప్రతి నాయకుడు ఒక ప్రతినాయకుడే! కానీ నాయకుడు అయ్యే అవకాశాలు మృగ్యమయ్యాయి. అసలు ఈ రక్తంలో నాయకత్వ కణాలు ఎప్పుడో చచ్చిపోయి ప్రతినాయక కణాలే వృద్ధి పొందుతున్నాయి. ఇది పాలకులకు పరిమితమని మనం నవ్వుకోకూడదు. మనందరినీ గురించి చెప్తున్నమాట.

యథార్థానికి భారతీయ జీవనవిధానంలో మౌలిక ధర్మసూత్రాల మేరకున్న విలువలను బట్టి ఆలోచిస్తే ఒకడే ప్రతినాయకుడు. మనం విధి పేరుతో పిలుచుకుంటున్నాం అతన్ని. కుటుంబంలో అందరూ మంచివాళ్ళుగా వున్నా, ఎన్నో అపోహలూ, అపార్థాలు ఏర్పడి అవి వారి రాగబంధాన్నో, మైత్రీ

సంబంధాన్నో భంగపరచి, బాధలకు కారణమయితే అది విధి తన బలంతో ప్రతినాయక పాత్రను పోషించి, మనుష్యులను ఇబ్బంది పెట్టడం. మనుష్యులు ఎవరికీ, ఎవరూ ప్రతినాయకులు కాకుండా విధిని మాత్రమే ప్రతినాయకుడుగా అంగీకరించి, ప్రవర్తించగలిగిన రోజు ఆ ఇల్లు లేక సమాజం ఒక దేవాలయంగానో, ప్రేమాలయం గానో కనిపిస్తుంది.

అయితే మనమిప్పుడు విధిని కాదని ఆ ప్రతినాయక పాత్రను మనమే పోషిస్తున్నాం. ఆవేశకావేశాలూ, హింసాద్వేషాలూ, మన ఆయుధాలు. మాడిపోయిన మన వ్యక్తిత్వాలకు చిరునవ్వుల మైపూతలు. ఈ స్థాయినుండి మనం ఎదగాలి. ప్రతినాయక పాత్రల స్థాయినుండి నాయకపాత్ర స్థాయికి చేరుకోవాలి. మన దారిలో మనకు ప్రేరణను, ఆవేశాన్ని, పట్టుదలను, ఆత్మ విశ్వాసాన్ని కల్గించి ప్రతినాయక పాత్రను పోషిస్తూ ప్రోత్సాహించటానికి విధి ఎటూ ఉన్నది గదా!

(ఫిబ్రవరి, 1996 )

# 'మంచి'గా ఉండటం కన్నా....

యుగయుగాలుగా తరతరాలుగా అందరూ మనకు నీతిని బోధిస్తున్నారు. రీతిని నిర్దేశిస్తున్నారు. మంచిగ బ్రతకమనీ, మంచిని పెంచమనీ, ధర్మాన్ని ఆచరించమనీ, సత్యాన్నే పలకమని ...వగైరా వగైరా. అయితే నాకనిపిస్తోంది. మంచిగా వుండమని చెప్పటం అనవసరమని. మనిషి మంచివాడుగా వున్నా. చెడ్డవాడుగా మారినా తన అవసరాలకోసం, అవకాశాలకోసమే. కాబట్టి ఆ అవసరాలు తీరటం, అవకాశాలు రావటం మంచిద్వారా జరిగేటట్లయితే మనిషి తప్పనిసరిగా మంచితనంతోనే మసలుతాడు. చెడ్డవారిని ఆశ్రయిస్తే తప్ప ఆ పరిస్థితి ఏర్పడదని రుజువైన రోజు చెడువైపు మొగ్గు చూపుతాడు. కాబట్టి తన అవసరాలు, తనకున్న అవకాశాలే మంచి చెడులను నిర్దేశిస్తాయి కానీ నీతిసూత్రాలూ, సూక్తిసుధలూ కావు.

ఏతావతా తేలినదేమిటంటే నీ మంచితనానికి నీకన్న నీచుట్టూ వున్నవారే ఆలంబనాలుగా రాణిస్తారని. నీ అవసరాలు తీరకుండా వుండాలనీ, తీర్చకుండా ఆపాలనీ పొరుగువాడికి అనిపిస్తే తప్ప నీ అవసరాలు తీరకపోవటం జరగదు.

అయితే అలా ఆలోచించే స్థాయికి పొరుగువాడిని తీసుకుపోవటంలో మన పాత్ర ఎంతో ఆలోచించాలి కదా! ఇద్దరమూ బ్రతకాలి, కానీ పొరుగువాడు మన దారికి అడ్డు రాకూడదు. అనుకున్నప్పుడు అడ్డు రాకుండా వుండవలసిన పరిస్థితిని అతనికీ కల్పించాలి కదా! కాబట్టి అతడు సహజంగా మంచివాడైనా చెడ్డవాడుగా మారిపోవటానికి అవసరమైన ఏర్పాట్లు మనమే చేస్తున్నట్లు గాదా! అయితే మీరు ఎదురు తిరిగి ప్రశ్నించవచ్చు. పొరుగువాడు కూడా మనకు ఆ పరిస్థితి కల్పించకూడదు కదా అని. నిజమే. ఇక్కడ నువ్వు, నేను అన్నది స్పష్టత కోసమే కానీ ప్రస్తావన ఒక దశకు సంబంధించినది. ఆ దశాచక్రం తిరుగుతున్నప్పుడు ఆ ఆకులసందులలో అందరూ దూరవలసినదే. అందుకే మనదగ్గరనుండే ఆలోచన ప్రారంభిద్దాం. మనం మంచిగా వుండటం కన్నా పొరుగువాడు మంచిగా బ్రతకటానికి వీలుగా ప్రవర్తించుదాం. మనకు వాడు పొరుగువాడైనట్లు మనం కూడా తనకు పొరుగువాళ్ళమే అన్న విషయాన్ని గుర్తించుకుందాం.

(మార్చి, 1996)

# మళ్ళీ తిరుణాళ్ళు

ఈ నెలలో మళ్ళీ మనకు తిరుణాళ్ళు. తిరుణాళ్ళన్న పదం చాలా విలువైనది. పవిత్రమైన రోజులని దాని కర్థం. అయితే తర్వాతర్వాత దాని అర్థంలో కొంచెం వ్యాప్తి, కొంచెం మార్పు వచ్చాయి. ఎక్కడలేని కోలాహలం, ఆందోళన, ఎవరూ ఎవర్నీ పట్టించుకోని స్థితి, అందరూ అందర్నీ పట్టించుకునే స్థితి ఏర్పడితే దాన్ని తిరుణాళ్ళు అనటం అలవాటైపోయింది.

అందుకే ఈ నెలలో మళ్ళీ మనకు తిరుణాళ్ళు. పుష్కరాలు 12 సంవత్సరాల కొకసారి అంటే అలాగే కనిపిస్తున్నాయి. పాపం గ్రహాలు మనంత తెలివి తేటలు పెంచుకోలేదు కాబట్టి. మనకు లెక్కప్రకారం అయిదేళ్ళ కొకసారి తిరుణాళ్ళు జరగాలి, కానీ మన అదృష్టం కొద్దీ ఈ మధ్య అంతకాలం ఎదురు చూడవలసిన అవసరం లేకుండా ఎప్పుడు పడితే అప్పుడే వచ్చేస్తున్నాయి. ఈ సారి మాత్రమే మామూలు లెక్కలో సకాలంలో అయినా మన అనుభూతిలో మాత్రం ఆలస్యంగా వచ్చాయి.

అయితే ఈ తిరుణాళ్ళు ఎవర్నీ పట్టించుకోని వారిమీదా, అందరినీ పట్టించుకొనే వారిమీద పెద్దగా ప్రభావాన్ని చూపవు. వారి దారి వాళ్ళు నిర్ణయించుకునే వుంటారు. సత్తు, అసత్తు అని మనం ఎంతగా గింజుకున్నా వారి దారి వారిదే. మార్పు కానీ, మారవలసిన అవసరం కానీ వారి కుండవు. కానీ, ఏది ఎంతవరకు అవసరమో అంతవరకు పట్టించుకొనేవారికి మాత్రం ఇవి అంతగా ఆశాజనకంగా లేవు.

అటువంటివారి ఆలోచనలు చెట్టుకొకటీ, పుట్టకొకటీ అయ్యాయి. వారిలో యుగాంతమే రాబోతోంది - అని కలతపడేవారు కొందరు, ఈ దేశాన్ని మనం ఎవ్వరూ బాగుచేయలేమని నలిగిపోయేవారు కొందరు, చేతిలో స్వస్తిక్ గుర్తు పట్టుకుంటే అది ఏ దిక్కువైపు చూపకుండా కనిపించే విచిత్రస్థితిని అనుభవించేవారు కొందరు, అయినా సరే ఇది భారత జాతి. ప్రపంచం కళ్ళు తెరవని రోజుల్లోనే ఎంతో నాగరికతను, విజ్ఞానాన్ని ప్రోది చేసుకున్న జాతి. ఆ వైభవాన్ని, ఆ విజ్ఞానాన్ని, ఆ సంస్కృతిని, ఆ విశ్వసౌభ్రాత్రాన్నీ మనం కోల్పోకూడదన్న దృఢ సంకల్పం ఈ దేశప్రజల్లో వుందని మాత్రం నమ్ముతున్నా. భారతదేశ ప్రజలు ఎప్పటికీ, ఎన్నటికీ విశాల విశ్వంలో గర్వంగా తలఎత్తుకొని తిరగగల పరిస్థితి మాత్రం తప్పిపోకూడదని ఆశిస్తున్నా. మార్గమెంత అంధకార బంధురంగా వున్నా గమ్యం మాత్రం వెలుగురేఖలే కావాలని ఆకాంక్షిస్తున్నా ...

(ఏప్రిల్, 1996)

# మళ్ళీ ఎప్పుడో?

అయిపోయాయి. ఎంతో కాలంగా ఎదురుచూచి అలసిపోయిన ఓటరు "మహాశయు"లను ఊరించి, ఊపిరి పీల్చుకునేలోపుగా వెళ్ళిపోయాయి. కొద్దిరోజులదాకా కథలు కథలుగా చెప్పుకోవటానికి చాలినన్ని ఊసుల్ని, ఊహల్ని కల్పించి వెళ్ళిపోయాయి. ఈ పత్రిక మనచేతుల్లోకి వచ్చే వేళకే మనకు కొన్ని నిజాలూ, కొన్ని ఆధ్యాత్మిక విషయాలూ అనుభవంలోకి వచ్చినా ఆశ్చర్య పోనవసరం లేదు. అదేమిటంటే - కనిపించే రాళ్ళలో భేదం మిథ్య అని, రాలే పళ్ళు మాత్రం వాస్తవమనీ, అక్కడ ఎవరున్నా చేయగలిగినది ఏదీ లేదనీ, మన ఆశలకు, మన ఆవేశాలకు ఊపిరి పోయటానికి ఎన్నికలు మళ్ళీ ఎప్పుడు వస్తాయో అని,

ఎలక్షన్ అయిన ప్రక్కరోజే "ఓటర్"గా మారిపోయినవాడు మళ్ళీ ఓటర్ "మహాశయుడు"అయ్యే రోజుఎప్పుడు వస్తుందా అని ఆలోచన ఇప్పటికే ప్రారంభమై వుండవచ్చు. మరీ అతివాదమనుకుంటే మితవాదదృష్టితో కొంత టైమిచ్చి చూద్దాం అన్న ఆశావాదమైనా ఏర్పడి వుండవచ్చు.

అద్దంలో చూచుకుంటే ఎవడికి వాడి ముఖమే కనిపిస్తుంది. తన ముఖం తనలాగే కనిపిస్తుంది, కనిపించాలి. ప్రభుత్వం అద్దం. ఓటరుకు దానిలో కనిపించేది తన ముఖమే. కాబట్టి ప్రభుత్వాలూ, పాలకులూ అందరూ పోనీ చాలామంది - అవినీతిపరాయణులనీ, స్వార్థపరులనీ అనుకొని ఆక్రోశించేవాళ్ళంతా అవన్నీ తమ ప్రతిబింబాలే అన్ని విషయాన్ని విస్మరించటం చాలా విచిత్రమైన విషయం. నయాపైసా కావచ్చు. నవరత్నాలు కావచ్చు. అవినీతికి అవకాశమున్నచోట పాల్పడని ఓటరు "మహాశయులు" ఎంతమంది వుంటారు? ఒక రంగంలోని వారు మరో రంగంలోనివారిని అధిక్షేపించటం తప్ప, ఏ రంగం పూర్తిగా ఆదర్శరాజ్యంగా వుంది. 'నా లాభం నాది' అన్నదే జీవితసిద్ధాంతంగా అందరూ బ్రతుకుతున్నమాట వాస్తవం కాదా? ఆలోచించాలి. పాలకులంటే ఈ తానులోని ముక్కలే గదా?

మార్పు మనలోనుండి ప్రారంభం కావాలి. ఆ ఉదాత్తాశయంతో ఆవిర్భవించిన సంస్థలు కూడా దురదృష్టవశాత్తూ అధికార బలహీనతలకు లొంగిపోతున్నాయి. ఇక ఒక్కటే దారి. ఎవడికి వాడే బాగుపడాలి. ఎవడిని వాడే బాగుచేసుకోవాలి.. (మే, 1996)

# ప్ర'పంచతంత్రం'

వెనుకటికి ఒక మహాకవి ప్రపంచతంత్రాన్ని మొత్తాన్ని రాజకుమారులకు తెలియజేసేందుకు పంచతంత్రాన్ని రచించాడు. ఎవరితో ఎప్పుడు చేతులు కలపాలో, కలిపిన చేతులను ఎప్పుడు నరకాలో, ఎవరితో విగ్రహించాలో, ఎవరి దగ్గర నిగ్రహాన్ని చూపాలో అంతా అరటిపండు ఒలిచి నోట్లో పెట్టినట్లు చెప్పాడు. అవి అర్థం చేసుకున్నవాడు విద్యావంతుడు, మేధావి అయి తీరుతాడని 'చాలెంజ్' చేసాడు. రాజనీతి అంటే ఏమిటో, అది రాజులకు ఎందుకో సూత్రీకరించి చెప్పాడు. అది పంచతంత్రం.

అయితే ఇప్పుడు ప్రపంచతంత్రం మారిపోతోంది. ఆత్మరక్షణ, ప్రజాశిక్షణ నాటి పంచతంత్ర లక్ష్యాలు కాగా ఇప్పుడు వాటి స్వరూపం మారింది. స్వార్థరక్షణ, ప్రజాభక్షణ నేటి ప్రపంచ తంత్రలక్ష్యాలుగా మారిపోయాయి. అయినా పరవాలేదు భారతీయులు ఆపాటి భరించటానికి అలవాటుపడ్డవారే. ఎటొచ్చీ ఉన్న చిక్కల్లా ఒకటే.

పులిని చూస్తే మనం మన జాగ్రత్తలోకి వస్తాం. ఎందుకంటే అది పులి అనీ, తన ఆహారంకోసం ఎదుటిప్రాణిని దేనినైనా - ఎవరినైనా - అది హింసిస్తుందని మనకు తెలుసు. తోడేలును చూస్తే అలాగే నిద్రమత్తు వదలి ఆత్మరక్షణోపాయాలను ఆలోచిస్తాం.

కానీ ఇక్కడ మన పులి పులిలాగా కనిపించదు. ఆవుకన్నా సాధు జంతువులాగా కనిపిస్తుంది. అది గాలి పీల్చటం, నీరు త్రాగటం, తిండి తినటం అంతా మనకోసమే అన్నట్లు కనిపిస్తుంది. కాబోలని మనం అనుకునేటట్లు చేస్తుంది. మనం అనుకోకపోయినా మనం అనుకునేటట్లుగా మన చుట్టూ వాతావరణాన్ని కల్పిస్తుంది.

మిత్రలాభం, మిత్రభేదం, సంధి, విగ్రహం అన్నింటి లక్ష్యాలూ ఉన్నతోన్నత పదారోహణ పర్వంలోనే కేంద్రీకరిస్తాయి ఇక్కడ రాజనీతిలో. అందుకే ఇక్కడ ప్రజాస్వామ్యమైనా, రాచరికం కాకపోయినా రాజులే వున్నారు. కానీ, నీతి నశించిపోయింది. కాకపోతే రాజులు పోయి నీతి మాత్రం మిగిలిందని మనం భ్రమపడుతుంటాం. (జూన్, 1996)

# వ్యాసపూర్ణిమ

**'నారాయణ సమారంభాం, శంకరాచార్య మధ్యమామ్,**
**అస్మదాచార్య పర్యంతాం, వందే గురుపరంపరామ్'.**

అజ్ఞానాంధకారాన్ని తొలగించి, విజ్ఞాన జ్యోతిని వెలిగించటం 'గురు' శబ్ద వాచ్యులకే సార్థకమౌతుంది.

**''గు' కారోంధకారస్తు, 'రు' కార స్తన్నిరోధకః,**
**అంధకార వివృత్యా తు, గురు రిత్యభిధీయతే''**

మానవజాతి మనుగడకు మూడు స్థానాలు గురు స్థానాలు.. మాతాపితరులు జన్మనిచ్చినవారు కాగా, ఆచార్యదేవుడు జీవితానికి మార్గదర్శకం చేయగల శక్తి. జగద్గురువైన శ్రీకృష్ణ పరమాత్మకు కూడా గురుపీఠం సాందీపని మహర్షి.

భారతీయ సంస్కృతికి పరంపరాగతంగా నిలిచేది వ్యాసపీఠం. వ్యాసు డనేది 'గురు' స్థానం. మహాభారతకర్త వ్యాసమహర్షిని స్మరించుకోవడం మన గురు పరంపరలోని సంప్రదాయం. వశిష్ఠులవారి మునిమనుమడు, శక్తిమహర్షి పుత్రుడు, శుక్రమహర్షి తండ్రి అయిన వ్యాసుడు విష్ణురూపుడే. ఆ మహర్షి మనుమడు పరాశరమహర్షి కొడుకు నాలుగు ముఖాలు లేని బ్రహ్మ, రెండు చేతులున్న హరి, మూడవ కన్నులేని శంభుడు, సాక్షాత్ భగవానుడే బాదరాయణుడు.

**'అచతుర్వదనో బ్రహ్మ, ద్విబాహురపరోహరిః,**
**అఫాలలోచనశ్శంభు, ర్భగవాన్ బాదరాయణః'.**

ధర్మప్రబోధం కొరకు మాత్రమే వ్యాసమహర్షి మహాభారతాన్ని రచించాడు. సర్వకాలాలకు, సర్వమానవాళికి, శాశ్వతసత్యసూక్తులను అందించిన, మానవాళికి ప్రవర్తనావళిని (Code of Conduct) ప్రబోధించిన భగవంతుని ప్రవచనమైన గీత మహాభారతంలో మధ్యభాగంలో పలికిందే.

**'పార్థాయ ప్రతిబోధితాం, భగవతా నారాయణేన స్వయం,**
**వ్యాసేన గ్రథితాం, పురాణమునినా మధ్యే మహాభారతమ్.....'**

'సత్యాన్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యం' ఈ రెండింటి విషయంలో పొరబాటు కూడదన్నదే ఈ సూక్తి తాత్పర్యం. పలికిన పసిడి వాక్యాలను ఆచరణలో చూపిన గురువునే ఆచార్యుడంటారు. అందువలననే 'ఆచార్య దేవోభవ!' అంటే ఆచార్యుడే దేవుడగుగాక అని అర్థం. ప్రపంచ విజేతగా పేరుపొందిన అలెగ్జాండరు చక్రవర్తి జన్మనిచ్చిన తల్లిదండ్రులకు కృతజ్ఞుణ్ణి అంటూ, వారికంటే గురువునందు మరింత ఎక్కువగా కృతజ్ఞుణ్ణి అంటాడు. బ్రతుకునిచ్చినవారు తల్లిదండ్రులయితే, ఆ బ్రతుకును సార్థకం చేసుకోవడం నేర్పినవాడు గురువు కదా!

'గురు' శబ్దానికి అక్షరజ్ఞానం నేర్పినవాడే అని కాదు, జన్మనిచ్చిన తండ్రి, వయస్సులో పెద్ద అయిన అన్న, బ్రహ్మోపదేశం చేసిన గురువు, ప్రాణరక్షణ కావించినవాడు కూడ గురువే. అమ్మలేనివారు లేనట్లే, 'గురు' పూజ చేయనివ్యక్తి ఉండరంటే అతిశయోక్తి కాదు. భారతీయసంస్కృతిలో గురుపీఠం అనేది. ఎలాంటిదో గురుస్థానం అలాంటిదే. ఒక వ్యక్తిని, ఒక శక్తిని, ఒక గ్రంథాన్ని గురుస్థానంలో గౌరవించినట్లే ఒక జాతీయపతాకను, ఒక సంస్కృతిప్రతీకను గురుస్థానంలో నిలుపుకోవడం మన పరంపరానుగతంగా వస్తున్న సంప్రదాయం. గురువు నేర్పిన సంస్కృతికి వారి మార్గానుసరణం చేయడం ద్వారా మనం వారికి కృతజ్ఞులమవుదాము. అదే వారి ఆశయసాధనకు 'గురుదక్షిణ'. శ్రీకృష్ణ బలరాములు తమ గురువు సాందీపని ఋషియొక్క మృతకుమారుని బ్రతికించి గురుదక్షిణ సమర్పించుకున్నారు. ఉదంకుడనే మునికుమారుడు పౌష్యుని భార్య కుండలాలను తెచ్చి గురుదక్షిణ సమర్పించుకున్నాడు. అర్జునుడు ద్రుపదుని బంధించి, ఏకలవ్యుడు తన కుడిచేతి బొటనవ్రేలిని తెగకోసియిచ్చి గురువు కోరిక తీర్చారు. మనది ఆ సంస్కృతి, ఆ సంప్రదాయం.

(జూలై, 1996)

# ఊదుకు తిందాం

వెనుకటికి మా మిత్రు డొక డుండేవాడు. ఏ పని చేసినా అందరూ కలిసి చెయ్యాలన్నది వాడి ఆశ, ఆశయం. అందుకే ఎవరేపని చేస్తున్నా తన వాటా కూడా తప్పకుండా వుండేలా చూచేవాడు. గుడికట్టినా, సభలన్నా, సంతర్పణలన్నా అందరికన్నా ముందే వాడు హాజరయ్యేవాడు. అయితే వాడి ఆశయానికి ఒక పద్ధతుంది. తానెప్పుడూ పొట్టు మాత్రమే తెస్తాడు. మనం పప్పులు తీసికొని పోవాలి. రెండూ కలిసి ఊదుకొని ఇద్దరం తినాలి. దీన్ని కొందరు సరదాగా తీసుకొనేవారు. కొందరు ముందు జాగ్రత్తపడి దూరంగా మెసలేవారు. కొందరు అప్పుడప్పుడు ఏ పెద్దవారితోనో చెప్పి మందలించేవారు.

వాడు పొయ్యాడు, కానీ ఆ ఆశయం వున్నవాళ్ళ సంఖ్య రోజురోజుకూ పెరిగింది. అప్పుడు మందలించటానికి పెద్దవాళ్ళంటూ ఒక రిద్దరుండేవాళ్ళు. కానీ ఇప్పుడు పెద్దవాళ్ళు ఊదుకు తినటం నేర్చుకున్నారు. మేం ఖర్చులు పెడతాం. మీరు త్యాగాలు చెయ్యండి. ఇద్దరం కలిసి ఎలక్షన్లలో పాలుపంచుకుందాం. మీరు ఓట్లు వెయ్యండి, మేము గెలుస్తాం. ఇద్దరం కలిసి ప్రభుత్వాన్ని నడిపించుకుందాం. మేము పాలన సాగిస్తూంటాం. మీరు పాలింపబడుతూ వుండండి. ఇద్దరం కలిసి సంక్షేమ రాజ్యాన్ని స్థాపిద్దాం - అంటూ మావాడి బావమరిది ఈ మధ్య నూతన సిద్ధాంతంతో ముందుకొచ్చాడని తెలిసింది. ఎప్పుడో మరచిపోయిన ఊదుకు తినే సిద్ధాంతం మళ్ళీ ఊపిరి పోసుకున్నందుకు నాకు పరమానందమైంది.

మునిమాణిక్యం నరసింహారావుగారు ఒక ప్రసంగంలో వ్రాశారు. చిల్లుతొట్టి లెక్కలు కొడుక్కు చెప్తున్న తండ్రిని, అతని భార్య చివాట్లు పెడుతుంది. ఎవరైనా చిల్లు పూడ్పించుకుని తొట్టి నింపుకుంటారు కానీ లెక్కలకోసం చిల్లుతొట్టి వాడుకోరని. కాబట్టి చిల్లు పూడ్చుకోవటం తెలీకుండా తొట్టి నింపుకుంటే ప్రక్కింటి బావినుండి నీళ్ళు అరువు తెచ్చి నింపినా అది నిండదు. ఎక్కడ పోయిందో అక్కడే వెదుక్కోవాలి. కానీ దీపమున్న ప్రతిచోట వెతకటం ప్రారంభిస్తే వెతుకుతున్నట్టే అనిపిస్తుంది. కానీ వస్తువు దొరకదు.

(ఆగష్టు, 1996)

# ప్రజాస్వామ్య 'వరం'

పాత రోజుల్లో, పురాణాల కథలు బాగా ప్రచారంలో వున్న రోజుల్లో వరాలు ఎక్కువగా వుండేవి, నమ్మడానికి వీలుగా వుండేవి. అప్పట్లో ప్రజాపాలన రాచరికంతో జరిగేది. ప్రజలంతా భయభక్తులతో పెరిగేవారు. కాబట్టి రాక్షసులు తపస్సులు చేయటం, మహర్షులు యాగాలు చేయటం, సజ్జనులు త్యాగాలు చేయటం వాటి నన్నిటినీ మెచ్చి దేవతలు - పురుషులైనా, స్త్రీలైనా - ప్రత్యక్షం కావటం, వరాల నివ్వటం జరిగేది. ఇచ్చేది దేవతలు, పుచ్చుకునేది అవిశ్రాంతంగా శ్రమ చేసిన దీక్షాదక్షులు. కాబట్టి అవి వరాలన్నా, వాటి ఫలితం కండకావరాలన్నా సరిపోయేది.

మరి ఇప్పుడు మనం ప్రజాస్వామ్యంలో జీవిస్తున్నాం. ప్రజల కొరకు, ప్రజలచేత, ప్రజలలోనుండి ఎన్నుకొనబడిన నాయకులు మనకు పాలకులు. ఈ మధ్య వాళ్ళకు కూడా వరాలు ఇవ్వటం అలవాటైపోతోంది. ప్రజలనందరినీ భక్తులుగా భావించి, సమాజాన్నే దేవాలయంగా అనుకుంటున్నారేమో తెలియదుగానీ ఎవరు మట్టుకు వాళ్ళు, చాలా చేయవలసి వుండీ, ఏ కొంచెమో చేసినా సరే ప్రజలకు వరాలిస్తున్నట్లే ఫీలయిపోతున్నారు. తాము కూడా ప్రజలలో నుండి వచ్చినవాళ్ళమేనన్న ప్రాథమిక సత్యాన్ని విస్మరించి, మనం కూడా మరచి పోవాలని కోరుతున్నారు.

లేకపోతే ఈ వరా లేమిటి? ఈ అంకితా లేమిటి? ఈ సంతర్పణ లేమిటి? ఏనాటి పదాలివి? అవే పదాలను ఇప్పటికీ వాడుకుంటూ భాషాభిమానాన్ని చాటుతున్నామా? లేక ఎన్ని శతాబ్దాలు గడిచినా, ఎన్ని రాజ్యాంగాలు వ్రాసుకున్నా మనలోని బానిస మనస్తత్వం, అధికార లాలసత్వం మరుగున పడిపోలేదని నిరూపించుకుంటున్నామా? ప్రజల డబ్బుతో, ప్రజల శ్రమతో కట్టిన జాతి ప్రయోజన హేతువులైన నిర్మాణాలను ఎవరో వచ్చి జాతికి అంకిత మివ్వడ మేమిటి? అటువంటి పదజాలం మనలోని ఏ తత్వాన్ని బయట పెడుతున్నట్లు? పదబంధాలను వాడటానికి పోటీపడుతున్న పత్రికా రంగం ప్రజలను ఏ వైపుకు తీసుకుపోతున్నట్లు?

**“నావిష్ణుః పృథివీపతిః”** అని పెద్దలు చెప్తే ఆనాడు కాదు పొమ్మని - అదంతా లోపభూయిష్ఠమనీ, మూఢవిశ్వాసరూపమనీ నమ్మి కాలదన్నిన మనం అవే భావాలను మళ్ళీ ప్రజలలో ప్రోది చేసే ప్రయత్నం ఎందుకు చేస్తున్నట్లు? అవే భుజకీర్తులను, భజనకీర్తనలను ఎందుకు స్వాగతిస్తున్నట్టు? ప్రజాస్వామ్య ‘వరా’నికి అది ఎప్పటికీ తీరని శాపమా?

(సెప్టెంబరు, 1996)

# మళ్ళీ కృతయుగంలోకి

ఈ మధ్య అందరూ ధర్మం నశిస్తోందనీ, కలియుగం మరీ వికృతరూపాన్ని ధరిస్తోందని ఆందోళనపడటం ఎక్కువైంది. ధైర్యం, ఉత్సాహం వున్న కొందరు ఈ యుగం చాలా తొందరలోనే అంతమైపోతుందనీ, యుగం మారిపోతుందనీ కూడా భయపెడుతున్నారు. అయ్యో! అంతా అయిపోతోందట అని ఆవేదనపడేవాళ్ళను కూడా గమనిస్తున్నాం.

అయితే నాకొక్క అనుమానం. అసలు మనం కలియుగంలో వున్నామా? కృతయుగంలోనా? అని. ధర్మం నాలుగు పాదాలతో నడిస్తే కృతయుగమట. ఒక్క కాలితో కుంటితే కలియుగమట. మంచిదే. ధర్మం నాలుగు పాదాలతో వుందనటానికీ లేదా లేదనటానికీ ప్రమాణాలు ఏమిటి?

తానే బ్రతకాలనుకోవటం కలియుగ లక్షణం. తానూ, పొరుగువాడూ ఇద్దరూ బ్రతకాలనుకుంటే ద్వాపరం. తాను పోయినా పరవాలేదు, పొరుగువాడు బ్రతకాలనుకుంటే అది త్రేతాయుగ లక్షణం. పొరుగువాడికోసం తనను కూడా కాదనుకోగలగటం కృతయుగలక్షణం. ఆ లెక్కన చూస్తే ప్రస్తుతం మనం కృతయుగంలోనే వున్నామే అనిపిస్తోంది నాకు.

నిన్న, మొన్నటిదాకా నేను కూడా అందరు అజ్ఞానుల మాదిరిగానే ధర్మం నశించిందనీ, కలి మారక తప్పదనీ అనుకున్నవాడినే. కానీ, ఈ మధ్య జరిగిన సంఘటనలు నా కళ్ళు తెరిపించాయి. కళ్ళు తెరిచి చూస్తే కృతయుగం కనిపించింది. వివరిస్తాను.

పార్టీలు, పెద్దరికాలు అనే తేడా లేకుండా అనేక కుంభకోణాలలో చిక్కుకొని కోట్ల రూపాయలు భోంచేసి, త్రేన్చే స్థితికి చేరికూడా పరగడుపుతో వున్నట్లు వెక్కిళ్ళు పెట్టేవారు, వారిని పట్టుకోవటానికి వీలుగాని పరిస్థితి, యెవరికి వారు ఏమీ ఎరగనట్లు మాట్లాడే ధోరణి చూస్తే కృతయుగంలో వున్నట్లే గదా! కాదంటే కాపాడే బాధ్యత ఆ దైవానిదే!

(అక్టోబర్, 1996)

# ప్రకృతి విజయం

ప్రకృతిని అదుపులో వుంచగలగటం చేతనైన నాటినుండి మానవజాతి ఎదుగుదల ఆరంభమైంది. మనిషి ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తూ, ప్రకృతిలోని ఒక్కొక్క రహస్యాన్ని బట్టబయలు చేయగలుగుతున్నాడు. ఎక్కడో వుండే వాళ్ళతో మాటాడటం, ఎక్కడోవున్న వాళ్ళను యథాతథంగా చూడగలగటం, ఎక్కడికో వెళ్ళి ఏదో అన్వేషించటం ఈరోజు ఆశ్చర్యకరమైన విషయాలు కావు. నిన్నటి ఊహ నేడు రూపుకట్టుకొంటోంది. ఈనాటి కల్పన రేపటికి వాస్తవమై కనిపిస్తోంది. అయినా సరే, మనం నిజంగా బలవంతులమా? లేక భ్రాంతిపడుతున్నామా అన్న ఆలోచన అప్పుడప్పుడు కలుగుతుంది.

ప్రకృతిలోని శక్తులు కొన్నింటిని వశం చేసుకొని, వాటిపై పెత్తనం చేయిస్తూ, ప్రకృతిని వశం చేసుకున్నట్టు భావించుకుంటున్నాం. శక్తులను వశం చేసుకుంటున్నాం. కానీ శక్తి మూలకాలూ, శక్తి వాహకాలూ మన కింకా ఈషణ్మాత్రం కూడా లొంగలేదేమో అనిపిస్తుంది.

నీళ్ళు సమృద్ధిగా వున్నచోట నాగరికత వెలిసింది. నీరు దొరకనిచోట నివాసం కూడా నిషిద్ధం. అయితే ఆ నీరు కావలసిన స్థాయికన్న కొంచెం ఎక్కువైతే మనిషి విలవిలలాడిపోతూ ఉక్కిరిబిక్కిరై, నిస్సహాయతతో నింగివైపు చూస్తున్నాడు. నిప్పు లేకపోతే సంస్కృతి లేదు. కానీ, నిప్పు మన అదుపు తప్పితే మనకు నిష్కృతి లేదు. నిన్న, నేడు మన రాష్ట్రాన్ని కుదిపివేసిన వానలు, వరదలు చూస్తుంటే మనం ఎంత అల్ప ప్రాణులమో స్పష్టమౌతుంది. అల్పప్రాణులం మాత్రమే అయితే పరవాలేదు, అల్పబుద్ధులం అనికూడా రుజువవుతోంది. వరదలకు ఎదురీదలేక ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని, ఏదో ఆసరాతో నిలిచి, ఆకలిదప్పులకు అలమటించిపోతున్నవారు ఒకరికొకరు సహకరించుకోవటంలో, ఒకరికోసం ఒకరు బాధపడటంలో ఆర్తిని, ఆవేదనను, ఆందోళనను కలబోసుకొని అనుభవించటంలో వారికి తెలిసిన వర్గం, వారికి తెలిసిన వర్ణం, వారెరిగిన కులం, వారు అవలంబించిన మతం అంతా ఒక్కటే, అదే మానవత్వం.

వరదలు తగ్గాయి. మానవత్వం కూడా మామూలుగానే వరదల్లో కొట్టుకొనిపోయింది. మళ్ళీ మామూలే కులం, మతం, వర్గం, విభేదం,

ఆరోపణలు, ప్రత్యారోపణలు, రాజకీయాలూ, రాక్షసాలూ, మళ్ళీ సామూహికంగా భయం కలిగేదాకా వైయక్తికంగా కుమ్ములాటలు.

అందుకే ఇప్పటిదాకా ప్రకృతియే మానవుణ్ణి జయిస్తోంది. భవిష్యత్తులో కూడా అంతే. మనిషిలోని రాక్షసుణ్ణి లొంగదీయగలది అది ఒక్కటే -

(నవంబరు, 1996)

# ప్రతిభ జాతీయసంపద

మానవ సమాజం ఇంతగా వికసించటానికి భౌతికమైన వనరులు ఓ రకంగా కారణమైతే, ఆ వనరులను సరిగా వినియోగించుకొనగలిగిన మేధ (ప్రతిధి) అసలైన కారణంగా కనిపిస్తుంది. స్థితిలో కన్న వినియోగదశలోనే వస్తువు విలువ ఎక్కువ. ఆ నియమం మేరకు గాలి, నీరు, నిప్పు, సూర్యరశ్మి, భూమి వగైరా వనరులెన్ని వున్నా వాటిని సరిగా వినియోగించుకొన గలిగిన మానవమేధ అన్నింటికన్నా విలువైనది. కాపాడుకొనవలసినది.

కానీ, మనలో సహజంగా అవగాహనాలోపం కారణంగానో లేక ప్రతిభ ప్రత్యక్షకారణంగా కనిపించకపోవటం వల్లనో దాన్ని కాపాడుకోవటంలో నిర్లక్ష్యం చేస్తున్నాం. స్థలాలను, పొలాలను, నగలను, నాణేలను ఆస్తులుగా భావించి వాటిని కాపాడటంలోనూ, కాపాడుకొనటంలోనూ చూపించే శ్రద్ధను మన మేధను, ప్రతిభను కాపాడుకోవటంలో చూపించలేక పోతున్నాం. బహుశః దానికి కారణం ఒకటేనేమో!

జల తరు పాషాణాదులన్నీ జాతీయసంపదగా పరిగణించ బడుతున్నాయి. తాత్కాలికంగా వాటిపై ఆయా వ్యక్తులకు అధికారాలున్నా, హక్కు భుక్తాలకు ఇబ్బంది లేకపోయినా జాతీయావసరం, ప్రజా ప్రయోజనం ఏర్పడినపుడు అవి వ్యక్తి అధీనంలోనుండి జారిపోయి, జాతీయమైన ఆస్తిగా పరిగణింపబడతాయి. అందువల్ల అన్యాక్రాంతం ఎప్పుడైనా కావచ్చునన్న భయం ఒకటి. దానివలన ప్రత్యక్షంగా సమకూరుతున్న లాభం ఒకటి. ఈ రెండూ కలిసి వాటిని కాపాడుకోవటానికి దోహదం చేస్తున్నాయి. అవి జాతీయమైన ఆస్తియైనా వ్యక్తి దానిని కాపాడే బాధ్యతను తీసుకుంటున్నాడు.

అయితే ప్రతిభను, మేధను ఈరోజువరకు కూడా వ్యక్తిగతమైన గొప్పతనంగానే భావిస్తున్నాం. కానీ, అది జాతీయమైన సంపద అని దాదాపు అందరూ గుర్తించలేక పోతున్నారు. స్త్రీలైనా పురుషులైనా ఆయా వ్యక్తులలో కనిపించే ప్రతిభ జాతీయమైన ఆస్తి. దాని ఫలితాలు జాతి మొత్తానికి ఎప్పటికైనా చెందాలి. తన అధీనంలో తాత్కాలికంగా వున్న స్థలాలను, పొలాలను వ్యక్తి కాపాడినట్లు తమ ఆధీనంలో వున్న ప్రతిభను కూడా తాత్కాలికంగా వ్యక్తి కాపాడాలి. దాని వికాసానికి దోహదం చేయాలి. ఈ అవగాహన ప్రజలలో కలిగినపుడు పాలకులు, పాలితులూ- ఇద్దరూ పరస్పరం వంచనలతో కాలం గడపటం ఆగిపోవచ్చునేమో! స్త్రీ, పురుష వివక్ష లేకుండా ప్రతిభా వికాసం సాధ్యపడుతుందేమో! ఎందరిలోనో మొక్కగానే రాలిపోయే ప్రతిభ మానుగా మారి సత్ఫలితాలను అందిస్తుందేమో! వేచిచూద్దాం

(డిశంబరు, 1996)

# సంక్రాంతి

సూర్యుడు మకరరాశిలోకి ప్రవేశించే కాలాన్ని మనం సంక్రాంతి పండుగగా జరుపుకుంటున్నాం.

వాస్తవానికి సంక్రాంతి ప్రతి మాసంలోనూ వచ్చేదే. మేషంలో ప్రారంభించి మీనం వరకున్న పండ్రెండు రాశులలోనూ సూర్యుడు ప్రతి సంవత్సరం సంచరిస్తాడు. కాబట్టి మేష సంక్రాంతి మొదలు మీన సంక్రాంతి వరకు ప్రతినెలా ఒక సంక్రాంతి వస్తుంది. అయితే మనం మకరసంక్రాంతిని మాత్రమే ప్రత్యేకంగా గుర్తించి పండుగ చేసుకుంటున్నాం. అసలు మిగిలిన ఏ పండుగలైనా చాంద్రమానం ప్రకారం జరుపుకునే మనం, సంక్రాంతిని మాత్రం సౌరమానం ప్రకారం జరుపుకుంటున్నాం.

మకరంలో సూర్యుడు ప్రవేశించటంతో ఉత్తరాయణం ప్రారంభ మవుతుంది. సూర్యగమనంలోని ఉత్తరాయణాన్ని - ఆరుమాసాలను మనం పుణ్యకాలంగా పరిగణిస్తాం. ఆ కాలంలో మరణిస్తే పుణ్యలోకాలకు వెళ్ళగలమని

మన విశ్వాసం, బ్రహ్మోపదేశంవంటి కార్యక్రమాలు ఉత్తరాయణంలోనే జరుపుకొనటం మన ధర్మం. మకర సంక్రమణంతోనే సూర్యుడు తనకు ఉచ్చస్థానమైన మేషరాశివైపునకు మొగ్గటం ప్రారంభమవుతుంది. సౌరశక్తిని మనం ప్రత్యేకంగా గుర్తించి, గౌరవించే ప్రక్రియ మకరసంక్రాంతి ఉత్సవాలలో కనిపిస్తుంది.

అయితే పండుగలు, పబ్బాలు మనిషి జీవితంలో మజిలీల వంటివి. నిత్య కృత్యమైన హడావుడి, ఆందోళనలను ప్రక్కనబెట్టి తనవైపు, తన సంఘం వైపు, తన దేశంవైపు, తన ధర్మంవైపు నిలిచి, నిదానంగా ఆలోచించేందుకు అవకాశం ఆరోజుల్లో లభిస్తుంది. ఒక్కొక్క మజిలీ దాటుతుంటే ఆ ప్రయాణానుభవంతో మరో మజిలీ చేరేందుకు అనుగుణంగా నడకలో మార్పులు చేర్పులు చేసుకున్నట్లు ఒక్కొక్క పండుగ మనలో ఎంతో కొంత మార్పునకు దోహదం చేయాలి. కానీ మనలో చాలామందిలో మార్పులు వస్తున్నాయి, కానీ అవి పెనం మీదనుండి పొయ్యిలో పడ్డట్టుగా వుంటున్నాయి.

కాబట్టి నిలిచి నిదానంగా ఆలోచించండి. వ్యక్తికి, వ్యవస్థకు కూడా ఉపయోగకరమైన నిర్ణయాలు తీసుకొని ఆచరించేందుకు కంకణం కట్టుకోండి - పండుగను పబ్బంగా (పర్వంగా) తీర్చిదిద్దుకోండి.

(జనవరి, 1997)

# పని

సముద్రం దగ్గర కొద్దిసేపు నిలబడిచూస్తే అలసట లేకుండా అలల అలజడి కొనసాగటాన్ని గమనించవచ్చు. ఏం సాధించాలనుకుంటున్నాయో ఏమో తెలీదు కానీ క్షణకాలం కూడా ఆగినట్లు అనిపించదు. ప్రతిసారీ భంగపడుతున్నా 'ఇక చాల్లే' అని అనుకొన్నట్లు కనిపించదు. అక్కడ నిలబడి చూస్తున్నంతసేపూ మనకు కూడా ఆ లక్షణమే అలవడుతుంది. ఎంతసేపు చూచినా ఇక చాలు అన్న భావన కలుగదు. అక్కడనుండి కదలాలని కూడా అనిపించదు. పనిచేసే స్వభావమున్న వాళ్ళను చూస్తే పనిచేయనివాళ్ళకు కూడా చేయాలనిపిస్తుందేమో.

సముద్రతీరానికి వాహ్యాళికి వెళ్ళటం ప్రపంచ నాగరికతలో విశిష్టమైనది. సముద్రానికి దగ్గరగావున్న ఏ జాతి ప్రజలూ దాన్ని వదలుకోవటం లేదు. దగ్గరలో సముద్రాలు లేనివాళ్ళు జీవితంలో ఒకసారైనా సముద్రాన్ని చూడాలని కలలు కనటం మన మెరిగిన విషయమే.

ఇంతగా ఆ సముద్ర సుందర చైతన్య స్వరూపాన్ని పరిశీలిస్తున్నా మనలో చాలా మందిలో మాత్రం ఆ పనిచేసే లక్షణం అలవడటం లేదు. పనిలో వున్న సముద్రాన్ని చూడటానికి పనిమానుకొని అయినా వెళుతుంటాం. కానీ పనిచేసే లక్షణాన్ని దాని ద్వారా అలవరచుకోవటం లేదు.

మన శరీరావయవాలన్నీ పనిచేసే లక్షణమున్నవే. ఏ పనీ లేకుండా వుండటం వాటికస్సలు ఇష్టం లేదు. అందుకే బుద్ధి, మనస్సు మొరాయిస్తున్నా వాటికి అలవాటుపడ్డ పనిని అవి యాంత్రికంగా చేసేస్తుంటాయి.

మన ఆలోచనలు అగాధాలు, కోరికలు కొండంతలు. కానీ, వాటిని తీర్చుకోవటానికి తగినట్లు, తెలుసుకోవటానికి అవసరపడేటట్లు పనిచేయటం మాత్రం మనం అలవరచుకోం.

పనిచేయటం చేతకాని ఏ జాతికైనా పతనం తప్పనిసరి అవుతుంది. పని చేయటానికి ఇష్టపడని ఏ వ్యక్తికయినా పరిస్థితి అగమ్యగోచరంగానే వుంటుంది. అందుకే వర్తమానం విజయవంతమై, భవిష్యత్తు ఫలవంతం కావాలంటే పనిచేసే సంస్కృతిని అలవరచుకుందాం. ఆ మనస్తత్వాన్ని పెంచిపోషించుకుందాం.

(ఫిబ్రవరి, 1997)

# అగ్ని పరీక్ష

శ్రీరాముడు రావణుని సంహరించిన తర్వాత సీత శీలానికి పరీక్ష పెట్టాడు. అగ్నిలో దూకి శుద్ధిఅయిన తర్వాతనే ఆమెను మరల స్వీకరించాడు. ఆనాటినుండి చావు బ్రతుకులమధ్య ఘర్షణలన్నీ అగ్ని పరీక్షలయ్యాయి. అది త్రేతాయుగం సంగతి.

ఈ కలియుగంలో మరల అగ్నిపరీక్షలు ప్రారంభమయ్యాయి. ఎండ అగ్గిలా మండిపడేటప్పుడు జరిగే పరీక్షలు కాబట్టి అగ్నిపరీక్షలు అని సరిపెట్టుకుంటే కుదరదు. ఆనాటి సీత శీలంలాగా ఈనాడు పరీక్షల్లో ఎందరి శీలమో పునీతం కావలసి వుంది.

అటు ప్రభుత్వాధికారులు, ఇటు విద్యార్థులు. పరీక్షించేవా రొకరు. పరీక్ష ఇచ్చేవా రొకరు. అయితే అంతమాత్రాన అది అగ్నిపరీక్ష కాబోదు. దీనికితోడు మరి రెండు అంశాలు వున్నాయి. అవి: పరీక్షానిర్వాహకులు, విద్యార్థుల తల్లిదండ్రులు. వీరి శీలానికే ప్రధానంగా అగ్నిపరీక్షలు. నిజాయితీకి మారుపేరుగా వుంటామంటూ ప్రకటనలు గుప్పించి అపమార్గాలు త్రొక్కేవారు మొదటిరకం. నిజాయితీ అంతటా నశించిపోతోందని ఆక్రోశిస్తూ దారితప్పి ప్రవర్తించేవారు రెండవ రకం. ఈ ఇద్దరిలో ఎవరైనా పొరపాటున సరియైనదారిలో నడుస్తారేమో అన్న బెంగతో గీతాచార్యుడిలాగా ఈ ఇద్దరికీ బోధించి నడిపించుకొనిరాగల పైరవీకారులు వీటన్నింటికీ కేంద్రబిందువు. పైరవీకారులు రెండు రకాలు. తమ ఆధిపత్యం నిలవాలనుకునే వారు కొందరు. ఇతరులు చెడితే చాలు అని సంతృప్తిపడేవారు మరికొందరు. ఈ ఇద్దరిలో కూడా తలవంచుకొని తమ పని తాము గుట్టు చప్పుడు కాకుండా చేసుకొని పోయేవారు ఒక తరహా. చేసేవన్నీ అవినీతి పనులైనా నీతినిగురించి పెద్దపెద్దగా ప్రవచిస్తూ, ప్రబోధిస్తూ, అమాయకంగా కనిపించాలని ప్రయత్నిస్తూ జాతికి ద్రోహం చేస్తున్న వారిది పెద్దమనిషి తరహా. అందరికన్న మరీ ప్రమాదకరమైన జాతి ఇదే. ఇటువంటివారి విషయంలో ఉపేక్షను ప్రదర్శించినా, అపేక్షతో ఆదరించిన భావితరాలవారు మనలను క్షమించరు. అందుకే అందరం అగ్నిపరీక్షగా తీసుకొని ప్రవర్తించుదాం. శక్తివంచన లేకుండా మంచిని సాధించే ప్రయత్నం చేద్దాం.

(మార్చి, 1997)

# దూరభావనమ్

మనకు దూరవాణి వుంది. ఇక్కడే వుండి ఎక్కడనుండో మాటాడే మాటలు తు. చ. పొల్లుపోకుండా సాక్షాత్తుగా వినగల్గుతున్నాం. దూరదర్శనం వుంది. మన ఇంట్లోనే కూర్చొని ఎక్కడో, ఏ దేశంలోనో వున్న రూపాలను ప్రత్యక్షంగా చూడగల్గుతున్నాం. అంటే మనిషికి మనిషికి మధ్య సంబంధాలను, బంధాలను శాసించే మూడు అంశాలలో రెండింటిమీద మనం ఆధిపత్యాన్ని సాధించాం. ఆ రెండింటిని మన గుప్పిట్లో పెట్టుకొనగలిగాం. అయితే మిగిలిన ఆ ఒక్క వ్యక్తి దూరభావనమ్. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వున్న వ్యక్తి ఏం ఆలోచిస్తున్నాడో తెలిసికొనగలగటం. ఈ అంశాన్ని సాధించటంలో మాత్రం మనం చాలా వెనుకబడి వున్నాం. అందుకే నోరు మాటాడుతున్నా నొసలు వెక్కిరిస్తోంటే తెలిసికొనలేకపోతున్నాం. భక్తితో నమస్కరిస్తున్నవాడు ఎప్పుడు కాళ్ళు పట్టి లాగుతాడో తెలియని దశలో వున్నాం. చుట్టూ తిరుగుతున్నవారు ప్రక్క పోటో, వెన్నుపోటో ఎప్పుడు పొడుస్తాడో ఆలోచించలేక పోతున్నాం. కనీసం ఊహించలేక పోతున్నాం.

కొన్ని మనస్సులు బిగ్గరగా ఆలోచిస్తుంటాయి. ఆ మనస్సులోని ఏ భావమైనా మాటలుగా మారవలసినదే. అయితే సమాజంలో వారు పడే పాట్లు అన్నీ ఇన్నీ కావు. కలిగే ఆలోచనలలోని వాస్తవికతను మాత్రమే ప్రకటించిన వాడు లోకవిరోధి అయి కూర్చుంటున్నాడు. అందుకే ఎవ్వరూ, ఏ ఇబ్బందిని పొందకుండా వుండాలంటే మనస్సులు పారదర్శకాలు కావాలి. ఈ వైపునుండి చూస్తే ఆ వైపు దాకా అంతా కనిపించాలి. ఆ మధ్యలోని ఆలోచనలన్నీ అందరికీ ప్రత్యక్ష సత్యాలు కావాలి. అటువంటి శాస్త్రీయ విజ్ఞానాన్ని సాధించగల ప్రయత్నాన్ని మనమంతా చేయగలగాలి. అప్పుడు మోసాలుండవు. కుతర్కాలుండవు. కుయుక్తులుండవు. జవాబుదారీతనం లేకపోవటమన్నది వుండదు. త్రికరణశుద్ధిని గురించిన సూక్తులు చెప్పనవసరం లేదు. అయితే అది సాధ్యమా? కావాలనే ఆశిద్దాం

(ఏప్రిల్, 1997)

# అవిశ్వాస తీర్మానం

జీవితంలో అనేక కోణాలలో విశ్వాసం పాత్ర ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. పుట్టుకతో ప్రారంభమై మరణం దాకా వ్యక్తి జీవితం విశ్వాసమే ఆధారంగా సాగుతోంది. లేకపోతే "జీవో జీవస్య జీవనం" (ప్రాణియే ప్రాణికి ఆహారం) అన్న వాస్తవాన్ని గ్రహించి కూడా అనేక ప్రాణులు, మనుషులతోసహా సహజీవనం వైపు సాగుతున్నాయంటే, కలిసి జీవిస్తున్నాయంటే అందుకు కారణం విశ్వాసమే. అది ఎంత బలంగా వుంటే, అంత ఘనంగా జీవితం సాగుతుంది. అది ఎంత విశాలంగా వుంటే, అంత ఉన్నతంగా సంఘస్థితి వుంటుంది. కానీ, వర్తమాన సమాజంలో ఆ విశ్వాసమనే అద్దం మురికిపట్టి పోతోందేమో అనిపిస్తోంది. విశేషించి ప్రజాస్వామ్య పద్ధతుల్లో రాజ్యాన్ని నడుపుకుంటున్న మనలో.

ప్రజలకు పాలకుల మీద విశ్వాసం లేదు. అధికారుల మీద విశ్వాసం లేదు. చుట్టూ వున్న సమాజం మీదా, కనీసం ఇంటి సభ్యులమీద కూడా విశ్వాసం పూర్తిగా వుండటం లేదు. పాలకులకు ప్రజలమీద - వాళ్ళ దృష్టిలో ప్రజలంటే ఓట్లు - కార్యకర్తలమీద, ప్రభుత్వ విధానాలను కొనసాగింపజేసే అధికారుల మీదా పూర్తిగా విశ్వాసం లేదు. ఈ ఇద్దరికీ శాంతిభద్రతల మీద, న్యాయవ్యవస్థ మీద విశ్వాసం లేదు. అయితే ఇంతటి వాస్తవాలను జీర్ణం చేసుకొనగలమన్న ఆత్మశక్తి మీద కూడా విశ్వాసం లేదు. అందుకే అంగీకరించటానికి సుతరామూ ఇష్టపడరు. అందరూ అందరినీ నమ్ముతున్నట్లు, ప్రతివాడూ ప్రక్కవాడికోసమే బ్రతుకు తున్నట్లు నటిస్తూ, నటింపజేస్తూ ఎవడి పని వాడు పూర్తి చేసుకొని, ఎవడి అవసరం వాడు తీర్చుకొని, ఎవడి పబ్బం వాడు గడుపుకుంటుంటాడు. ప్రకృతి ప్రసాదించిన గాలి, నీరు, భూమి విషయంలో కూడా ఎవడిమట్టుకు వాడే అధికారి ననుకుంటున్నాడు. అంతా నాకే కావాలని ఆశగా ఆలోచిస్తున్నాడు.

అందుకే వర్తమాన వ్యవస్థమీద, ప్రజాస్వభావాలమీద అవిశ్వాసతీర్మానం పెడుతున్నాను. చర్చించండి. తీర్మానం వీగిపోతే వినయంగా అభిప్రాయాన్ని ఉపసంహరించుకుంటాను. (మే, 1997)

# అందరినీ క్షమించు

"విద్యార్థి చేత్ త్యజేత్సుఖం" పాతరోజుల్లో మాట ఇది. చదువు బాగా రావాలంటే సుఖం వదిలి పెట్టాలని దీని అర్థం. ఆ మాట చెప్పిన రోజుల్లో పిల్లలు అలాగే చదువుకొనేవారట, కొంచెం వయస్సు మళ్ళినవాళ్ళను ఎవరినైనా కదిలించినా కూడా ఆ మాటే అంటుంటారు. మా రోజుల్లో.... వీధి దీపాల క్రింద ... వగైరా వగైరా..

అయితే ఈనాటి విద్యార్థుల పరిస్థితిని గమనిస్తే వీళ్ళు సుఖంతోపాటు, శాంతినికూడా వదిలిపెట్టి కష్టపడటం కనిపిస్తోంది. పుట్టీ పుట్టకముందే పుట్టెడు పుస్తకాలు మోస్తూ, తల్లిదండ్రుల సుఖసంతోషాలకోసం రకరకాల అభినయాలతో 'రైమ్స్' వల్లిస్తూ మేష్టర్లనబడేవాళ్ళ తృప్తికోసం తు.చ. తప్పకుండా చెప్పింది చెప్పినట్లు వల్లిస్తూ నానా అగచాట్లుపడటం లేదా? భయాందోళనలకు గురియైన సమాజం అనే బాతు పెడుతున్న బంగారు గ్రుడ్లు ఈనాటి విద్యార్థులు.

అంతగా బంగారు గ్రుడ్లతో విద్యాసంస్థలు పెరిగి పెద్దవై పోతున్నాయి. అయినా వాటికి తృప్తిలేదు. అలనాటి కథకు అన్యాయం జరగగూడదని కాబోలు, అప్పుడప్పుడు బాతుమీదనే దృష్టి పెట్టి అడుగు వేస్తున్నాయి. అయినా ఇది ఇప్పటికే చచ్చిన బంగారు బాతు కాబట్టి మరల వచ్చే నష్టమేదీ లేదు. తాను చచ్చి కూడా ఇతరులకోసం బంగారు గ్రుడ్లు పెట్టడమే దీని రివాజు.

అన్యాయాలను, అక్రమాలను అరికట్టి అందరికోసం పనిచేసే యంత్రాంగం ఒకటి మనకుంది. దానిని ప్రభుత్వం అంటాం. మన ప్రభుత్వాలది అద్వైతవాదం. అన్నీ తెలిసి కూడా ఏమీ ఎరగనట్లు నడవగలవు. ఎక్కడో పోగొట్టుకున్న వస్తువును ఎక్కడో వెతుకుతున్నట్లు ముందుకు సాగిపోగలవు.

ఇన్ని రకాల విపరీత విపత్కర వాతావరణంలో ఈనాటి విద్యార్థి నిజంగా సుఖాన్ని, శాంతిని త్యాగం చేసినవాడే. కాదంటారా? అయితే ఈ మొత్తం పరిస్థితికి ఎవరి కారకత్వం వారికుంది. ఎవరి భయం వారికుంది. ఎవరి అశ్రద్ధ వారి దగ్గరుంది. ఎవరి ఆశ వారిని పెంచి పోషిస్తోంది. కాబట్టి ఎవరినంటాం? దైవమా! అందరినీ క్షమించు. అందరిలోని అజ్ఞానాన్నీ క్షమించు. (జూన్, 1997)

# విశ్వధర్మం

'విశ్వధర్మ (వాణి)' పత్రిక ప్రారంభించి ఇప్పటికి ఆరు వసంతాలు గడిచి పోయాయి. పత్రికా రంగంలో పరిచయమున్న ఎవరికైనా తెలుసు ఒక చిన్న పత్రిక ఆరు సంవత్సరాలపాటు ఆగకుండా - ఆపకుండా - నడవటం - నడపటం అంత తేలికైన విషయం కాదని. ఈ విషయం మనస్సులో మెదిలినపుడు విశ్వధర్మవాణి నిర్వహణ ఇంకా బాధ్యతాయుతంగా, ప్రయోజనవంతంగా జరగాలని, ఆ కోణంలోనుండి దానినుంచి పాఠకులు ఎంతో ఆశిస్తున్నారనీ స్పష్టమవుతుంది.

విశ్వధర్మం అనాది, అనంతం. దాని తత్త్వం, మహత్వం అనుభవైకవేద్యం. నిత్యనూతనం. అదొక నిరంతర గంగాప్రవాహం. నిరాటంక నిర్ఝరపాతం. ధర్మస్వరూపం, ధర్మవిస్తృతీ తెలిసేకొద్దీ, ఆలోచించే కొద్దీ దానిలోని సంశ్లిష్టత, సంక్లిష్టత ఎక్కువవుతూ వుంటుంది. స్పష్టత అందనంత దూరంలో వున్నట్లనిపిస్తుంటుంది. స్పష్టత వైపు దృష్టిని సారించటం, సమగ్రతవైపు పయనాన్ని సాగించటం లక్ష్యంగా మానవుని మనుగడ జరగాలి. అది ప్రయత్నపూర్వకంగా జరుగుతున్నట్లుగా కాక అసంకల్పితచర్యగా అమరిపోతున్నట్లు కనిపించాలి. అప్పుడే జీవితం ధర్మబద్ధ మవుతుంది. జీవనం కర్మశుద్ధం అవుతుంది.

అయితే, ఆధునిక మానవుడికి ధర్మాన్ని గురించిన అవసరం వున్నా అవగాహన కన్పించడం లేదు. అది ఆలోచించవలసిన అవసరమున్న విషయంగా అనిపించటం లేదు. అందుకనే అప్రయత్నంగా, అనూచానంగా వస్తున్న ధర్మాచరణకు తప్ప కాలానుగుణంగా మారుతున్న జీవనవిధానానికీ, విలువలకు అనుగుణంగా ధర్మస్వరూపం తెలియటంలేదు. ధర్మం అవిచ్ఛిన్నం అయినా సమన్వయం నిత్యనూతనం. దాని ఫలితం సర్వజనసౌభాగ్యం, సర్వప్రాణిహితం.

ఆ నేపథ్యంలో 'విశ్వధర్మవాణి' తన శక్తి వంచన లేకుండా విశ్వధర్మ స్వరూపాన్ని విభిన్న కోణాలనుండి అందించే ప్రయత్నం చేస్తోంది. ఆవాణిని వినిపించేందుకు సాహసిస్తోంది. ధర్మం తెలిసినా, దానిని చెప్పగలగటం మరొక ఎత్తు. ఆ రెండవ లక్షణాన్ని వీలయినంత మృదువుగా, స్పష్టంగా, తేలికగా అందరికీ అందించే ఈ 'విశ్వధర్మవాణి' సంకల్పానికి అందరూ సహకరించాలి. అందరి చేయూతా కావాలి. అందరూ ఫలితాలు అందుకోగలగాలి. (జూలై, 1997)

# కాలజ్ఞానం

కాలమన్న పదాన్ని ఎప్పుడు ఎవరు నిర్దేశించారో తెలియదు. కానీ దాని విలువ, దాని వైశిష్ట్యం అసాధారణం, అనన్యసామాన్యం. ఒక అవిభాజ్యం, అదృశ్యం అయిన పదార్థాన్ని సూర్యుణ్ణి ఆధారంగా చేసి, చిన్న చిన్న ముక్కలుగా విభజించి, రోజు - దినం అని పేరు పెట్టి, అక్కడనుండి కాలాన్ని పరిగణించటం ప్రారంభించినవైనం ఆశ్చర్యకరం. అలనాటి ప్రాచీనమానవుడి మేధావికాసానికి, విలాసానికి నికషాయమానం. దాన్ని, దాని పరిభ్రమణాన్నీ, దాని తిరుగులేనితనాన్ని అర్థం చేసుకొనగలిగితే కాలజ్ఞానం మనకు కలిగినట్లే. తద్వారా దాని విలువను మనం కాపాడుకొనగలిగినట్లే.

అయితే మనలో చాలామందికి కాలజ్ఞానం అన్నది చాలా వింతైన, విచిత్రమైన, విలక్షణమైన ధర్మం. గతాన్ని గమనించి ఏమీ అర్థం చేసుకోలేని మనం, వర్తమానానికి అనుగుణంగా ఎలా ప్రవర్తించాలో అవగాహనలేని మనం, భవిష్యత్తును గురించి చెప్పాలన్నా, వినాలన్నా ఉబలాటపడుతుంటాం. దానికి బానిసలమైపోయి ప్రవర్తిస్తుంటాం. భవిష్యత్తును గురించి ప్రవచించగలగటమే కాలజ్ఞానంగా భావిస్తుంటాం. మనమంతా కూడా బ్రహ్మంగారిలానో, 'నోస్ట్రాడమస్'గానో మారిపోయినట్లు భావించుకొని ఏవేవో భవిష్యన్నిర్దేశాలు చేసేయగలుగుతుంటాం. ఒకవేళ మాటాడకపోయినా వాటిని, వారిని గౌరవించి అదే పరమ పవిత్ర జీవితంగా భావించుకొని మురిసిపోతుంటాం.

కానీ, సామాన్య మానవుడికి దైనందిన జీవితం సవ్యంగా సాగిపోవటానికి, తన ప్రవర్తన పొరుగువారికి ఇబ్బంది కలిగించకుండా వుండటానికి మనకు అంతటి కాలజ్ఞానం అవసరం లేదు. ఎప్పుడు ఏ పనిని చేయాలో తెలుసుకొని తదనుగుణంగా ఇతరులు మనకోసం లేదా మనవలన వారి సమయాన్ని పాడుచేసుకొనవలసిన అవసరం లేకుండా ప్రవర్తించగలిగితే చాలు. మనకుకూడా బోలెడంత కాలజ్ఞానం వున్నట్లే. మన కాలజ్ఞానం భవిష్యత్తును సూచించకపోతే, భావిలో జరగబోయే వింతలను, విచిత్రాలను వివరించలేకపోతే నష్టమేమీ లేదు. కానీ, వర్తమానంలో మనవలన ఎవరూ ఇబ్బందులు పడకుండా వుంటే చాలు. ఆపాటి తెలుసుకొని బ్రతక గలిగితే మనం కాలజ్ఞానంలో బ్రహ్మంగారికన్న గొప్పవాళ్ళమే. (ఆగష్టు, 1997)

# సమాంతర రేఖలు

సమాజంలో భావచైతన్య స్థాయి పెరుగుతోంది. పదార్థాలను, భావాలను వాస్తవిక దృష్టితో చూడటానికి అలవాటుపడిపోతున్నారు. ఒకనాటి ప్రజలలాగా ఈనాటి ప్రజలలో ఊహలు లేవు, కలలు లేవు, కల్పనలు లేవు. వాస్తవాన్ని ఎక్కడున్నా గ్రహించి, ఎలా వున్నా జీర్ణంచేసుకోవడం నేర్చుకుంటున్నారు. ఎవరికి ఎవరిని గురించీ భయంకానీ, బెంగకానీ లేదు. ఒకవేళ వుందనుకుంటే దానికి అనేకానేక కారణాలుంటున్నాయి. ఈ పరిణామక్రమంలో పాత విలువలకు పాతరలు వేస్తున్నారు. క్రొత్త విలువలను కొనుగోలుచేస్తున్నారు.

ఈ మార్పు అటు భౌతిక జీవితంలోనూ, ఇటు ఆధ్యాత్మిక జీవితంలోనూ కూడా కనిపిస్తోంది. ఆధ్యాత్మికంగా ఈ దేశం చాలా ముందుకు దూసుకొనిపోతోందనేందుకు విభిన్న దాఖలాలు కనిపిస్తున్నాయి. ఎక్కడ అవకాశముంటే అక్కడ గుళ్ళు, మందిరాలు కట్టించేస్తున్నాం. ఎక్కడ అవసరముంటే అక్కడ విగ్రహాలను ప్రతిష్ఠిస్తున్నాం. పూజలు చేసేవారిసంఖ్య పెరిగింది. పుణ్యక్షేత్రాలలో రద్దీ పెరిగింది. భజన కార్యక్రమాలు ఊపందుకొంటున్నాయి. సాధుపుంగవుల సంఖ్యా, స్థాయి ఎదిగిపోతోంది. అందరిలోనూ తాము నిమిత్తమాత్రులమేనన్న భావం వేళ్ళూనుకొనివుంది. ఆ భావమే మంచి, చెడు రెండూ పట్టించుకోకుండా జీవించటానికి ఊతమిస్తోంది.

ఇటు, భౌతికజీవితం ఒకనాటి మనిషి ఊహలకు కూడా అందనంత వేగంగా ఎదుగుతోంది. ఈనాటి మానవుడికి విశ్వమంతా విలాసకేంద్రమే. పుట్టిన వూరు దాటి పోవాలంటే అనుమానించిన ప్రజలు ఈనాడు పుట్టినదేశం - కొద్దికాలంలో గ్రహం కూడా కావచ్చు - వదలివెళ్ళటమే అంతిమలక్ష్యంగా సాగుతున్నారు. మానవుడు విశ్వమానవు డవుతున్నాడు. భౌతికంగా సర్వసుఖాలను ప్రోదిచేసుకొని సృష్టించుకొనగలుగుతున్నాడు.

అయితే పెరిగిన ఆ ఆధ్యాత్మిక చైతన్యాన్ని, ఎదుగుతున్న ఈ భౌతిక జీవితంతో ముడివేసి అన్వయించుకోవటంలో మాత్రం పూర్తిగా - సంపూర్తిగా

విఫలమవుతున్నాడు. తన కక్కుర్తి ప్రవర్తనతో అటు ఆ ఆధ్యాత్మికతను, ఇటు ఈ భౌతికతను కూడా అప్రతిష్ఠపాలు చేసి తన కేమీ తెలియనట్లు, తన బాధ్యత లేనట్లు నటించగలుగుతున్నాడు. అందుకే ఈ రెండూ జీవితాలు - ఆధ్యాత్మిక భౌతిక జీవితాలు - సమాంతర రేఖలుగా సాగిపోవటమే తప్ప కలిసి ఒకటయ్యే రోజు కనుచూపుమేరలో కనిపించటం లేదు. వివేకానందులు ఎంత అవేదనపడినా ఆయన బొమ్మకు పూజ చేయగలమే కానీ, ఆయన సిద్ధాంతాలను పాటించలేము కదా?

(సెప్టెంబరు, 1997)

# మాచింగ్ ముచ్చట

'మాచింగ్' అంటే దాదాపు తెలియనివాళ్ళు ఈ రోజుల్లో ఎవరూ ఉండరు. వేసుకునే బట్టలనుండి, తొడుక్కునే జోళ్ళనుండీ, పెట్టుకునే బొట్టు, అమర్చుకునే కట్టు, ముడిపెట్టుకునే జుట్టువరకు మాచింగ్ లేనిదే మన మనస్సుకు నచ్చదు. కట్టుకున్న ఇంటికి ప్రక్కింటి రంగుతో మాచింగ్, ఇంటిలోపల వేసుకునే రంగులకు మాచింగ్; లోపల వేసేరంగులకు, వాడుకునే వస్తువుల రంగులకు మాచింగ్. వస్తువుల వర్ణాలకు, వాటిపై కప్పే వస్త్రాల వర్ణాలకు మాచింగ్ తప్పనిసరిగా చూస్తాం. నిజంగా ఇది మనసారా అభినందించదగిన అంశం. మనిషి మానసికంగానూ, శారీరికంగానూ ఆరోగ్యంగా ఉండాలంటే చుట్టూవున్న వాతావరణంలో, వర్ణాలలో, నిర్మాణాలలో ఒక సమత, ఒక తౌల్యం ఉండటం చాలా అవసరం. ఈ తౌల్యం లౌల్యంగా వేలంవెర్రిగా మారనంతవరకు ఇది చాలా అవసరం కూడా.

ప్రకృతి నిర్మాణంలో కూడా ఈ మాచింగ్ చాలా ప్రధానమైన పాత్రను నిర్వహిస్తోంది. గాలి - నీరు - వెలుతురు - నేల - నింగి వీటి మాచింగ్లో ఎక్కడ తేడావచ్చినా ఇబ్బందులు ఎదురవుతూనే ఉంటాయి. గాలితో నీరు 'మాచ్' కాకపోతే అది ఎడారి అయికూచుంటుంది. నింగికి వెలుగు మాచ్ కాకపోతే విశ్వమంతా అంధకారబంధుర మవుతోంది. నీటికి నిప్పుకు మాచ్ లేకపోతే పాకశాస్త్రం తగలడిపోతుంది. సృష్టిలోని ఈ రహస్యాన్ని గుర్తించగలిగాం కాబట్టే మనంకూడా నిత్యజీవితంలో మాచింగ్ విలువ తెలుసుకొని కాపాడుకుంటున్నాం.

అయితే ఇదంతా బాహ్యవిషయం. మనలో అంతర్గతంగా మాచింగ్ అవసరమైన ధర్మాలు కొన్ని ఉన్నాయి. మనస్సు - మాట - పని. కలిగే ఆలోచనలకు, చెప్పేమాటలకు, చేసేపనులకు మాచింగ్ చాలా అవసరం. ఆ మాచింగ్ కుదిరినవాళ్ళనే మహాత్ములని పెద్దలు అన్నారు. కానీ, మనలో చాలామందికి అది కుదరటం లేదు. మనస్సు వేరు - మాట వేరు - పని వేరు అవుతోంది. బాహ్య విషయాల్లో ఇంతగా మాచింగ్‌ను ఆదరించటం నేర్చుకున్న మనం అంతర్గతమైన మాచింగ్ వైపు మళ్ళనవసరంలేదా? ఆలోచించండి. (అక్టోబరు, 1997)

# సమాజవైరాగ్యం

జీవితం మీద విరక్తి కల్గించినట్టు కనిపించే కొన్ని సన్నివేశాలను పెద్దవాళ్ళు క్రోడీకరించారు. వాటిని పురాణవైరాగ్యం, ప్రసూతివైరాగ్యం, శ్మశానవైరాగ్యం అని పేర్కొన్నారు. ఆయా సందర్భాలలో, సంఘటనలలో క్షణికమైనా సరే జీవితం మీద విరక్తి కలుగుతుందట. కాలం గడిచేకొద్దీ భౌతికంగా, మానసికంగా ఎన్నో మార్పులు సంభవించేకొద్దీ విరక్తికల్గించే సంఘటనల సంఖ్య కూడా పెరిగింది, పెరుగుతూ వస్తోంది. సంఘజీవి అయిన మానవుడు సమాజ జీవితంలోని అనేక సందర్భాలలో, సన్నివేశాలలో జీవితంపై విరక్తిని, ఏహ్యభావాన్ని పెంపొందించుకుంటున్నాడు. పైన చెప్పిన వైరాగ్యాల లాగా ఇదికూడా క్షణికమే అయి, మరల మామూలు స్థితికి రాగలిగితే సమస్య లేదు. అయితే ఆ విరక్తి అంతర్గతంగా పేరుకొనిపోయి విపరీత ప్రవర్తనలకు, ఊహించని పరిణామాలకు దారితీస్తోంది.

వాస్తవికంగా ఆలోచిస్తే మనం అసహ్యించుకొనే సందర్భాలూ, ఆయా సందర్భాలలోని మన ప్రవర్తనలూ సహజత్వానికి దగ్గరైనవి. తన అవసరం తాను తీర్చుకోవడం, తన బ్రతుకు తాను బ్రతకటం, తన చావు తాను చావటం సృష్టిలోని అన్ని ప్రాణులకు సహజం. మనిషితప్ప ఇతర జంతువులన్నీ ఈ పద్ధతిలోనే బ్రతుకు తున్నాయి. దాదాపు ప్రకృతి సహజధర్మాలకు అనుగుణంగానే బ్రతుకుతున్నాయి. అందుకే ప్రత్యేకానురక్తి కానీ, ఆవేశపూరితమైన విరక్తి కానీ వాటికి లేవు.

కానీ మనిషి దారి వేరు, మనిషి తీరు వేరు. మనిషిజీవితం ఏటికి ఎదురీత. ప్రకృతికి, ప్రకృతిధర్మాలకు నిలువెత్తు సవాలు. ఆ సవాలులో నుండి సవాలక్ష ప్రశ్నలూ, సందేహాలూ, తప్పని పరిస్థితులలో సహజీవన సూత్రాలూ అవసరమయ్యాయి. అవన్నీ వ్రాసుకొని, ఆచరించలేక, ఆచరించగలిగినవారు ఆచరింపజేయించలేక సతమతమయి విరక్తికి లోనవుతున్నారు. బ్రతికినంతకాలం కూడా బ్రతుకులోని మాధుర్యాన్నీ, మహత్వాన్ని అనుభవించలేక, అర్థంచేసుకోలేక సతమతమవుతున్నారు. అందుకే ఈ సందర్భంగా గుర్తుంచుకొనవలసిన ప్రధానాంశం ఒకటుంది.

మనలో కనిపించే లోపాలు దాదాపు అన్నీ మనకు ప్రకృతిగతంగా సంక్రమించినవి. మనం వాటిని పరిహరించి, లేదా అధిగమించి వ్యక్తిగత జీవితాలనూ, సమాజస్వభావాన్ని సత్యశివ సౌందర్యాలకు ఆలవాలం చేయాలని ప్రయత్నిస్తున్నాం. కాబట్టి ఆ ప్రయత్నంలో పూర్తిగా సఫలత్వాన్ని పొందలేనంత మాత్రంచేత నిరాశపడ నవసరం లేదు. ఏ కొంచెం ముందుకు పోగలిగినా అదే ధన్యతగా భావించాలి. ఆ బలంతో, ఆసరాతో ముందుకు సాగిపోగలగాలి.

(నవంబరు, 1997)

# నేను

మనిషి తనకోసమే తాను బ్రతుకుతాడు, తన మనుగడయే లక్ష్యంగా అన్ని ఆలోచనలూ, అన్ని పనులూ చేస్తాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలనుండీ ఉద్యమాలకు ఊపిరిపోయటం వరకు అన్నింటి లక్ష్యమూ ఒక్కటే. "నేను" అన్న రెండక్షరాల పదమే.

ఇది అనాదిగా, ఆ భావమే పునాదిగా స్థిరపడిపోయిన సత్యం. పురాణాలు చెప్పినా, పురుషార్థాలు చెప్పినా, భౌతిక శాస్త్రానికైనా, ఆధ్యాత్మిక శాస్త్రానికైనా మూలం ఈ భావమే. కాకపోతే అంతరాంతరాల్లో అదొక్కటే పని చేస్తున్నా, పైకి మాత్రం మనం అంత తీవ్రవాదులం కాదు అన్నట్టుగా కనిపించటం మనం నేర్చుకున్నాం. దాచి పెట్టటం చేతకాక పైకి కనిపించి బయటపడే వారిని

స్వార్థపరులు అని నిందించడం అలవాటు చేసుకొన్నాం. ఏతావతా అందరూ స్వార్థపరులే అన్నది తిరుగులేని నిర్ణయం, పరమార్థం కూడా. అయితే ఆ స్వార్థంలో, పరమార్థంలో కొంత పరార్థం కూడా కలిస్తే అది కొంతవరకు సామాజిక జీవితానికి ఆలంబన మవుతుంది. “నేను” నుండి “మేము” వరకు అక్కడనుండి “మనం” వరకు ప్రయాణాన్ని కొనసాగించగలిగితే పరమార్థంలో కొంత మనకు అవగతమయినట్లే.

“మనం” అన్నది కూడా ఈ అనంత ప్రాణికోటిలో, విశాలవిశ్వంలో, చాలా చిన్నపదమే. సకలచరాచర జీవజాలాన్ని, అచర వస్తుసముదాయాన్ని పరిగణనలోకి తీసుకుంటే “మన” అన్న పదం కూడా ఒక అణువు వంటిదే. ఆ అణువులో ఒదిగిపోవలసిన పరమాణువులలో “నేను” ఒకటి.

కాబట్టి వాస్తవికంగా “నేను” అన్నది ఒక పరమాణువు యథాతథ స్థితిలో. కానీ, దాని విస్ఫోటనశక్తి మాత్రం అంచనాల కందనంత వుంటుంది. కాబట్టి వ్యక్తి స్థాయిలో ఒదిగి వుండి - పరమాణువుగా వుండి - విస్ఫోటన సమయంలో శక్తిగా ఎదిగి, అన్నివైపుల విస్తరించగలిగినప్పుడే “నేను” కు విలువ. సమాజానికి భద్రత. సహజీవనానికి ప్రతీక. (డిశంబరు, 1997)

# రాగింగ్

అందరికీ తెలిసిన విషయాలను నూతనంగా తానే కనుగొన్నట్లు మాటాడటం, తాను కూడా ఆచరించని విషయాలను తాను తప్ప మిగిలిన అందరు ఆచరించాలని ఆశించటం, ఆచరించటంలేదని ఆక్రోశించటం, విడివిడిగా తాను కూడా సమస్య జ్వలించటానికో సమిధవేస్తూ, అందరితో కలిసినపుడు పరిష్కార మార్గాలను గురించి ప్రగల్భించటం ఈనాటి సమాజానికి పట్టిన దుర్గతి, మానవజాతికే మచ్చతెచ్చే - కనిపించని - అవినీతి. ఎన్నో సమస్యలను మనం ఆ కోవలోనే ఆలోచించటం నేర్చుకున్నాం. వాటిల్లో ఒకటి ప్రధానమైనది, దయనీయమైనది రాగింగ్.

లంచగొండితనాన్ని, వరకట్నాన్ని నిషేధించి, నిషేధాన్ని ఉల్లంఘిస్తే అమలుపరిచే విధంగా చట్టాలు చేసినట్టే రాగింగు నిషేధిస్తూ చట్టాలు, కఠిన శిక్షలు చేశాం. చేతులు దులుపుకున్నాం. ఆ శాసనం చట్టసభనుండి కాలేజినోటీసుబోర్డు దాకా అంచెలంచెలుగా, రకరకాల సంతకాలతో ప్రాకుతూవచ్చి అక్కడ ఆగిపోతుంది. ఆ కాగితం యోగాన్ని బట్టి కొద్ది నిముషాలో, గంటలో, రోజులో అక్కడ వైభవంగా బ్రతికి, కాలగర్భంలో కలిసిపోతుంది. అక్కడితో రాగింగ్ నిరోధానికి సంబంధించిన అందరూ చట్టబద్ధంగా అన్ని చర్యలు తీసుకున్నట్లే. అయినా కాలేజిలోనే రాగింగ్ భరించలేక ఆత్మహత్యలు జరుగుతున్నాయంటే "...అయినా యుద్ధం ఎందుకంటే తమ్ముడూ అది మన ప్రారబ్ధం" అని తిలక్ (అమృతం కురిసినరాత్రి) ఏనాడో సెలవిచ్చాడు.

"ప్రొఫెషనల్ కోర్సులు" చదివేవారు జీవితంలో ఆటుపోటులకు గురికావలసి వస్తోందని, దాని కనుగుణంగా వారిని తయారుచేయటానికి రాగింగ్ అవసరమని చాలామంది సీనియర్ విద్యార్థులు, అధ్యాపకులు కూడా అభిప్రాయపడుతుంటారు. ఆకాడికి 'ప్రొఫెషనల్ కోర్సులు' చదివేవారు మనుష్యులన్నట్లు, మిగిలినవారు కారన్నట్లు. ఆటుపోట్లకు గురికాకుండా సమాజంలో ఎవరు జీవించగలుగుతున్నారు?

తమ పిల్లలు కాలేజిలో చేరేరోజు తపనపడ్డ తల్లితండ్రులు మరుసటి సంవత్సరం తమ పిల్లలద్వారా అటువంటి అనర్థం జరుగకుండా ఆపలేకపోవటం, పిల్లలను మందలించలేకపోవటంతో ఈ సమస్య పంజావిప్పుతుంది.

అక్కడనుండి 'టచ్ మి నాట్' (ఆత్తపత్తిచెట్లు) లకు అనుంగుతమ్ములైన పరిపాలకులు, అధ్యాపకులు, అధ్యాపకసంఘాలు, విద్యార్థిసంఘాలు, విశ్వవిద్యాలయాలలోనూ, కళాశాలలలోనూ పాలకపదవుల కోసం మాత్రం వెంపర్లాడి, బాధ్యతల దగ్గర మాత్రం తప్పుకుపోయే రాజకీయ నాయకులు, పారిశ్రామికవేత్తలు, ఇతర పెద్ద మనుషులు, సామాజిక కార్యకర్తలు వీరందరి సాక్ష్యంగా విరుచుకొనిపడుతుంది.

ఎంత దౌర్భాగ్యం! అన్యాయం జరిగిపోతోందని ఆక్రోశించటానికి ఇంత మంది వుండీ, విరియకముందే రాలిపోతున్న మొగ్గలను చూస్తూ నిమ్మకు నీరెత్తినట్లు వుండగలగటం మానవ నాగరికతకు వెన్నుపోటు కాదా? పశుపక్ష్యాదులు స్టేట్మెంట్లు ఇవ్వలేవు. కానీ మనలను చూచి వాటి భాషలో అని నవ్వుకుంటూ వుండవా?

ఇంతమంది బాధ్యులలో ఏకొద్దిమంది త్రికరణశుద్ధిగా ప్రయత్నించినా దీన్ని అరికట్టడం కష్టం కాదే! అసలిది సమస్యగా కూడా కనిపించే అవకాశం లేదే!

పై అందరికీ చెప్పి ఒప్పించలేం. ఎందుకంటే ఎవరి బాధ్యతలు వారు నిర్వర్తించకపోయినా ఎవరి హక్కులు వారి కున్నాయి. అవి వారిని నిర్దోషులనే అంటాయి. కన్నబిడ్డలమీద ప్రేమ కన్నవారికే కాబట్టి తల్లిదండ్రులకే బంధముంటుంది. దాన్ని తెంపే అవకాశం మీ బిడ్డ తీసుకోకుండా మీరు కనిపెట్టివుండండి. (జనవరి, 1998)

## రూప శిల్పం

మనిషికి రూపాభిమానం ఎక్కువ. ఇతరుల రూపాలను విభిన్న కారణాల వల్ల మనం అభిమానిస్తుంటాం. రూపంతో మనకున్న పరిచయం స్థాయి ఆ రూపంపై మన అభిమాన స్థాయిని నిర్ణయిస్తుంది. ఆ పరిచయం అనునిత్యం చూస్తుండటం గాక ఆ రూపంతో పెనవేసుకున్న భావానుబంధంగా వుండటం ప్రత్యేకంగా గమనించవలసిన అంశం. 'కాకిపిల్ల కాకికి ముద్దు' అనటంలో రూపాభిమానం, అది సంభవించే విధానం కూడా స్పష్టమవుతున్నాయి. కాకి అనాకారియైన పక్షి అని మన భావం. అయితే ఆ కాకిపిల్ల కూడా తల్లి కాకికి అందంగానే కనిపించటం వెనుక భావబంధమే కారణమై కనిపిస్తోంది. భావబంధం ప్రగాఢతరమైనప్పుడు చెరగని ముద్రలు వేయటం సంభవం. ఆ ముద్రల కనుగుణంగా అవకాశమున్న రీతిగా - అలనాడు విగ్రహాలు, చిత్రాలు,

నేడు ఫోటోలు - రూపాలను పదిలపరచుకోవాలన్న తహతహ మనకు కలుగుతుంది. ఒక ప్రాణి మరణిస్తే ఆ రూపానికి మరల అస్తిత్వం లేకపోవటం ఈ భావాన్ని మరీ గాఢంగా మారుస్తుంది.

రూపాభిమానంలో ఆత్మ రూపాభిమానం పరాకాష్టకు చెందిన భావన. ఇది కూడా భౌతికమైన రూపమాత్రాభిమానం కాకుండా తన భావాలతో బంధాన్ని పెంచుకున్నదై కనిపిస్తుంది. కేవలం రూపం మీదనే మనిషికి అభిమానమైతే ఏదైనా కారణంవలన రూపంలో లోటు ఏర్పడితే ఆ అభిమానం నశించవలసి వస్తుంది. కానీ, అలా జరగటం లేదు. కాబట్టి విశిష్టభావబద్ధమైన తన రూపం మీదనే మనిషికి అభిమానం. ఆ విశిష్టభావం తన మనస్సులో పుట్టి, తన మనస్సులో పెరిగి, తన బుద్ధితో సంస్కరించబడి, తన ఇంద్రియముల ద్వారా ప్రకటించబడినపుడు ఆ రూపమే వ్యక్తి మనోరూపం అవుతుంది. ఆ మనోరూపం భౌతికరూపం కన్నా ఎక్కువ అభిమానాన్ని మనిషిలో కలిగిస్తుంది. ఆ రూపం స్థిరంగా సమాజంలో నిలువగలిగితే తన భౌతికరూపం నిలిచినట్లుగానే భావన కలుగుతుంది. రూపానికి శాశ్వతత్వంలేని సృష్టిలో శాశ్వత (మనో) రూపాన్ని కల్పించుకొనగలగటం మనిషికి గర్వకారణమై స్వరూపాభిమానం రెట్టింపై పనిచేస్తుంది.

అందుకే ఏ పని చేస్తున్న వ్యక్తి అయినా, ఏ కళాకారుడైనా తన భావాలకు ఏ వంచన లేకుండా యథాతథంగా రూపాన్ని ఇవ్వగలిగినపుడు అది అద్భుత శిల్పమై విరాజిల్లుతుంది.

అయితే దురదృష్టవశాత్తు మన రాజకీయ నాయకులకు ఆత్మవంచన, పరవంచన లేకుండా తమ మనస్సులకు రూపకల్పన చేయటం ఇష్టం లేదు. అందుకే రాజకీయం సుందరశిల్పం కాలేకపోతోంది. కాకి పిల్ల కాకికి ముద్దుగా మిగిలిపోతోంది.

(ఫిబ్రవరి, 1998)

# సాధనమా? సాధ్యమా?

భారతీయుల జీవనవిధానంలో కొన్ని విశిష్ట లక్షణాలు కనిపిస్తాయి. వాటిల్లో ప్రధానమైనది పుస్తకాలలో వ్రాసే మాటలకు, దైనందిన వ్యవహారానికి సంబంధం లేకపోవటం. ఇందులో మినహాయింపు లేదు. అందుకే పరమాత్మను విశ్వవ్యాపి అనీ, అన్ని ప్రాణులలోనూ ఆ పరమాత్మ స్వరూపమే వుంటుందని, ప్రాణిమాత్ర సేవ పరమాత్మ సేవ అనీ చెప్పుకుంటూ కూడా విశ్వరూపంగా పరమాత్మను సందర్శించగలిగేవాడికి విలువను తగ్గిస్తాం. పరమాత్మను పరమాత్మగానే చూచేవాడిని మాత్రమే మహాత్ముడు, మంచివాడు వగైరా పేర్లతో పిలుచుకుంటాం.

అనాదిగా, ప్రత్యేకించి ఆధునికంగా మంచివాడు అనిపించుకో దలచుకున్న వాడికి కావలసిన లక్షణాల్లో భక్తుడై వుండటం కూడా ఒకటి. గుడికి వెళ్ళటం, గుడిచుట్టూ తిరగటం, పూజలూ, భజనలూ చేయటం, చేయించటం ఆర్థికంగా పుష్టివుంటే కళ్యాణాలు, కైంకర్యాలూ చేయించటం, ఏకంగా గుళ్ళూ గోపురాలు కట్టించగలగటం - వీటిలో ఏ స్థాయిలో ఏది నిర్వహించగలిగితే ఆ స్థాయిలో మంచివాడయిపోవటం జరుగుతోంది. భక్తి పరమ పవిత్ర భావన అయినప్పుడు ఆ భక్తి నరనరాన జీర్ణించుకొన్న అటువంటివారికి చేతులెత్తి నమస్కరించి మనం కూడా పునీతులమవుదాం. భక్తుడికి భక్తుడుగా వుండటం కూడా భగవద్భక్తియే, శరణాగతిలో ప్రధానాంశమే కాబట్టి.

కానీ, నాకొక్క అనుమానం. భక్తి అన్న భావం, ధ్యానం, ఆరాధనం సాధ్యమా? సాధనమా? అని. భక్తిని పెంపొందించుకోవటం, ఆచరించటం లక్ష్యమా (సాధ్యమా)? అదే అయితే, ఆ స్థాయి భక్తులైన వారి దిన దిన ప్రవర్తనలు, మనకు కనిపించే వికారాలూ, విన్యాసాలూ, వారిమీద అయితే పరవాలేదు కానీ, మన జీవితాలమీద మనకు విరక్తిని కల్గించే పరిస్థితులలో కూడా వున్నాయి. దాన్ని అలా సరిపెట్టుకోవటమేనా?

అయితే మన శాస్త్రాలు కానీ, భక్తి భావాన్ని ప్రతిపాదించిన గ్రంథాలు కానీ దాన్ని ఒక సాధనంగా చెప్పాయే కానీ సాధ్యంగా చెప్పలేదు. మోక్షసాధనకు –

జ్ఞానసాధనకు - వున్న మార్గాలలో ఒకటి భక్తి మార్గమే, కానీ భక్తి గమ్యం కాదు గదా! జ్ఞానసాధనలో ప్రధానాంశం సర్వప్రాణులలో, సర్వులలో సర్వేశ్వరుణ్ణి దర్శించటమే కదా! అది లోపించిన తర్వాత సర్వమూ పరమాత్మభావమే అన్న ఆలోచన వదలి, పైసలు ఏరుకునేందుకు పరుగులు ప్రారంభించిన తర్వాత, భక్తితో చేసే పూజలు తప్ప మిగిలిన అన్ని పనులను ఆత్మపరంగానే చూడటం అలవాటు చేసుకున్న తర్వాత భక్తిని సాధ్యంచేసి ఆత్మపరవంచనలు చేసుకోవట మెందుకు?

(మార్చి, 1998)

## జీవితం విలువైనది

మనం నిత్యం ఏ కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్నా సంకల్పం చెప్పుకుంటాం. అప్పుడప్పుడు మహాసంకల్పాన్ని కూడా చెప్పుకుంటాం. అవేవో ఆపకుండా చదువుకునే మంత్రాలలాగా వినిపిస్తుంటాయి. కానీ, అది మన ఉనికిని మనం గుర్తించటం మాత్రమే. ఈ అనంతవిశ్వంలో మనం ఎక్కడ వున్నామో, ఎప్పుడు వున్నామో గుర్తించగలగటం, గుర్తుచేసుకోవటం మాత్రమే.

ఈ ఉనికిలో రెండు అంశాలుంటాయి. ఒకటి ప్రాదేశికమైన ఉనికి. రెండవది కాలానికి సంబంధించినది. ప్రదేశానికి సంబంధించిన ఉనికి పదార్థం యొక్క మూడు డైమన్షన్లకు (పొడవు, వెడల్పు, లోతు/ఎత్తు) సంబంధించినది. పదార్థం నిలపటానికి కొంత స్థలం (ప్రదేశం) అవసరం. ఒక మనిషి నిలవటానికి అవసరమైన ప్రదేశం ఈ అనంత విశ్వంలో ఎంత ? కాబట్టి మనిషి చుట్టూ అసలు ఊహకు కూడా అందనంత విశ్వముంది. మనిషి ఉనికి పరమాణువంత కూడా కాదు. కాబట్టి చుట్టూ బాగావుండి మనమే బాధపడుతున్నామని కుమిలి పోవటం, చుట్టూ బాధలు, బడుద్దాయిలూ వున్నా మనం గొప్పగా సుఖపడుతున్నామని ఎగిరిపడటం రెండూ అవివేకమే.

పదార్థం ఉనికిలో మరో అంశం కాలం. ఇది వాస్తవానికి నాలుగవ డైమన్షన్. అయితే దానిని గుర్తించటానికి కానీ, దానిలో ముందు వెనుకలకు మన ఉనికిని త్రిప్పటానికి కానీ మనకింకా చేతకాలేదు. మన పరిశోధనలు ఆ

విషయంలో ఏపాటీ ముందుకు పోలేదు. కాబట్టి వర్తమాన మొక్కటే మనకు తెలిసిన ఆ నాలుగవ డైమన్షన్, ఆ డైమన్షన్లో మనం ఎక్కడో ఒకచోటనుండి ప్రయాణం ప్రారంభించి మరో బిందువు వరకు ముందుకు మాత్రమే పోగలగటం జీవితం. ఆ ప్రదేశం అనంతం అయినట్లు కాలం కూడా అనంతం. ఆ అనంతకాలంలో మన జీవితకాలం ఊహకందనంత చిన్నది. దానికి ముందు, దానికి వెనుక ఎన్నో జరగబోతాయి. ఎన్నెన్నో జరిగాయి. జరిగిన దేదీ మరో మారు ఉనికిలోనికి రాలేదు. జరగబోయేది ఎంత గింజుకున్నా ముందుగానే జరగదు. కాబట్టి ఏ క్షణం విలువ ఆ క్షణానిదే. ఏ జీవితం విలువ ఆ జీవితానిదే.

కాబట్టి దేని కదిగా ప్రతిజీవితం విలువైనదే. సాపేక్షంగా ఇతర జీవితాలతో పోలిస్తే ఎవరి జీవితమూ గొప్పది కాదు, ఎవరి జీవితమూ తక్కువా కాదు.

ఈ సత్యాన్ని కూడా గ్రహించగలిగితే నిరాశానిస్పృహలతో హత్యలూ, ఆత్మహత్యలూ వగైరా పనులకు సిద్ధపడటం వుండదు. ఆలోచించండి. జీవితం విలువైనది. (ఏప్రియల్, 1998)

## వరం - శాపం

కోసల దేశానికి రాజధాని అయోధ్య. దానికి రాజు దశరథుడు. కుమారులు లేరన్నది ఒక్కటే ఆయనకున్న చింత. లక్ష్యాన్ని చూడకపోయినా వినికిడితోనే కొట్టగల విలుకాడు దశరథుడు. దానితోనే పొరపాటు జరిగింది. మునికుమారుడు దశరథుడి బాణానికి బలి అయ్యాడు. "నాలాగానే పుత్రశోకంతో మరణిస్తా" వని ఆ తండ్రి శపించాడు. దశరథుడు పరమానందాన్ని పొందాడు. పుత్రులులేని తాను పుత్రశోకంతో మరణించాలంటే పుత్రులు పుట్టకతప్పదు గదా! మహర్షి మాట వ్యర్థం కాదు గదా? శాపం వరంగా మారిపోయింది.

మరో మహారాజు. ఆయనకు డబ్బు పిచ్చి ఎక్కువ. ఏ వస్తువులో అయినా కనకమహాలక్ష్మినే అతడు చూడగలిగేది. ఏ దేవతో ప్రత్యక్షమైతే "తాను ముట్టిందల్లా బంగారం కావా" లని వర మడిగాడు. 'తథాస్తు' అన్న దామె. అంతే

ఎగిరి గంతేసిన ఆ రాజుకు, అన్నపానీయాలే కాదు, తాను ముద్దుగా ఎత్తుకున్న కన్నబిడ్డ కూడా బంగారంగా మారిపోయింది. ఉలుకూ పలుకూ లేకుండా పోయింది. కోరుకున్న వరం శాపంగా పరిణమించింది. మరలా వరాన్ని ఉపసంహరించుకోక తప్పని పరిస్థితి ఏర్పడింది.

ఇలా ప్రతియుగంలోనూ వరాలూ, శాపాలూ మనలను పరిహసిస్తూనే వుంటాయి. మేధావుల బుద్ధి వికసించిన ప్రతిసారీ ఒక్కోవరం మనకు సంక్రమిస్తోంది. వరాన్ని అనుభంలోకి తెచ్చుకుని ఆనందించేలోపుగానే అవి శాపాలై, శూలాలై బాధిస్తున్నాయి. ఆ కోవకు చెందిన మరో వరం - మరో శాపం - దూరదర్శనం.

మన కళ్ళకు కాళ్ళకు అందనంత దూరంలోని సన్నివేశాలను కళ్ళారా చూడగలగటం ఎంత గొప్పవరం. జీవితాంతమూ మరువలేని మధుర సంఘటనలను పదే పదే చూడగలిగేటట్లు భద్రపరచుకోగలగటం ఎంత గొప్ప అవకాశం. మరో మండలానికి వెళ్ళిన మన రాకేష్ శర్మ మన ప్రధానితో మాట్లాడుతుంటే మనింట్లోనే కూర్చొని ఆ సన్నివేశాన్ని చూడగలగటం ఎంత విచిత్రానుభూతి.

పోయింది. ఆ వరప్రభావం చచ్చిపోయింది. ఇప్పుడది ఎలా వదిలించుకోవాలన్న శాపంగా మారే పరిస్థితి వచ్చేసింది. పగలూ, రాత్రి, పిల్లలూ, పెద్దలూ అందరూ కళ్ళప్పగించి 'చిత్ర' హింసలకు స్వాగతం పలకటం, శారీరకంగా కూడా ఆరోగ్యవంతులు కాలేని జాతిని తయారుచేస్తోంది. ఆ చిత్రహింస నచ్చక మరోవైపు వెళితే చట్టసభలూ, ముష్టిఘాతాలూ, సరదా చర్చలూ.

భగవాన్! విరక్తితో నా టీవి పెట్టెను నేను బ్రద్దలు కొట్టకుండా వుండే సహనాన్ని ప్రసాదించు తండ్రీ!

(మే, 1998)

# అమ్మా - అంబా

ప్రాణికోటిలో మనిషి అన్నింటికన్న తెలివైనవాడు. ఎందుకంటే పరిశోధనలూ, శాస్త్ర సాంకేతిక విషయాలూ అసాధారణస్థాయిలో ఊహకందనంతగా పెంచగలిగాడనీ, జీవితాన్ని సర్వసౌఖ్యమయంగా చేసుకోగలిగాడనీ కూడా కాదు. మిగిలిన ప్రాణిసమూహంచేత తన కవసరమైన పనులన్నీ చేయించుకోగలగటం అక్కడ కారణం.

మనిషి ఎంత తెలివైనవాడని మన మనుకున్నా మనకు లేని కొన్ని ఉత్తమ లక్షణాలు, శారీరికశక్తులూ జంతుజాలానికీ, పక్షిలోకానికీ వున్నాయి. ఆ విషయాన్ని గుర్తించగలిగారు కాబట్టి అలనాటి మానవులు ఆ జంతుజాలాన్నీ, ఆ పక్షి సంతానాన్ని ఉపయోగించుకొని తమ పనులు చేయించుకొనేవారు.

కాలక్రమంగా మానవుల స్థాయి పెరిగింది. క్రొత్తగా ఉపయోగ పెట్టుకొనగల జంతువులు కనిపించలేదు. కాబట్టి సాటి మనుషులనే ఉపయోగించుకొని తాను ముందుకు పోవటానికి నిర్ణయించుకొని, ఆ విధానానికి అలవాటుపడ్డాడు. అంతవరకు మనిషి కూడా సాటిమనిషిని ఒక జంతువుగా భావించి ఉపయోగపెట్టుకొన్నాడు. ఆ తర్వాతదశ మరీ దయనీయంగా తయారైంది.

సాటి మనిషిని కాకుండా సాటిమనిషికి సంబంధించిన వాటిని - విజ్ఞానాన్నీ, వికాసాన్నీ, విజయాలనూ, వితరణనూ కూడా తనది చేసుకోవాలి అన్న దురాశాపాశంలో చిక్కుకొని జంతువులకన్న హీనమయిపోయారు. నిర్లజ్జగా తనది కాని దానిని తనదిగా ముద్ర వేసుకుంటూ విశ్వమంతా ఒకటే, అదంతా నాదే - అన్న వేదాంతవేత్తలూ, తయారయ్యారు. కాలం గడిచేకొద్దీ 'అమ్మా' అనే వాళ్ళకంటే 'అంబా' అనే వాళ్ళ సంఖ్య పెరిగిపోతుందేమో! అందరూ జాగ్రత్తపడండి. 'అమ్మా' అనే అనగలగాలనీ, ఆ స్వరంతోపాటు ఆ భావంలోని త్యాగగుణాన్నీ కూడా అలవాటు చేసుకోవాలని ప్రయత్నించండి.

(జూన్, 1998)

# సుఖ దుఃఖాలు

ప్రతి ప్రాణికి వుండే ప్రాథమికమైన ఆశ తాను సుఖంగా వుండటం, తనకు ఎట్టి పరిస్థితులలోను ఇష్టం లేనిది దుఃఖపడటం. అయితే, ఎవరి జీవితంలో అయినా సుఖదుఃఖాలు స్థిరంగా నిలిచి వుండేవి కావు, సుఖం తర్వాత దుఃఖం, దుఃఖం తర్వాత సుఖం, మరలా దుఃఖం. మరలా సుఖం- ఇలా చక్రభ్రమణం లాగా అవి తిరుగుతూనే వుంటాయి. ఆ రెండింటి మధ్య ఉండే వ్యవధానం ఒక్కొక్కసారి ఏ కొందరి జీవితాలలోనే ఎక్కువగా ఉంటుంది. రెండు దుఃఖాల మధ్య వ్యవధి ఎక్కువగా వున్నప్పుడు తానే అదృష్టవంతుడై బాగా సుఖంగా వున్నట్లు ఆ జీవి కనిపిస్తుంది. రెండు సుఖాల మధ్య వ్యవధానం పెరిగినపుడు తనకన్న దురదృష్టవంతుడు, దుఃఖభాగుడులేడని క్రుంగిపోవటం కనిపిస్తుంది.

ఇదిగో ఈ సందర్భంలో మనిషికి వాస్తవికదృష్టి అవసరమవుతుంది. అది లోపిస్తే ఈ రెండు సందర్భాలలోనూ మనిషి పతనమయ్యే అవకాశం కనిపిస్తుంది. తాను సుఖంగా వుండటానికి తానొక్కడే కారణమన్న అహంకారం సుఖంగా వుండేవాణ్ణి పతనం చేస్తుంది. తాను దుఃఖాన్ని పొందటానికి ప్రపంచమంతా కారణం అన్న భావం దుఃఖభాగుణ్ణి పతనం చేస్తుంది. యథార్థానికి ఒకడు సుఖంగా బ్రతకటానికి మరెందరి సహకారమో - ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ వుంటుంది. ఒకడు దుఃఖంగా బ్రతకటానికి ఒకవేళ చుట్టూ ఉన్న వారంతా కారణమైనా, అతను కూడా కారణం కాకపోడు. ఈ రెండింటినీ గుర్తించి, గ్రహించి, మనిషి ప్రవర్తించవలసి ఉంటుంది. ప్రశాంతంగా జీవించవలసి ఉంటుంది.

సుఖదుఃఖాలు అన్నవి అందరి ప్రమేయంతో, ప్రసక్తితో, జోక్యంతో ఏర్పడే రెండు అవస్థలు. లాటరీ ముల్లు ఎక్కడ ఆగితే వాడిని అదృష్టమో, దురదృష్టమో ఆవహించినట్లు సుఖదుఃఖాల అవస్థలు ఎప్పుడో, ఎక్కడో ఫలరూపాన్ని పొంది ఆగుతాయి. ఎవరి దగ్గర ఆగితే వారు ఆ ఫలితాలను అనుభవిస్తారు. కాబట్టి సుఖదుఃఖాలను కాక వాటి ఫలితాలను మాత్రమే ఉదాసీనంగా ఉండి అనుభవించగలిగిన రోజు జీవితాలు ప్రశాంతంగా సాగిపోతాయి.

(ఆగష్టు, 1998)

# ఇంటిని దిద్దుకుందాం

'ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గాని కెక్కినట్లు' అని తెలుగులో ఒక సామెత. చిన్న పనులు చేయటంకూడా చేతకానివారు గొప్పపనులు చేయటానికి ప్రయత్నిస్తుంటే - ఆ సందర్భంలో ఈ సామెతను వాడుతుంటాం. నిర్లక్ష్యం వలననో, చేతకానితనం వలననో చిన్న విషయాలను విడిచిపెట్టి, పెద్దవాటిపై దృష్టిపెట్టి, విఫలమవుతున్న వాళ్ళు చాలామంది కనిపిస్తారు. సమాజంలో గొప్ప వాళ్ళనిపించుకోవాలని తపనపడేవారూ, సమాజానికి గొప్పగా సేవచేయాలని ఆలోచించేవారూ, సమాజానికి హితబోధ చేయాలని తాపత్రయపడేవారూ, కొండంతగా ఆశయాలున్నా కూడా వీటికన్నింటికీ మూలమైన ఇంటిని నిర్లక్ష్యం చేసి ఇబ్బందులకు గురి అవుతున్నవారు, ఇబ్బందులకు గురిచేస్తున్నవారు సంఘంలో ఎక్కువ.

సర్వప్రాణులతో కూడిన ఈ విశాల విశ్వంలో ప్రాణిజీవితాలకు ప్రత్యేకించి - మానవ జీవితాలకు కేంద్రస్థానం ఇల్లు. ఆ ఇంటిని చక్కదిద్దుకుంటే సమాజం చాలావరకు తనంతట తానే చక్కబడుతుంది. కానీ లోపమంతా అక్కడే జరుగుతోంది. సామాజిక జీవులుగా బ్రతకాలని తాపత్రయపడేవారిలో చాలామంది. ఇంటిని దిద్దుకోవటంలో విఫలమవుతున్నారు. తమ నిర్లక్ష్యఫలితాలను అనుభవించమని సంఘానికి వదిలివేస్తున్నారు.

ఇల్లు అంటే మూడు అంశాలు ప్రధానంగా ఉంటాయి. ఇల్లు, ఇంటిచుట్టూ పరిసరాలు ఒకటి. ఇంటిలో మనుష్యులు, వ్యక్తిత్వవికాసం, వారి మధ్య అవగాహన రెండవ అంశం. పరిసర వ్యక్తులతో పరిచయాలు, సుహృద్భావం మూడవ అంశం. ఈ మూడు కోణాలలోనుండి విజయవంతంగా జీవితాలను గడుపుతున్న వారి సంఖ్య అత్యల్పం.

ఇంటిని ఇంటి పరిసరాలను శుభ్రంగా ఉంచుకోవటం శారీరిక, మానసిక ఆరోగ్యాలకు మూలకారణ మవుతుంది. ఎంతో ఉండటం, ఎన్నో ఉండటం ముఖ్యం కాదు. ఉన్న స్థలాన్ని, ఉన్నవాటిని అందంగా, ఉపయోగకరంగా వినియోగించుకోవటం ముఖ్యం. అపుడు శరీరం బాగుపడి మనస్సుపై ప్రభావం

చూపుతుంది. మనస్సు మలినం కాకుంటే కుటుంబ సభ్యుల మధ్య అవగాహన, ఆప్యాయతలు నిలిచి, ఆహ్లాదకర వాతావరణం ఏర్పడుతుంది.

ఒక కుటుంబం ఒకే బాటగా, ఒకే మాటగా, ఒకే ప్రాణంగా బ్రతకగలిగితే ఆ ఇంటి ప్రభావం పరిసరాలపై, పరిసరాలలోని వ్యక్తులపై, ఇళ్ళపై పడుతుంది. ఇంటికీ, ఇంటికీ మధ్య స్నేహం సేతువు అవుతుంది. మనిషికీ, మనిషికీ మధ్య భేదాలు సన్నగిల్లి విశ్వాత్మ ఏర్పడుతుంది. అప్పుడే మానవసమాజం మాధవమందిరంగా పరిఢవిల్లుతుంది. అందుకే ముందుగా అందరం ఇంటిని దిద్దుకుందాం.

(సెప్టెంబర్, 1998)

## ఆగి, ఆలోచించండి

మనిషి మెదడు చాలా పదునయినది. చాలా చిన్న పదార్థంగా కనిపిస్తున్నా అనంతవిశ్వాన్ని అందులో ఇముడ్చుకొనగల శక్తి దానికున్నది. దానికున్నశక్తిలో వాస్తవానికి మనిషి ఉపయోగపెట్టుకొనగలిగింది చాలా తక్కువ భాగాన్నే. అయితే ఆ తక్కువభాగమే కార్యకాలంలో స్వయంసంపూర్ణం.

చూడగానే రూపాన్ని, వినగానే శబ్దాన్ని ఆలోచనమాత్రంచేత యెక్కడో, ఎప్పుడో జరిగిపోయిన విషయాలను కంప్యూటర్ కన్నా వేగంతో గుర్తించగల స్థాయి మెదడుకుంది. అంత హఠాత్తుగా, అంత వేగంగా గ్రహించగల శక్తి మెదడుకున్నా, ఆచరణ విషయంలో మాత్రం అంత వేగం మంచిది కాదని పెద్దల భావం. అందుకే అనేక సందర్భాలలో ఆగి, ఆలోచించమని చెప్తుంటారు. నిలిచి నిదానంగా పోవటం నడకలోని మలుపులలో ఎంత అవసరమో, జీవితం మలుపులు తిరిగే దశలో ఆగి, ఆలోచించటం అంతే అవసరం.

భారతంలో చిరకారి అని ఒక మహర్షి కుమారుడు. ఏ పని అయినా ఆలస్యంగా ఆలోచించిచేయటం అతని అలవాటు. అందుకే అతని పేరు చిరకారి.

ఒకసారి అతని తండ్రి తన భార్యశీలాన్ని శంకించి ఆమెను వధింపుమని చిరకారిని ఆజ్ఞాపిస్తాడు. ఆజ్ఞాపించి తాను అరణ్యంలోనికి వెళ్తాడు పనిమీద.

అప్పుడు చిరకారి. ఎంతో ఆలోచిస్తాడు. తల్లిదండ్రుల స్థాయిలను పరామర్శిస్తాడు. ఇద్దరూ ప్రతి జీవితానికి తప్పనిసరి అని నిర్ణయించుకొంటాడు. తల్లినే ఒక పిసరు ఎక్కువగా భావిస్తాడు. ఈ ఆలోచనల పరంపరతోనే తండ్రి వచ్చేదాకా కూడా సమయం గడుస్తుంది.

తండ్రి కుమారుని ఆజ్ఞాపించి వెళ్ళిన తరువాత కొంతసేపటికి అతనిలో పరివర్తన కలుగుతుంది. తన పొరపాటును తెలిసికొని చిరకారి తన అలవాటు ప్రకారం ఇప్పుడు కూడా ఆలస్యం చేస్తే ఎంత బావుంటుందో అని ఆశపడతాడు. ఆశ్రమానికి తిరిగివస్తాడు.

వచ్చిన తన తండ్రి పాదములపయ పడ్తాడు చిరకారి. మాటను పాటించనందుకు మన్నింపుమని. అతని తండ్రి పరమానందపడతాడు. అప్పుడు వాస్తవాన్ని గ్రహించి ఇలా అంటాడు.

ప్రేమించటం, పొగరుపడటం, అభిమానించటం, ఇతరులకు ద్రోహం చేయటం, పాపకృత్యాలు, అప్రియకార్యాలు చేయటంలో ఆలస్యమే సత్ఫలితాల నిస్తుంది - అందుకే ఆగి ఆలోచించండి.

(అక్టోబరు, 1998)

# పట్టు పురుగులు

పట్టు చీరెలు, పట్టు పంచెలు, పట్టు కండువాలు మనల్ని ఎంతగా ఆకర్షిస్తాయో, మన మనస్సులను ఎంతగా రెచ్చగొడతాయో మనకు తెలుసు. శుభకార్యాలకే కాక, పవిత్రకార్యాలకు సైతం ఉపయోగపడటం పట్టుకు ఉన్న గొప్ప పట్టు. కారణ మేమిటో స్పష్టంగా ఎవ్వరూ వివరింపలేరు కానీ, మడిబట్టలుగా కూడా పట్టుబట్టలు ఉపయోగపడటం చాలా విశేషం. పట్టుచీర అరువిచ్చి పీట పట్టుకొని తిరిగిందన్న ఒక్క సామెత చాలు, పట్టుకు ఉన్న విలువను నిరూపించటానికి.

అయితే ఆ పట్టు ఎలా తయారవుతోంది? ఇది అందరికీ తెలిసిన విషయమే. పట్టు పురుగులనుండి పట్టు తయారువుతుంది. గ్రుడ్లదశనుండి చాలా జాగ్రత్తగా కాపాడుకుంటూ, పిల్లల దశనుండి ఎంతో ప్రేమగా ఆహారాన్ని అందిస్తూ, మనం పట్టు పురుగులను పెంచుతాం. అవి పాపం మన ప్రేమంతా నిజమని నమ్మి ఉల్లాసంగా, హుషారుగా జీవిస్తూ తమ ఒళ్ళంతా పట్టుదారం చేసికొని బ్రతుకుతాయి. ఇక చాలు అని మనకు అనిపించినపుడు ఆ పురుగులను చంపి - పాపము నశించుగాక పట్టు దారాన్ని తీసుకొని మన ముచ్చట కొద్దీ వేసుకొని ప్రేమగా, పవిత్రంగా ఆ బట్టలను దాచుకుంటాం. పాపం తాను కూడబెట్టిన పట్టు తన ప్రాణాలమీదకు తెస్తుందని దానికి తెలీదు. అల్పప్రాణి గదా!

అయితే మనుషులం మనం మహాప్రాణులం. విజ్ఞానులం. విశ్వవిజేతలం. ప్రకృతి శక్తులన్నీ తమంత తాముగా వచ్చి దాసోహమని మనముందు నిలుస్తున్నాయి. వినాశానికి, ఉత్పత్తికి మధ్య దూరం కానీ, కాలం కానీ చాలా స్వల్పమనీ, క్షణాల వ్యవధిలోనే వాటిని చెరిపివేయవచ్చుననీ నిక్కచ్చిగా గ్రహించగల వాళ్ళం.

అయినా మనమూ కూడబెడుతున్నాం. జీవితాంతమూ అనుభవమూ లేక, సద్వినియోగమూ లేక కూడబెట్టడంతోనే తృప్తిపడి - ఈ మాట తప్పుకావచ్చు. - బ్రతికేస్తునాం. ఆ కూడబెట్టటానికి అడ్డమైన దారులూ అన్వేషిస్తున్నాం. నక్కలాగా జిత్తులు వేస్తున్నాం. గాడిదలాగా చాకిరి చేస్తున్నాం. కుక్కలాగా కాపలా కాస్తున్నాం. అయినా ప్రయోజనం లేదు. చివరకు పట్టు పురుగులా కూడబెట్టడం ద్వారానే సర్వస్వాన్ని కోల్పోవచ్చు. కాదంటారా? (నవంబర్, 1998)

## సంఘ జీవనం

మనిషి సంఘజీవి. అనేక శాస్త్రపరిశోధనలకు ఈ అంశం మూలకారణమై కనిపిస్తుంది. సంఘజీవనం అంటే కలిసిబ్రతకటం అని మామూలుగా చెప్పుకుంటాం. కానీ, వాస్తవానికి కలిసి బ్రతకటమనటం కన్నా ఒకరిపై మరొకరు ఆధారపడి బ్రతకటం సంఘజీవితంలో ప్రధానాంశమై కనిపిస్తుంది.

సంఘంలో ఆర్థికంగా ఒక గొప్ప స్థాయికి వచ్చినవాళ్ళు, మరే ఇతర కారణాల వలనయినా గొప్పవాళ్ళు, లేదా గొప్పవాళ్ళుగా భావించుకునేవాళ్ళు ఈ సాంఘిక జీవన విధానాన్ని అప్పుడప్పుడు లేదా చాలామార్లు అపార్థం చేసుకుంటుంటారు. పైపెచ్చు అదే అసలయిన అర్థమని నిర్ణయిస్తుంటారు.

పరస్పరం ఆధారపడటం తప్పనప్పుడు, పరస్పర సహకారం తప్పని పరిస్థితి అవుతోంది. కాబట్టి ఎంతటివాడైనా ఎందరి సహకారమో లేనిదే ముద్ద మింగే పరిస్థితి లేదు, రాదు. ఆ సహకారం లభించే మోతాదును బట్టి అనుభవించే సౌకర్యం సాంద్ర మవుతుంటుంది.

అయితే ఈ సహకారం విషయంలోనే అపార్థాలను అరికట్టవలసి వుంది. ఇతరులు మనకు సహకరించుటలో రెండు అంశాలు కనిపిస్తాయి. ఒకటి సహకారాన్ని పొందేవాడి స్థాయి, రెండు సహకారాన్ని అందించేవాడి స్థాయి. చాలా మంది సహకారాన్ని పొందేవాడి గొప్పతనాన్నిబట్టి - అది ఆర్థికమైనదైనా కావచ్చు, అధికారానికి సంబంధించినదైనా కావచ్చు, అచ్చంగా అహంకారానికి సంబంధించినదైనా కావచ్చు - సహకారం లభిస్తోందని భ్రమపడుతుంటారు. అది భ్రమ మాత్రమే అని పదే పదే నిరూపణ అవుతున్నా ఒకరు కాకపోతే మరొకరైనా తమ మంచితనాన్ని బట్టి సహకరిస్తుంటారు. కాబట్టి అదంతా తమ గొప్పతనమే అనుకోవటం కనిపిస్తుంది.

వాస్తవానికి సహకార సిద్ధాంతంతో సహకరించే వ్యక్తి మంచితనం, గొప్పతనం, విశాల దృక్పథం, మానవతా దృష్టి సహకారానికి ప్రేరకాలవుతాయి. కానీ, సహకారాన్ని పొందేవారి డాంబికాలు కావు. అహంకారంతో కన్ను మూసుకొనిపోయి కన్నూ, మిన్నూ కనిపించనివారిని వదిలేద్దాం, కాలమే వారికి సమాధానమిస్తుంది. మామూలు మనుష్యుల స్థాయిలో మనమంతా గుర్తుంచుకుందాం. ఇతరులు మనకు సహకరిస్తున్నారంటే అది వారి మంచితనమే కానీ మన గొప్పతనం కాదు. చెట్టు నీడనిచ్చినా, ఏరు నీటినిచ్చినా, పుడమి పంటనిచ్చినా అది వాటి స్వభావమైన సహకారభావంవల్లనే కానీ, ఈ మానవ పిపీలికల మగతనంవల్ల మాత్రం కాదు.. (డిశంబర్, 1998)

# రెండింతల ప్రజాస్వామ్యం

ప్రజలు ఆటవికజీవితంనుండి సామాజిక జీవితానికి, ఒకవేళ అరణ్యాలలో వున్నా సమభావంతో జీవించటానికి అలవాటుపడిన వాటినుండి వ్యక్తిగతమయిన సమస్యలు, పరిష్కారాలు, బాధ్యతలు, అధికారాలతోపాటు సామాజికాలైన బరువు బాధ్యతలు, పదవులు, అధికారాలు కూడా ప్రారంభమయినాయి. అందరి తరపున వ్యవహరించటానికి అందరికి ప్రతినిధిగా ఒకరిని నిర్ణయించుకొనేవారు. సామాజిక బాధ్యతను ఎవరో ఒక వ్యక్తి మాత్రమే చేసినా, లేదా అన్ని పనులనూ అందరూ చేయాలన్నా కూడా సమస్యే కాబట్టి నిర్దిష్టంగా ఒక వ్యక్తిని ఏర్పరచుకొని పనులు నిర్వహించే బాధ్యత అప్పగించారు. ఆ వ్యక్తినే నాయకుడన్నారు, రాజన్నారు, దొర అన్నారు, జమీందార్ అన్నారు. ఇంకా మరేవేవో పేర్లతో పిలిచారు.

బాధ్యతను అధికారంగా, పనిని పదవిగా ఆలోచించటం ప్రారంభమైన తర్వాత ఆ అధికారం, ఆ పదవి, ఆ హోదా ఎవరికో ఒక్కరికే ఆనువంశికంగానో, కండబలం ద్వారానో దక్కటమేమిటని దుగ్ధ కలిగింది. దాని ఫలితంగా మందిలోని ఎవడికైనా ఆ పదవి దక్కవచ్చని సిద్ధాంతీకరించుకొనే పరిస్థితి వచ్చింది. దానినే ప్రజాస్వామ్యమన్నాం. ఏ ఒక్కరూ తమ తమ పనులు మానుకొని అందరి పనులు చేయలేరు కాబట్టి అందరి తరపున ఎవరో ఒకరిని ప్రతినిధిగా ఎన్నుకుందామనుకున్నాం. వాళ్లనే ప్రజాప్రతినిధులన్నాం. వారు చక్కగా పని చేయటానికి వీలుగా వారి సంఖ్యను మోతాదు మించి ఏర్పాటు చేసుకొన్నాం. ప్రజాస్వామ్యవాదులంతా ప్రజలందరూ అన్నింటికి అధికారులనీ, ప్రజలసుఖమే ప్రపంచ సుఖమని అన్నారు. కాబోలనుకున్నాం. ప్రభుత్వసుఖం ప్రజల సుఖం కాదా? అన్నారు. ఎందుకు కాదు అని సరిపెట్టుకున్నాం. ప్రభుత్వ బాధలు ప్రజల బాధలు కావా? అని కొంత కాలానికి అన్నారు. దేశభక్తిగల పౌరులుగా అవునన్నాం. 'మీ బాధలు మీరే తీర్చుకోండి' అని చివరగా అన్నారు. దిమ్మెరపోయి అప్పుడు - ఇప్పుడు - తలెత్తుతున్నాం. ప్రజాప్రతినిధులను ఎన్నుకోవటం ప్రజాస్వామ్యంలోని మొదటి హక్కు అయితే ప్రజల పనులు ప్రజలే చేసుకోవటం రెండవ హక్కు అంటున్నారు. నిజం, ప్రజలే అదృష్టవంతులు. హక్కులు రెట్టింపు అయ్యాయి.

(1999- జనవరి)

# మతమా? ధర్మమా?

మనదేశంలో ప్రస్తుత ప్రధాన సమస్య మతాలకు, మతాభిమానాలకు, మత దురభిమానాలకు, మత విదేష్వాలకు, మత విధ్వంసాలకు సంబంధించినది. మతప్రమేయం అవసరం లేదంటూనే అన్ని రాజకీయపక్షాలూ మతంతో దోబూచులాడటం ఆ సమస్యను మరింత జటిలం చేస్తోంది. రాజకీయ పక్షాలన్నీ రాజ్యాంగం మేరకే చిత్తశుద్ధితో ఆలోచిస్తే, తదనుగుణంగా ప్రవర్తిస్తే అసలు సమస్య లేదు. ఒకవేళ పొడసూపినా దానిని పరిష్కంచటం అసాధ్యం కాదు. సమస్యకు మొత్తానికి కేంద్రబిందువు ఒక్కటే - మతానికీ, రాజకీయానికీ ముడిపెట్టడం. దానిలో రెండు పద్ధతులు - కొందరు అనుకూల ధోరణిలో, మరికొందరు వ్యతిరేక ధోరణిలో. ఇద్దరి లక్ష్యం రాజకీయంగా ప్రయోజనం. ప్రయోజనం అంటే స్వప్రయోజనం, ప్రజాప్రయోజనం కాదు. స్వప్రయోజనం అంటే అధికారప్రాప్తి మాత్రమే, మరేదీ సరిపోదు. ఇది అందరికీ, రాజకీయ పక్షాలకు కూడా తెలిసిన సత్యం. కాకపోతే, తాను తప్ప ఇతరులందరూ అధికారం కోసమే, తాను మాత్రం ప్రజలకోసం అని అందరూ మభ్యపెడుతుంటారు. మనల్ని నమ్మమంటారు. మనం మాత్రం తక్కువ తిన్నామా? అందరినీ ఈసడిస్తూనే ఉంటాం. మన పనులకు అవసరమయినప్పుడు వాళ్ళ చుట్టూనే తిరుగుతాం. ఇంద్రుడైనా, చంద్రుడైనా తానే అంటాం.

ఇదొక విషవలయం, కంటకనిలయం, అయోమయాలకు ఆలయం కూడా. కాకపోతే వర్షానికై వరుణదేవుని పూజలు చేసినవారే సరస్వతీ వందనాన్ని వ్యతిరేకించగలరా? అది మతతత్త్వమని. మన పేర్లు, మన తీరులు, మన కార్యక్రమాలూ, ప్రారంభోత్సవాలూ, పూర్ణకుంభ స్వాగతాలూ, కొబ్బరికాయల మ్రోతలు, శంఖుస్థాపనలు, అక్కడ వల్లించే మంత్రాలూ, నిర్వహిస్తున్న దేవాదాయ ధర్మాదాయశాఖలూ, అక్కడి ఉత్సవాలకు అధికారికంగా పర్యటనలు, శేషవస్త్ర స్వీకారాలూ, ఇవన్నీ మత ప్రమేయం లేనివేనా?

అంటే మన స్థితి ఎటువంటిదో తెలుస్తోంది. ఏది మతమో, ఏది మతం కాదో, ఏది ఎంతవరకు మతమో, ఆ మతంలో మన ప్రమేయం ఎంతవరకో

ఎవ్వరికీ తెలియని రాజకీయ వాతావరణంలో వున్నాం. ఎమ్మెల్యేలు మొదలు రాష్ట్రపతి వరకు అందరూ ఇఫ్తార్ విందులు ఇస్తూనే ఉన్నారు. వీటిలో చాలా అధికారిక కార్యక్రమాలే. కార్తికమాసంలో ఏ నాయకుడూ రాత్రిపూట విందులు ఇచ్చినట్లు ఇంతవరకు మనం వినలేదు. అలా అని వారికి ఒక మతం మీద ద్వేషం అనలేము. శ్రీరామనవములకు, శివరాత్రులకు, ఉగాదినాడు ప్రభుత్వపక్షాన జరుగుతున్న హంగామా తక్కువేమీ కాదు. క్రిస్మస్‌ను అసలు ప్రత్యేకంగా గుర్తించి క్రిస్మస్ విరామాలే ఇస్తున్నాం. మతాన్నీ, ప్రభుత్వాన్నీ, రాజకీయాన్నీ, వేరు చేసిచూడటానికీ, ప్రవర్తించటానికి మనకింకా సరియైన 'క్లూ' దొరకలేదనటానికి ఇదంతా ఉదాహరణమే.

దీనికి కారణాలు రెండు. అనాదిగా మన రక్తంలో జీర్ణించుకొనిపోయిన భావాలు, వాటినిబట్టి ఏర్పడిన ఆచారాలు, సంప్రదాయాలూ ఒక కారణం. దీనినే ధర్మమంటాం. దానిని మతంగా భావించి ఆ పేరు చెప్పి ఇతరులు ముందుకు దూసుకుపోతారేమో, లాభపడతారేమో అన్న భయం రెండవ కారణం.

మొదటిది ధర్మం. అది ఒక జాతికి, ఒక ప్రాంతానికి, ఒక కాలానికి పరిమితమైనా విశ్వమంతా వ్యాపించగల తత్త్వం. అందుకే ఈనాడు మనమనకునే విభిన్న మతాలలోనూ, ప్రబోధనలలోనూ సమానత్వమే ఉంటుంది. మౌలికములయిన విలువలలో అన్ని మతాలు ఒకటే చెపుతాయి. విశ్వమానవ సౌభ్రాత్రం వాటిలోని అంతస్సూత్రం.

అయితే ఆయా దేశకాలాలనుబట్టి ఆచారవ్యవహారాలు మారుతూ, చేరుతూ, వెనక్కు పోతూవుంటాయి. వాటికెవరో ఒకరు మూలపురుషు డంటారు. అక్కడనుండీ మతాలు ప్రారంభమవుతాయి. భూమికి ఆకర్షణశక్తి వున్నదని న్యూటన్ చెప్పకముందు కూడా పండు క్రిందనే పడేది కదా? కాబట్టి పండు క్రింద పడటం ధర్మం. న్యూటన్ దాన్ని గ్రహించి చెప్పినవాడే కానీ ఆ ధర్మాన్ని కల్పించిన వాడు కాదు.

ఈ సత్యాలను గ్రహించి మతాన్ని, ధర్మాన్ని వేరుచేసిచూచి, మతాన్ని రాజకీయ లాభాలను విడదీసి ఆచరించి, మతాభిమానాన్ని, మతదురభిమానాన్నీ విశ్లేషించుకొని నాయకులు ప్రవర్తిస్తే ఈ దేశంలో మతం సమస్య కాదు. ధర్మం విచ్ఛిన్నం కాలేదు. నిత్య జీవితంలో, సమాజంలో అన్ని మతాలవారూ కలిసే జీవిస్తున్నారు. కలిసి ప్రశాంతంగా జీవించాలనే ఆశిస్తున్నారు. రాజకీయనాయకులు, మతనాయకులు ఈ విషయాన్ని ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది. అయితే ప్రజల అనుమానం వారి కావిషయం తెలియదని కాదు. వాళ్ళ లాభాలను వదులుకోలేకపోతున్నారని.

(ఫిబ్రవరి, 1999)

# కాలం మారిందా?

'కాలం మారింది, మనుషులు మారాలి', 'కాలంతోపాటు మనమూ మారాలి', 'కాలమెప్పుడూ ఒకేరీతిగా వుండదు' - వగైరా మాటలు మనం రోజూ వింటుంటాం. పాపం నోరూ, వాయీ లేనిది కాబట్టి ఆ కాలం మన ఆరోపణలన్నీ భరిస్తుంది. మనలో వచ్చే మార్పులన్నీ కాలంమీదికి నెట్టివేసి మనం విధేయులమన్నట్లు ప్రవర్తిస్తుంటాం.

వాస్తవానికి కాలానికి ఉనికి వుంది. రూపం లేదు. ఆ ఉనికి కూడా సాపేక్షమయినదే. ప్రకృతి, మానవునిస్థితి దాని రూపం. వీటిద్వారా కాలమంటూ ఒకటుందని ఊహిస్తున్నాం. కానీ నిజానికి అదంటూ వుందో లేదో? ఎత్తును కొలుస్తున్నాం. పొడుగు కొలుస్తున్నాం. వెడల్పు కొలుస్తున్నాం - కానీ, ఇటువంటి కొలతలకు వేటికీ అందకుండా మరేదో వుండి తీరాలని మనలో వచ్చే మార్పులనుబట్టి ఊహిస్తున్నాం. ఆ ఊహలనే గట్టిగా, పకడ్బందీగా నిర్ణయించి దానికొక కొలత తయారుచేశాం. కాలమానం తయారయింది. కాబట్టి మారేది మనం, కాలం కాదు.

మరి కాలం మారిందనటం అవాస్తవమా? ఆలోచించాలి. కాలానికి తొలి ప్రమాణాలు సూర్యచంద్రులు. వాటిలో ఏ మార్పు లేదు. రెండో ప్రమాణం ఋతువులు, ధర్మాలు. ఋతువులు అటు ఇటు కొంచెం జరిగినట్లనిపించవచ్చును కానీ, ఋతుధర్మాలు మారలేదు. మామిడికాయలు వేసవిలోనే వస్తున్నాయ్. సొరకాయలు మంచు పడితేనే కాస్తున్నాయ్. అంటే మారింది కాలం కాదు. మనుషులు.

పోనీ, ఇంకో రకంగా చూద్దాం. ఈ కాలాన్ని మహర్షులు నాలుగు యుగాలుగా విభజించారు. కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలని. ధర్మాసక్తి కృతయుగ లక్షణం. ధర్మాశ్రితత్వం త్రేతాయుగ లక్షణం. అధర్మవైముఖ్యం ద్వాపర లక్షణం. అధర్మాసక్తి కలియుగ లక్షణం. అంటే 'కాలం మారింది. మనుషులు మారాలి' - అని త్రికరణశుద్ధిగ నమ్మితే అందరూ ఆధర్మంవైపు పరుగులు తీయవలసిందేనా! అసలు అలా పరుగులు తీయకపోతే వాడు యుగలక్షణాలకు ద్రోహం చేసినట్లవుతుంది గదా! ఇప్పుడు ఆలోచిద్దాం. కాలంతోపాటు మనమూ మారాలా? ఇంతవరకు మారి నీతికి, అవినీతికి తేడా తెలియక ముష్టిబ్రతుకులు బ్రతకటం చాలలేదా? జేజెమ్మలలాగానో- మన లెక్కలో వాజమ్మలలాగానో పద్ధతి ప్రకారం బ్రతుకుతున్న ఆ ఒకరిద్దరిని కూడా బురదలోకి ఈడిస్తేనే కానీ మనకు తృప్తిలేదా?

కాలంతోపాటు మారటం అన్న ఆత్మవంచనా రూపమైన సిద్ధాంతాన్ని ఒక్కక్షణం ప్రక్కన బెట్టి ఆలోచించండి. కాలానికి ఎదురీది మనుషులను మార్చిన వాళ్ళకే చరిత్రలో స్థానం కానీ, కాలంతోపాటు కొట్టుకుపోయినవాళ్ళ అవశేషాలు దొరకటం కూడ కష్టమే. ఎదురీత చేతకాకపోతే, ధైర్యం లేకపోతే ఇబ్బంది లేదు. కానీ కొట్టుకొని పోవడమే నాగరికత అనీ, సంస్కారం అనీ, అది అనివార్యమని ప్రచారాలు మాత్రం చేయకండి. అందరినీ అటు వైపులాగి జాతిని అనామికను చేయకండి.

(1999 - మార్చి)

# పువ్వు పుట్టగానే పరిమళించదా?

తెలుగునేలలో పుట్టి తెలుగు మాట్లాడుతూ పెరిగిన ఎవరికైనా పరిచయమైన సామెత పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నది. వాస్తవానికి పరిమళం కోసం పువ్వుపూచేవరకు ఎదురుచూచినా మొక్క మొలవగానే ఆ లక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. కనిపించటమే గాదు. ఆ లక్షణాలు మరెప్పుడూ మారవు. ఆ చెట్టు కాలగర్భంలో కలిసిపోయేదాకా అలాగే ఉంటాయి. ఒకవేళ సాంకర్యాది గుణాల వలన కొన్ని అదనపు లక్షణాలు వచ్చి చేరవచ్చును. కానీ మౌలిక లక్షణాలు నశింపవు. మనుషులను గూర్చి మాట్లాడుకునే సందర్భంలోనే ఈ సామెతను మనం వాడుతుంటాం. కాబట్టి ఇది మానవనైజాన్ని గురించి చెప్పుకునే సామెతయే.

కానీ, లోకంలో సంఘటనలను, సన్నివేశాలను కొన్ని ప్రత్యేక మనస్తత్త్వాలను పరిశీలిస్తుంటే ఈ సామెత అబద్ధమేమో అనిపిస్తుంది. రాజకీయాల్లో గాని, మైత్రీబంధాల విషయంలో గానీ, సామాజికజీవితంలో గానీ ఒకప్పుడు ఆత్మీయతా బంధాలు, మరొకప్పుడు ఆవేశకావేశాలు కనిపిస్తుంటాయ్. నిన్నటిదాకా భుజంమీద ఎక్కించుకొని మోసిన వ్యక్తిని నేడు పరమ పాపిష్టిమనిషని ఈసడించ గలుగుతున్నాం. నిన్నటిదాకా 'బ్రదర్' అని పిలిచినవాడిని ఈ రోజు 'బాస్టర్డ్' అని నిందించగలుగుతున్నాం. నిన్నటి దేవుడు నేడు దెయ్యం, నేటి మహాత్ముడు రేపటికి మామూలు ఆత్ముడు.

ఇప్పుడు ఆలోచిద్దాం. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందా? అదే నిజమైతే నిన్నటి లక్షణాలు నేటికి వెగటు పుట్టించటానికి కారణమేమిటి? అవి నిన్న కనిపించలేదా? పువ్వు పుట్టికూడా పరిమళించలేదా? ప్రకృతి ధర్మంలో వెలితి ఏర్పడుతోందా?

లేదు, పువ్వు పుట్టగానే పరిమళించటమూ సత్యమే. తొలి పరిచయంలోనే మనిషి స్వరూప స్వభావాలు వ్యక్తం కావటమూ సత్యమే. అవగాహనలోని లోపంవలన అక్కడ కూడా వాటిని వెంటనే గ్రహించలేకపోయినా ఎక్కువశాతం గ్రహిస్తూనే వుంటాం. అయితే ఈ తారుమారు పరిస్థితికి కారణం?

తొలిదశలో ఆ పరిమళమే మన ప్రయోజనాలకు ఉపయోగపడుతుందన్న ఆశ, ఉపయోగపడాలన్న ఆరాటం మనలో వుండి ఆ వ్యక్తిని దేవుణ్ణి చేస్తాం. ఉపయోగపడని నమ్మకం కలిగినా, ఉపయోగించుకొనే అవసరం లేకపోయినా దేవుణ్ణి దెయ్యం చేస్తాం. మహాత్ముణ్ణి మామూలాత్ముడిని చేస్తాం. మరో మహాత్ముని అన్వేషించటం ఆరంభిస్తాం..

అంతే కానీ పువ్వూ, నవ్వూ రెండు తొలి దశలోనే లక్షణాలు తెలుపుతూనే వుంటాయ్. (ఏప్రిల్, 1999)

## నింగికి నిచ్చెనలు

ఒక చెట్టును మొలిపించాలంటే కనీసం ఒక గింజ మన దగ్గరుండాలి. ఒక రూక దానం చేయాలంటే కనీసం ఆ ఒక్క రూక మన దగ్గరుండాలి. ఎత్తుగా వున్న దేన్నయినా అందుకోవాలంటే అంత ఎత్తు లేకపోయినా కనీసం చేతులు పైకి లేపగల శక్తి అయినా వుండాలి. ఇదంతా అసాధారణమైన విషయమేమీ కాదు. జీవితాన్ని జీవించటం చేతనైన ప్రతివారికీ ఈ విషయం అనుభవంలో వున్నదే. జీవితాన్ని కొన్ని నిర్దిష్టమైన విలువలతో గడపదలచిన ప్రతి మనిషికి అర్థమయినదే.

అయితే వర్తమానంలో నింగికి నిచ్చెనలు వేయాలని ప్రయత్నిస్తున్న అంగుష్ఠమాత్రుల సంఖ్య అధికమయిపోతోంది. అదీ ప్రత్యేకించి కవులు, రచయితలు, ప్రవక్తలూ, ప్రబోధకుల విషయంలో. ఆధ్యాత్మిక తత్త్వవేత్తలయినా, ఆధిభౌతికతత్త్వవేత్తలయినా ఈ విషయంలో మినహాయింపు లేదు.

తాము పెంచదలచుకున్న జ్ఞానవృక్షాలకు, నీతిమహీరుహాలకు తమ దగ్గర ఒక గింజకాదు గదా, కనీసం దాని వాసన కూడా కనిపించదు. అయినా సరే శూన్యంలో ఆ చెట్టును మొలిపించి, అందంగా రెమ్మలు కొమ్మలూ పొదిగి, మనలను పరవశులను చేస్తారు. కాకపోతే అంతే చమత్కారంగా ఆ ఫలాలను సొంతం చేసుకుంటారు. ఈ నేపథ్యంలో గింజ లేకపోవటం వాస్తవం. చెట్టు అసత్యం. కొమ్మలు రెమ్మలు అసత్యం. పూత అసత్యం. ఫలాలు మాత్రం సత్యం.

వాటిని గింజకూడా లేని ఆ ప్రబోధకుడు, ఆ ప్రవక్త, ఆ తత్త్వవేత్త, ఆ కవి, ఆ రచయిత అనుభవించటం మాత్రం సత్యం.

ఈ మాటను మనం మర్యాదగా ప్రస్తావించినా వారు కోపంతో చిందులు వేయటం, ప్రపంచంలో ఎవడు మంచివాడో చెప్పమని ఛాలెంజ్ చేయటం, ఎవ్వరినీ మిగల్చకుండా అందరినీ చెడ్డవారిని చేసే ప్రయత్నం చేయటం సత్యం.

నిజమే, ప్రపంచమంతా చెడిపోయిందని మాటవరసకు అంగీకరిద్దాం. అయినా సరే ప్రబోధకుల స్థానంలోని వారు చెడకూడదు. ప్రయాణికులు ఎంత అల్లరి చిల్లరిగా వున్నా బస్సు నడిపే డ్రైవరు క్రమశిక్షణతో ఉండాలి. అల్లరే కావాలనుకుంటే ఆ స్థానాన్ని విడిచిపెట్టాలి.

కానీ, మన ప్రబోధకులకు డ్రైవర్ సీటూ కావాలి, అల్లరిచిల్లరిలో అందరిలాగానే వుండాలి అని కోరిక. అందుకే ఆధారం లేకపోయినా నింగికి నిచ్చెనలు వేస్తున్నారు. అయితే వారెక్కటం లేదు. మనలను ఎక్కించి, పండ్లు కోయించి, సత్కారాల పేరుతో సొంతం చేసుకొనిపోతున్నారు. మనమేం చేయగలం? వారు మహాత్ములు. మనం మామూలు ఆత్ములం.

(మే, 1999)

# సుస్థిర ప్రభుత్వం

ప్రస్తుతం దేశవ్యాప్తంగా చర్చనీయమైన విషయం సుస్థిర ప్రభుత్వాలను స్థాపించుకోవటం. కేంద్రంలో ప్రభుత్వం స్థిరంగా వుండవలసిన అవసరాన్ని రాజకీయ పార్టీలు, మేధావులు నొక్కి నొక్కి వక్కాణిస్తున్నారు. ప్రజలు కూడా అదే ధోరణిలో ఆలోచించి సాధకబాధకాలను చర్చిస్తున్నారు.

అయితే వాస్తవానికి మనకు కావలసింది సుస్థిర ప్రభుత్వముండటమా? సుస్థిర పరిపాలనను అందించటమా? ప్రభుత్వకర్తవ్యం పరిపాలన కాబట్టి సుస్థిర ప్రభుత్వముంటే సుస్థిరపాలన వున్నట్లే అని మనకనిపించవచ్చు. కానీ, అది ఎంతవరకు వాస్తవమన్నది మనం ఆలోచించాలి.

ప్రభుత్వపరిపాలన - అది ఏ స్థాయి ప్రభుత్వమయినా సరే - ప్రజల జీవన స్థితిగతులను బట్టి సఫలమో విఫలమో తేలుతుంది. ప్రజలజీవన విధానం ఒడిదుడుకులకు లోనుగాకుండా వుండటమే సుస్థిరపరిపాలన. ఆ స్థితిని కల్పించగల ప్రభుత్వమే సుస్థిర ప్రభుత్వం.

శాసనసభలోనో, పార్లమెంటులోనో ఒక ప్రభుత్వానికి తిరుగులేని మెజారిటీ వుండవచ్చు. ఆ నాయకత్వం ఎదురులేనిది కావచ్చు. అంతమాత్రం చేత ఆ ప్రభుత్వం ప్రజల జీవన విధానాన్ని ఒడిదుడుకులు లేకుండా నియంత్రించగలుగుతోంది అని అనలేము. ఆ స్థాయిలో వున్న ఎన్నో ప్రభుత్వాలు వివిధ స్థాయిలలో విఫలమైన అంశం మనకు ప్రత్యక్షసత్యం. కీలకమైన అన్ని రంగాలలో ఆ ప్రభుత్వాలు విఫలమై, వైఫల్యాన్ని అంగీకరించలేక కప్పిపుచ్చుకునే ప్రయత్నాలు విరివిగా చేయటం మన అనుభవంలో ఉన్నదే.

మెజారిటీ లేకపోయినా ఒడిదుడుకులు లేని ప్రజాజీవితాన్ని అందించ గల ప్రభుత్వాలను కూడా చూచాం, చూస్తున్నాం.

కాబట్టి సుస్థిరత్వం అన్నది ఆయా పాలకులు లేదా పార్టీల నిబద్ధతకు, నిస్వార్థ భావానికి, నిజాయితీకి సంబంధించిన అంశం. అది పాలనలో ప్రతిబింబించాలి గానీ ప్రభుత్వ స్థితిలో గాదు. విదేశీ వ్యవహారాల విషయంలో అయినాసరే సుస్థిర పరిపాలనవుంటే సుస్థిర ప్రభుత్వమున్నట్లే లెక్క. ఇతర దేశాలు ఆక్షేపించలేవు, అహంకరించలేవు కూడా.

అందువలన ప్రజలు ఆ కోణంలో ఆలోచించి ప్రతినిధులను ఎన్నుకోండి. రాజ్యాంగ నిబద్ధత, ప్రజా సంక్షేమ దృష్టి, విశేషించి ప్రజల దైనందిన జీవితాలతో దాగుడుమూతలాడుకునే లక్షణాలు లేకపోవటం - ఇవి ప్రధానంగా కన్పించే పాలకులను ఎన్నుకుందాం. అప్పుడు ప్రభుత్వం అదే స్థిరంగా వుంటుంది. దానికోసం మనం ఆలోచించి, ఆందోళన చెందనవసరం లేదు.

(జూన్, 1999)

# జై జవాన్

ప్రస్తుతం భారత్ - పాకిస్థాన్ల మధ్య యుద్ధం కాని యుద్ధం జరుగుతోంది. ఈ రెండు దేశాలకు సంబంధించిన ప్రధాన వ్యక్తు లెవ్వరూ దీన్ని యుద్ధమని వ్యవహరించటం లేదు. పైపెచ్చు యుద్ధం వచ్చే అవకాశాలు లేవని ఖచ్చితంగా చెప్తున్నారు. దాయాదుల మధ్య యుద్ధం లేదు, రాదు అంటే అందరూ ఆనందించవలసిన అంశమే. అయితే యిది యుద్ధం కాకపోయినా పర్యవసానాలు మాత్రం యుద్ధానికి తీసిపోయేవి కావు. పరస్పరం కాల్పులు, సైనికుల వీరమరణాలు, నిర్దిష్ట ప్రదేశాల స్వాధీనాలు, దేశభక్తిని ప్రేరేపించే ప్రకటనలు, ప్రసంగాలు, పాటలూ, కవితలూ అన్నీ మామూలుగానే కొనసాగుతున్నాయి. ఇది సైనికుల మధ్య సంఘర్షణమే కాని ప్రజలదాకా ప్రాకలేదని, ప్రజాజీవనాన్ని స్తంభింపజేసే కార్యక్రమాలు, దాడులు జరగటంలేదని అన్నందువల్ల యుద్ధం కాదని అంటే కొంతవరకు అంగీకరిద్దాం. కానీ, ఈ విషయాన్ని అంగీకరించవలసింది మనం కాదు. సరిహద్దు ప్రదేశాల్లో నివసిస్తున్న ప్రజలు. ఆ విషయాన్ని అటుంచుదాం.

ప్రతికూల పరిస్థితులలో సైతం మాతృభూమికై ఆత్మబలిదానం చేస్తూ, రక్తతర్పణాలు చేస్తూన్న వీరకిశోరాల త్యాగాలను ఎంత ప్రస్తుతించినా కొంచెమే అవుతుంది. ఎంత కన్నీరు కార్చినా అది అల్పమే అవుతుంది. కన్నబిడ్డలను, కట్టుకున్న వారిని కోల్పోయి కించిత్తుకూడా కలతపడకుండా అవసరమైతే తాముకూడా యుద్ధానికి సిద్ధమంటున్న తల్లిదండ్రులను, ఇల్లాండ్రను చూస్తుంటే మనసు మంచు ముక్కవుతుంది. ఓదార్చడానికి వెళ్ళినవారికి వారే ఊరడింపు మాటలకు బదులు వీరోచిత ప్రోత్సాహాన్ని ఇవ్వటం ఈ పరంపరలో పతాకాయమాన మవుతుంది. జై జవాన్.

అంతా బాగానే వుంది. ఒకవైపు ప్రాణంకన్న దేశం మిన్న అని జీవితాలను బలిదానం చేస్తున్న వీర సైనికులను ప్రశంసిస్తూనే, ఊరడిస్తూ ప్రసంగిస్తూనే, మనం మన వ్యవహారాలను యథాతథంగా కొనసాగించగలగటం కాలం నేర్పిన అల్లరి అవుతుందేమో. ఒక్క దేశ సంరక్షణ అన్న విషయంలో తప్ప నేను పొరపాటు

పడుతున్నానేమో - మరే విషయంలోనూ మన రాజకీయ నాయకులు వారి రాజకీయాల శైలిలో మార్పు చూపించటం లేదు. వాళ్ళ పదవీ వ్యామోహంపై పట్టు సడలించటం లేదు. ఉద్యోగులకు సైతం దండుకున్న లంచాలలో కొంత భాగాన్ని దేశరక్షణ కోసం త్యాగంచేసి దేశభక్తిని చాటుకోవటమే తప్ప ఆ వీర సైనికుల్లాగే మనంకూడా వృత్తికి అంకితమై నిజాయితీగా ప్రవర్తించుదామన్న దృష్టిలేదు.

ఏతావతా తేలుతున్న దేమిటంటే, యుద్ధం లేదా యుద్ధవాతావరణం ఆర్థికవ్యవస్థపైన ప్రభావాన్ని చూపగల్గుతోంది. మీడియామీద ప్రభావాన్ని చూపగల్గుతోంది. ప్రజలలో ఆ ఒక్క విషయంలో మాత్రమే స్పందనను కలిగించగలుగుతోంది. అంతేకానీ, ప్రజల వృత్తులు, ప్రవృత్తుల విషయానికొస్తే మాత్రం మనకు కనిపించేది శూన్యం. వాళ్ళ పనులు వాళ్ళు సరిహద్దుల్లో చేసుకుపోతుంటే మన పనులు "ఎప్పటిలాగే" చేసుకుంటూపోతున్నాం. ఎవరి దారి వారిది, ఎవరి అవసరం వారిది.

(జూలై, 1999)

# మనం మారమా?

మానవజాతి వయస్సు కోట్లసంవత్సరాలు వుంటుంది. ఆయుష్షు మరెన్ని కోట్ల సంవత్సరాలు వుంటుందో ఊహకందదు. సంప్రదాయబద్ధమైన లెక్కల ప్రకారం యుగాలు, ప్రళయాలవంటి పదాలను పరిశీలించినా ఈ ప్రవాహం అనంతం, అవిచ్ఛిన్నం అని అర్థమవుతూనే వుంటుంది.

ఇంత వయస్సున్న ఈ మానవుడికి ఇంతవరకు బుద్ధి కుదరకపోవటం ఆశ్చర్యాన్నే కాకుండా ఆందోళనను కూడా కల్గిస్తోంది. ఎదిగే పిల్లలను సైతం వయస్సుతో ముడిపెట్టి బుద్ధిహీనతను ఎత్తిచూపించే మానవుడు తానింకా బుద్ధితెచ్చుకోలేదని, తెచ్చుకునే ప్రయత్నం కూడా చేయటంలేదని ఎందుకు గుర్తించడో అర్థం కాదు.

అయితే, ఈ బుద్ధిలేకపోవటంలో మరో అంశాన్ని ప్రత్యేకించి గుర్తించాలి. స్వలాభ విషయంలో ఎవరి బుద్ధి అయినా సంపూర్ణశక్తితో పనిచేస్తూనే వుంది. కాని, మానవుడు ఒక్కడైనా మానవత్వం ఒక జాతి అని, దానికోసం పాటుపడ టంలో వ్యక్తి వికాసం కూడా ఇమిడి వుంటుందని మాత్రం గ్రహించటం లేదు.

ఈ విషయంలో ఎవ్వరికి మినహాయింపు అవసరం లేదు. పాలకులు - పాలితులు, పండితులు - పామరులు, బలవంతులు - బలహీనులు అందరూ ఈ విషయంలో సమాన భాగస్వాములే. వ్యాసుడు ధర్మాలు ప్రబోధించినా, మహాత్ములు అంతర్మథనఫలంగా సూక్తులు అందించినా, కవులు ఎన్ని సుభాషితాలు వ్రాసినా, ఏ విధమైన ప్రయోజనం కనిపించక పోవటం విశేషం. అవన్నీ బలహీనుల కంటి తుడుపుకోసం వ్రాసిన వ్రాతలేమో అనిపిస్తే అది తప్పు కాదేమో!

ధర్మరాజు యక్షుడికి చెప్పిన సమాధానాలలో స్పష్టంగా చెప్పాడు. ఈ విశాలవిశ్వంలో తన ఉనికి అత్యల్పమనీ, క్షణికమనీ తెలిసికూడా శాశ్వత మన్నట్లుగా మనిషి ప్రవర్తించటం గొప్ప వింత అని తేల్చాడు, నిజమే. అయితే దాని నొక వింతగానే భావించి ఏ మేధావీ మౌనంగా కూర్చొనలేదు. ఆ వింతతత్త్వంనుండి మనిషిని బయటపడవేసే ప్రయత్నం చాలానే చేశారు. కానీ ఆ మేధావుల ప్రవర్తన కూడా ప్రశ్నార్థకం కావటం నిరాశకు మూలకారణం, జాతి పతనానికి పరాకాష్ఠ.

అందరూ అందరినీ మోసం చేసుకుంటూ మానవుడి వయస్సుకే సిగ్గు చేటుగా మారుతున్న మనం చేయవలసిందీ, చేయగలిగింది ఏమీ లేదా? ఎన్నిసార్లు చెప్పినా ఒక్కటే సమాధానం. మార్పు మననుండి ప్రారంభం కావాలి మార్పు కోరుతుంటే. లేదా కాలగర్భంలో కలిసిపోవాలి కథామాత్రంగా కూడా మిగలకుండా. ఈ రెండింటిలో ఏ మార్గాన్ని ఎన్నుకుంటామో ఆలోచించండి. అంతే కానీ, 'నలుగురితో నారాయణా' అంటూ మనం కూడా మరో సమిధవేయటం ధర్మం కాదుగదా!

(ఆగష్టు, 1999)

# ప్రజలకోసం ప్రాణాలు

ఎన్నికల పండగల గురించి మనం మాట్లాడుకొని ఎంతో కాలం కాలేదు. మళ్ళీ మరో అవకాశం, మళ్ళీ ఈ జాతికి ప్రసవవేదన, పుట్టబోయే వికృత శిశువుకోసం అందరి ఆందోళన, నిరీక్షణ.

ఈసారి ఎన్నికల కలకలంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తున్న అంశాలు కొన్ని వున్నాయి. రోజురోజుకూ బలం పుంజుకొని జాతికి సవాలుగా నిలుస్తున్న సత్యాలవి. వాటిలో కొన్ని - మచ్చుకు - అందరికీ తెలిసిన విషయాలు ఎవ్వరికీ తెలియనట్లు అందరూ నటించగలగటం వాటిలో ఒకటి. హరిశ్చంద్రుడు పుట్టిన ఈ దేశంలో ఏ ఒక్కనాయకుడు నోటినుండి గూడా సత్యం బయట పడలేకపోవడం మరీ దారుణమైన రెండో విషయం. ఈ రెండు విషయాలలో ఢిల్లీ నాయకులనుండి గల్లీ నాయకుల వరకు ఎవ్వరికీ మినహాయింపు ఇవ్వవలసిన అవసరం లేకపోవటం విమర్శకులకు కొంత వెసులుబాటు. ఈ అవినీతి విన్యాసాలకు, అక్రమార్క వికారాలకు ప్రజలు కేంద్ర బిందువులు కావటం, పాపం ప్రజలకోసమే వాళ్ళు ఇవన్నీ చేస్తూండటం, చేయవలసి రావటం మరో విచిత్రమైన మలుపు.

పాతరోజుల్లో ప్రజలకు అవసరమైన సౌకర్యాలు కల్పించటం, దేశాన్ని దాని సరిహద్దులను కాపాడగలగటం, విదేశాలతో సత్సంబంధాలు నెలకొల్పు కొనగలగటం, సామాజిక న్యాయానికి భంగంలేకుండా చూడగలగటం ప్రధాన లక్ష్యాలుగా నాయకులు వ్యవహరించేవాళ్ళు. ఈ నాలుగు అంశాలలో కనీసం పదిశాతం సత్ఫలితాలు సాధించినా పరిపాలన అద్భుతంగా ఉందని మనం అభినందించవచ్చు.

కానీ, వర్తమానకాలంలో నాయకులకు కొన్ని రహస్యాలు తెలిసాయి. ప్రజలను పరిపాలించటం అంత తేలిక కాదు అన్నది వాటిలో ప్రధానమైన అంశం. అందుకే పరిపాలన సాగిస్తామనే వాళ్ళకంటే ప్రాణాలిస్తామనేవాళ్ళ సంఖ్య పెరిగిపోతోంది. ఏ నాయకుడిని కదిలించినా ప్రజలకోసం ప్రాణాలు ఇచ్చేవాడే. నిజంగా ఆ ప్రాణాలకే విలువవుంటే, పదవినో, అధికారాన్నో అంటిపెట్టుకునే

క్రమంలో అవి ఉపయోగపడతాయనుకుంటే వీళ్ళు ఆ ప్రాణాలను అంత తేలికగా ఇస్తారా? అందునా ఈ పిచ్చి ప్రజలకోసం,

కాబట్టి ప్రజలకు నాయకుల ప్రాణాలు అక్కర్లేదు. ప్రాణాలు తోడేయకుండా పనిచేయగల, చేయించగల నాయకులు కావాలి. ఆ విషయంలో నిర్లక్ష్యం చేస్తే మాత్రం అసలే పిచ్చి ప్రజలు, పిచ్చిలో ఏం చేసినా చేస్తారు.

(సెప్టెంబరు, 1999)

# మోహం - వ్యామోహం

మహాభారత యుద్ధరంగం సిద్ధమైంది. ఇక ముందు కురకడమే తరువాయి అనుకొంటున్న సందర్భంలో అర్జునుడు బెంబేలు పడిపోయాడు. శత్రుపక్షంలోని బంధువుల నందరినీ చూచి గాండీవాన్ని వదిలేశాడు. అర్జునుణ్ణి మళ్ళీ కర్తవ్యం వైపు నడిపించటానికి గీతోపదేశం చేశాడు కృష్ణుడు. అంతా విన్న తరువాత అర్జును డన్నమాట ఇది "నష్టోమోహః స్మృతిర్లబ్ధా"అని. నా మోహం నశించిందనే అర్జునుని ప్రకటన ఆలోచనలకు దారితీస్తుంది.

అర్జునుడికి శత్రుపక్షంలోని వారంతా - ప్రధానమైనవారు - బంధువులే. రకరకాల వరుసలవాళ్ళు. జన్మతః సంక్రమించిన ఆ బంధుభావం తప్ప మరో రీతిగ అర్జునుడికి వారితో అత్యంత సన్నిహిత సంబంధా లున్నట్లు ఎక్కడా దాఖలా లేదు. ఏ భీష్ముడిమీదనో, ద్రోణాచార్యులమీదనో, సంజయుడిమీదనో వున్న గౌరవం తప్ప ఇతరులతో మోహపడవలసినంత ఆత్మీయత లేదు అర్జునుడికి. అయినా ఉన్న ఆ కాస్తంత బంధుభావాన్ని తలంచుకున్నంతమాత్రం చేతనే మోహం ప్రకోపించి, కర్తవ్యాన్ని విస్మరింపజేసింది. పలాయనవాదాన్ని పఠింపజేసింది. ఏతావతా తేలిందేమిటంటే కర్తవ్యనిర్వహణలో మోహం అడ్డువస్తుంది. దాని బలం ఊహ కందనంత.

ఆ మోహం వ్యామోహమైతే మరీ బలం పుంజుకుంటుంది. మోహం కర్తవ్యంనుండి వెనక్కు తప్పిస్తే, వ్యామోహం ఆ కర్తవ్యంవైపు నడవమని కూడా ప్రోత్సహిస్తుంది. ధర్మాన్ని మరిపింపజేసేది మోహమైతే, అధర్మాన్ని కౌగిలించుకొమ్మని ప్రోత్సహించగలది వ్యామోహం. ధృతరాష్ట్రుడిలో ఈ లక్షణం పరాకాష్ఠకు చెంది కనిపిస్తుంది. పుత్ర వ్యామోహ మొక్కటే ధృతరాష్ట్రుణ్ణి సమూలకంగా నశింపజేసింది. ఆ విషయం ధృతరాష్ట్రుడికి కూడా తెలుసు. పదే పదే దానినుండి బయటపడాలని పై కంటాడు కూడా. కానీ, కడుపులో లేనిది కావిలించుకుంటే రాదు గదా!

అది ఆనాటి భారతం. నేటి భారతంలో ఈ మోహవ్యామోహాల పరిధి విస్తరించింది. దాదాపు అంటువ్యాధిలాగా అందరికీ సంక్రమించింది. కడుపు కూటికేడిస్తే, కొప్పు పూలకేడ్చినట్లు ఎవడి మోహం వాడిది. ఎవడి ఫలాపేక్ష వాడిది. అయితే ఇక్కడ గమనించవలసిన ప్రధానాంశమొకటుంది. నాటి భారతంలో పాలకుల గురించి మాటాడుకున్నాం కాబట్టి నేటి భారతంలో కూడా వాళ్ళను గురించి ముచ్చటించుకుందాం.

ఈనాటి మన పాలకులలో - అందరూ అనటమెందుకు కానీ - చాలామందిలో కర్తవ్యాన్ని విస్మరించగల్గినంత మోహం లేదు. అసలు కర్తవ్యదృష్టి వుంటే గదా! కర్తవ్యాన్ని విస్మరించే పరిస్థితి. కాబట్టి కర్తవ్యధ్యాసే లేకపోవటం మోహం నుండి బయటపడవేసింది. ఇక పుత్రవ్యామోహంతో ధృతరాష్ట్రుడు నాశనమయ్యాడు. ప్రస్తుతం ఆ వ్యామోహం కూడా లేదు. అంత ఆత్మనాశన పరిస్థితి వస్తే వ్యామోహాన్ని అయినా వదిలిపెట్టి తమ పదవులకోసమే అధికారాలకోసమే ప్రయత్నించే స్థితి నేడు. కాబట్టి వ్యామోహం కూడా లేదు.

ఆ విధంగా మనం ముందుకు పోతున్నాం. ఎంత గొప్ప మార్పు! ఈ మానవ ప్రయత్నానికి దైవసహకారం అవసరమంటారా?

(అక్టోబరు, 1999)

# ఉత్తిష్ఠత - జాగ్రత

విజ్ఞానం అనంతమైనది. అది అందరికీ తెలిసిన వాస్తవమే. అది ఏ కోణంలోనైనా ప్రసరించగలది. ఇది కూడా జగమెరిగిన సత్యమే. అది మనుష్యుల జీవన విధానాలను, లక్ష్యాలను, గమ్యాలను కూడా మార్చగలుగుతుంది. ఇది అందరూ ప్రత్యక్షంగా చూస్తున్న అంశమే.

ఒకప్పుడు భిన్నప్రాంతాలలోని వ్యక్తుల మధ్య కలయిక కానీ, మాటాడటం గానీ ఎప్పుడో, ఎప్పటికో అన్నట్లుండేది. ఇప్పుడదంతా క్షణాలమీద పని. కాశికిపోయినవాడు కాటికి పోయినవాడితో సమాన మొకప్పుడు. ఇప్పుడు కాటికి నడిచి వెళ్లేలోపు కాశీకి విమానంలో వెళ్ళిరావచ్చు. ఎంత మార్పు. ఈ మార్పు కంతటికీ మూలం యంత్రశక్తి.

ఒకనాడు ఇవి మంత్రతంత్రశక్తులు లేదా కనుకట్టు విద్యలు. ఇప్పుడవి ప్రత్యక్షంగా ఎవరైనా ప్రదర్శించగల యంత్రశక్తులు. యంత్రగమనానికి మూలం శక్తి. ఆ శక్తి విద్యుత్ కావచ్చు, మరేదైనా ఇంధనం కావచ్చు. ఏ ఇంధనం లేకుండా పనిచేసే యంత్రాలు లేవు. కొన్ని వున్నట్లనిపించినా వాటికి మానవుని చోదనశక్తి శక్తిగా పనిచేస్తుంది.

విద్యుత్తు వున్నా, మరే ఇంధనమయినా వున్నా యంత్రం తనంత తాను పనిచేయదు. రిమోట్ కంట్రోలు అనుకున్నా అది "రిమోట్ కంట్రోలు" ఉండటమే కానీ కంట్రోలు లేకపోవటం కాదు. కానీ, విచిత్ర, విశిష్ట, విలక్షణకార్యాలను చేసి చూపించగల యంత్రాలకు మానవశక్తి ప్రధానమైన ఇంధనం. కాబట్టి మానవుడు అనంతశక్తి సంపన్నుడు. యంత్రాలు కానీ, ఆ యంత్రాలను నడిపే వివిధ శక్తులు కానీ, ఆ మానవుని శక్తిలో నుండి పుట్టినవే.

అవసరపడినపుడు, యంత్రాలు పనిచేయకుండా మొరాయించినపుడు వెంటనే వాటిని బాగుచేసి మరల పనిచేయించటం మనకు తెలుసు. అక్కడ ఎంతో శ్రద్ధ చూపిస్తాం. కానీ, ప్రస్తుత సమస్య ఆ మానవుడు సరిగా పనిచేయకపోవటం.

మానవ యంత్రం మొరాయించి వుండటం. దానిని బాగుచేసుకునే ప్రయత్నం కానీ, శ్రద్ధ కానీ ఎవ్వరిలో కనిపించటం లేదు.

సంపదలు సృష్టించటం, సమానంగా పంచుకోవటం మానవయంత్రం చేయవలసిన రెండు పనులు. మొదటిపని సజావుగా సాగుతోంది కానీ, రెండవ భాగం పూర్తిగా చెడింది. అనాదిగా మహర్షులెందరో బాగుచేసే ప్రయత్నం చేస్తూనే వున్నారు. వారి వల్ల కాలేదు. వారు ఛాందసులు కాబట్టి వారిదారిలో అది కుదరలేదు. కానీ, నేడు మనం ప్రకృతిని శాసించే స్థాయికి చేరుకున్నా మనుకుంటున్నవాళ్ళం. మనం కూడా ఆ మానవయంత్రాన్ని సంపూర్ణంగా బాగుచేసుకునే ప్రయత్నం చేయకపోతే భవిష్యత్తరాలలో మానవశక్తీ వుండదు, మానవుడూ వుండడు. కేవలం పశుప్రవృత్తి మిగులుతుంది. (పశువులకు క్షమాపణలతో) ఉత్తిష్ఠత, జాగ్రత......

(నవంబరు, 1999)

## కథలను బ్రతికించుకుందాం

సూర్యుడస్తమించేదాకా ఆటల్తో అలసిపోయి, ఆరుబయట అన్నం తిని, దీపం బుడ్డీక్రింద పుస్తకాలు చదివి, ఓ కథ వినందే నిద్రపోని బాల్యానికి ఇప్పుడు వార్ధక్యం వచ్చేసింది. ఆ ఆటలు లేవు. ఆ అలసటలు లేవు. ఆరుబయట అన్నం తినే అదృష్టానికి నోచుకోలేదు. ఇక కథలదాకా ఆలోచించే అవకాశమే లేదు.

ఒక చిన్న కథ ఒక పసిమనస్సులో ఎంతో ఆలోచన రేపేది. ఎన్నో ఆశలు రేపేది. ఎన్ని జీవిత సత్యాలనో ముద్రించేది. ఉత్సుకతకు మారుపేరై ఉరకలు వేయించేది. ఎదుగుతున్న కొద్దీ చిన్ననాడు హత్తుకొని వున్న ఒక్కొక్క ఆలోచనా భవిష్యత్తుకు ఒక్కొక్క మెట్టుగా మారేది. మనస్సు దారితప్పుతున్నట్లు అనిపిస్తే ఒక కథ ఆసరాగా నిల్చి పట్టు కల్పించేది.

ఇప్పుడు ఆ కథలు లేవు. ఆ ఆలోచనలు లేవు. ఆ ఆశలూ లేవు. ఆ ఉత్సుకత్వమూ లేదు.

వినాలన్న కుతూహలం పసితనానికి సహజమైన గుణం. అదొక శ్వేత పత్రం (దివాలా తీస్తున్న ప్రభుత్వాలు సమర్పించే అంకెల గారడీ కాదు), అత్యంతం నిర్మలం. దానిమీద ఏ విలువలను పొదిగితే ఆ విలువలతోనే అది రాణిస్తుంది. విలువలను గురించి ఆలోచనలనైనా కలిగించగల్గితే ఆదరింపవలసిన విలువలను అదే నిర్ణయించుకుంటుంది. కానీ...........

చెప్పేవాళ్ళు లేక చెడిపోతున్నారు - అని తెలుగుసామెత ఇక్కడ అక్షరాలా వర్తిస్తుంది. కొన్ని సందర్భాల్లో చెప్పేవాళ్ళు చెడిపోతున్నారనో, చెడిపోయినవాళ్ళూ చెపుతున్నారనో అన్నా తప్పు లేదేమో! ఎలాగయినా సరే! చెప్పే బాధ్యతను మనం నిర్వహించగలిగితే విని ఆలోచించే స్థాయికి వాళ్ళే చేరుకుంటారు. కానీ -

మన మింకా చెప్పగల స్థాయికి చేరుకోలేదు. దానికోసం చేస్తున్న ప్రయత్నమూ లేదు.

అలనాటి బాల్యాన్ని గుర్తుచేసికొని అందరూ ఆనందిస్తున్నారు. అదే కావాలని కోరుకుంటున్నారు. ఆ రోజులే వేరు అని నిట్టూరుస్తున్నారు. కానీ, దాన్ని సాధించాలనే విషయంలో మాత్రం సాహసం చేయలేక పోతున్నారు. ఎక్కడి కక్కడ కాలంకన్నా ముందు పరుగెత్తాలనే తపనతో కొన్నింటిని జారవిడుచుకొంటున్నారు.

ఇప్పటికే మానవత్వం మోడయిపోయింది. దాన్ని కూడా తెగనరికే ప్రయత్నాన్ని పాలకులు చేస్తున్నారు. డబ్బు ఒక్కటే అన్నింటికీ లక్ష్యమని నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నారు. మన పతనాన్ని భావితరాలవాళ్ళు కథలు కథలుగా చెప్పుకోకముందే విలువలను కాపాడుకుందాం. దానికై పెద్దగా బాదరబందీ లేదు. శ్రమా లేదు. చిన్ననాటి కథలను బ్రతికించుకుందాం. వాలిపోయే మోళ్ళను అవే చిగురింపజేస్తాయ్........

(డిశంబరు 1999)

# భక్తి

నరజన్మకు పరమప్రయోజనం మోక్షసాధన ప్రయత్నం చేయటమని సనాతన భారతీయ విశ్వాసం. పురుషార్థాలలో పెద్ద పీట దానిదే. ఆ మోక్షసాధనకు అనేక మార్గాలను మహర్షులు బోధించారు. వ్యక్తి మానసికస్థాయిని బట్టి భక్తిజ్ఞానకర్మ యోగాలలో ఏదైనా మోక్షప్రదమయిన మార్గమన్నారు. వాటిలో కూడా అత్యంతమూ సులభమూ, విశిష్టమూ అయినది భక్తిమార్గమని ప్రవచించారు. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ" అని నొక్కి వక్కాణించారు. ఆ మార్గంలో ప్రయాణించి ఎందరో తరించి చూపారు.

ఆధునిక కాలంలో భక్తికి ఎన్నడూ లేనంత గిరాకీ ఏర్పడింది. భక్తి దినదిన ప్రవర్ధమానమవుతోంది. భక్తుల సంఖ్య ఏక్షణానికాక్షణం పెరుగుతోంది. నిత్యపూజల కన్న నైమిత్తికపూజలూ, వాటిని మించి కామ్యపూజలు ఊపందుకుంటున్నాయి. వ్రతాలు, దీక్షలూ, ఏ రోజు కారోజు పోటీపడి పల్లవిస్తున్నాయి. మందిరాలూ, దేవాలయాలు కట్టించే వారూ ఏయేటి కాయేడు ఎక్కువవుతున్నారు. ఇదంతా చూస్తుంటే మానవజాతికే నిత్యకళ్యాణం పచ్చతోరణమని పరమానందపడవలసిన పరిస్థితి. ఇంకా కొంచెం లోతుగా వెళ్ళి చూద్దాం.

డబ్బు మీద ఆశపెరిగే కొద్దీ భగవంతుడి మీద ప్రేమ పెరుగుతోంది. కోరికలు పెరిగే కొద్దీ భజనలు ఊపందుకుంటున్నాయి. అవినీతి, అక్రమార్జనా పెరుగుతున్న స్థాయిలో కళ్యాణకార్యక్రమాలు, ప్రసాదవినియోగాలు వృద్ధి పొందుతున్నాయి. డబ్బు రాలేదని కొందరు, వచ్చింది పోతుందని కొందరూ పోటీలుపడి ప్రదక్షిణలు చేస్తున్నారు. చివరకు గొప్పతనానికీ, మంచితనానికీ గుర్తు భక్తుడయివుండటమే అన్నంత స్థాయికి వచ్చేశాము. ఆ భ్రాంతిని పెంచి పోషించటానికి తలా ఒక చెయ్యి వేస్తున్నాము.

భక్తిని మోక్షసాధన మార్గమనుకున్నాం గదా! మోక్షం ముక్తి - అంటే వదిలించుకోవటం. అంటే భక్తి లక్ష్యం వదిలించుకోవటమే కానీ తగిలించుకోవడం కాదు. ఏం వదిలించుకోవాలంటే, అన్నీ అని ఒక్కటే సమాధానం. కానీ, ప్రస్తుతం

మన సమాజంలో భక్తి తగిలించుకొనేదే కానీ వదిలించుకొనేదిలా లేదే! ప్రపంచంలోనివన్నీ మనవి కావాలనే మనవి తప్ప మరేమాట మనం భగవంతుడితో మాటాడటం లేదే! భక్తికి వైశాల్యమే కానీ లోతులేకుండా పోతోందే! పరిమళభరితమైన పూలమొక్కలా వుండవలసిన అది ఒక పిచ్చిమొక్కలా, గుర్రపుడెక్కలా సమాజమంతా వ్యాపిస్తోంది. వెర్రితలలు వదిలించే భారాన్నైనా భగవంతుడికి వదిలేద్దాం. స్వామీ మమ్ములను క్షమించు. మేమేం చేస్తున్నామో. ఎందుకు చేస్తున్నామో మాకే తెలీదు.

(జనవరి, 2000)

# మనుష్య ఋణం

"ఋణానుబంధరూపేణ పశుపత్నీ సుతాలయాః" అని సనాతన ధర్మం విశ్వసిస్తోంది. పశువులయినా, ఆలుబిడ్డలయినా, ఇళ్ళూ-వాకిళ్ళూ అయినా ఋణానుబంధాన్ని బట్టియే. ఇది వ్యక్తి కర్మానుభవానికి సంబంధించిన విషయం. కానీ, ఒక వ్యవస్థకు ధర్మానుభవాన్ని, మార్గనిర్దేశాన్ని అందించినందుకు, మనం ఆ వ్యవస్థలో భాగస్వాముల మయినందుకు తీర్చుకొనవలసిన ఋణాలు చాలా వున్నాయి. అవి పితృఋణము, ఋషిఋణము, దైవఋణమూ, ఈ మూడు ఋణాలు మనకు మామూలుగా తెలిసిన విషయాలే.

వ్యాసమహర్షి మహాభారతంలో మరొక ఋణాన్ని గురించి ప్రధానంగా ప్రస్తావిస్తారు. అది మనుష్యఋణం. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు విశ్లేషించి, వివరించి, వినిపించిన మహర్షి, కపిలజడలు, కపిలకన్నులు, కపిలగడ్డంతో సంచరించే చాదస్తుడు - మనుష్యఋణం గురించి మాట్లాడటం ఆశ్చర్యమనిపించటం లేదూ? అణువణువునా పరమాత్మ వ్యాపించి వున్నాడని నొక్కివక్కాణించి మనలోని పరమాత్మాంశను ప్రధానంగా సంభావించిన మహర్షులు మనుషులకు ఋణపడివున్నామని అది తీర్చుకొనవలసిన అవసరముందని ప్రకటించటం విశేషం కాదూ?

అటువంటి మహర్షులను, వారి ఆలోచనలను పాత చింతకాయపచ్చడి అని కొట్టి పారేసే మనం మనుష్యఋణం తీర్చుకోవలసిన అవసరమున్న స్థాయికి ఎప్పుడు చేరుకోగలం. చేసిన అప్పులు ఎగవేసే అవకాశం కోసం ఎదురుచూచే మనం చేసినట్టు కళ్ళకు కనిపించని ఆ ఋణాన్ని గురించి ఎలా ఆలోచించగలం?

ఈనాటి మన నాగరికత వెనుక, సంస్కృతి వెనుక, సుఖమయ జీవితం వెనుక ఎందరి రక్తతర్పణాలు వున్నాయో ఎన్ని తరాలు, ఎన్ని జీవితాలు అంకితమయ్యాయో మనం చూడకపోవచ్చు. కానీ మనకు తెలియకపోలేదు. గతాన్ని వదిలేద్దాం. వర్తమానంలో అయినా పరస్పర సహకారం లేకుండా అడుగుకూడా ముందుకు వేయలేకపోవటం మనందరికీ తెలుసు. తెలిసికూడా ఎవరి అవసరమూ లేదన్నట్టు అహంకరించి ప్రవర్తిస్తా మెందుకో!

మనుష్యులకు ఋణపడి వుండటం వాస్తవ మయినప్పుడు ఋణం తీర్చుకునే మార్గం కూడా మనుష్యులతో సంబంధించినదే. మనష్యులకు తనవారికీ, తనసాటివారికి, తనతోటివారికి, తనకు ఏమీకానివారికి ఎవరికైనా సరే ఇబ్బందులు కల్గించకుండా, మానవజాతి సుఖసంతోషాలు అంతమయ్యే అవకాశం కల్పించకుండా జీవించగలిగితే మనుష్యఋణం తీర్చుకున్నట్లే. ఆ కోణంలో నుండే ఆలోచించే ప్రయత్నం చేద్దాం. (ఫిబ్రవరి, 2000)

# నాలుక నృత్యం

మనిషికి కళ్ళూ, చెవులు, ముక్కు, నాలుక, చర్మం - ఇవి జ్ఞానేంద్రియాలు. వీటిలో కళ్ళూ, చెవులు, ముక్కు జంటలు. చర్మం సర్వశరీరవ్యాపి. నాలుక మాత్రం ఒక్కటే. అది సర్వతోభద్రమైన స్థితిలో వుంటుంది.

పాపం చెవులకు ఏ రక్షణా లేదు. అందుకే ఎవరేం చెప్పినా చచ్చినట్టు వినవలసిన పరిస్థితి దానికి ఏర్పడింది. అదేదో లాభసాటిగా వుందని భావించి మనంకూడా వాటిని ప్రోత్సహిస్తున్నాం. కళ్ళకు రక్షణ వుంది. తమ కిష్టం లేకపోయినా, అలసిపోయినట్లనిపించినా కర్తవ్యాన్ని వీడి విశ్రాంతి తీసుకునే

అవకాశం వాటికుంది. ముక్కు ఒక కాలువ వంటిది. మరేదో తన పని తాను చేసుకుంటూ పోవటానికి అది ఉపయోగపడుతుంది. పని గట్టుకొని పని మానిపిస్తే తప్ప అది పనిమానే పరిస్థితి లేదు. చర్మానిది విశిష్టస్థితి. ఏదైనా తనకు తగిలితే తప్ప అది వుందో లేదో కూడా తెలియదు. వీటినన్నింటినీ మించి విలక్షణంగా కనిపించే ఇంద్రియం నాలుక.

ఈ నాలుకకు ప్రధానంగా రెండు కర్తవ్యాలున్నాయి. ఒకటి రుచి చూడగలగటం. శరీరానికి అవసరమైన ఆహారపదార్థాల మంచి చెడులను విశ్లేషించి, నిరూపించవలసిన బాధ్యత ఇది. ఇక రెండవది మనలోని ఆలోచనలను ఇతరులకు తెలియజేయటానికి అవసరమైన మాటలను పలికించటం.

ఈ రెండో కర్తవ్యం విషయంలో మనస్సుకు నాలుకకు ఎప్పుడో, ఎందుకో అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయి. వాటిజన్మకాలం మనకు తెలీదు కానీ వాటి అభివృద్ధిని ఈనాడు మనం కళ్ళారా చూడగలుగుతున్నాం. సామాన్య మానవుడి మొదలు సామ్రాజ్యా లేలేవాళ్ళదాకా, పాపం ఈ పరిస్థితికి తల్లడిల్లిపోతున్నారు. మనసులో ఏదో వుంటుంది. అది పైకి చెప్పాలని ఎంత గింజుకున్నా వీలు కావటం లేదు. నాలుక ఇంకేదో మాటాడుతుంది. పైపెచ్చు మనస్సును కూడా ముగ్గులోకి తానే లాగి, నా మనస్సులో అటువంటి ఆలోచన లేదని తానే అనిపిస్తుంది. పాపం మనస్సు ఏం చేస్తుంది. దానికి మాటలు రావు. మనస్సు చెట్లు కూలుస్తా మనుకుంటుంది. నాలుక మొక్కలు నాటుదా మంటుంది. మనస్సు పొట్టలోనికి ముడుచుకొని పోయి వుంటుంది. నాలుక పెట్టుబడులను ఉదారంగా అందిస్తుంటుంది. మనస్సు ఆకలితో అలమటించిపోతుంటే నాలుక పాడిపంటలు వృద్ధిని గూర్చి ప్రకటన లిస్తుంది.

ఎన్ని పోకడలు, ఎన్ని విన్యాసాలు, ఎన్ని నృత్యాలు ఈ నాలుక నేర్పింది. ఓ దేవా! ఈ నాలుక విన్యాసాలనుండి నన్నూ, నా పాలకులనూ కాపాడు. మా మనస్సు ఏం ఆలోచిస్తోందో మా నాలుకలకే కానీ మాకు తెలీదు.

(మార్చి, 2000)

# స్తవాలు - వాస్తవాలు

**ప్రియవాక్యప్రదానేన, సర్వే తుష్యంతి జన్తవః ।**
**తస్మాత్తదేవ వక్తవ్యం, వచనే కా దరిద్రతా ॥**

- అని లౌక్యం తెలిసిన ఒక సంస్కృత కవి నిర్ద్వంద్వంగా ప్రకటించారు. తమ కిష్టమైన మాటలు వింటే ఎవరైనా సంతోషిస్తారు. కాబట్టి మనం అటువంటి మాటలే మాటాడుకుందాం. మాటలకు దారిద్ర్యం లేదు గదా అని సారాంశం.

ఈ శ్లోకాన్ని చదివినా, చదవకున్నా ఈనాడు లోకంలో ఈ బాపతు జనాలనే చాలామందిని చూస్తున్నాం. వాళ్ళకు వాస్తవాలతో పనిలేదు. వాస్తవాలను తాము మరుగుపరుస్తున్నందువల్ల లేదా అవాస్తవాలను వాస్తవాలుగా చెలామణిలోకి తెచ్చి మనుష్యులను మభ్యపెడుతున్నందువల్ల జాతికి జరిగే నష్టాలతో వారికి సంబంధంలేదు. "నాలాభం నాది" అనే ఒక్క సూత్రమే వారిజీవితాలకు ఆలంబనం, వేదవచనం, బ్రహ్మపదార్థం కూడా.

అయితే ప్రజల్లో చిన్నా, చితకా రకానికి చెందినవారు ఇటువంటి జీవితసూత్రాలతో బ్రతికితే బ్రతకవచ్చు. అది వారి బలహీనత అనో, అదంతా మనుషులందరిలోనూ కనిపించే లక్షణమేలే అనో తృప్తిపడవచ్చు. వాళ్ళ జీవిత పరిధి, వాళ్ళు ప్రభావితం చేయగలిగిన సమాజం పరిధి చాలా చిన్నది కాబట్టి.

కానీ, ఈ మధ్య పెద్ద పెద్ద మనుషులలో సైతం ఇదే లక్షణం కనిపిస్తోంది. ప్రజానాయకులు, ప్రజాపాలకులూ కూడా ఈ సిద్ధాంతాన్ని దిక్సూచిగా భావిస్తున్నారు. కోట్లకొలది ప్రజల భవిష్యత్తు వారిచేతుల్లో వున్నదనీ, ప్రజలు వారిని విశ్వసించి ఆ కర్తవ్యాన్ని వారికి అప్పగించారని విస్మరిస్తున్నారు. పరస్పర స్తవాల మాటున వాస్తవాలను మరుగుపరిచి లేదా వక్రీకరించి, ప్రజలకు చూపెట్టి, పబ్బం గడుపుకోవాలని ఉబలాటపడుతున్నారు. ఇది జాతికి ఎంతో హానికరమైన అంశం.

అందరిలా తాము అనుకొనేవాడు కానీ, అందరికన్నా భిన్నంగా అందరికీ మార్గదర్శకుడుగా నిలువలేనివాడు కానీ, ఏ విధమైన సామాజిక బాధ్యతను

నిర్వర్తించటానికి అర్హుడు కాదు. కొడుకు పాల కేడ్చేటప్పుడు తండ్రి సీసాల కేడ్చేవాడయితే, తండ్రి అనే పదానికి అతనికి అర్హత లేనట్లే. ప్రజలు బ్రతుకు భారమై ఏడుస్తుంటే, పాలకుడు రాబడిమార్గాలకై ఏడుస్తుంటే అతనికి పాలకుడుగా నిలిచే అర్హత లేదు.

కానీ ఏం చేస్తాం. ఆ తానులో నుంచి చింపిన ముక్కలు ప్రజలు. ఆ నూలుతో నేసిన తానులు పాలకులు. వాస్తవం కాదంటారా? స్తవం చేయటం నాచేత కాదు మరి. (ఏప్రిల్, 2000)

# మనిషి మహోన్నతుడే

కాలం అనంతం. వ్యక్తిగతంగా చూస్తే ఎవరిమట్టుకు వారికి అది అనాది కూడా. మనం ఈ కాలచక్రంలోకి ప్రవేశించే ముందు ఎన్ని కోట్ల ప్రాణులు దానిలో పరిభ్రమించాయో, ఎన్ని పరిణామాలు జరిగాయో మనకు తెలియదు. భూమి విశాలమైంది. మనమున్నచోట మన ఉనికికి లెక్క తప్ప, కొంచెం కనుమరుగయ్యే దూరం వెళితే చాలు, మన ఉనికి కూడా సంశయాస్పదమే. అయినా సరే మనిషి తన ఉనికిని, దానికి ఆధారమైన ప్రదేశాన్ని సర్వస్వంగా భావిస్తూ తన పుట్టుకనే కాలానికి ప్రారంభబిందువుగా స్వీకరిస్తూ నడక సాగిస్తున్నాడు. తన మనసులోనుండి, తన దృక్కోణంలోనుండి సమస్త విశ్వాన్ని పరిశీలిస్తున్నాడు, పరవశిస్తున్నాడు, పరిణమింపజేస్తున్నాడు, పగలబడిపోతున్నాడు.

నిజమే. కానీ, ఈ విషయంలో మనిషి నిర్దోషి, మనకు ముందున్న కాలం ఎంతయినా ప్రాణులు లేకపోతే దానికి పరిగణనమే లేదు గదా! సూర్యచంద్రుల గమనాలవలన పగలు, రేయి ఏర్పడుతున్నా వాటిని లెక్కబెట్టి చెప్తున్నది మనిషే కదా! కాబట్టి మనిషి అంతకుముందే వున్న ప్రపంచంలోనికి తాను వచ్చినా తనతో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించే ప్రయత్నం చేస్తాడు. ఆ రీతిగా సాగిన అందరి ప్రయత్నాల సారమే మనకు ముందున్న కాలం. ఏ మనిషికి ఆ మనిషి స్వతంత్రంగా ఆలోచించి ప్రవర్తించకపోయినట్లయితే ఆ కాలానికి ఈ రూపం వచ్చివుండేది కాదు.

ఇప్పుడు కూడా మనిషి అలాగే ప్రవర్తించాలి. ప్రవర్తిస్తున్నాడు కూడా. కానీ, ఒకటే సమస్య. మొత్తం కాలాన్ని భూత భవిష్యత్తుల భేదం లేకుండా, మొత్తం ప్రపంచాన్నీ, వ్యవస్థను అంతటినీ కూడా తన చెప్పుచేతలలో వుంచుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. తన సిద్ధాంతమే ప్రపంచ సిద్ధాంతం కావాలని ఆశపడుతున్నాడు, ఆవేశపడుతున్నాడు. ఈ క్రమంలో మంచిచెడులను విస్మరిస్తున్నాడు. స్వపరభేదం లేకుండా అందరినీ వంచిస్తున్నాడు.

అంతటితో ఆగితే పరవాలేదు. తనను తాను మోసం చేసుకోవటంలో ఏ ప్రాణీ, ఏ కాలంలోనూ ఎదగలేనంత ఎత్తుకెదిగాడు నేటి మనిషి. తన బలాన్నే తన జీవితానికి ప్రమాణంగా భావిస్తున్నాడు. అది అంగబలం కావచ్చు, అర్థబలం కావచ్చు. దాన్నే విలువగా మారుస్తున్నాడు. అవకాశం కల్పించుకొన్నవాడు అందరిచేతా ఔననిపిస్తున్నాడు. లేనివాడు అగాథాల్లోకి కూరుకుపోతున్నాడు.

అయినా సరే, మనిషి మహోన్నతుడే. కాలిపోయి అయినా కాలానికి మరోపొరను కల్పించవలసినవాడే. (మే, 2000)

## మతమా? స్వప్రయోజనమా?

కాలగమనంలో మార్పులు కనిపిస్తున్నాయ్. వ్యాపారం, వ్యాపారధోరణీ విశ్వవ్యాప్తమవుతున్నాయి. ప్రపంచమంతా ఒకే గొడుగు క్రిందకు చేరాలంటూ అన్ని దేశాలూ ఆశపడుతున్నాయి. క్రియాశీలకంగా ఆలోచించటం నేర్చు కుంటున్నాయి. ఈ ధోరణిని ప్రత్యేకంగా ప్రదర్శింపజేస్తూ పబ్బంగడుపుకొనేవారి సంఖ్య పెరుగుతూనే వుంది.

మతాలు, మతాధికారులూ ఒకరిమీద ఒకరు ఆరోపణలు చేసుకొంటున్నారు. వీటిని పూర్తిగా కాదంటూనో, అంతా అవునంటూనో స్వప్రయోజనాలు కాపాడుకొనేవారు ఆ పనిలోనే లీనమై వున్నారు. తమకు అనుకూలమయినంత వరకు స్వమతాభినివేశాన్ని అయినా, పరమతాధిక్షేపణల నయినా ప్రకటిస్తూనే వున్నారు. సామాన్యమానవులు, సాధారణ జీవులు ఈ

మహోన్నత వ్యక్తుల మధ్యలో మసలలేక, ఏది నిజమో, ఏది అబద్ధమో అర్థంగాక తమ జీవితాలకు భద్రతలేక అల్లాడిపోతున్నారు.

అసలు మతమంటే ఏమిటో, అది ఎక్కడ, ఎలా, ఎందుకు ప్రారంభమవు తుందో ఏపాటి అయినా ఆలోచించగలిగితే ఈ సమస్యలు ఇలా వుండవేమో!

మానవ సమాజం ఏర్పడిన తర్వాత అందరి సుఖశాంతుల కోసం - అందరు కలిసి బ్రతకక తప్పదు కాబట్టి - ఎవ్వరికి ఇబ్బంది లేకుండా అందరూ బ్రతకటం కోసం కొన్ని పద్ధతులు ఏర్పరచుకొంటారు. ఆనాటికి అది జీవనప్రమాణంగా నిర్ణయింపబడుతుంది. అందరూ వీలయినంతవరకూ ఆ ప్రమాణానికి అనుగుణంగా నడుస్తుంటారు.

కొంత కాలం గడుస్తుంది. ఆ కాలంలో ఎదుర్కొన్న పరిస్థితులను బట్టి, నూతనంగా ఏర్పడిన అవసరాలను బట్టి జీవన ప్రమాణాలలో కొన్ని మార్పులు అవసరమవుతాయి. జాగ్రత్తగా ఆలోచించి, నిష్పాక్షికంగా నిర్ణయించగలవారు ఆ మార్పులకు శ్రీకారం చుడతారు. లక్ష్యంలో మాత్రం మార్పుండదు. అది ఎవరికీ ఇబ్బంది లేకుండా అందరూ బ్రతకాలన్నదే. ఈ మార్పును వెంటనే అంగీకరించలేనివారు వ్యతిరేకిస్తారు. దానితో రెండు వర్గాలు కూడా ప్రజలను ఆకట్టుకోటానికి దానికి ఆధ్యాత్మికతను జోడిస్తాయి. అవి రెండు మతాలు అవుతాయి. అదే పరిణామక్రమంలో రెండు, మూడు, నాలుగు - ఇలా ఎన్నయినా అవుతాయి. అయ్యాయి.

ఈ నూతనత్వాన్ని ప్రతిపాదించినవారైనా, ఆ ప్రాచీనతను ఆదరిస్తున్న వారయినా లక్ష్యానికి దూరం కానంతవరకు ప్రజలు ప్రశాంతంగానే వుంటారు. సామాజిక వాతావరణం కలుషితం కాదు.

అయితే, ఆ తర్వాత ఆయా మతాలను, మతసిద్ధాంతాలను అడ్డుపెట్టుకొని తమ పబ్బం గడుపుకొంటూ వాటిని కాపాడుతున్నామనే వారి సంఖ్య ఎక్కువ అవుతుంది. ఆ స్వార్థాన్ని సిద్ధింపజేసుకోవటంలో వ్యక్తుల మధ్య ఏర్పడిన పోటీని మతాలమధ్య పోటీగా చిత్రీకరిస్తారు, చిత్రీకరిస్తున్నారు.

మనకు స్వార్థమూ లేదు, మతాన్ని అడ్డుపెట్టుకొని లాభపడాలన్న అశా లేదు. మనమంతా ఆ పెద్దలకు విన్నవిద్దాం. “మీ లాభాలను మీరు పొందండి. అభ్యంతరం లేదు. దానికి మతం ముసుగువేసి జాతిని నష్టపరచకండి. మానవతను నిర్వీర్యం చేయకండి.”

(జూన్, 2000)

# దొర్లిపోక తప్పదు

చరిత్రను అధ్యయనం చేస్తుంటే ఎన్నో రహస్యాలు తెలుస్తుంటాయి. ఎన్నో హితబోధలు ధ్వనిస్తుంటాయి. గతంలో వర్తమానాన్ని బేరీజు వేసిచూచుకొని భవిష్యత్తును తీర్చుకునేందుకు దారి చూపిస్తుంటాయి.

మనం తరతరాలుగా, రకరకాలుగా చరిత్రను చదువుతూనే వున్నాం. పాఠాలు చదువుతూనే వున్నాం. చదివిస్తూనే వున్నాం. కానీ, అది మనకు అర్థమయినట్లుగానీ, దానినుండి మనమేదో గ్రహించదలచుకున్నట్టుగానీ, ఎప్పుడూ, ఎక్కడా కనిపించటం లేదు.

సంచారజాతులనుండి స్థిరంగా ఒకచోట నిలిచివుండే దాకా మనిషి ఎదుగుదల నిరాఘాటంగా జరిగివుంటుంది. అక్కడనుండి కుదుళ్ళు ఏర్పడ్డాయి. ఏ కుదురు కాకుదురు స్వతంత్రంగా పెరగటం ప్రారంభించాయి. ఆ దశలో నుండి మండలాలు, పాలెంలు ఇలా రకరకాల పేర్లతో, స్పష్టంగా చెప్పుకోవాలంటే బుల్లి బుల్లి రాజ్యాలు తయారయ్యాయి. ఈ మొత్తానికి ఒకే ధర్మం, ఒకే పద్ధతులు, ఒకే ఆలోచన వున్నా అంతా ఒకటి అన్న భావన లోపించింది. జాతీయత లోపించింది.

అక్కడితో మన స్వర్ణసంపదలూ, సామ్రాజ్యవైభవాలూ పతనం కావటానికి అన్ని దారులూ ఏర్పడ్డాయి. ఈ జాతిని, ప్రజలను ఎంతమంది పరిపాలించారో, ఎన్ని రకాలుగా హింసించారో ఆనాడు అనుభవించినవారికి తెలుసు. నిజాయితీగా ఆ విషయాలను అధ్యయనం చేస్తున్నవారికి తెలుసు.

అక్కడక్కడ ఎవరో మహాత్ముడు తెగించి, త్యాగంచేసి వాటి నెదురిస్తూ వచ్చారు. కొంచెం ఆలస్యంగానే మరల మన ఉనికిని మనదిగా నిలిపారు. ఇదంతా చరిత్ర. 1947 ఆగష్టు 15 నుండి మనం మరొకసారి సంపూర్ణంగా స్వతంత్రులమైనామని గర్వించే ఏర్పాటు చేశారు.

అయితే, అక్కడనుండి మనం మరల మన పతనానికి మనమే ఏర్పాటుచేసుకొంటున్నాం. ఏ ఐక్యభావన లోపించి గతంలో బాధలు పడ్డామో ఆ భావాన్ని ఈ రోజు మరీ నిర్లజ్జగా వదిలివేస్తున్నాం. పాలకులు అందరూ - ఈ మాట తొందరపాటు కాదన్న విశ్వాసంతోనే అంటున్నాను - స్వలాభాలు, స్వాధికార ప్రయోజనాలు తప్ప మిగిలిన సర్వ లక్షణాలను విస్మరిస్తున్నారు. దేశమంతా ఒక్కటే, మనుషులంతా ఒక్కటే. పాలకులు మాత్రం వేరు వేరు కుంపట్లు అన్నట్లుగా తయారవుతున్నారు. అందరి లక్ష్యం స్వప్రయోజనం. అందరి మాట ప్రజాభివృద్ధి. ఈ ద్వైధీభావనను, ద్వంద్వప్రవృత్తిని మనం క్షమించగలిగితే క్షమించవచ్చును గానీ చరిత్ర క్షమించదు. దానికంత సహనం లేదు. ఎవరి మీదుగానైనా అది దొర్లిపోక తప్పదు. (జూలై, 2000)

## చదువుకుందాం

మనకు చదివే అలవాటు తప్పిపోయింది. చదువుకొనే అలవాటు అంతకుముందే అంతరించిపోయింది. ఒక మంచి మాటనో, ఒక మంచి బాటనో పదే పదే మననం చేసుకున్నా, పరవశించి నడిచిపోతున్నా మనం ఎదిగే అవకాశముంది. మనుషులం మనుషులంగా బ్రతుకుతూ మానవత్వ విజయానికి పతాకలను ఎగురవేసే అవకాశముంది. అయినా కానీ మనం ఆ దారిన నడవలేకపోతున్నాం.

ఆ రోజుల్లో చదవగలవాడు చదువుకోసం, చదవలేనివాడు చదివించుకొని అయినా వినడంకోసం, అదీ కుదరనివాడు చెప్పించుకొని వినటం కోసం ఆశపడేవాడు. ఆసక్తి చూపేవాడు. విన్నదాన్ని, చదివినదాన్ని ఆలోచించి, ఆచరింప చేసేవాడు. సదసద్వివేకాన్ని పెంపొందించుకోవాలని ఆశించేవాడు.

ఈనాటి పరిస్థితి మారిపోయింది. మంచి స్నేహాలనూ కోల్పోతున్నాం. మంచి స్నేహితులవంటి పుస్తకాలనూ కోల్పోతున్నాం. అందుకే మనిషి భౌతికస్థితి, మానసికస్థితి కూడా క్లిష్టంగా, భరించరానట్లుగా తయారవుతున్నాయి. పరిసరాలను చూసి భ్రమపడుతూ కంటున్న కలలను నిజాలు చేసుకోవాలన్న తపన తప్ప నిజంగా మనకేం కావాలో మనకు తెలీని దశ. ఒకవేళ తెలిసినట్లనిపించినా దానికోసం మనమేం చెయ్యాలో అర్థంకాని దశ.

అందరిదీ ఒకే దారి కాదు. అందరిదీ ఒకే తీరూ కాదు. ఎవరిమట్టుకు వారు తమ దారే గొప్ప అంటున్నారు. తేల్చి చెప్పటానికి తూకపురాళ్ళేవి? కాలం నిష్కర్షగా దేన్నైనా తేల్చి చెప్పగలదు. కానీ, అంతదాకా మనం ఆగినా చేసిన పనుల ఫలితాలు ఆగవు గదా! పర్యవసానాలు మారవు గదా!

ఆ దుఃస్థితి నుండి బయటపడాలంటే ఒకటే మార్గం. మంచి పుస్తకాలు చదవగలగటం. అవి ఎందరి అనుభవాలకో, ఆలోచనలకో రూపకల్పనలు. ఎన్ని సంక్లిష్ట పరిస్థితులకో పరిష్కార మార్గాలు. ఎందరి జీవితాలకో గమ్యస్థాన నిర్దేశకాలు. కింకర్తవ్యతామూఢులకు కర్తవ్యబోధకాలు. మనిషికి, మనిషికి మధ్య అవి సేతువులు.

మళ్ళీ ఒక్కసారి ప్రయత్నించి చూద్దాం. చదివే అలవాటును సొంతం చేసుకుందాం.

(ఆగష్టు, 2000)

## జ్ఞానం భారః క్రియాం వినా

**వార్తయందు జగము వర్తిల్లుచున్నది**
**యదియు లేనినాడ యఖిల జనులు**
**అంధకారమగ్నులగుదురు గావున**
**వార్త నిర్వహింపవలయుఁ బతికి.**

- ఇది నన్నయ పద్యం. నారదుడు ధర్మరాజుకు రాజనీతి విశేషాలను వివరిస్తూ చెప్పిన అంశం. రాజనీతిలో వార్తకు ప్రాధాన్యముంది. అయితే ఇప్పుడు మనమనుకునేటంత సంకుచితార్థం ఆ పదానికి లేదు. అప్పుడు 'అర్థానర్థాలను

పరిశీలించటం' అని అక్కడ వార్త పదానికి అర్థం. పాలకుడు తాను చేస్తున్న లేదా.. చేయదలచుకొన్న కార్యక్రమాలు లేదా ప్రణాళికల పర్యవసానం అర్థమో, అనర్థమో చర్చించి, తగినవారి సూచనలను, సలహాలను స్వీకరించి, ఆపై నిర్ణయించటం వార్త అవుతుంది. అప్పుడు ప్రజల సుఖసంతోషాలకు ఏ విధమైన ఇబ్బందీ లేకుండా ప్రణాళికాబద్ధంగా పరిపాలన చేయవచ్చు. అలా కాకుండా తానే సర్వజ్ఞుడన్న అభిప్రాయంతో తాను మాత్రమే ప్రజాహితం కోరుకొనేవాడినన్న అహంకారంతో పాలకుడుంటే ఆ ప్రజల భవిష్యత్తు అంధకారబంధురమే. నాడైనా, నేడైనా పాలకులకు వార్త అవసర మెంతున్నదో ఇప్పుడు స్పష్టపడుతుంది గదా!

అయితే, ఈనాడు వార్త అంటే చాలా సంకుచితమైన అర్థం ఏర్పడింది. ఒకచోట జరుగుతున్న సమాచారాన్ని మరొకచోట నివసించేవారెవరైనా తెలుసుకోవటమే ఈనాటి వార్త. ఆ తెలుసుకోవటమే జ్ఞానానికి పరాకాష్ఠ అని భావించి అందరం దానివైపే పరుగెత్తుతూ వెంపర్లాడుతున్నాం. 'ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ' అన్న పేరుతో దాన్ని విశిష్ట శాస్త్రంగా రూపొందించి - నిష్కర్షగా చెప్పాలంటే - మిగిలిన ప్రధానాంశాలకు అన్నింటికీ ప్రతిభను దూరం చేస్తున్నాం. జాతి ప్రయోజనాలకన్నా స్వప్రయోజనాలు ప్రధానంగా భావించే అందరూ దాన్ని ఆకాశాని కెత్తేసి ఆనందిస్తున్నారు.

నిజమే. వార్తలను, విశేషాలను, సమాచారాలను ఎప్పటికప్పుడు క్షణాలమీద అందరూ తెలుసుకొనగలగటం గొప్ప విశేషమే. దానివలన కొన్ని - పోనీ చాలా అందాం - ప్రయోజనాలున్న మాట వాస్తవమే. కానీ కేవలం సమాచార సేకరణ, దానిలోని నైపుణ్యం, వ్యక్తినికానీ, జాతినికానీ ముందుకెదగనీవు. ఇది మూలవిషయకమైన అభివృద్ధి కాదు, కానేరదు. ఇతర ప్రాధాన్యరంగాలలో సాధించిన విజయాలకు, విషయాలకు విశ్లేషణాత్మక రూపకల్పనమే సమాచార రంగం. అంత మాత్రమే.

ఆ సమాచారాన్ని ఎంత గొప్పగా తయారుచేసికొన్నా దాన్ని మరల వినియోగదశలోనికి తెచ్చుకొని ఉపయోగించవలసినది మానవుడే. ఆ మానవుణ్ణి పరిష్కరించటంలో, సరిగా తీర్చిదిద్దటంలో మాత్రం అందరూ ఉదాసీనంగానే వున్నారు. పాలకులు, పాలితులు కూడా ఆ మనిషిని, ఆ మనిషి సాధించవలసిన

ఇతరరంగాల విజయాలను నిర్లక్ష్యం చేస్తున్నారు. ఈవిధంగా జరుగుతున్నంత కాలం; ప్రజలూ, పాలకులు తాత్కాలికమైన ధనసంపాదన - కొంతమందికి మాత్రమే పరిమితం - శాశ్వతాభివృద్ధిగా భావించి ప్రవర్తిస్తున్నంత కాలం జ్ఞానాన్ని ప్రోగుచేసుకోవటమే జరుగుతుంది. ప్రోగుబడ్డ జ్ఞానాన్ని సరిగా వినియోగించు కొనలేకపోతే, జ్ఞానాన్ని ఆచరణలో చూపించలేకపోతే అది వ్యక్తికీ, జాతికి కూడా శిరోభారమే. పెద్దలు ఎప్పుడో అన్నారు 'జ్ఞానం భారః క్రియాం వినా' (ఆచరణలేకపోతే జ్ఞానం కేవలం భారం). (సెప్టెంబరు, 2000)

## మాటకు ప్రాణము సత్యము

చిన్నప్పుడు ప్రాథమిక పాఠశాలలో చదువుకునేప్పుడు సాయంకాలం కాగానే పిల్లలందరినీ వరుసగా నిలబెట్టి, చేతులు కట్టించి పద్యాలు వల్లెవేయించేవారు. ఒకరు చెప్తుంటే మిగతావారు పలకటం. ఎంత పెద్దగా పలికితే అంత గొప్పతనం. పోటీలు పడి ఎలుగెత్తి పలుకుతూండేవాళ్ళం. "**మాటకుఁ బ్రాణము సత్యము, కోటకుఁ బ్రాణంబు సుభటకోటిధరిత్రిన్, బోటికిఁబ్రాణము మానము, చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ**".

అప్పట్లో పలకటమే తప్ప పెద్దగా ఆలోచించవలసిన అవసరం లేదు. అసలు ఆలోచన లేకపోయినా మునిగిపోయిందేమీ లేదు. తర్వాత్తర్వాత వాటిగురించి కొంచెం కొంచెం ఆలోచిస్తున్న సమయంలో అనిపించేది "అనవసరంగా అలా గొంతు చించుకోవటం తప్ప సత్యాన్ని పాటించకపోతే కొంపలేం కూలాయని." పాఠం చదవలేదు. రాలేదు. తలనొప్పిగా వుంది మాష్టారూ అంటే కొంపలేం కూలుతాయట. చేయి తగిలి గాజుగ్లాసు బ్రద్దలైపోయింది. మనకేం తెలీనట్లు గుంభనంగా వుండి అందరితోపాటు ఆశ్చర్యం ప్రకటిస్తే నష్ట మేమిటి? నిజం చెప్పినా గ్లాసు మళ్ళీ అతుక్కోదు గదా!

నిజమే. తల నీది, నొప్పి నీది, తలనొప్పి నీది. పాఠం రానిది నీకు. ఏతావతా నష్టపోవటమంటూ జరిగితే అది నువ్వే. మీ ఇంట్లో గ్లాసు పగిలింది. నువ్వు కాకపోతే మీ తమ్ముడు, మీ చెల్లాయి. నువ్వయినా తమ్ముడయినా తన్నులు తప్పనప్పుడు గుంభనంగా వుండండి. మీకు తెలీదనండి. గ్లాసు మీ ఇంటిదే గదా! నష్టం లేదు.

కానీ, మీ జీవితం - మనజీవితం అందాం - తలకొచ్చే నొప్పికో, పగిలిపోయిన గ్లాసుకో పరిమితమై లేదు. దాని విలువ అంతమాత్రమే అయితే హరిశ్చంద్రుణ్ణి గురించి తెల్లవారేదాకా నాటకాలు వేయాల్సిన అవసరం లేదు.

నువ్వు నీతో ఆగవు. సంఘంలోనికి చొచ్చుకొని వస్తావు. నిరుద్యోగివి కావచ్చు. చిరుద్యోగివి కావచ్చు. బస్టాండులో బఠాణీలు అమ్మవచ్చు. బస్సులు తయారుచేసే కంపెనీకి యజమానివీ కావచ్చు. ఇవన్నీ చిన్నచిన్న మెట్లై చివరగా ఈ సంఘాన్నంతా నడిపించే బాధ్యత నీమీద పడవచ్చు. ప్రజలకు, దేశానికి కూడా నువ్వు ప్రతినిధివి కావచ్చు.

అప్పుడు మాటకు ప్రాణము సత్యమని చదువుకుందామంటే నీకు తీరిక వుండదు. తీరికచేసుకున్నా తిరకాసు తెలుసు కాబట్టి ఒంటబట్టదు. చిన్ననాడే అలవాటయిన అబద్ధాలు చెప్పే గుణం ఇప్పుడు పొమ్మన్నా పోదు.

ఆరోజు తలనొప్పి నీది. ఈరోజు అది సంఘం మొత్తానిది. ఆరోజు పగిలింది నీ ఇంటి గ్లాసు. ఈ రోజు అది ఈ దేశానికి చెందిన ఆస్తి. పాలితులు దీనంగా బ్రతకవలసినదేనా? పాలకులు పద్యాలు చదువుకోరా?

(అక్టోబరు, 2000)

# జీవనధర్మం

మానవ జీవనం రోజురోజుకూ సంక్లిష్టంగా మారుతోంది. పరిస్థితులను, పరిసరాలను బట్టి ఎప్పటికప్పుడు తాత్కాలిక నిర్ణయాలు తీసుకొని ప్రవర్తించటమే తప్ప స్థిరమైన నిర్ణయాలు, నిర్దిష్టమైన విలువలు ఏర్పరచుకోలేకపోతున్నాం. జనసంఖ్య, రవాణా సౌకర్యాలు, భౌతిక సౌకర్యాలు పెరిగిన తర్వాత ఈ స్థితి మరీ విజృంభిస్తోంది. అలనాటి నీతిసూత్రాలు, శాస్త్రబోధలు సమన్వయపడని జీవితం మన ముందు నిలుస్తోంది.

ఇంత ఒత్తిడిలో కూడా ధర్మబద్ధంగా, ఒక పద్ధతి ప్రకారం జీవించాలనే తపన కొద్దిమందిలో అయినా వుంది. అయితే నిత్యజీవితానికి అనుగుణంగా ధర్మస్వరూపాన్ని అర్థంచేసుకోవటం కష్టమవుతోంది. 'ఎలా వుండాలి?' అన్న ప్రశ్న చాలా మందిలో సమాధానం లేకుండానే మిగిలిపోయింది.

వాస్తవానికి పాతరోజులయినా, క్రొత్తరోజులయినా ధర్మలక్ష్యంలో మార్పుండదు. భౌతికంగా ఎన్ని మార్పులు ఏర్పడినా ధర్మస్వరూప దర్శనంలో మార్పున్నట్లు అనిపిస్తుంది, కానీ ధర్మలక్ష్యంలో మార్పుండదు. దాన్ని సూక్ష్మంగా, మామూలుగా అర్థం చేసుకోగలిగితే వీలయినంత ఎక్కువమంది పాటించే అవకాశం కూడా లేకపోలేదు.

మానవుడు సంఘజీవి. కాబట్టి, సహజీవనం తప్పనిసరి, సహజీవనంలో పరస్పర సహకారం ప్రధానాంశం. ఒకవేళ సహకరించకపోయినా ఇబ్బంది కలిగించకుండా వుండగలగాలి. మనుగడకోసం సంఘర్షణ తప్పనిసరి అయినప్పుడు బలవంతులదే పైచేయి అవుతుంది. బలహీనుడికి బ్రతకగలిగే అవకాశమివ్వాలన్నదే ధర్మశాస్త్రాలలక్ష్యం. కాబట్టి మన జీవనశైలి, మన ప్రవర్తన ఇతరులకు ఇబ్బంది కలిగించకుంటే అదే ధర్మబద్ధమైన జీవితం. కలిగించక తప్పని స్థితి సహజంగా ఏర్పడితే దానిని వీలయినంతవరకు కుదించగలగాలి.

ఏతావతా నాకనిపిస్తున్న దేమిటంటే ఇతరులకు ఇబ్బంది కలిగించకుండా, కలిగించక తప్పనిస్థితి ఏర్పడితే వీలయినంత తక్కువగా వుండేటట్లు చూడటం ధార్మికజీవనానికి తొలి మెట్టు. కాదనగలమా? (నవంబరు, 2000)

# సంపాదకీయం

**ఉపాధ్యాయాత్ దశాచార్యః, ఆచార్యాణాం శతం పితా|**
**సహస్రం తు పితుర్మాతా, గౌరవేణాతిరిచ్యతే ||**

తండ్రి కిచ్చే గౌరవానికి వేయి రెట్లు తల్లి కివ్వాలి. అసలు భారతీయ జీవనవిధానంలో స్త్రీకి ప్రాధాన్యం, గౌరవప్రపత్తులివ్వటం జరిగింది. విదేశీ సంస్కృతి, నాగరికతల ప్రభావం తమవంతు హక్కులు, గౌరవాలు తమకు దక్కటంలేదని మహిళా సంఘాలు పోరాటం సాగించటంలో దోష మేమీ లేదు. అనుభవంలో పాలనాయంత్రాంగంలో కాని, ఆర్థికసంస్థల నిర్వహణలో గాని మహిళ పురుషుడికంటే ఎంతో సమర్థవంతంగా, తన శక్తియుక్తులను ప్రదర్శిస్తూ సమాజంలో వారు చేపట్టి నిర్వహించలేని రంగం లేదని నిరూపిస్తున్నారు. ఉపాధ్యాయవృత్తి ఒక్కటేగాక, శాస్త్ర, విజ్ఞాన, సాంకేతిక విద్యారంగాలలో కాని,

రక్షణ వ్యవస్థలోని వివిధ విభాగాలలో గాని పురుషులతో పాటు సమంగానే కాక, కొన్ని కొన్ని సందర్భాలలో అంతకు మించి శక్తిసామర్థ్యాలను ప్రదర్శిస్తూ తమవంతు బాధ్యతను నిర్వహిస్తోంది మహిళాలోకం.

సమాజానికి కుటుంబ వ్యవస్థకున్న ప్రాముఖ్యం స్త్రీమూర్తి వల్లనే కల్గుతుంది. తల్లిగా, చెల్లిగా, ఇల్లాలుగా కుటుంబాన్ని తీర్చిదిద్దటంలో మహిళ చూపే సహనం, ప్రేమానురాగాలు, త్యాగమూర్తిగా నిలుపుతాయి. అలాంటి స్త్రీకి భారతీయ జీవన విధానంలో సముచిత స్థానం లభించటం లేదనేది ఒక ఉద్యమ నినాదంగానే మిగిలిపోతున్నది. వాస్తవానికి అనాదికాలంనుండి - వేద, పురాణకాలాల నుండి - విద్యలోను, వైదుష్యంలోను స్త్రీలు పురుషులకు తగ్గిపోలేదు. ఒకప్పుడు మహావిద్వాంసులు, తత్వవేత్తల నడుమ జరిగిన విద్యాపరీక్షకు పరీక్షాధికారిణిగా, న్యాయనిర్ణేతగా తన వైదుష్య ప్రాభవాన్ని ప్రదర్శించిన సంఘటన వుండనే ఉన్నది. యజ్ఞయాగాదులు నిర్వహించిన సందర్భాలు కూడా లేకపోలేదు.

ఆర్థికస్వాతంత్ర్యం ఉంటే స్త్రీలు ఇంకా బాగా తమ శక్తిసామర్థ్యాలను సమాజానికి ఉపయోగపరిచే అవకాశం పెరుగుతుందనడం కూడా నిజమే మరి. స్త్రీల హక్కులకై పోరాటం సాగిస్తున్నాం అనే మహిళాసంఘాలకంటే పురుష సమాజమే వారి కా హక్కు ప్రసాదించే చట్టాలను ఆమోదించే సమయానికి వెనుకంజవేస్తుండటం ఇప్పుడు చూస్తున్నాం. ఉదాహరణకు 'మహిళా ఆరక్షణ చట్టం' (Women Reservation Bill) మూడోవంతు అవకాశం ఇస్తేనే తమను మించిపోతున్నారు. ఇక సగం వాటా కల్పిస్తే ముందు ముందు మూడు వంతుల దాకా పెరిగిపోతారన్న భయం వివిధరాజకీయపక్షాల పురుషపుంగవులను వెనుకడుగు వేయిస్తోంది. నవసమాజంలో స్త్రీని ఒక బలహీనమూర్తి (అబల) గానే అణచి ఉంచాలనే నిగూఢ గుప్తకాంక్ష పురుషనాయకులను వదిలిపెట్టడం లేదు..

మాటలకు, చేతలకు పొంతన ఉండకపోవడం రాజకీయవిద్యలో ప్రథమ పాఠం అంటే అసత్యం కాదు. అనుభవైకవేద్యమే. చెప్పేది చేసినా, చేసేది చెప్పినా అది రాజకీయతత్త్వం కాదన్నంతగా ముదిరిపోయింది. రాజకీయ వ్యవస్థ తలచేది, పలికేది, నడిచేది ఒకే విధంగా ఉండటం సత్పురుష (ఉత్తముల) లక్షణం అంటుంది నీతిచంద్రిక. అలా ఉండనివాళ్ళను, అన్ని విషయాలలోను వైరుధ్యం ఉండటమే మంచిదని భావించేవారిని, ఏమందాం? (డిశంబరు, 2000)

# విశ్వధర్మవాణి

విశ్వాని కంతటికీ దారిచూపించగల ధార్మికచైతన్యం భారతదేశంలో ఏనాడో వెల్లివిరిసింది. అసాధారణ ప్రతిభాపాటవాలకు నిదర్శనంగా ఆధ్యాత్మిక తత్త్వం తన ఉనికిని పొందింది. అయితే వికసించిన ఆ పూవుల పరిమళాలను వాస్తవంగా ఆఘ్రాణించి దిగంతాలదాకా కొనిపోగలిగిన వ్యక్తుల కోసం నిరీక్షిస్తూ వుండివలసి వస్తోంది. అవి వాడని పూలు. రోజు గడిచేకొద్దీ పరిమళాల సాంద్రత పెరుగుతుందే కానీ తరగదు.

అలాంటి నిరీక్షణ క్షణాల్లో ఆ ధర్మాన్ని అధ్యయనం చేసి, ఆ పరిమళాలను ఆస్వాదించి, నరనరాల జీర్ణించుకొని, విశ్వాన్ని మొత్తాన్ని పరిమళింపజేసిన వాణి ఒక్కటే ఒక్కటి ఈ జాతికి దక్కింది. అదే నరేంద్రుని వాణి. అదే వివేకానందుని వాణి.

మానవ జీవనాన్ని సమగ్రం, సర్వాంగసుందరం చేసుకొనడానికి అవసరమైన భావజాలం మొత్తం ఈ జాతి తొలినాళ్ళలోనే సంతరించి పెట్టుకొంది. అయితే ఆ సిద్ధాంతాలను అద్భుతంగా వివరించగలవారూ, అసాధారణంగా వ్యాఖ్యానించగలవారు కోకొల్లలుగా ఏర్పడ్డారు. కానీ ఆచరించి ప్రచారం చేయగలవారు ఈనాడు కరువయ్యారు. కర్మ సిద్ధాంతాన్ని వివిధ విన్యాసాలతో వికృతంచేసి, అకర్మణ్యతను భారతీయుల నెత్తుటిలో నింపేశారు. దాని ప్రభావంతో ఈ జాతి అదీ ఇదీ అని లేకుండా అనుభవించవలసిన అగచాట్లను అన్నింటినీ అనుభవించింది. ఇంకా ఏదో ఒక రూపంలో అనుభవిస్తూనే ఉంది. ఆ అకర్మణ్యతను పోగొట్టి భారతీయ ఆధ్యాత్మికతత్త్వానికి నిజమైన వ్యాఖ్యాతగా వారసుడుగా నిలిచినవాడు వివేకానందుడు.

మనిషి దేవుడులా మారే ప్రయత్నం చేయటంకన్నా మనిషిగానే బ్రతకగలిగితే చాలని నమ్మిన వ్యక్తి. నిజానికి ఈ రోజు దేవుళ్ళలాగా బ్రతుకుతున్నవారి సంఖ్య చాలా వుంది. కానీ, నిజమైన మనిషిలాగా బ్రతకగలవారి సంఖ్య తగ్గిపోతోంది. ఆ లోపాన్ని పూర్తిచేసి మనిషిని మనిషిగా బ్రతకటానికి ప్రోత్సహించిన కర్మిష్ఠి వివేకానందుడు. వివేకానందుని వాణిని విశ్వధర్మవాణిగా పరిగణించగలగటం పురాతన సుకృతఫలం. (జనవరి, 2001)

# గృహీత ఇవ కేశేషు...

**నిండార రాజు నిద్రించే నిద్రయు ఒకటే,**
**అండనే బంటు నిద్ర అదియు ఒకటే,**
**మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమి ఒకటే,**
**చండాలు డుండేటి సరిభూమి ఒకటే ...**

- అంటూ అన్నమయ్య గీతం ఆలాపిస్తోంది. ఆ పాట ఎన్నిమార్లు విన్నా, ఎన్నినాళ్ళు పాడుకున్నా ఆ భావాన్నో, రాగాన్నో ఆస్వాదించటం తప్ప ఆ తత్త్వాన్ని అందుకోలేకపోతున్నాం. అయితే ఆ తత్త్వాన్ని అనుభవింపజేయటానికి ప్రకృతికి మాత్రం కొన్ని క్షణాల కాలం చాలు. ఏళ్ళతరబడి చేసిన శ్రమను, సాధించుకున్న సంపదను, విలాసాలను, నివాసాలను నేలకు సమాంతరంగా నిలపటానికి ప్రకృతికి కొన్ని క్షణాలే పట్టింది. అలనాటి ఉద్యానవనం నేడు మరుభూమిగా కనిపిస్తోంది. కేవలం 40 సెకన్ల కాలం భూమి కంపిస్తే గుజరాత్లో ఏర్పడిన దృశ్యమిది.

ప్రపంచమంతా దిగ్భ్రాంతి చెందింది. నిర్ఘాంతపోయింది. విధి ఘటనలను గూర్చి, దైవలీలలనుగూర్చి, మానవుని నిస్సహాయతను, నిమిత్తమాత్రతను గురించి చర్చ జరగని ఇల్లు బహుశః ఒకటి కూడా వుండదేమో! ప్రార్థించే పెదవులు, పనిచేసే చేతులు అన్నీ ఒక్కటై గుజరాత్ వైపే పరుగుపెట్టాయి....

అయితే ఆ పర్వం అయిపోయింది. యక్షుడు ధర్మరాజును (మహాభారతంలో) వింతల్లోకెల్ల వింత ఏమిటని అడిగాడట. దానికి ధర్మరాజు చెప్పిన సమాధానమిది. "తన కళ్ళముందు కాలంతీరి కదలిపోయే వారిని ఎందరినో చూస్తూ కూడా తాను మాత్రం చిరంజీవిని అన్నట్లు మనిషి ప్రవర్తించటమే" అని. ఆ వాస్తవం అప్పుడప్పుడు కళ్ళముందు కనిపిస్తుంది.

ఆ మనిషి వింత ప్రవర్తన, ఫలితాలు రెండు కనిపిస్తాయి. ఆ సంఘటనను ఎలా మలచుకొని లాభపడవచ్చు అన్నది ఒకటి. ఆ సహాయసామగ్రిలో ఎవరివాటా ఎంత దోచుకునే అవకాశమున్నది అన్నది మరొకటి. పోయినవాళ్ళు ఎటూ పోయారు. ఉన్నవాళ్ళు ఉత్సాహంగా బ్రతకాలి కదా అన్న సూత్రం ఇక్కడ

పనిచేస్తుంది. అదొక మాయ. ఆ మాయ లేకపోతే మనుగడ లేదు. అది వాస్తవం. కానీ, మాయ మాత్రమే మనుగడ కారాదు.

ఏదో విపత్తు సంభవించినప్పుడు అందరూ కలిసి పనిచేయటం ఎంత అవసరమో, ఏ విపత్తూ లేనప్పుడు కూడా అదే పద్ధతిలో పనిచేయటం అలవాటు చేసుకోవాలి. ధర్మబద్ధంగా నడిచే ప్రయత్నం చేయాలి. విపత్తులకు చాలా భాగం మన బాధ్యతారాహిత్యం, కర్తవ్యనిష్ఠ లేకపోవటం కారణాలని మనకు తెలుసు. ప్రకృతిసహజంగా విపత్తు వచ్చినా, విపత్తువలన కలిగే ఫలితాలు మాత్రం మానవకారణంగా వస్తున్నవే. వాటిని అరికట్టుకోవాలంటే ఒకటే సూత్రం - "గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మ మాచరేత్" అన్నది. మృత్యువు జుట్టుపట్టి లాగుతున్నదన్న భావన నిత్యం మనసులో వుంచుకొని ధర్మబద్ధంగా పనిచేయగలగాలి. ఆ నిబద్ధతను నా దేశ ప్రజలకు కలిగించలేవా భగవాన్!

(ఫిబ్రవరి, 2001)

## కాలం

కాలగమనంలో మరో సంవత్సరం గడిచిపోతోంది. మరో శిశిరం చెదిరిపోతోంది. మళ్ళీ వసంతం. అదే చివురులు, అవే కోకిలలు, అవే మల్లెలు, అవే మామిడికాయలు. మనం కావాలన్నా, వద్దన్నా అదే క్రమంలో కాలం నడుస్తోంది.

వాస్తవానికి కాలం శక్తి అపరిమితం. దాన్నెవ్వరూ ఎదిరించలేరు. అడ్డగించలేరు. అడ్డదిడ్డంగా అది దూసుకొని పోయినా, అవ్యవస్థతో సాగిపోయినా దాన్ని కాదనగలవారు ఎవ్వరూ లేరు. అసలు కాదనటం ఎలాగో కనీసం తెలిసిన వారూ ఎవ్వరూ లేరు.

అయినా సరే, అది క్రమబద్ధంగానే సాగుతుంది. గడియారాలలో తేడాలుండవచ్చు. దానిలో మాత్రం తేడా రాదు. అది ఒక నియతికి కట్టుబడి వుంది. ఒక క్రమగతిని అలవాటు చేసుకొంది. అది స్వయంగా తనను తాను నియంత్రించుకొని సాగుతుంది.

కానీ, మనం మనుషులం - మన ఉనికికి ప్రధానమైన ఆధారం కాలం. మనకు ఓటుహక్కు రావాలన్నా, పెళ్ళి ముచ్చట తీరాలన్నా, ఉద్యోగం చేయాలన్నా,

విరమించుకోవాలన్నా మూలం కాలమే. కానీ, మనం మనకు ఆధారమైన కాలం నుండి నేర్చుకొన్నది కానీ, నేర్చుకొంటున్నది కానీ ఎంత శాతం?

ఖచ్చితంగా చెప్పాలంటే, మనం కాలంకన్నా నిక్కచ్చిగా వుండగలగాలి. కారణం అడుగడుగునా మన నడకను నియంత్రించే యంత్రాంగం మనకుంది. మన నాగరికత, సంస్కృతి, ఆచారాలు - ఇవన్నీ కాలంలాగానే మనంకూడా క్రమబద్ధంగా నడవటానికి ఉద్దేశించినవే. క్రమబద్ధంగా నడిచిన కొన్ని తరాల అనుభవాలసారంగా మనకు మిగిలినవే. అయినా వాటిని అతిక్రమించటానికి మనం చూపే సాహసం; ఆచరిస్తున్నట్టు, అనుసరిస్తున్నట్టు కనిపిస్తూ దాటవేసేందుకు చూపించేచొరవ; వాటిని అడ్డం పెట్టుకొని ఏదేదో సంపాదించి దాచుకుందామన్న తపన మామూలు లెక్కలకు అందనిది. ఇంత చేసి కాలగర్భంలో కలిసిపోతున్నప్పుడు పట్టుకొని పోతున్నది ఏమైనా వుందా అంటే, అదీ కనిపించదు.

అందుకే ప్రయత్నిద్దాం. ఈ నవవసంతంనుండి అయినా కాలంలాగా ఖచ్చితంగా మనలను మనం నియంత్రించుకొని బ్రతికే ప్రయత్నం చేద్దాం. మానవత్వపు విలువలను కాపాడుకుంటూ మనం మనంగా బ్రకటానికి నడుం బిగించుదాం. (మార్చి, 2001)

## ఆకలి - ఆశ

తొలి మానవుడికి ఆకలి తీర్చుకోవటమే కానీ, ఆశలకు ప్రాణం పోయటం తెలియదు. అలా కొంతకాలం గడిచిన తర్వాత, అగ్నిసాక్షిగా నాగరికతను పెంచుకొని మనిషి మహోన్నతంగా విస్తరించిన తర్వాత ఆశలకే కానీ ఆకలికి విలువలేని దశలోకి మనిషి ప్రవేశించాడు. ఈనాటి సమాజాన్ని ఒకే ఒక సందేహం పట్టిపీడిస్తోంది. ఆకలి తీర్చినవాడు గొప్పవాడా? ఆశలు తీర్చుకుంటున్నవాడు గొప్పవాడా? అని.

కేవలం తన ఆకలి తాను తీర్చుకుంటూ బ్రతికేవాళ్ళు కొందరున్నారు. సామాజిక జీవితంలో అసలు వారి ఉనికికి గుర్తింపూ లేదు, విలువ ఉండదు. కానీ తన ఆశలను తీర్చుకునేవాడి విషయంలో మాత్రం ప్రత్యేకత వుంది. ఆశలు తనవే

అయినా, వాటిని తీర్చుకొనే క్రమంలో ఆ వ్యక్తికి విలువ, గుర్తింపూ వస్తాయి. అవి అనుకూలంగా అయినా ప్రతికూలంగా అయినా వుండవచ్చు.

ఇక మూడవ తెగ ఆకలి తీర్చేవారు. వీళ్ళు అసలు ఈ సమాజంలో వున్నారా? మన పాలకుల సంగతి వదిలివేద్దాం. వాళ్ళంతా పైన చెప్పిన రెండో రకం వ్యక్తులు. వారి ఆశలకు అంచుగా నిలవటానికి ఆకాశానికే అవకాశం లేకుండా పోతోంది. మరి సామాన్య ప్రజానీకంలో అయినా ఇతరుల ఆకలి తీర్చే ఆలోచన చేయగల వారి సంఖ్య ఎంత వుంటుంది? అసలు ఆకలి తీర్చటమంటే ఏమిటి? ఎలా? మార్గ మేది? అన్న ఆలోచన మాత్రం ఎంత మంది కుంటుంది?

మనుషులలో నాలుగు రకాల వారుంటారు. 1) చెడ్డగా సంపాదించి తనకోసం ఖర్చు పెట్టేవాళ్ళు. 2) చెడ్డగా సంపాదించి మందికోసం ఖర్చుచేసే వాళ్ళు. 3) మంచిగా సంపాదించి తనకోసం ఖర్చుచేసుకొనేవాడు. 4) మంచిగా సంపాదించి మంది కోసం ఖర్చుపెట్టేవాళ్ళు. ఈ నాలుగు రకాలకు ఏ పేర్లయినా పెట్టుకోవచ్చు. మన ఇష్టాన్నీ, మనఃస్థితినిబట్టి ఎన్ని తరగతులుగా అయినా విభజించుకోవచ్చు.

కానీ నాలుగో రకం వ్యక్తుల సంఖ్య పెరగాలి. మంచిగా సంపాదించి మందికోసం ఖర్చు చేయగల మనస్తత్వం పెరగాలి. తాను అందరిలో లీనమయి, తనలో అందరినీ విలీనం చేసుకోగల మనుషుల సంఖ్య పెరగాలి. అప్పుడు ఆశలు తీర్చుకొనే వారితోపాటు ఆకలి తీర్చేవాళ్ళూ అప్రయత్నంగా తయారవుతారు.

(ఏప్రిల్, 2001)

# మనిషిలో దేవుడు

సృష్టి అనంత ప్రాణికోటితో కూడింది. పరమాణురూపంనుండి పరాత్పరరూపందాకా అన్నీ దాని విశేషాలూ, విచిత్ర విన్యాసాలూ.

ఈ ప్రాణుల మధ్య అన్యోన్య సహకారం, అన్యోన్య శత్రుత్వం రెండూ సహజంగా పుట్టినవే. బలాన్నీ, బలహీనతనూ ఆధారంగా చేసుకొని ఈ వైషమ్యాలు ఏర్పడుతున్నాయి.

అయితే, ఈ ప్రాణులనన్నింటినీ దాదాపు నియంత్రించగలశక్తి మానవునికి దక్కింది. మిగిలిన జంతువులలో ఏదీ కూడా మనిషిని చంపగలగవచ్చు. అమాంతంగా మింగివేయవచ్చు. కానీ, నియంత్రించలేదు. కాబట్టి మనిషిని మనిషే నియంత్రించగలగాలి లేదా దేవుడు. సమస్త ప్రాణికోటికీ నియంత కాబట్టి ఆయనను గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. కాబట్టి మనిషి మాత్రమే మనిషిని నియంత్రించగలడు. ఎలా?

శాసనాలు చేసి కానీ, బలవంతం చేసి కానీ మనిషిని భయపెట్టగలం, లేదా ఒకటి రెండు మార్లు ఒత్తిడిమేర నియంత్రించగలం. కానీ సర్వకాల సర్వావస్థల యందును మనిషిని నియంత్రించటానికి శాసనాలు సరిపోవు. ఇది రోజూ మనం కళ్ళారా చూస్తున్న సత్యం.

ద్వేషం చేయలేని పనులను ఎన్నింటినో ప్రేమ చేయగలదు. మనిషి తనను తాను ప్రేమిస్తూ, పరిసరాలను, పరిసరజనాలను, చుట్టూ వున్న సమాజాన్ని ప్రేమించగలిగితే అది ప్రతి మనిషిని నియంత్రించగలదు. ప్రపంచాన్ని మొత్తాన్ని శాంతి సౌధంగా నిలుపగలదు.

అందరినీ ప్రేమించగలగటం, విశ్వప్రేమను ప్రదర్శించగలగటం అంత తేలికైన విషయం కాదు. నేను - నాది అన్న దృష్టి బలహీనపడేవరకు ఇది సాధ్యపడే విషయం కాదు. కాని, ఇది అంత అసాధ్యం కూడా కాదు. దీని కొక చిన్న చిట్కా వుంది.

ఇప్పటిదాకా మనం దైవాన్ని మానవాకృతిలో తీర్చికొని, మానవుని ఆలోచనలు, అభిరుచులమేరకు పూజాపునస్కారాలు నిర్వహిస్తూ, నైవేద్యాలు అందిస్తూ భావించుకొంటున్నాం. ఒక్క మాటలో చెప్పాలంటే దైవాన్ని కార్యక్రమాలలో మనిషి స్థాయికి దిగజార్చాం. దాన్ని కొంచెం మార్చి మనిషిలో దైవాన్ని చూడగలగటం నేర్చుకుంటే! అంతా పరమాత్మరూపం, కాబట్టి ప్రతి మనిషిలోనూ దేవుడున్నాడు. ఆ మనిషిని మనం దేవుడిగా భావించగలగాలి. అంతే. ప్రయత్నం చేద్దాం. దేవుణ్ణి మన స్థాయిలో భావించిన మనం, పొరుగువారిని దేవుని స్థాయిలో భావించలేమా? (మే, 2001)

# మనస్సు

శరీర నిర్మాణంలో ఎంతో విలక్షణమైన, విచిత్రమైన ఇంద్రియం మనస్సు. శరీరంలోని ఇతర భాగాలలాగా దీనికి రూపం లేదు. అయితే మనస్సుతో సంబంధం లేకుండా ఏ ఇంద్రియమూ పనిచేసే అవకాశం లేదు. శరీరంలోని పంచకోశాలలో మనోమయకోశమని కూడా ఒక భాగాన్ని భావించారు వేదాంతులు.

విశ్వవేదాంతంలో గానీ విశ్వసాహిత్యంలో గానీ మనస్సును గురించి. ప్రస్తావన లేకుండా, దాని ప్రమేయం లేకుండా ఏ సిద్ధాంతమూ ప్రతి పాదించబడలేదు. శరీరంలోని జీవుడికి, బాహ్యప్రపంచంతో కానీ, ఇతర శరీరాలలోని జీవులతో గానీ సంబంధాన్ని కల్పించేది మనస్సు.

వాస్తవానికి జీవుడికి తాను ఆశ్రయించుకొని వున్న శరీరం తప్ప మిగిలినదంతా బాహ్యప్రపంచమే. అయితే ఈ బాహ్యప్రపంచంలో ప్రాణులు, ప్రాణరహితాలు రెండూ వుంటాయి. ప్రాణం లేని పదార్థాలతో జీవుని సంబంధాలు పెద్దగా ఇబ్బంది పెట్టేవి కావు. ప్రాణులతో గల సంబంధాలలో కూడా పశుపక్ష్యాదులతో వున్నసంబంధాలు కూడా పెద్దగా సమస్యలు కావు. కానీ, తనలాగా మానవ శరీరాన్ని ఆశ్రయించి వున్న జీవులతో ఏర్పడే సంబంధ బాంధవ్యాలు మాత్రం జీవుడిని రాగద్వేషాలకూ, సుఖదుఃఖాలకూ లోనుచేస్తుంటాయి. వీటికన్నింటికీ మూలకారణం మనస్సు కావటం, అది కంటికి కనిపించకపోవటం విశేషం.

ప్రతి జీవుడిలోనూ మనస్సుంటుంది. కాబట్టి జీవుడికీ, జీవుడికీ మధ్య సంబంధాలలో సమస్యలకు అవకాశ మేమిటని అనుమానం కలుగవచ్చు. అందరిలో  వున్నది మనస్సే గదా!

నిజమే, అందరిలోనూ మనస్సే వున్నా, అదే అన్నింటికీ మూలమవుతున్నా దానికి నియతస్థితి లేకపోవటం, ఏ ఒక మనస్సూ సర్వాత్మనా రెండవదానితో సరిపోలకపోవటం ఈ విపరీత పరిస్థితికి కారణం.

మనం ఈరోజు ఉపయోగించుకొనే భౌతిక పదార్థాలలో చాలా వాటికి విశ్వవ్యాప్తమైన ఒకే రూపకల్పన కనిపిస్తుంది. టైపు మిషన్లు, వాహనాల

విడిభాగాలు, విద్యుత్ పరికరాలు వగైరా. ఒకే రూపకల్పన వున్నా నిర్మాణస్థాయిలో చిన్న చిన్న తేడాలు వస్తే అవి మనలను ఇబ్బంది పెట్టడం మనం గమనిస్తూనే వున్నాం. ఆ స్థితిలో ఏ విధమైన నిర్దిష్టప్రణాళిక లేకుండా కోటాను కోట్ల మనస్సులు ప్రవర్తిస్తూ వుండటం, వాటికి ఒకదానితో మరొకదానికి సంబంధం తప్పనిసరి కావటం సమస్యలకు కారణం కాకపోతుందా? ఎంతగా మనం సామాజిక, సామూహిక నియమాలు కల్పించినా, ప్రతిమనస్సుకూ తనదంటూ ఒక లోకం, దాని కొక నియమం కనిపిస్తుంటాయి మరి.

అందుకే మనిషి తన మనస్సును వీలైనంత మేరకు అందరి మనస్సులతో ఏకాత్మను పొందేటట్లుగా సన్నద్ధం చేసుకుంటే కనీసం కొన్ని ఇబ్బందులయినా తొలగిపోతాయేమో పరీక్షించవచ్చు.

(జూన్, 2001)

# విశ్వధర్మవాణి

విశ్వధర్మవాణి ఒక దశాబ్దంగా తన వాణిని వినిపిస్తోంది. ధర్మస్వరూపాన్ని అర్థం చేసుకొనటం పండితులనుండి పామరులదాకా అందరికీ అసాధ్యంగా కనిపిస్తున్న రోజులలో తనదైన పద్ధతిలో సర్వమానవులకు ఆచరణీయమైన ధర్మస్వరూపాన్ని వివరించే, వినిపించే ప్రయత్నం చేసింది.

మనిషి ఏ దేశంలో పుట్టినా, ఏ కులానికి చెందినవాడైనా, ఏ మత సంప్రదాయాలను పాటిస్తున్నవాడయినా ముందుగా తాను మనిషి, ఆ తర్వాతనే ఏ లక్షణమైనా, ఏ గుర్తింపు అయినా. మనిషి ఎక్కడైనా సహజీవి, సంఘజీవి, పరస్పరం ఆధారపడి బ్రతికే ప్రాణి. కాబట్టి మనిషికి అవసరమైన ఏ ధర్మమైనా ఆ పరిమితులకు, పరిధికి లోబడివుంటుంది. ఉండి తీరాలి.

అనాదిగా శాంతి సౌఖ్యాలతో కూడిన మానవ జీవనాన్ని ఆశించిన మేధావులు ఎందరో తమ ఆలోచనలను మథించి, మానవజీవనానికి అవసరమైన

ప్రాథమిక సూత్రాలను ఎన్నింటినో ప్రకటించారు. ప్రజలకు అర్థమయ్యేటట్టుగా వినిపించే ప్రయత్నం చేశారు. వారి సిద్ధాంతాలు అక్కడక్కడ పరిమితులకు లోనైనవిగా కనిపించినా అవన్నీ విశ్వధర్మసూత్రాలే. ఆ స్వల్పభేదాలు దేశ కాల పరిస్థితులను బట్టి ఏర్పడినవే, కానీ మౌలికతలో విభేదించేవి కావు. ఏ ప్రవక్త అయినా అశాంతిని కోరి తెచ్చుకొనమని ప్రబోధించడు గదా!

అయితే మనిషి తనకున్న అవకాశాలను సరిగా వినియోగించుకోలేక, అవగాహనను తగిన రీతిగా పెంచుకోలేక, సూత్రాలను సమన్వయించుకోవటం చేతకాక - ఇష్టం లేక - తన పరిధిలో తాను గిరిగీచుకొని నిలబడి సంకుచిత స్థితికి లోనయ్యాడు. ఆ సంకోచస్థితి ఫలితాలను తన కిష్టమైనా లేకున్నా అనుభవించి తీరవలసిన పరిస్థితిని చేజేతులా తెచ్చుకొన్నాడు. దాని తీవ్రత ఎవరెంత ప్రయత్నించినా అదుపు చేయలేని స్థితికి ఈరోజు చేరుకొన్నది.

ఈనాడు తాను ప్రశాంతంగా బ్రతుకుతూ, పదిమందీ ప్రశాంతంగా బ్రతకాలని ఆలోచించేవారికి సామాజిక జీవితంలో అనేక ధర్మసందేహాలు కలుగుతున్నాయి. కర్తవ్యాకర్తవ్య సంశయం అనుక్షణం కలుగుతోంది. ఈ సందర్భంగా సూక్ష్మంతో మోక్షంగా మనం భావించవలసిన ధర్మమేమిటి?

ఎవరే పనిచేసినా ధర్మమే. అయితే అది రెండు నిబంధనలకు లోబడి వుండాలి.

1. దానివలన ఇతరులకు ఇబ్బంది కలగకూడదు. 2. దాని పరిణామాలను భరించగల శక్తి తన కుండాలి.

ఈ కోణంలోనుండి ఆలోచించి చూడండి. ధర్మస్వరూపం తేలికగా బోధపడుతుందేమో!

(జులై, 2001)

# మనస్సు - మాట

మనస్సుకు, మాటలకు ఘర్షణ అనాదిగా సాగుతూనే వుంది. మనస్సును యథాతథంగా అనువదించటానికి మనిషికి మాటలు చాలవు. అసలు మాటలే రాని జంతుజాలం తమ జీవితావసరాలను తాము గడుపుకోగలుగుతున్నా; లెక్కలేనన్ని భాషలు, ఊహ కందనన్ని పదాలు వున్నా మనిషికి భాష చాలటం లేదు. ఇది మామూలు మనుషులు, సంఘంలో పెద్దగా గుర్తింపు లేనివారు తమ మానాన తమ జీవితాన్ని వెళ్ళదీసుకుంటున్నవారిని గురించి చెప్పే మాట కాదు. మేధావులుగా, మహాకవులుగా, విజ్ఞానులుగా, విజ్ఞతగలవారుగా గుర్తింపు పొంది సమాజాన్ని నడిపించే స్థాయి కలిగినవారిని గురించి, నడిపిస్తున్న వారిని గురించి ఆందోళనపడుతూ చెప్తున్న మాట.

సమాజ ప్రతినిధులైన నాయకులు గంభీరంగా ఏదో మాటాడటం, అది వార్త రూపంలో జనానికి చేరటం, ప్రజలు ఆశ్చర్యాన్నుండి తేరుకొనేలోగానే తానలా మాటాడలేదనీ, పత్రికలే వక్రీకరించాయనీ ఆ నాయకుడు మరో ప్రకటన చేయటం. ఇదంతా ఎందుకు జరుగుతున్నట్టు. మాటాడుతున్నది విజ్ఞత, బాధ్యత రెండూ గల నాయకుడు. వింటున్నదీ, విని వ్రాస్తున్నదీ అంతే స్థాయిలో సామాజిక బాధ్యతగల పత్రికా ప్రతినిధులు. విజ్ఞతలో తీసిపోనివాళ్ళు. అటువంటి స్థితిలో వారేదో చెప్పటం, వీరేదో వక్రీకరించి రాయటం సాధ్యమా? లోపం నోటిలో వున్నట్టా? చెవిలో వున్నట్టా? వాళ్లవాళ్లకున్న బలాన్ని బట్టి అటో ఇటో అవుతుంటుంది. కానీ, నిజానికి ఆ లోపం మనస్సులోది. అందుకే మనస్సును అనువదించటానికి మాట - భాష - చాలటం లేదని భావించవలసివుంటోంది.

అయితే నిజంగా మాటలు చాలనంత స్థితి మనస్సుకున్నదా? లేదనే చెప్పవలసి వస్తుంది. అసలు మన మనస్సు ఏదో మనకు తెలిస్తే, మన మనస్సును దాచుకోకుండా మాటాడాలన్న సంకల్పం మనకుంటే మనస్సుకు భాష చాలక పోవటమన్నది జరగదేమో! ఒకవేళ జరిగితే మనస్సులోని సాంద్రతను పూర్తిగా బయటపెట్టగల భాష కుదరక పోవచ్చునేమో గాని మనస్సుకు భిన్నంగా మాటాడే

పరిస్థితి మాత్రం రాదు. అదే జరిగిందంటే మనస్సుకు, మాటకు సమభావన లేకుండా, సమన్వయం లేకుండా మనం మాటాడుతున్నామనే అర్థం కాని మన భావాలను ఇతరులు వక్రీకరించటమన్నది జరగదు. అటువంటి అవకాశమే లేదు.

ఇకనైనా మనం మనకోసం కాకపోయినా మన కుటుంబం కోసం, మన సమాజం కోసం, మన దేశంకోసం మనస్సుకూ మాటకు సమన్వయాన్ని కల్గించుకొని మాటాడే ప్రయత్నం చేద్దాం.

(ఆగష్టు, 2001)

# ఉపాధ్యాయ దినోత్సవం

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ, తస్మై శ్రీగురవే నమః ॥**

ఇది గురుదేవులమీద భక్తిని ప్రకటించవలసిన ప్రతి సందర్భంలో మనం స్మరించుకొనే శ్లోకం. గురువు బ్రహ్మ, విష్ణువు మహేశ్వరుల స్వరూపం. అంతే కాదు పరబ్రహ్మ స్వరూపంకూడా. ఈ నాలుగు లక్షణాలు గురువు లందరిలో కనిపించి, ఏ సందర్భంలో ఏది అవసరమో ఆ సందర్భంలో అది కనిపించి ప్రయోజనవంతం కావాలని రచయిత సంకల్పం.

నిజమేనేమో! అలనాటి గురువులలో - గురువులకు కాలభేద మెందుకనుకుంటే - ఈనాటి గురువులలో ఎందరో ఇటువంటి విలక్షణ లక్షణాలు కలిగివుండి జాతిని ఉద్ధరించినవారే. ఈనాటికీ గురుపూజలు, వారి దినోత్సవాలు జరుగుతున్నాయంటే అటువంటివారి చలవే.

అయితే, సంఘంలోని అన్ని రంగాలలో అనుకూల, ప్రతికూల వ్యక్తులు, వ్యక్తిత్వాలు ప్రబలుతున్నట్లే ఉపాధ్యాయులలో, గురువులలో కూడా అనుకూల ప్రతికూలశక్తులు పనిచేస్తూనే వున్నాయి. కేవలం రుద్రస్వరూపులు, కేవలం బ్రహ్మస్వరూపులూ లెక్కకు మిక్కిలిగానే కనిపిస్తున్నారు. పైపెచ్చు అన్ని

వర్గాలలోను చెడు ధోరణులు ప్రబలంగా వుంటే మనం మంచిగా ఎందుకుండాలని వాదిస్తుంటారు.

ఈ సందర్భంగా ఒక్క విషయం గమనించాలి. సమాజం పని విభాగాన్ని చేసుకొన్నది. వ్యక్తులను, వ్యవస్థను తీర్చిదిద్దుకొనేందుకు, ముందుకు తీసుకుపోయేందుకు అనుగుణంగా కార్యరంగాలను విభజించుకొని దానికి తగిన అర్హతలనూ నిర్ణయించుకొంది. ఈ అర్హతలలో ఎక్కడా వ్యక్తిత్వ ప్రస్తావన లేకపోటం దురదృష్టకరమైనా అన్ని రంగాలకూ అది సమాన లక్షణం కాబట్టి సరిపెట్టుకొందాం. అంతే తప్ప వ్యక్తుల నెవ్వరినీ నిర్బంధంగా ఆయా రంగాలలో పనికి నియోగించటం లేదు. కాబట్టి మనిషి తాను ఏ పనిచేసి సమాజంలో తన కర్తవ్యాన్ని నిర్వహించదలచుకొన్నాడో తానే నిర్ణయించుకుంటున్నాడే కానీ ఎవరూ బలవంతంగా రుద్దటం లేదు. తాను ఎన్నిక చేసుకొన్న పనిని తాను తన లక్షణాలకు అనుగుణంగా కాక ఆ పనికి అనుగుణంగానే చేయవలసి వుంటుంది. తాను చేయలేకపోయినా, తన కిష్టంలేకపోయినా ఆ రంగాన్ని తాను వదలాలే కానీ అక్కడే వుండి దానిమీదే బ్రతుకుతూ కర్తవ్యాన్ని విస్మరించకూడదు.

విశేషించి ఎవరు విస్మరించినా ఉపాధ్యాయుడు విస్మరించకూడదు. ప్రయాణికులు కాళ్ళు బార్లా చాపి పడుకోవచ్చుగానీ బస్సు డ్రైవరు ఆ పని చేయకూడదు. చేస్తే ఎవ్వరూ మిగలకపోవచ్చు. కాళ్ళయినా కదలకపోవచ్చు.

(సెప్టెంబరు, 2001)

# మరో మహాసంగ్రామం

ప్రపంచానికి యుద్ధాలు, యుద్ధానుభవాలు క్రొత్తవేం కావు. కానీ, తరాలు మారుతూ వుంటాయి కాబట్టి ప్రస్తుతతరంలోని వారికి యుద్ధమన్నా, దాని ఫలితాలన్నా తెలియవు. చరిత్ర వాటికి సంబంధించిన దయనీయ ఫలితాలను, పరిణామాలను కాలయంత్రంలో చూపిస్తున్నా పూర్తిగా అర్థం కావు. అర్థమైన వాళ్ళైనా అందరూ వాటిని గుర్తుంచుకొంటారని చెప్పలేం. రోజులు గడిచేకొద్దీ

గతం మాసిపోవటం, లీలామాత్రంగా కనిపించటం సహజం. అయితే ఎన్ని అవకతవకలున్నా, ఎంత ఆవేశకావేశాలున్నా యుద్ధపరిస్థితి రాకుండా వీలయినంత వరకు చూడాలని ఆరోజుల్లో అనుకొనేవారు. ఇదంతా మనం ప్రజల కోణంలో నుండి ఆలోచిస్తున్నాం.

అయితే ఇప్పటి ప్రజలలో వచ్చిన విలక్షణమైన మార్పు ఒకటుంది. అమెరికాలో నిలువెత్తు భవనం నిట్టనిలువునా కూలిపోతుంటే విచారించినవారి సంఖ్య కన్న దాన్ని టెలివిజన్లలో చూచి విస్తుపోయినవారి సంఖ్య, అంత త్వరగా అంత దగ్గరగా మనం ఆ సన్నివేశాన్ని చూడగలిగినందుకు కారణమైన అభివృద్ధినిచూచి మురిసిపోయినవారి సంఖ్య ఎక్కువ. అందుకే ఇప్పుడు యుద్ధమన్నా, ఉత్పాతాలన్నా, వరదలన్నా, వినాశాలన్నా ఒక ప్రత్యక్ష ప్రసారం మాత్రమే. ప్రసారంలోని బాగోగులే కష్టనష్టాల కన్నా ప్రధానపాత్ర వహిస్తున్నాయి.

లేకపోతే ఇప్పుడు ప్రతివాడూ యుద్ధమెప్పుడు? యుద్ధమెప్పుడు? అని ఉత్సాహంగా అడిగే పరిస్థితి వచ్చివుండేదా? సామాన్య గృహిణులనుండి అందరూ ఒక క్రికెట్టు మ్యాచ్ ప్రత్యక్ష ప్రసారంకోసం ఎదురుచూచినట్టు ఇప్పుడు యుద్ధం కోసం ఎదురు చూస్తున్నారు. పార్లమెంటు సమావేశాలు, శాసనసభా సమావేశాలు ప్రత్యక్ష ప్రసారం చేసినప్పుడు సీరియస్‌గా సినిమాలు చూస్తున్నవారు కూడా ఛానళ్ళు మార్చి, ఆ ప్రసారాలను చూచిన వైనం మనకు గుర్తే. కల్పితమైన సినిమాలకన్నా సజీవమైన ప్రజాప్రతినిధుల వాకోవాక్యాల తీరు ప్రజలను అంతగా ఆకర్షించింది. అవి అయిపోయాయంటే నిరాశ పడ్డ గృహిణులూ లేకపోలేదు.

ఇప్పుడు అటువంటి ఔత్సాహికుల దృష్టి యుద్ధంమీద పడింది. యుద్ధం అనివార్యమైతే పాలకులు తలపట్టుకొని కూర్చోవచ్చు. కానీ ప్రజలు చూడాలని ఉవ్విళ్ళూరుతున్నారు. వారి దృష్టిలో అది ఒక మంచి ప్రత్యక్ష ప్రసారం. జీవితం క్షణభంగురమని చెప్పి చెప్పి విఫలమైన ఆధ్యాత్మికశాస్త్రాల కన్నా ఆ క్షణత్వాన్ని కళ్ళకు కట్టినట్టు చూపిస్తున్న ప్రత్యక్ష ప్రసారాలు ఎక్కువ ఫలితాలు సాధిస్తున్నాయి.

ప్రజలకు చావంటే భయంలేకుండా పోయిందని ఆనందిద్దామా? బ్రతుకంటే అర్థం కావటంలేదని భయపడదామా? (2001 - అక్టోబరు)

# భారత సందేశం

వ్యాసమహర్షి వేదవిభాగం చేయటమే కాక అష్టాదశపురాణాలనూ, మహాభారతాన్ని కూడా రచించాడు. మహాభారతాన్ని పంచమవేదంగా, మానవ జీవవసారంగా తీర్చిదిద్దాడు. అన్నదమ్ముల కలహానికి అసాధారణమైన ఇతిహాస గౌరవం దక్కటం విశ్వ సాహిత్యంలోనే అది విశిష్ట గ్రంథంగా పరిగణించబడటం అద్భుత సన్నివేశం.

మహాభారతంలో మనం ప్రత్యేకించి గమనించవలసిన విలక్షణ స్థితి ఒకటి కనిపిస్తుంది. ఆ ఇతిహాసంలో కనిపించే పాత్రలు కోకొల్లలు. ఉపాఖ్యానాలను విడిచి పెట్టినా, చుట్టపుచూపుగా వచ్చిపోయే పాత్రలను లెక్కచేయకపోయినా ప్రధాన పాత్రలే లెక్కకి మిక్కిలిగా కనిపిస్తాయి. అది అటుంచితే, అసలు ఏ ఒక్క పాత్రలో కూడా పరిపూర్ణమైన ఉత్తమపాత్ర లక్షణాలున్నట్టు సాధారణ దృష్టికి కనిపించకపోవటం మరో విశేషం. కురుకుల పితామహుడు భీష్ముడితో ప్రారంభించి, ధర్మానికి మారుపేరుగా వ్యవహరించబడిన ధర్మరాజును చూచినా వ్యాసమహర్షియే స్వర్గారోహణ పర్వంలో ఇచ్చిన తీర్పును గమనించినా ఏ పాత్ర కూడా మన దృష్టికి ఆననట్టు కనిపిస్తుంది. భాగవతాది గ్రంథాలలో కనిపించే పరమ భాగవతోత్తముల ముందు, పురాణాలలో కనిపించే జ్ఞానయోగుల ముందు, వాల్మీకి చిత్రించిన ఆదర్శమూర్తులు వెలవెల పోయినట్లు కనిపిస్తాయి. ఎందుకో మరి? ఆలోచించాలి.

మహాభారతంలోని పాత్రలు అన్నీ సజీవాలు. ఈ రోజుకూ మన కళ్ళముందు వారి ప్రతిబింబాలు అనునిత్యం కనిపిస్తుంటాయి, కొన్ని లక్షణాలు మినహాయించితే. మనం పరాన్ని సాధించాలన్నా ఇహమే మూలకారణం కాబట్టి, ఇహంతో సంబంధంలేని పరానికి అవకాశం లేదు. కాబట్టి లౌకిక జీవన విధానాన్ని ప్రధానాంశంగా చేసి దానిలోని లోటుపాట్లను, ఆదర్శతను చిత్రించి చూపటం వ్యాసమహర్షి లక్ష్యం. స్తబ్ధతకు, చలనానికి మధ్య ఎంతో అంతరముంటుంది. వాటి ఫలితంలోనూ తేడా వుంటుంది. చలనశీలమైన పాత్రలను చిత్రించి వాటి పర్యవసానాలను ప్రకటించటం, తద్వారా పాఠకులలో చలనతత్వాన్ని ప్రోదిచేయటం వ్యాసుడు ఆశించిన ప్రయోజనం.

వ్యాసభారతంలోని పాత్రలలో మరో విశిష్ట లక్షణముంది. ఒక పాత్ర మరొక పాత్రలోని గుణదోషాలను ఎత్తిచూపటం, అధిక్షేపించటం, అవహేళన చేయటం ఈ ఇతిహాసానికి ప్రాణం. ఎవ్వరిచేత కూడా ఎత్తిచూపబడని పాత్ర, ఎత్తిచూపేందుకు అవకాశమివ్వని పాత్ర భారతంలో కనిపించవు. అయితే ఆ విధంగా లోపాలతోకూడిన పాత్రలను చిత్రించటంలో కవి ఆంతర్యం?

ఈ సందర్భంగా మరొక్క విషయాన్ని గమనించాలి. ఆయా పాత్రలలో మనకు కనిపించే లోపాలు చాలావరకు వ్యక్తిగతమైనవి. సామాజిక జీవితం సమర్థంగా సాగాలన్నా, ఆదర్శంగా నిలవాలన్నా, సమాజంకోసం బ్రతకటం చేతకావాలన్నా సామాజిక దృక్పథంతోనే ఆలోచించాలి. ఆ క్రమంలో వ్యక్తి కన్నా సమష్టి గొప్పది కాబట్టి వ్యక్తిలోని దోషాలయినా, గుణాలయినా అప్రధాన మవుతాయి. సామాజికమైన గుణదోషాలే ప్రధానంగా గుర్తింపబడతాయి. ఆ దృష్టితో మహాభారతాన్ని ఆలోచించి చూడగలిగితే! (నవంబరు, 2001)

## పంచపదాలు

భీష్ముడు అంపశయ్యపై వుండి ఉత్తరాయణం కోసం ఎదురుచూస్తూ ధర్మరాజు అభ్యర్థన మేరకు జీవిత విధానాలను ఎన్నింటినో వివరించాడు. మహాభారతంలోని రెండు పర్వాలు - శాంతి, ఆనుశాసనిక పర్వాలు ఆ సంభాషణ సందేశాలకు సంబంధించినవే.

మంకి గీతలో భీష్ముడుపదేశించిన సుఖజీవనమార్గంలో అయిదు అంశాలను సుఖహేతువులుగా చెప్పారు.

**సర్వసామ్యమనాయాసం, సత్యవాక్యం చ భారత ।**
**నిర్వేదశ్చావిధిత్సా చ, యస్య స్యాత్ స సుఖీ నరః ॥**

సర్వసామ్యం, అనాయాసం, సత్యవాక్యం, నిర్వేదం, అవిధిత్స - అయిదు మార్గాలు.

అందరినీ లేదా అన్నింటినీ, సమానంగా చూడగలగటం సర్వసామ్యం, వాస్తవానికి ఇది ఒక్కటి పూర్తిగా అలవడితే మిగిలినవన్నీ అలవడినట్లే భావించవచ్చు. వివక్ష లేకుండా ప్రాణుల నన్నింటినీ, చేతనాచేతన పదార్థాలన్నింటినీ, ద్వంద్వరూపాలయిన భావాలన్నింటినీ సమానంగా చూడగలిగితే అంతకంటే కావలసినది ఏముంది?

ఆయాసపడకపోవటం అనాయాసం. అంటే నిరర్థకంగా శ్రమపడక పోవటం. నిత్య జీవితంలో స్వల్ప ప్రయోజనం కోసం, అది లేకపోయినా మనది కాకపోయినా మన కేమి నష్టం లేదు అనుకొన్న వాటికోసం కూడా మనం ఎంతో శ్రమపడుతూ వుంటాం. దానితో ఆందోళన పెరిగి శరీరాన్ని, మనస్సును కూడా కలతకు గురిచేస్తుంటాం. ఆ ఆయాసాన్ని వదిలివేస్తే!

మూడవది సత్యవాక్యం. దీనిపై భారతంలో ఎంతో చర్చ జరిగింది. ఏది సత్యం, ఏది అసత్యం అని నిర్ణయించి చెప్పటానికి వ్యాసుని మనస్సు ఎంతో పరిశ్రమించింది. ప్రస్తుతం సత్యవాక్యం మన వ్యవహారానికి సంబంధించినది. ఉదయంనుండి రాత్రివరకు ఎన్నో మాటాడుతుంటాం. వాటిలో ఏది సత్యవాక్యమో, ఏది దానికి దూరమైందో ఎవరి మనస్సుకు వారికే బాగా తెలుస్తుంది. ప్రాణిహితం కోరి పలికేది ఏదయినా సత్యవాక్యమే. ప్రాణికి కీడు చేసేది ఎంత సత్యమైనా అది అసత్యం క్రిందనే లెక్క.

నిర్వేదం అంటే దాదాపు వైరాగ్యం. కోరికలను అదుపుచేస్తే వైరాగ్యం. ఫలితాలు అందకపోయినా తొణకకుండా నిలవగలగటం నిర్వేదం. నిర్వేదమార్గం పరిపూర్ణ వైరాగ్యానికి దారిచూపిస్తుంది.

అవిధిత్స అంటే కర్మలపై ఆసక్తి లేకపోవటం. దీనిని భగవద్గీతలో సుస్పష్టంగా వివరించారు. కర్మలపై ఆసక్తి లేకపోవటమంటే కర్మఫలితంపై ఆసక్తి లేకపోవటమని.

ఈ అయిదు సూత్రాలలో మార్గాలు వేరైనా లక్ష్య మొకటే ! - కొన్నింటినైనా కొంత మేరకయినా జీవితంలో పాటించి చూడగలిగితే ఏ వైద్యుడి అవసరమూ వుండదు గదా! (డిశంబరు, 2001)

# అశాంతి

వర్తమాన సమాజంలో వ్యక్తులయినా వ్యవస్థ అయినా శాంతిని అన్వేషించటంలో సతమతమై పోతున్నారు. వీరంతా శాంతికాముకులై ఆ పరిస్థితిలో వున్నారని చెప్పలేం. కానీ, అశాంతి తమను ఎక్కడ ఇబ్బంది పెడుతుందో అన్న భయంతో ఆ స్థితికి లోనవుతున్నారు. అన్ని విషయాలలో వర్తించే సామాన్యసూత్ర మొకటుంది. ఏదైనా తన దగ్గరనుండే ప్రారంభం కావాలని. శాంతిసాధన లక్ష్యం అయితే దానికి ప్రయత్నం కూడా తన దగ్గరనుండే ప్రారంభం కావాలి.

అనాదిగా భారతజాతి "ఓం శాంతిః శాంతిః శాంతిః" అని ముమ్మారు శాంతిని ఆకాంక్షిస్తూ వల్లె వేసుకొంటూనే వుంది. శాంతిమంత్రాలు మనకు ప్రత్యేకంగా వున్నాయి. అయినా సరే, అశాంతి మన చుట్టూ ఈ నాటికీ రాజ్యం చేస్తూనే వుంది.

సమాజం - సృష్టి - కొనసాగుతున్నంత కాలం, మనస్సు స్వార్థంవైపు పయనిస్తున్నంత కాలం, మనిషి మనిషిగానైనా బ్రతకటానికి ప్రయత్నించనంత కాలం ఈ అశాంతి ఒక తప్పని స్థితి.

అశాంతిని పోగొట్టి శాంతిగా జీవించే మార్గాలు ఎన్నో ఎందరో చెప్పారు. మేధావులు వారి తను మనః ప్రాణాలను అర్పించి శాంతిస్థాపనకై ప్రయత్నించారు. ఇతరులకు శాంతంగా జీవించే మార్గాలు బోధించటానికే తమ మేధను మొత్తాన్ని వినియోగించి, వారు అశాంతిగానే జీవించి కూడా సామాజిక శాంతిస్థాపనకై ప్రయత్నించారు.

అయితే, సంఘంలో శాంతి సమస్య ప్రధానంగా సామాన్యజనానికి సంబంధించినది. వీరికి తమ గురించిన అవగాహనా తక్కువే, ఇతరులను గురించిన అవగాహనా తక్కువే. ఆ కారణంగా తమకేం కావాలో తమకే తెలియక, ఇతరులు ఎందుకు అలా వుంటున్నారో అర్థంచేసుకోలేక అసహనంతో అశాంతిని కొనితెచ్చుకొంటున్నారు.

మరీ సామాన్యజనానికి శాంతి - అశాంతుల సమస్య లేదు. మేధావులు, మహర్షులు అశాంతికి లోనైనా అది సామాజిక శాంతికోసమే. ఇక మధ్యతరగతి. మామూలు మనిషి మాత్రం తమ గురించి తాము కొద్ది సేపైనా ఆలోచించలేక, అంచనా వేసుకోలేక అశాంతికి గురవుతున్నారు. ఎవరినిగురించి వారు తెలుసుకుంటే ఇక అశాంతికి తావెక్కడ?

(జనవరి, 2002)

## స్థితప్రజ్ఞత

భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు చేసిన పరమోపదేశం అతీతంగా వుండమనీ, అలా వుంటేనే స్థితప్రజ్ఞుడు కాగలడనీ. ఇప్పటికి అదేదో ఆధ్యాత్మికభావన అనిపించినా అప్పటికి అది దేన్నీ పట్టించుకోవద్దు అన్న సూత్రాన్ని అర్జునునికి నూరిపోసి యుద్ధం చేయించటమే లక్ష్యంగా కొనసాగినదయి వుండవచ్చు. నిజానికి దేన్నీ పట్టించుకోకపోవటం అన్న పదాన్ని మామూలుగా వింటే అది తప్పనో, బాధ్యతారాహిత్యమనో అనిపిస్తుంది. కానీ, వాస్తవంగా చూస్తే అది స్థితప్రజ్ఞతయే గదా! ఆ విధమైన స్థితప్రజ్ఞత వర్తమాన ప్రపంచంలో బాగా పాతుకుపోతోంది. అందునా మన సమాజంలో.

తనకు, తన అవసరాలకూ, తన లాభాలకూ, యేమీ తోచకపోతే, చూచి ఓర్వలేకపోతే యితరుల నష్టాలకూ అవసరమైనంతమేర మనం పట్టించుకోవటం అలవాటు చేసుకొన్నాం. కానీ మనకు, మన అవసరాలకూ అన్న ఆలోచనదాకా పోలేకపోతున్నాం.

మన కొక ఇల్లు వుంది. అది విశాలవిశ్వం. అది అందరి యిల్లు. అయితే బలమున్నవాళ్ళు కొందరు కొన్ని కొన్ని ప్రదేశాలను ఆక్రమించి, సరిహద్దులు యేర్పరచుకొని వేరు పోయారు, కాబట్టి దేశాలయ్యాయి. ఇప్పటికైనా అంతకన్న బలవంతుడు తలచుకొంటే ఆధిపత్యం నిలవదు గదా!

ఆ క్రమంలో మన దేశం, మన యిల్లు. మన సొంత యింటిని యెంత పదిలంగా చూచుకొంటామో, మన దేశాన్ని అలాగే చూచుకోవాలి గదా! దేశం నాదెలా అవుతుందనుకోనవసరం లేదు. ఈ దేశంలో నువ్వు యెక్కడకు

వెళ్ళాలన్నా, యేం తినాలన్నా, యేం తాగాలన్నా యెవ్వరి అనుమతి అవసరం లేదు. ప్రయాణానికి అయ్యే ఖర్చు భరిస్తామే తప్ప ప్రయాణానికి అనుమతికోసం కాదు గదా! నడిచివెళ్ళగలిగితే యెక్కడా అడ్డులేదు గదా! తిండి విషయానికి వస్తే యింట్లో అయినా కొని తెచ్చుకొంటేనే తిండి వుంటుంది. కానీ తనంతట తాను రాదు. అదే స్థితి దేశంలో యెక్కడైనా సంభవమే.

కాబట్టి ఈ దేశమంతా కూడా మన ఇల్లే. సొంత ఇంటిని కాపాడుకొన్నట్టు, సొంత యింటిని అందంగా తీర్చుకొన్నట్టు, సొంత యింటిని చూచి గర్వపడ్డట్టు పరిశుభ్రంగా వుంచుకొన్నట్టు దేశం విషయంలో కూడా ఆలోచించగలగాలి గదా!. పరిసరాల పరిశుభ్రతలో, సంరక్షణలో, సౌందర్యంలో అంత శ్రద్ధను ప్రదర్శించాలి. గదా!

ఈ విషయాలన్నీ యెలావున్నా ఒక్క అంశంలో ఈ దేశంలో ప్రజలందరికీ దేశాన్ని యింటిలా చూచుకొనే అలవాటైంది. సొంత యింటిలోని డబ్బును యెవ్వరి అనుమతి లేకుండా జేబులో కుక్కుకోగలిగినట్టు దేశం విషయంలో కూడా యెవడికి అందినంత వారు జేబులో నింపుకోవటంలో సిద్ధహస్తులయ్యారు. దేశంమీదున్న యీ ప్రేమను యేమని నిర్వచించగలం. స్వపరభేదంలేని ద్వంద్వాల కతీతమైన స్థితిప్రజ్ఞత అందామా? (ఫిబ్రవరి, 2002)

# సహగమనమే ప్రగతి

విశ్వసృష్టి విలక్షణమైంది. విచిత్రత, విశిష్టత దాని ప్రధాన లక్షణాలు. కోట్ల సంవత్సరాల నుండి అవిచ్ఛిన్నంగా సాగుతూ వస్తున్నది. నిన్న మొన్నటి విషయాలు తప్ప అంతకన్న వెనక్కు వెళ్ళి చూడటానికి మనకు తగిన ఆధారాలేవీ లేవు. దొరికిన రాళ్ళు రప్పలకు వయస్సు నిర్ణయించి దానినిబట్టి మన వయస్సును కూడా నిర్ణయించుకొంటున్నాం. భౌతికశాస్త్రాలయినా, వేదాంతశాస్త్రాలయినా దీని పుట్టుకకు సంబంధించిన మూలకారణాన్ని తేల్చి చెప్పలేకపోతున్నాయి. చెట్టు ముందా? విత్తు ముందా? అని సామెతలద్వారా తత్వాన్ని నెమరువేసుకొంటున్నాం.

ఇంతగా కోట్ల కోట్ల సంవత్సరాలుగా సాగుతున్న సృష్టిక్రమంలో మనిషి తొలినాటినుండీ వుండి వుండవచ్చు. లేదా జీవపరిణామక్రమవాదాన్ని అంగీకరిస్తే మధ్యలో ఎక్కడో ఎప్పుడో ఆవిర్భవించి వుండవచ్చు. అయితే, అది కూడా మనకు అందనంత వెనుకనే.

మరి ఇంతకాలం నుండీ వున్న మనిషి ఎంత ఎదిగి వుండాలి? సుఖాలకోసం, సౌకర్యాలకోసం చేసిన అన్వేషణలు ఫలించి ఇప్పటికే అవి మోయలేని భారాలుగా, వీడలేని అలవాట్లుగా మారాయి. వద్దువద్దనుకుంటూనే వాటికి సిద్ధపడుతున్నాం. ఇంకా ఇంకా అన్వేషణలు సాగుతున్నాయి. ఇంకా ఇంకా ముందుకు వెళ్ళగలం కూడా. బహుశః కొంతకాలానికి మనిషికి మనిషికి మధ్య యాంత్రికమైన (యంత్రాలద్వారా) సంబంధమే తప్ప ప్రత్యక్ష సంబంధం లేకపోవచ్చు. ఒకే ఇంట్లో ఎందరున్నా ఎవరికి వారు ఒక్కొక్కరుగా మిగిలిపోయి యాంత్రిక సంబంధాలతో మనుగడ సాగించవచ్చు. దీనిలో చాలా భాగం ఇప్పటికే సాధించాం.

ఈ అద్భుత ప్రగతి ఎందుకు? ప్రగతి ఉనికిని గూర్చిన ప్రశ్న కాదిది. దాని వినియోగానికీ, ఫలితానికి సంబంధించిన ప్రశ్న. ఇంతింత శ్రమపడి మానవుడు. సాధిస్తున్న ఈ అన్వేషణ అన్వేషణ కోసమేనా? మరేదైనా ప్రయోజనముందా? అసలే దేవుడు విచిత్రంగా తయారుచేసిన సృష్టిని మనిషి అంతకన్నా విచిత్రంగా మారుస్తున్నాడు. విచిత్రంగా వుండటమే లక్షణమంటారా? అదైనా దేనికోసం?

మనిషి సాగించే కృషి, సాధించే ఫలితం ఈ రెండూ కూడా మనిషిని అతిక్రమించి ఎక్కడికో వెళ్ళే అవకాశం లేదు. కాబట్టి సాధిస్తున్న ప్రతిఫలితం మనిషి మనుగడలో ప్రతిబింబించాలి. మనిషి మనస్సులో ప్రతిఫలించాలి. మనిషి మనిషి కలిసి జీవించటంలో సంగమించాలి. ఎవరి గీతలు వారు గీచుకోవటానికి, ఎవరి కోటలు వారు కట్టుకోవటానికీ మనమేం ఆటవికులమా? అనాగరికులమా? చేతులు పట్టుకొని మనిషి మనిషి కలిసి నడవటానికి అందరూ ప్రయత్నించాలి. ప్రగతికి సంకేతం సహగమనమే.

(మార్చి, 2002)

# మనస్సు

**"మన ఏవ మనుష్యాణాం, కారణం బంధమోక్షయోః"** అన్నారు పెద్దలు. విషయవాసనలలో బంధించబడటానికి గాని, వాటి నుండి విముక్తుడు కావటానికి గాని మనస్సే ప్రధానకారణం. మనస్సు అత్యంత చంచలమైనది. ఒక్క క్షణమైనా స్థిరంగా ఉండదు. ప్రపంచంలో మనస్సుకంటే వేగంగా చరించేది మరొకటి లేదు. అంత చంచలమూ, వేగవంతమూ ఐన మనస్సును నిగ్రహించటం అంత తేలికైన పని కాదు. ఈ మనోనిగ్రహం కేవలం ఆధ్యాత్మవాదులకు మాత్రమే కాదు, భౌతికవాదులకు, సామాన్య ప్రజలందరకు కూడా అత్యంతావశ్యకమైనది. అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మని ఇలా అడుగుతాడు. - ఓ కృష్ణా! మనస్సు అత్యంత చంచలమైనది! గాలిని నిగ్రహించటం ఎంత కష్టమో మనస్సును స్వాధీనం చేసుకోవటం కూడా అంతే కష్టంగా వున్నది. మనస్సును స్వాధీనం చేసుకోవటానికి ఏమి చేయమంటావు? అని. శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో ఈ విధంగా అంటాడు. "ఓ అర్జునా! మనస్సు చాలా చంచలమైనదన్న దానిలో సందేహం లేదు. దానిని నియంత్రించడం కూడా చాలా కష్టమైనదే. కానీ, అభ్యాసం, వైరాగ్యం అనే రెండు మార్గాలద్వారా దాన్ని స్వాధీనం చేసుకోవచ్చు."

**"అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేన చ గృహ్యతే"** గీత.

మనస్సు మన అధీనంలో ఉండదు. అది స్వేచ్ఛగా, దాని ఇష్టం వచ్చినట్లు విహరిస్తూ వుంటుంది. దానిని నియంత్రించాలంటే ముందుగా మనస్సును వశం చేసుకోవాలన్న గట్టి సంకల్పం అవసరం. తరువాత మనస్సుయొక్క స్వభావాన్ని అర్థం చేసుకొని, తగినవిధంగా, నియమబద్ధంగా అభ్యాసం చేయాలి. ప్రతివ్యక్తిలోను సంకల్పశక్తి అనేది ఎంతో కొంత ఉంటుంది. కాని మనస్సును వశం చేసుకోవాలి అనే దృఢమైన సంకల్పం, దీక్ష లేనిదే అది వశంకాదు, మనస్సును వశం చేసుకోవాలంటే సుఖభోగాలను జీవితధ్యేయంగా భావించరాదు, భోగలాలసత్వం ప్రధానంగా వున్నంతకాలం మనస్సును స్వాధీనం చేసుకోవాలనే సంకల్పం దృఢంగా వుండదు, సంకల్పం దృఢంగా లేనంతవరకు మనస్సు

స్వాధీనం కావటం అసంభవం. సుఖభోగాలు కావాలనే కోరికను అధిగమించనంతవరకు, ఏమి చేసినా మనస్సు సంపూర్ణంగా వశం కాదు. జీవితంలో పదేపదే ఎదురయ్యే అపజయాలకు క్రుంగిపోరాదు. ప్రతి అపజయమూ సరికొత్త ప్రయత్నాలకు మనలను మరింత ప్రోత్సహించేది కావాలి.

మనస్సును వశం చేసుకోవాలనే సంకల్పశక్తిని పెంచాలంటే దానిని బలహీనపరచే కారణాలను దూరం చేయాలి. దానిలో నూతన శక్తిని నింపటానికి కృషి చేయాలి. మనస్సును వశం చేసుకోవటమనేది ప్రపంచంలో అన్నిటికన్న అతికష్టమైన పని. ఇంత పెద్ద పనిని నేను చేయగలనా అని దిగాలుపడి కూర్చోరాదు. ప్రయత్నం చేస్తున్నప్పుడు ఎదురయ్యే పరాజయాలను లెక్కచేయక, పట్టుదలతో మరింత తీవ్ర కృషి చేయాలి గాని నిరాశ, నిస్పృహలతో వదలివేయరాదు. అనేకమంది గొప్పవారు కూడా అంత సులభంగా మనస్సును స్వాధీనం చేసుకోలేకపోయిన మాట యథార్థం.

(ఏప్రిల్, 2002)

# సంఘనీతి

మనిషి సామాజిక జీవి. సృష్టిలోని అనేక ప్రాణులలో తానొకడైనా ఇతర ప్రాణుల జీవన విధానాల కన్నా విలక్షణమైన జీవన విధానాన్ని ఏర్పరచుకొన్నాడు. దాన్ని విశిష్టమైనదిగా భావిస్తున్నాడు. ఇతర ప్రాణులు ఆ విషయాన్ని అంగీకరిస్తాయో లేదో మనకు తెలియదు. ఆ అంశం తేలేదాకా మనిషి జీవన విధానం గొప్పదని తాత్కాలికంగా అంగీకరిద్దాం.

ఆ జీవనవిధానాన్ని నిర్మించుకోవటంలో మనిషి ఇతర ప్రాణులనుండి తనను తాను కాపాడుకోవటం కంటే సాటి మనిషినుండి తనను తాను కాపాడుకోవటం అవసరమని భావించాడు. దాని కెంతో ప్రాధాన్యమిచ్చాడు. అందుకే వ్యక్తిప్రవర్తనను అనేక కోణాలనుండి నియంత్రించే సూత్రాలను కుప్పలు తెప్పలుగా తయారుచేశాడు. ఆ నియంత్రణలూ, ఆ నీతులూ పాటించటానికి

తనకు కూడా వీలుకాదని తెలిసినా, నైసర్గిక మానసికస్థితి వాటికి భిన్నంగా వుంటుందని గమనించినా, ఆ నియంత్రణను సడలించేందుకు అవకాశమివ్వలేదు. పదిమంది కలిసి పరామర్శించుకొనే వేళలో, అందరూ కలిసి కొందరిని గురించి మాటాడుకొనే సమయంలో ఆ నీతులు, ఆ నియంత్రణలూ వీరోచితంగా విజృంభిస్తుంటాయి. తొలినాటి ఆ నియంత్రణలే తర్వాత్తర్వాత రాజశాసనాలుగా, ప్రస్తుతం చట్టాలుగా రూపుదిద్దుకొన్నాయి. ప్రశాంతమైన సమాజాన్ని నిర్మించటానికి ఇదొక్కటే మార్గమని భావించినవారు దీనిని తు.చ తప్పకుండా ఆచరింపజేసేందుకు ప్రయత్నిస్తుంటారు.

ఇదంతా ఒక పార్శ్వం మనిషికి. మరొక పార్శ్వంలో మనిషి తనకు తానుగా నిలుస్తాడు. ఇక్కడ నియంత్రణలైనా, శాసనాలయినా, చట్టాలయినా తనకు తాను నిర్మించుకొంటాడు. కొన్ని సమయాలలో ఇవి సంఘ నియంత్రణతో సరితూగుతాయి. అప్పుడప్పుడు వాటికన్నా గొప్పగా కూడా ఉంటాయి. కానీ, చాలా సందర్భాలలో సంఘనీతితో విభేదిస్తుంటాయి.

సామాజికనీతిని పాటించటంద్వారా తన ఆనందాన్నో, సుఖాన్నో కోల్పోయే పరిస్థితిలో మనిషి స్వనియంత్రణసిద్ధాంతాలనే పాటిస్తాడు. దానిని సమర్థించుకొనేందుకు రకరకాల మార్గాలలో ప్రయత్నం చేస్తుంటాడు. అది దాదాపు అందరికీ అనుభవంలో వుండే విషయమే. కాకపోతే అది అందరిలోనూ కనిపించే లక్షణమే అన్న అవగాహన వున్నవాడు ఎదుటివాణ్ణి బుకాయించకుండా తలవంచుకొని పోతాడు. అది కూడా లేనివాడు, లేదా లేనట్లు నటించేవాడు దబాయింపును ఆశ్రయిస్తాడు.

ఇంతకూ మనుషులు ఎవ్వరూ పాటించలేని నీతులనూ, నియంత్రణలనూ ఎందుకు నిర్మించినట్లు? అక్కడే మానవుడికి విచక్షణ కావాలి. తన సుఖాన్నీ, ఆనందాన్నీ కోల్పోకుండానే సంఘనీతిని గౌరవించే స్థాయికి తన వ్యక్తిత్వాన్ని దిద్దుకొనగలగాలి. అప్పుడు సంఘానికీ, వ్యక్తికీ సమన్వయం కుదురుతుంది.

(మే, 2002)

# మంకి గీత

మహాభారతంలో భగవద్గీత చెప్పబడిందని మనందరికీ తెలుసు. అయితే భగవద్గీతతోపాటు మరెన్నో గీతలు మహాభారతంలో వున్నాయి. భగవద్గీత సమగ్రజీవన ప్రణాళిక అయితే, ఇతర గీతలు పాక్షికంగా ఏదో ఒక అంశాన్ని కేంద్రీకరించుకొని ఏర్పడినవి. అటువంటి గీతలలో శాంతిపర్వంలోని మంకి గీత ఒకటి.

మంకి ఒక ముని. అయితే ధనం సంపాదించాలన్న కోరిక ఆ మునిలో ఏర్పడింది. దానితో రకరకాలుగా ప్రయత్నించి విఫలుడవుతాడు. చివరగా తన దగ్గర మిగిలిన డబ్బునంతా వెచ్చించి రెండు ఎద్దులను కొంటాడు. వ్యవసాయం చేసి ధన సంపాదన చెయ్యాలని సంకల్పిస్తాడు. ఆ ఎద్దులకు దుక్కిదున్నటం అలవాటు చేయాలని తీసికొనిపోతుంటాడు మంకి మహర్షి. దారిలో ఒక పెద్ద ఒంటె పడుకొని వుంటుంది. దాని ఉనికిని లెక్కచేయకుండా పొగరుగా వెళ్తాయి ఈ ఎద్దులు. దానితో ఒంటె కోపించి ఆ ఎద్దుల మీద బడి చంపివేస్తుంది. చివరి ప్రయత్నం కూడా విఫలం కావటంతో మంకి విరక్తుడవుతాడు. దైవసహకారం లేకపోతే ఏమీ చేయలేమని, కార్యసిద్ధి దైవాయత్తమే అని, పురుషుడు ఎంత మొండికెత్తినా కేవలం పురుషకారం కార్యసాధనకు చాలదనే నిర్ణయానికి వస్తాడు. తన ఈ దుస్థితికి కారణం కోరికలే గదా అని ఖేదపడతాడు. కోరికలు లేకపోవటం కన్న గొప్పసుఖం లేదని సంభావించి తృప్తిపడతాడు.

**యచ్చ కామసుఖం లోకే, యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।**
**తృష్ణాక్షయసుఖస్యైతే, నార్హతః షోడశీం కలామ్ ॥**

కామసుఖాలు ఇహలోకానికి సంబంధించినవి. పుణ్యపురుషులకు మరణానంతరం దివ్యసుఖాలు లభిస్తాయని మన విశ్వాసం. అయితే కోరికలు చంపుకొనటంలోని సుఖం వీటిని మించినదట.

కోరికలు అనేవి మనిషికి భారం. మనం వాటిని నడిపించినంత కాలం పరవాలేదు. జీవితం పూర్తిగా సుఖంగా వుందని చెప్పలేకపోయినా, దుఃఖరూపంగా పరిణమించిందని అనలేము. కానీ, శ్రుతి మించి అవే (కోరికలు)

మనలను నడిపించే స్థితి వస్తే మాత్రం బ్రతుకు దుర్భర మవుతుంది. కుక్క తోకను ఊపాలి కానీ, తోకకుక్కను ఊపకూడదు. మెదడు సంకల్పించిన మార్గంలో కాళ్లుకదలాలి, కానీ కాళ్ళుకదలటం ప్రారంభమైన తర్వాత మెదడు కదలకూడదు.

కోరిక అనేది నేరం కాదు. తీవ్రంగా శిక్షకు గురికావలసిన దోషమూ కాదు. కోరికలే లేకపోతే మానవజాతి ఇంతగా పురోగతిని సాధించి వుండేది కాదు. అయితే ఆ కోరికకు కొన్ని పరిమితులుంటాయి. ఉండాలి కూడా. నడక మనిషికి స్వాభావిక లక్షణం. అవసరపడినపుడు కొంతమేర పరుగెత్తగలగటం మనిషికి సాధ్యం. అయితే జీవితం మొత్తం పరుగులతోనే గడపాలన్నా, ఇంకా వేగంగా ఎగురుతూ వెళ్ళాలన్నా అది మనిషికి అసాధ్యం. దాని పరిణామాలూ, ఫలితాలూ కూడా భరించలేనివవుతాయి.

మనిషి కోరికలకు సయితం అదే నియమం వర్తిస్తుంది. నడవాలని కోరుకోవటం నేరం కాదు. ఎగరాలని మనస్సుపడటం మన స్థాయికి తగినది కాదు

(జూన్, 2002)

# తెలుగు సామెతలు

జీవితాన్ని గురించి ఆలోచించటం, అవగాహన చేసుకొనటం మనిషిగా పుట్టిన అందరికీ అవసరం. అయితే అందరికీ అంత తీరికా, ఓపికా వుండటం లేదు ఆలోచించటానికి. అంత లోతైన, విశాలమైన మనస్సువుండటం లేదు అవగాహన చేసుకొనటానికి. జీవితాన్ని కనీసంగా తెలుసుకోవాలన్నా, సమాజంలో బాధ్యతగల వ్యక్తిగా కొంతమేరయినా బ్రతకాలన్నా మనకు ఎంతో ఉపయోగ పడగలవి సామెతలు - తెలుగు సామెతలు.

'ఏదో సామెత చెప్పినట్టు' అంటూ ప్రారంభించి మాట్లాడేవారిని ఈ రోజుల్లో కూడా చూడవచ్చు. ఏ సామెతనూ వాడకుండా మాటాడటం అలాంటి వారికి ఇష్టం లేదన్న మాట. ఎందుకంటే నిత్య వ్యవహారంలో దాదాపు ఏ సందర్భంలో అయినా ఉదాహరించు కొనటానికి వీలయినంత విస్తృతపరిధి సామెతల కుంది.

సామెత అంతగా వ్యక్తులను, శ్రోతలను ఆకట్టుకొనటానికి కారణం అది చాలామందికి చెందిన జీవితానుభవం కావటమే. పదిమంది అనుభవాన్ని ఎవరో ఒకరు చక్కని చిక్కని భాషలోనికి కుదించినదే సామెత. ప్రత్యేకించి తెలుగుభాషలో సామెతలు కోకొల్లలు.

కాలం విచిత్రంగా ముందుకు కదులుతూ - బలం కలవారిచే కదిలించబడుతూ అంటే బావుంటుందేమో - వుంది. భాషలకున్న ప్రాధాన్యం, విలువా కూడా తగ్గిపోతున్నాయి. మరేదో అవసరానికి భాషను అభ్యసించటమే తప్ప భాషగా భాషను అధ్యయనం చేయటం మృగ్యమవుతోంది. విశేషించి తెలుగు పిల్లలు, తెలుగు తల్లులు, తెలుగును నిర్లక్ష్యం చేయటం తెలుగు భాషకు నష్టం కాదు కానీ, తెలుగుజాతికి నష్టం.

ఒక జాతియొక్క జాతీయతను, సంస్కృతిని, ప్రకృతి పరిశీలనా నైపుణ్యాన్ని, అవగాహనలోని లోతుపాతులను, మనిషి జీవించటానికి అవసరమైన ప్రాథమిక విషయాలనన్నింటిని సామెతలు తమలో ఇముడ్చుకొని వుంటాయి. వాటిని అధ్యయనం చేయడం కొన్ని జీవితాలను చదవగలగటమే.

ప్రస్తుతం తెలుగు పిల్లలకు కథలు వినే అవకాశం లేదు. కథలు చదివే అవకాశమూ లేదు. తెలిసీతెలియని వయస్సులో సందేహాలు కలిగే అవకాశమేలేదు. ఉమ్మడి కుటుంబాలు లేకపోవటం సగం జీవితాలను తలక్రిందులు చేయగా, అర్థంపర్థం లేని విద్యావిధానం, వెంపర్లాట మిగతా సగానికి తిలోదకాల నిచ్చాయి.

ఈ సందర్భంలో కనీసం మాట్లాడే ఆ కొద్దిపాటి సమయంలోనయినా తెలుగు సామెతలను పిల్లలు వినే అవకాశం కల్పించాలి. ఆ విధంగా అయినా కోల్పోతున్న తెలుగుదనాన్ని, విజ్ఞానాన్ని కొంతమేరకయినా కాపాడుకోగలగాలి.

(జూలై, 2002)

# సంస్కృత వైభవమ్

భారతీయులకు గర్వకారణమైన రెండు అంశాలలో ఒకటి సంస్కృతి, రెండవది సంస్కృతం. సంస్కృతం అన్న పేరు వినగానే ఒక విశాలమైన వాఙ్మయం, అనాదిగా మానవ జీవితాలతో ముడివేసుకొనిపోయిన భావసముదాయం, ఈ దేశపు ప్రజల నిత్యవ్యవహారవిధానం అన్నీ మనస్సులో మెదులుతాయి. అయితే సంస్కృత భాష గొప్పదని అంగీకరించేవాళ్ళను వదిలిపెట్టినా, సందేహించేవాళ్ళ దృష్టి కోణంనుండి ఆలోచించి సంస్కృతం ఎందుకు గొప్పదో నిర్ణయించగలగాలి. ఏ భాషకైనా భాషగా దాని పటిష్ఠత, ఆ భాషలో రచించబడిన వాఙ్మయపరిపుష్టత ఉనికికి ప్రధానసాధనాలు. ఒక భాషగా సంస్కృత భాష గొప్పతన మేమిటని ఆలోచిస్తే ఏ భాష అయినా గొప్పదనటానికి ప్రమాణాలు ఏమిటని నిర్ధారించ గలగాలి. భాషయొక్క ప్రాచీనత, పటిష్ఠత, వర్తమానకాలంలోనూ దాని వినియోగం - ఈ మూడు అంశాలకు అనుకూల సమాధానాలు లభిస్తే ఆ భాష ఉన్నతమైనదనే నిర్ణయం.

సంస్కృత భాష ప్రాచీన మనటంలో ఎవరికీ అభ్యంతరం లేదు. ప్రాచీన భాషలుగా విశ్వవ్యాప్తంగా పరిగణించబడే భాషల్లో సంస్కృతం కూడా ఒకటి. సంస్కృత భాషాధ్యయనం చేసిన తర్వాత విదేశీయులు సైతం ఆనందాశ్చర్యాలకు లోనయి దాని గొప్పతనాన్ని కీర్తించిన పరిస్థితి సంస్కృతభాష కుంది. విశ్వ సాహిత్యంలో మొదటిదిగా చెప్పబడుతున్న ఋగ్వేదం సంస్కృతభాషలో రచించబడినదే. సంస్కృత భాషయొక్క పటిష్ఠతను గురించి ఎవ్వరూ సంశయించ వలసిన అవసరం లేదు. ఈనాటికీ ఎంత పండితుడైనా ఆ భాషా మర్యాదలను అతిక్రమించే సాహసం చేయలేడు. ఆ సాహసం చేసేవారికేమో అవసరం కలగటం లేదు. మానవుని మేధాసంపత్తికి ప్రబలసాక్ష్యం అనిపించుకొన్న పాణిని అష్టాధ్యాయి, దానిపై విస్తరించిన అనంత వ్యాకరణ శాస్త్ర విజ్ఞానం సంస్కృతాన్ని పటిష్ఠపరచాయి. ఇక మూడవ అంశం నేటి కాలానికి ఉపయోగపడటం.

ఈనాటికీ భారతదేశంలోని భాషలు - అవి ఏ భాషా కుటుంబానికి చెందినవయినా - సంస్కృతపదజాలం లేకపోయినా, సాహిత్యసహకారం లేకపోయినా స్వతంత్రంగా మనజాలని స్థితి వుంది. ఏ భాషలో అయినా నూతన పారిభాషికపదాల అవసర మేర్పడితే అవి సంస్కృతపదబంధాలు అయివుండటం, మరో రీతిగా వాటిని స్పష్టంగా చెప్పలేకపోవటం కనిపిస్తూనే వుంది. సంస్కృతాన్ని కాదనే వారైనా పదబంధాలకోసం దాన్నే ఆశ్రయించవలసివస్తోంది.

సామాన్యంగా కనిపించే విషయాన్ని సభ్యతాపరిధిలోనికి తీసుకొని రావాలన్నా పత్రికలు, సమాచార వేదికలు సంస్కృతభాషనే వాడవలసిరావటం, వాడటం రోజూ కనిపించే అంశమే.

ఈ విధంగా ఒక భాషగా సంస్కృతం నేటికీ అవసరమైన విశిష్టభాష. ఆ భాషలోని అంశాలు మరెప్పుడైనా వివరంగా చూద్దాం.

(సెప్టెంబరు, 2002)

# హిరణ్య శ్రాద్ధం

శ్రద్ధగా చేసే పని శ్రాద్ధ మవుతుంది. అత్యంత శ్రద్ధతో పితరులకై చేసే కార్యక్రమం కాబట్టి శ్రాద్ధమనే పదం ఆ ప్రత్యేకార్థంలో రూఢమైంది. కార్యక్రమాన్ని నిర్వహించే ఒడుపుని బట్టి ఇవి రకరకాలు. వండని పదార్థాలతో పెడితే 'ఆమ శ్రాద్ధం', వండిన వాటితో అయితే '(పిండ) శ్రాద్ధం', సంబంధాలు తెగతెంపులు చేసుకొనే ఉద్దేశ్యంతో బ్రతికుండగానే పెడితే 'చిటకశ్రాద్ధం' వగైరా. వంటా-వార్పూ లాంటిశ్రమకు సిద్ధపడకుండా ధనరూపంలోనే జరిపించేస్తే దాన్ని 'హిరణ్యశ్రాద్ధ' మంటారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు హిరణ్యశ్రాద్ధాన్ని మరో అర్థంలో స్థిరపరచారు. అదే లంచం. ఏతావతా అవినీతికి మూలమైన లంచం తీసుకోవటమంటే హిరణ్యశ్రాద్ధంలో భోక్తగా వుండటమంత గొప్పపని.

వర్తమాన సమాజంలో విచిత్ర స్థితి ఏర్పడింది. శ్రాద్ధాన్ని పెట్టవలసినప్పుడు భోక్త అవసరమవుతాడు. 'పనసకాయ దొరికిన రోజే తద్దినం పెట్టాలనే' గోదావరివాసుల అభిప్రాయాన్ని గౌరవించినా ఆ రోజూ భోక్త అవసరం. అయితే చిలకమర్తి వారి అర్థంలో మాత్రం దీనికి భిన్నమైన స్థితి. తద్దినం కోసం భోక్తలు కాకుండా భోక్తలకోసం తద్దినాలు (శ్రద్ధాలు) పెట్టవలసిన పరిస్థితి.

ఆధునిక నాగరికతలో శ్రాద్ధం పెట్టాలంటే భోక్తల కరువు ఏర్పడుతోంది. దాన్ని చిన్నతనంగా భావించేవాళ్లూ, చిలిపితనంతో స్వీకరించేవాళ్లూ, మనకు కనిపిస్తారు. శ్రాద్ధభోక్త అంటే తక్కువగా చూడబడటం (విజ్ఞత కలవారి విషయంలో ఇది జరగదు) మనం రోజూ చూస్తున్నా, హిరణ్యశ్రాద్ధ మంటే మాత్రం భోక్తలు పోటీలుపడివస్తారు. అసలు అడిగి, బ్రతిమిలాడి, బెదిరించి, హుంకరించి కూడా హిరణ్య శ్రాద్ధాలు పెట్టించుకొనేవాళ్ళ సంఖ్య రోజురోజుకూ మితిమీరితోంది.

ఇక్కడ భోక్తగా వుండటానికి సిగ్గు, బిడియం లాంటిపదాలేవీ అడ్డురావటం లేదు. కులగోత్రాలు గానీ, స్త్రీ పురుష భేదం కానీ, వయస్సు కానీ, ఏవీ ప్రతిబంధకాలు కావటం లేదు. సంఘంలో తమకున్న స్థాయి కానీ, తాను చేయవలసిన బాధ్యత కానీ, దీని కేమాత్రమూ నిరోధకం కావటం లేదు. అవకాశమున్న ప్రతిచోటా, అవకాశమున్న ప్రతివాడూ హిరణ్య శ్రాద్ధాలు పెట్టించుకోవటమే.

మామూలు శ్రాద్ధంలో భోక్త సంతృప్తి యజమాని సంతృప్తి అవుతుంది. కాబట్టి బ్రతిమిలాడి భోక్తకు అన్నం వడ్డించే అలవాటు అక్కడుంటుంది. హిరణ్య శ్రాద్ధంలో మాత్రం దీనికి పూర్తిగా భిన్నం. ఇక్కడ పీడించి తినటమే కానీ బ్రతిమిలాడి పెట్టడాలుండవు. అయినా నిస్సంకోచంగా పీడిస్తూనే ఉంటాం.

ఈ హిరణ్య శ్రాద్ధానికి సపిండీకరణం చేసే రోజు ఎప్పుడొస్తుందో ఏమో!

(అక్టోబరు, 2002)

# నాగరికత

మనిషి పుట్టి ఎంతకాలమైందో ఈనాటికీ ఏవో కాకిలెక్కలు తప్ప స్పష్టంగా చెప్పగల అవకాశం లేదు. పుట్టినప్పటినుండి ఎటువంటి మార్పులకు లోనయ్యాడో, ఎన్ని విధాలుగా బ్రతకటానికి ప్రయత్నం చేసాడో, ఆ క్రమంలో ఎన్ని కష్టాలు పడ్డాడో, ఎన్ని సుఖాలు మరిగాడో దిఙ్మాత్రంగా ఊహించి చెప్పటమేతప్ప నిర్దుష్టంగా సంభావించే అవకాశం లేదు. ఇవన్నీ అస్పష్టంగా కనిపిస్తున్నా ఒక్క విషయం మాత్రం స్పష్టంగా కనిపిస్తుంది. నాటికీ నేటికీ కూడా, మనిషి తాను అప్పటికున్న పరిస్థితికన్నా ఎక్కువ సుఖాన్ని, ఎక్కువ ఆనందాన్ని, ఎక్కువ లాభాన్ని పొందాలన్న తపనతోనే ఏ మార్పునైనా స్వీకరించాడు. ఎప్పటికప్పుడు జరుగుతున్న మార్పులలోని అడుగుపొరలను (ఆంతర్యాన్ని) సంస్కృతి అని, పై పొరలను (ఉపరితలాన్ని) నాగరికత అనీ నిర్వచించుకొన్నాడు.

భారతదేశం సంస్కృతి, నాగరికతల విషయంలో ప్రపంచ దేశాలకు దారిచూపగలదని మన భావన. ఇతర పాశ్చాత్యదేశాలు ఎదిగీ ఎదగని స్థితిలో వున్నప్పుడే భారతదేశం మహోన్నత స్థితికి చేరివుందని మన ప్రగాఢ విశ్వాసం. ముందైనా, కొంత ఆలస్యంగానైనా ప్రతి దేశానికీ ఒక సంస్కృతి ఏర్పడి వుంది. ప్రతిదేశం వర్తమానంలో తనదైన నాగరికతతో ముందుకు పోతూనే వుంది. అయితే నాగరికత పరమార్థం ఏ దేశంలో పాతుకుపోయి ఉంటే ఆ దేశం నాగరికతలో అన్నింటికన్న ముందున్నదని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

మానవజాతి ఎదుగుదలలో ప్రధాన లక్ష్యం సుఖం, శాంతి, ఆనందం అయినప్పుడు వాటిని పొందగల అవకాశం ఎక్కడుంటే అది నాగరికదేశం. ఎదుగుతున్న సమాజంలో కానీ, ఎదిగిన సమాజంలో కానీ ఎవ్వరూ ఇతరుల సహకారం లేకుండా సుఖంగా, ఆనందంగా జీవించగల అవకాశం లేదు. అలనాటి ఆటవిక జీవితాలలో ఎవ్వరితో సంబంధం లేని ఏకాంత సుఖశాంతులు దొరికి వుండవచ్చు. కానీ, ఈనాటి నాగరిక సమాజాల్లో ఆ అవకాశం లేదు. కాబట్టి తన సుఖశాంతులకు తానే కాకుండా ఇతరులు కూడా బాధ్యులే అని

గుర్తించగలిగితే అది నాగరికతను అర్థంచేసుకోగలగటంలో మొదటి మెట్టు. తనకు ఇతరులతో అపేక్ష పున్నట్లే తనతోనూ ఇతరులకు అపేక్ష వుంటుందని, కాబట్టి తాను ఇతరుల సుఖశాంతులకు అడ్డు కాకూడదని, విఘాతం కలిగించకూడదని అర్థంచేసుకోగలిగితే నాగరికత లక్ష్యం అర్థంమైనట్టు.

ఆ కోణంలోనుండి చూస్తే ప్రపంచదేశాలలో ఈనాటి భారతం ఏ స్థానంలో వున్నట్టు. భారతదేశంలో సాధారణ ప్రజలు ఇప్పటికీ గ్రామాలలో వున్నా, అరణ్యాలలో వున్నా, నాగరికులే. నాగరికులమని చెప్పుకుంటూ, పదిమంది బాధ్యతలు భుజాన వేసుకొంటూ, పదిమంది శ్రమతో సుఖపడటం చేతనైన నాగరికులు ఎప్పటికి నాగరికతను నేర్చుకొంటారో?

(నవంబరు, 2002)

# ఆనందో బ్రహ్మ

**"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్.**
**ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే.**
**ఆనందేన జాతాని జీవంతి. ఆనందం ప్రయంత్యభిసంవిశన్తి"**

- అని ఉపనిషత్తులు ఆనందమే బ్రహ్మ యని ప్రకటించాయి. బ్రహ్మజ్ఞానాన్ని సాధించటం అంత తేలిక కాదనీ, యమదమాది నియమాలెన్నో దానికి సాధన సంపత్తి అనీ, జన్మజన్మల అనుభవాల ఫలితంగా జ్ఞానం సిద్ధిస్తుందనీ ఒకవైపు చెపుతూ మరోవైపు ఆనందమే బ్రహ్మ అని అనటం పరస్పరం పొసగని విషయాలుగా అనిపిస్తాయి. నిజానికి ఆనందమే బ్రహ్మ అయితే బ్రహ్మజ్ఞానం కరతలామలకం గదా అని అనుకొనేలా చేస్తాయి.

యథార్థంగా ఆనందంగా వుండగలిగితే అది బ్రహ్మజ్ఞాన సాక్షాత్కారమే. అయితే మనకు కనిపించినంత తేలికగా ఆనందసిద్ధి ఉండదు. పుట్టిన ప్రతి మనిషి ఆనందంగా జీవించాలనే కోరుకొంటాడు. అనుక్షణమూ దానికోసమే ప్రయత్నం

చేస్తుంటాడు. అయినా సరే, ఆనందంగా జీవించగలుగుతున్నాడా అంటే గట్టిగా చెప్పటం కష్టం. ఎంతమంది ఆనందంగా జీవించగలుగుతున్నారో అంచనా వేయటం కూడా కష్టం.

ఎందుకంటే బ్రహ్మజ్ఞానం ఎంత అగమ్యగోచరంగా కనిపిస్తుంటుందో ఆనందస్వరూపం కూడా అంత అయోమయంగానే వుంటుంది. ఆనంద కారణాలనూ, వాటికున్న కార్యకారణభావసంబంధాన్ని స్పష్టంగా తెలుసుకోవటం అంత తేలికేమీ కాదు. ఆనందం యొక్క స్థూల, సూక్ష్మ భేదాలను తెలిసికోవటం కూడా మనిషికి మామూలుగా అందని స్థితియే.

ఆనందకారణాలు మనిషి మనిషికీ మారుతుంటాయి. ప్రదేశాన్ని, కాలాన్నీ, సందర్భాన్నీ బట్టి మారిపోతుంటాయి. సాధారణ మానవుడు తాను, తన మనస్సు, తన మనస్సు అభిలషించే ఆనందకారణాలను అన్వేషించి పట్టుకొనగలిగితే కొంతమేర ఆనందంగానే బ్రతకవచ్చు.

కానీ, సంఘజీవి అయిన మనిషి ఆనందానికి ఇతరులనుండి కూడా కారణాలను గ్రహిస్తాడు. 'మనది కానిది మనకెప్పుడూ నప్ప' దని ప్రాథమిక సూత్రాన్ని విస్మరించి, కనిపించిన ప్రతివాడితో తనను తాను పోల్చి చూచుకొని, ఇతరులలాగా ఆనందంగా జీవించాలని కలలు కంటున్నాడు. ఆ కలలు కొనసాగినంతకాలం ఆనందం అందుబాటులోనికి రాదు. అది బ్రహ్మపదార్థంలాగా అయోమయమనీ అనిపిస్తుంది.

ప్రతి వ్యక్తికీ తనలో తనదంటూ ఒక లోకముంటుంది. ఆ లోకంలో తాను ఆనందించటానికి తగిన పరిసరస్థితిని ఇతరుల ఆనందానికి భంగకరం కాని రీతిగా అన్వేషించుకొని ఆనందించగలిగితే అది బ్రహ్మానందమే. ఆ స్థితికి చేరనంతవరకు బ్రహ్మజ్ఞానంకోసం తపనపడ్డట్టు ఆనందంకోసమూ తపించవలసిందే.

(డిసెంబరు, 2002)

# ఆదర్శజీవితానికి అడ్డదారులు లేవు

జీవించటం ఒక కళ. అందరూ నడిచే దారిలో అలవోకగా నడవటం చాలామందికి ఇష్టం. దానివల్ల వచ్చే నష్టాలను భరించటానికి, అనుభవించటానికి వారికి ఏవిధమైన అభ్యంతరం వుండదు. అయితే ఆ జీవితం సజావుగా సాగుతున్నట్టు కనిపించినా జీవితానుభవాన్ని మాత్రం సంపూర్ణంగా పొందలేము.

జీవితాన్ని కళగా భావించేవారు మాత్రం మరో కోణంలో నుండి ఆలోచిస్తారు. తమవైన కొన్ని విలువలను జీవితంలో ప్రతిబింబించే ప్రయత్నం చేస్తారు. దానివల్ల నష్టాలతోపాటు కష్టాలు కూడా వస్తాయి. అయినా సరే ఆ అనుభవం ముందు, ఆ ఆనందంముందు కష్టనష్టాలను వాళ్ళు లెక్కించరు. అందరూ మూసపోసినట్టు జీవిస్తే చరిత్ర లేదు. సంస్కృతి లేదు. ఆ జాతిని గురించి చెప్పుకోవటానికి మిగిలేదంటూ ఏమీ వుండదు.

వ్యక్తి జీవితం విలువైనది. దానికన్నా సామాజిక జీవితం మరీ విలువైనది. ఎందరో ఉత్తములు తమ జీవితాన్ని మలచుకొన్న తీరులో మీగడగట్టిన అనుభవాలే ఆ జాతిసంస్కృతిగా నిలిచిపోతాయి. అందుకే ప్రతిమనిషీ తనదైన పద్ధతిలో జీవించగలగాలి. ఆ పద్ధతిని సామాజికపద్ధతితో సమన్వయింపజేయగలగాలి. ఆ క్రమంలో మూసపోసుకున్న సమాజంలోనికి క్రొత్త విలువలను చొప్పించటంలో వ్యక్తికి ఇబ్బందులు తప్పవు. అయినా వాటిని అధిగమించి, విలువలను అందించిన వారే ఆదర్శవ్యక్తులుగా చరిత్రలో నిలిచిపోతారు. అటువంటివారి అడుగుజాడల్లో ఇతరులు నడక సాగిస్తారు.

ఈమధ్య సమాజంలో మరీ విచిత్ర తత్త్వాలు కనిపిస్తున్నాయి. ఆదర్శ జీవితానికి అడ్డదారులుండవన్న సత్యాన్ని దాదాపు అందరూ విస్మరిస్తున్నారు. సామాన్య వ్యక్తులు, సాధారణ స్థాయిజీవితాలు ఆ ఒరవడిలో సాగితే జాతికి పెద్ద నష్టమేమీ లేదు. కానీ, జాతిని తీర్చిదిద్దవలసిన బాధ్యత గల స్థానంలో వున్నవారు సైతం అడ్డదారులను అభివృద్ధిగా సూచిస్తూ, ప్రతిపాదిస్తూ, సమర్థించుకొంటూ, మిగిలినవారిని దారితప్పించే ప్రయత్నం చేస్తున్నారు. దారితప్పటమే గొప్పతనమని

అనిపిస్తున్నారు. ఇది జాతికి తీరని ద్రోహం. ఇప్పటికే దాని ఫలితాలు కనిపిస్తున్నాయి. సామాన్యవ్యక్తి కూడా ఏ రంగంలో అయినా, ఏ కోణంలో నుంచి అయినా అడ్డదారుల్లో ప్రయాణం సాగించాలనుకొనే పరిస్థితి దాపురించింది.

ఇకనైనా ప్రజలు గ్రహించాలి. ఆదర్శ జీవితానికి అడ్డదారులుండవు. తనదైన మార్గంలో నూతన ప్రమాణాలను ధర్మబద్ధంగా అందించగలవాడే ఆదర్శవంతుడవుతాడు. (జనవరి, 2003)

## రామరాజ్యం

మరోమారు శ్రీరామనవమి వచ్చింది. ఊరూరా చలవపందిళ్ళు. పందిళ్ళలో సీతారామకళ్యాణాలూ, తలంబ్రాలు పంచుకోవడాలూ, భద్రాద్రిరాముని కళ్యాణ వైభవాన్ని ఆకాశవాణి ద్వారా ఆలకించటాలు అన్నీ సజావుగానే పూర్తయ్యాయి. ప్రజలంతా మరో రోజు భక్తిలో, ప్రపత్తిలో, కళాసంపత్తిలో మునిగితేలారు. రామదాసు కీర్తనలు విన్నారు. లవకుశలోని పాటలు విన్నారు.

అయిపోయింది, ఉదయానికి సర్వం సంపూర్ణం. తలంబ్రాలూ, తాటాకుల విసనకఱ్ఱలు, భక్తి ప్రపత్తులూ అన్నీ రొటీన్ లైఫ్లో కలిసిపోయాయి. నెలలో మూడు వానలు కురుస్తున్నాయో లేదో, బంగారు పంటలు పండుతున్నాయో లేదో, పేదసాదల బ్రతుకు మారుతోందో లేదో ఎవ్వరికీ పట్టడంలేదు.

అవును, పట్టించుకోవలసిన అవసరమేముంది. బహుశః రాముడికి కూడా పట్టించుకోవలసిన పరిస్థితి వున్నట్లులేదు. రామరాజ్యం కావాలంటాం. ఒకే బాణమూ, ఒకటే మాటా, ఒక్క భామకే రాముని ప్రేమా - అని పాటలు పాడుకుంటూ గడిపేస్తాం. అంత మాత్రానికేనా మనకు రామరాజ్యం అవసరమయ్యేది. ఆ వ్యక్తిగత లక్షణాలను - అవి విశిష్టమైనవే. కాదనలేం - చూచేనా రామరాజ్యం కావాలని కోరుకునేది. అవి కుటుంబానికి పరిమితమైన లక్షణాలే కానీ రాజ్యానికి సంబంధించినవి కావుగా. వ్యక్తితో ముడిపడినవే కానీ వ్యవస్థకు సంబంధించినవి కావుగా. రాజ్యమంటే వ్యవస్థ కానీ, వ్యక్తి కాదుగా.

ఎవడో ఏదో అన్నాడని, అదే ప్రజావాక్యమని ఇల్లాలిని అడవికి పంపించాడు రాముడు. ఇల్లాలిని వదిలిపెట్టే విషయాన్ని అటుంచితే ఎవడో ఏదో అన్నమాటకు ఆ రాచరికపు వ్యవస్థలో కూడా ఎంత విలువ వచ్చిందో తెలుస్తోందా? ప్రజల్లో అత్యంత సామాన్యుడైనవాడి మాట రాజులో ఎంత కలవరాన్ని, ఆత్మపరిశీలననూ కల్గించిందో అర్థమౌతోందా? అది రాచరికపు ప్రజాస్వామ్యం. అందుకే అది రామరాజ్యం. మనం ప్రజాస్వామ్యపు రాచరికంలో ఉంటున్నాం. అందుకే నిరూపిస్తే రాజీనామా చేస్తామనేవారే కానీ నిజాయితీగా పరిశీలన చేసుకునే పాలకులు మనకు కరువైనారు. అవును, మరి చట్టం ప్రకారం దోషి అని తేలేవరకు ఎవరైనా నిర్దోషే!

ప్రజల్లో ఎక్కడో ఏదో జరిగితే, ఆ ప్రజలు రాజును నిలదీస్తే 'రాజ్యంలోని అధర్మస్థితికి రాజుదే బాధ్యత' అని రాజు అంగీకరించిన రోజులవి. పాపం ఆ రామరాజ్యం తేవాలనే స్వర్గీయ ప్రధాని శ్రీలాల్బహుదూర్ శాస్త్రి రైలు ప్రమాదాన్ని తన బాధ్యతగా భావించి రైల్వేమంత్రి పదవికి రాజీనామా చేశారు. ఇప్పుడు అలా జరగాలని ఆశించకూడదు. పాపం ఎవరైనా ఎన్నిటికని రాజీనామా చేయగలరు!

అందుకే వాచాలత్వంగా తీసివేయలేని యథార్థమైన విలువ గల వాక్స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం, పాలితుల బాధలకు తమదే బాధ్యత అని అంగీకరించే ధైర్యమున్న పాలకుల పారతంత్ర్యం - అదీ రామరాజ్యం. అది రావాలనుకుంటే తప్పేమీ కాదేమో! (మార్చి, 2003)

# మళ్ళీ ఆశల చిగుళ్ళు

'స్వభాను' పేరుతో మళ్ళీ మరో వసంతం వచ్చింది. వసంతాలు ఎన్ని వచ్చినా, ఆ సౌరభాలనైనా మనలో మిగల్చగలిగితే ఆ వసంతానికి గుర్తింపు. కానీ ఆ వసంతం దారి వసంతానిదీ, మనుష్యుల దారి మనుష్యులదీ అవుతున్నంత కాలం కాలానికి ఏ పేరు పెట్టుకుంటే మాత్రం ఒరిగేదేముంది?

భౌతికమైనా, కాలికమైనా, మానసికంగా కూడా ఏదో ఒక నూతనత్వాన్ని తీసికొని రాకపోతుందా అని అప్పుడెప్పుడో ఎదురుచూస్తుండే వాళ్ళం. ఆశగా

ఆకాంక్షిస్తూ వుండేవాళ్ళం. కానీ, ఇప్పుడా ఆశలు లేవు. చిన్నబోయిన మనిషి కాలాన్ని కూడా చిన్నబుచ్చుతున్నాడు.

ఇప్పుడు ప్రపంచమంతా ఒకే కుగ్రామమయింది. ప్రపంచీకరణ పేరుతో వ్యాపారసంస్కృతినీ, వ్యవహారసంస్కృతినీ పెంచుకొని, దూరాలను తగ్గించుకొని విశ్వమానవుల సంఖ్యను పెంచుకొంటున్నాం. ఎటొచ్చీ ప్రపంచీకరణమంటే ఏమిటన్నదే తేలటం లేదు. అక్కడి వస్తువులు ఇక్కడ అమ్ముకోవటం, ఇక్కడి కూరలు అక్కడ వండుకోవటం, అక్కడి డ్యాన్సులు ఇక్కడ చూడటం, ఇక్కడి తత్వాలు అక్కడ పాడటం. అంతవరకేనా? అంతవరకే అన్నా కొంతవరకు నయం. విశేషం లేకపోయినా వికారాలు అంటకుండా వుండేవి.

కానీ, మన ప్రపంచీకరణలో ఒకర్ని చూచి ఒకరు తప్పులు చేయటం, తప్పించుకొని తిరగటం నేర్చుకొంటున్నారు. ఒకరిని చూచి మరొకరు విలువలను, వలువలను సైతం వదిలించుకోవటం అభ్యాసం చేస్తున్నారు.

సాంస్కృతిక వినిమయంతో మనుష్యులంతా సమైక్యభావాలను, సౌజన్య సందేశాలను అందించుకోవటం మాని, సాంస్కృతికకాలుష్యానికి కారణభూతు లవుతున్నారు. ఆ క్రమంలో అందరూ అందరిమీదా బురద చల్లుకొంటున్నారు. కడుక్కోటానికి నీళ్ళుకూడా సరిపడా అందని దేశం మనది. మనం మరి ఏ స్థితికి వెళ్ళబోతున్నామో!

ఆధునిక సౌకర్యాలు అందరికీ అందుబాటులోనికి వచ్చి, అందుబాటు లేని వారిపై కూడా ఆ ప్రభావాలు వ్యాపించి మనిషి మరీ కుదించుకొనిపోతున్నాడు. ప్రపంచమనేది అనంతవిశ్వంగా వున్నప్పుడే కుంచించుకొని బ్రతకటం అలవాటైన మనిషి విశ్వమే ప్రపంచీకరణ పేరుతో కుంచించుకుపోయినప్పుడు పరమాణువు కన్నా చిన్నబోతున్నాడు. విశాలంగా ఉన్నతంగా ఎదగవలసిన మనిషి ఉనికి కూడా కోల్పోయి ఎక్కడున్నదీ తెలియకుండా పోతున్నాడు. ఈ క్రొత్త సంవత్సరంలో అయినా మనుష్యులను వెతుక్కొనే ప్రయత్నం చేద్దామా?

(ఏప్రిల్, 2003)

# ఎవరు బాధ్యులు?

సూర్యకిరణాలు దూసుకువస్తున్నాయ్. ఋతుపవనాలు తప్పటడుగు లేస్తున్నాయ్. వేసవితాపాన్ని భరించలేక వడదెబ్బకు మరణిస్తున్నవారి సంఖ్యతో మనం అగ్రభాగాన నిలుస్తున్నాం. కరువు తాండవిస్తోంది. నిప్పు నాలుకలు చాచి దాని కన్నీటిని కూడా కబళించివేస్తోంది. ఏడ్చే అవకాశం కూడా లేకుండా పోతోంది. ఎప్పటిలాగా పాలకులు, పాలితులూ, స్వపక్షాలూ, విపక్షాలూ, సర్వపక్షాలూ శక్తివంచన లేకుండా ఎదుటి వాళ్ళపై ఆరోపణలు చేసి చేతులు దులుపుకుంటున్నాయి.

సకాలంలో వానలుంటే తప్ప కరువుకాటకాలు తీరే పరిస్థితి లేదు. వానలు ఎలా కురుస్తాయో ప్రాథమిక పాఠశాలల విద్యార్థులనుండి అందరికీ తెలుసు. ఆ తరగతుల్లో బొమ్మలేసి మరీ బోధిస్తుంటాం. మబ్బుముక్క ఎలా తయారవుతుందో, అది వర్షపుచుక్కగా ఎలా మారుతుందో అందరికీ తెలుసు. అయినా నాలుగు చుక్కల వానకోసం ప్రకృతిమీదనో, వరుణదేవుడుమీదనో, కప్పల పెళ్ళిళ్ళ మీదనో ఆధారపడుతున్న మనం ఆత్మపరిశీలన చేసుకోవటానికి మాత్రం ముందడుగు వేయలేకపోతున్నాం. ఈ విపత్కర పరిస్థితులకు, పర్యావరణ సమతౌల్యం లోపించటానికి సాధారణగృహస్థుని దగ్గరనుండి ప్రభుత్వాలవరకూ అందరూ బాధ్యులే.

ఇల్లు కట్టుకొనేటప్పుడు కాస్తంత జాగా మిగిలినా మరో రెండు గదులు కట్టి అద్దెల కిద్దామనుకునే సంస్కృతి పెరిగిపోతోంది. ఒకవేళ కొంత ఖాళీ మిగిలితే దానిని బండలతో పరిచి కప్పివేసేదాకా నిద్రపట్టదు. నువ్వు త్రవ్వుకున్న బావికైనా, బోరుకైనా నీరు మాత్రం నీస్థలంలో నుండి అందే అవకాశం లేదు. ఆ జాగాలో పచ్చగా ఒక మొక్క పెరిగే అవకాశం లేదు. మొక్కకే గతిలేకపోతే చెట్లెక్కడ నుండి వస్తాయ్.

పట్టణాల్లో నగరాల్లో పాపం చాలామందికి ఆ అవకాశాలూ లేవు. అపార్ట్మెంట్ పేరుతో సింహద్వారం మూసుకొని బోనులో జంతువుల్లాగా లోపల్లోపలే తిరగాలి. ఇక వారికి మొక్కేమిటి? చెట్టేమిటి?

ఇది చాలదన్నట్టు సిమెంట్ రోడ్లనే ప్రగతికి సంకేతాలుగా తీర్మానించుకొన్న మనం పల్లెలూ, పట్టణాలూ తేడా లేకుండా ఎక్కడికక్కడ మట్టి కనిపించకుండా సిమెంటు పరుచుకుంటున్నాం. అడ్డొచ్చిన చెట్లను అలాగే నరుక్కుంటున్నాం. పాలకులకూ, పాలితులకూ ఇద్దరికీ లేని అవసరం వానదేవుడి కొచ్చిందా?

రండి, అందరం కలిసి సిమెంటు పెళ్ళలు పంచుకుతిందాం రండి!

(జూన్, 2003)

## రాజనీతి

రాజనీతిలో ప్రధాన పాత్రధారులు రాజు - ప్రజలు. రాజు ఏ పని చేసినా, ఏ ఆలోచన చేసినా ప్రజల అభ్యుదయమే లక్ష్యమై వుండాలి. ప్రజలలో ఏ ఒక్కరికి నష్టం కలిగినా, ఒకరి నష్టం ద్వారానే మరొకరు లాభపడే పరిస్థితి ఏర్పడినా అది అభ్యుదయం కాదు. కాలేదు. అలాగే తమకు ఏ బాధ వచ్చినా రాజు దగ్గరే మొరపెట్టుకోవటం, రాజు తమ కోసం రాజ్య భారాన్ని మోస్తున్నాడు కాబట్టి ఆయన కోసం ఏం చేయటానికైనా సిద్ధపడటం ప్రజలవంతు. ఆ అనుబంధం అలా కొనసాగినంత కాలం రాజ్యం సుభిక్షంగా వుంది.

రాచరికపువ్యవస్థలోని చిన్న చిన్న లోపాల కారణంగా మనం ప్రజాస్వామ్యవ్యవస్థను ఆహ్వానించుకున్నాం. స్వతంత్రంగా రూపకల్పన చేసుకొన్నాం. ప్రజల జీవితాలు 'మూడు పువ్వులు ఆరు కాయలు'గా విరాజిల్లుతాయని కలలు కన్నాం. అయితే పాలకులకు ప్రజలకు మధ్య వుండవలసిన అనుబంధం అంతరించిపోయింది. ఇద్దరూ కూడా అందరి సౌఖ్యంకోసం ఆలోచించటం మాని, ఎవరి సుఖంకోసం, ఎవరి లాభంకోసం వారు ఆలోచించటం ప్రారంభించారు. అది ఎన్ని అనర్థాలకు దారితీస్తోందో ప్రత్యక్షంగా చూస్తున్నాం.

గుమాస్తా ఉద్యోగాల కోసం పరీక్షలు వ్రాసేవాళ్ళకు కూడా రాజ్యాంగ స్వరూపాన్ని తెలుసుకోవలసిన అవసరం మన వ్యవస్థలో వుంది జనరల్ నాలెడ్జి పేరుతో. అయితే పాలకులకు మాత్రం రాజ్యాంగమంటూ ఒకటుంది - అన్న ఆలోచనకూడా లేకపోయినా పరిపాలన చేయవచ్చు. ప్రజాస్వామ్యంకోసం మనం తయారుచేసికొన్న రాజ్యాంగం ఎంత పవిత్రమైనదో దాదాపు అంత పవిత్రమైన రాజనీతిశాస్త్రం మన దేశ సాహిత్యంలో వుంది.

'అర్థశాస్త్రం', 'కామందక నీతిశాస్త్రం' వంటి గ్రంథాలు కేవలం రాజనీతిని బోధించేవి. మహాభారతంలో అపారంగా రాజనీతిశాస్త్రవిషయాలున్నాయి. శాంతిపర్వంలో రాజధర్మపర్వమన్నభాగం రాజనీతిని కూలంకషంగా బోధిస్తుంది. కాళిదాసువంటి మహాకవులు ఉత్తమ రాజలక్షణాలను, ప్రజాలక్షణాలను అద్భుతంగా వివరించారు. ఆ రాజనీతిలోని ప్రధానాంశాలనైనా మన పాలకులచేత చదివించగలిగితే అది ఆదర్శ రాజ్యనిర్మాణానికి దారితీయవచ్చు. వర్తమాన సమాజంలోని చాలా సమస్యలు వాటంతట అవే అంతరించిపోవచ్చు.

రాజనీతి, రాచరికపు వ్యవస్థ ప్రజాస్వామ్యానికి విరుద్ధమో, ప్రతిబంధకమో కాదు. పైపెచ్చు పరిపోషకం కూడా. ఆ ప్రాచీన రాజనీతి పునరుద్ధరించుకోవలసిన అవసరం ప్రస్తుతం దేశాని కుంది మరి. (అక్టోబరు, 2003)

## వంచనా శిల్పం

పాత రోజుల్లో మేధావులు 64 కళలను లెక్కించారు. వాటిలో వింతవింతగా కనిపించే కళలు కూడా చాలా వున్నాయి. ఆ రోజుల్లో దొంగతనాలను కూడా కళాత్మకంగా చేసేవారు. అయినా సరే మోసం చేయటాన్ని కళగా కానీ, శిల్పంగా కానీ వారెవ్వరూ చెప్పినట్లు కనిపించదు.

ఈనాటి సమాజంలో మనం ఆశ్చర్యపడవలసిన స్థాయిలో లేదా ఆందోళన పడవలసిన ప్రగతితో వంచనాశిల్పం ముందుకు పోతోంది. దయాదాక్షిణ్యాలూ, సిగ్గూశరాలూ, ఏమీ లేకుండా పూర్వాపరపరిశీలనకు అవకాశం లేకుండా వంచనను కళాత్మకంగా, జీవితసూత్రంగా స్వీకరిస్తున్నారు.

వంచనలో అత్యంత ప్రధానపాత్ర ఇతరులను నమ్మించగలగటం. మన మాటలనో మన చేతలనో ఎంతగా నమ్మించగలిగితే అంతగా ఆ కళలో రాణించవచ్చు. వెనుకటికి నమ్మిన వాడినే మోసం చేయగలం గానీ, నమ్మని వాడిని ఏమీ చేయలేమనే నానుడి వుండేది. ప్రస్తుత పరిస్థితి అది కూడా కాదు. నమ్మించి మోసం చేయటం, నమ్మించేందుకు రకరకాల విన్యాసాలను ప్రదర్శించగలగటం నేటి కళ.

ఈ కళను జీవితంలో ఆచరణలో పెట్టడాన్ని పెద్దవాళ్ళే తమ బాధ్యతగా స్వీకరించటం ఈ సమాజం చేసుకున్న అదృష్టం. చిన్నా చితకా మనుషులు అటువంటి వాటికి పాల్పడుతుంటే సరిదిద్దవలసిన బాధ్యత పెద్దవాళ్ళకుంటుంది. కానీ, నేడు పెద్దవాళ్ళే ఆ కళాపోషకులై పైపైకి వెళ్ళటానికి పోటీపడుతున్నారు. ఆ పోటీలో గెలవటానికి ఎవరి మట్టుకు వాళ్ళు జాతినీ, నీతినీ, సమాజాన్నీ, సామాజికావసరాలనూ, ప్రయోజనాలనూ అన్నింటినీ బలిపెట్టడానికి ఏకొంచెమూ వెనుకాడని దశకు చేరుకొన్నారు.

'చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష' అన్నదే లక్ష్యంగా పంచనా శిల్పకళకు ఒరవడి దిద్దుకుంటున్నారు. 'చిన్ని బొజ్జలకైతే' ఎవరెంత మెక్కినా పరవాలేదు. ఆశ ఎంత వున్నా పొట్ట చిన్నదే కాబట్టి. కానీ, వీరి ఆశ కడుపు నింపుకోవటంతో తీరదు. ఆశ నిండితేనే గానీ కుదరదు. ఆ ఆశ సముద్రం లాంటిది. అదెప్పుడూ నిండదు. ఈ వంచన ఎటూ ఆగదు. మరి విముక్తి? (నవంబరు, 2003)

# నమ్మించగలవాడే నాయకుడు

ప్రపంచ దేశాలలో ప్రజాస్వామ్యం 'మూడు పువ్వులూ ఆరు కాయలు'గా వెలుగుతున్న దేశాల్లో పెద్ద దేశం మన భారతదేశం. ప్రజాప్రతినిధియై పరిపాలనలో పాలుపంచుకోవటానికి వయోనియమం తప్ప, మరే నియమమూ లేని దేశం మనది. చదువుసంధ్యలతో పని లేదు. ఒకవేళ ఆలోచించినా ఏం చదివాడనే కానీ, ఎలా చదివాడన్న అంశంతో మనకు సంబంధం లేదు. కటిక దరిద్రుడైనా, కోటీశ్వరుడయినా ఇక్కడ భేదం లేదు. కాకపోతే ఒకడు కటిక దరిద్రుడు ఎందుకవుతున్నాడని కానీ, మరొకడు కోటీశ్వరుడు ఎలా

కాగలుగుతున్నాడని కానీ మనకు అనవసరం. అవసరమైన వయస్సుంటే చాలు, ఏ స్థానానికైనా అర్హత లభిస్తుంది.

గ్రామస్థాయినుండి దేశస్థాయి వరకూ కొన్ని వేలమంది నాయకులు మనకున్నారు. అందరిదీ ఒకటే లక్ష్యం. అందరూ ప్రజలకోసం, వారి సంక్షేమం కోసం, ప్రజాభివృద్ధికోసం, ప్రపంచ దేశాల్లో మన దేశాన్ని సగర్వంగా తలెత్తుకొని నిలిచేలా చేయటంకోసం కంకణం కట్టుకొన్నవారే. అయితే అందరూ కలిసి ఆ పని ఎందుకు చేయకూడదన్న ఆలోచన ప్రజాస్వామ్య వ్యవస్థలో కలగటం పరమ పాపం. దేశం ముందుకు పోవాలి గానీ, ఆ పని తమ ద్వారానే జరగాలన్నది అందరి ఆకాంక్ష. దాన్ని అధికారకాంక్ష అనండి, అధికారదాహ మనండి మరే పేరైనా పెట్టండి. పేరులోని అందాన్ని ఆస్వాదించగలగటం తప్ప మనం చేయగలిగిందేదీ లేదు.

ఈ క్రమంలో అందరూ ప్రజల మీదా, ప్రజల ఓట్లమీద ఆధారపడి ఆశలు పెంచుకొంటారు. ఎన్నికలు వచ్చేసరికి ప్రజలు ఓటర్లు అవుతారు. మరీ దగ్గరపడే కొద్దీ ఓటరు మహాశయులవుతారు. అప్పుడప్పుడు ఈ ప్రజలే ఆ నాయకులపాలిట దేవుళ్ళవుతారు. అవసరనైవేద్యాలను కూడా అందుకొంటారు. మహానైవేద్యం మీద నమ్మకాన్ని పెంచుకొంటారు.

ఆ నమ్మకాన్ని కలిగించటమే ప్రజాస్వామ్య వ్యవస్థలో కీలకమైన అంశం. ఎవరు ఏం చేశారు? లేదా ఏం చేయదలచుకొన్నారు? ఎలా చేయదలచుకొన్నారు? ఇప్పటిదాకా ఎందుకు చేయలేకపోయారు? రేపు చేస్తారన్న నమ్మకం ఏమిటి? ఇటువంటి ప్రశ్నలు అందరికీ కాకపోయినా కొందరికైనా మనస్సుల్లో మెదులుతాయి. అవి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, గాలివార్తలద్వారానో ప్రసరించకుండా ఊరుకోవు. అంతమాత్రంచేత నాయకులకు కలిగే నష్టమూ లేదు, ప్రజలకు కలిగే లాభమూ లేదు. ఎందుకంటే ప్రజాస్వామ్యవ్యవస్థలో అనుమానాలు తీరటం ముఖ్యం కాదు. తీరుతున్నట్లు నమ్మకం కలగటమే ముఖ్యం. ఆ నమ్మకాన్ని కలిగించగలవాడే నాయకుడు.

(ఫిబ్రవరి, 2004)

# అధికారాలా? బాధ్యతలా?

**"రాజుల్మత్తులు వారి సేవ నరకప్రాయంబు"** అంటూ రాజులున్నకాలంలో వారి ఆస్థానాలమీదనే ఆధారపడి జీవిస్తూ ఒక మహాకవి పలికిన మాట ఇది. ఆరోజుల్లో రాజులుండేవారు. వంశపారంపర్యంగా రాజ్యాధికారాన్ని పొందుతూ ప్రజలను పరిపాలించేవారు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించేవారు అన్నది ఏ మంచి రాజును గురించి అయినా, మంచిగా చెప్పవలసిన వాక్యం. ప్రజలకు నీతి నేర్పి, రక్షించి భరిస్తున్న కారణంగా దిలీపుడు తానే ప్రజలకు తండ్రిగా వుండేవాడు. అసలు తల్లిదండ్రులు జన్మకారకులు మాత్రమే అని దిలీపుని గొప్పతనాన్ని కాళిదాసు వర్ణించాడు రఘువంశ కావ్యంలో. "ప్రజలు ఏ సన్నిహిత బంధువును కోల్పోయినా ఆ స్థానాన్ని తాను పూరిస్తానని - అది పాపం కాకపోతే" అని దుష్యంతుడు తన రాజ్యంలో ప్రకటన చేయిస్తాడు. ఈ జాతి రాజులు రాజాస్థానానికి ఇచ్చిన గౌరవానికి, చూపించిన విశ్వాసానికి ప్రతీకలు పై భావాలు. కానీ "వారేరీ?".

రాచరికపు వ్యవస్థను సమూలంగా త్రోసిరాజని ప్రజాస్వామ్య వ్యవస్థకు పట్టం గట్టుకొన్నామీనాడు. తగిన వయస్సు పొందిన ఏ వ్యక్తి అయినా నేడు ప్రజలను పాలించవచ్చు. పాలించటానికి తగిన అధికారాన్ని పొందవచ్చు. ఆ బాధ్యతను తన భుజాల కెత్తుకోవచ్చు.

వాస్తవానికి ఒక దేశ - రాష్ట్ర పాలన అంటే ఎంత ప్రమాదకరమైన అనుభవమో, ఎంతటి కత్తిమీద సామో, ఎంత నరకప్రాయమో తెలిసినవాడెవ్వడూ ఆ బాధ్యతను కోరి తెచ్చుకొనే ప్రయత్నం చేయడు. "రాజ్యాంతే నరకం ధ్రువమ్" అని ఆనాటివారే నిర్ణయించారు. ఇంతటి భయంకరమైన బాధ్యతను అంగీకరించటానికి ఈనాడు ఈ దేశంలో ఇంతమంది, ఇంతగా ప్రయత్నించటం లోని ఆంతర్య మేమిటి?

నాటికీ నేటికీ ఒక ప్రధానమైన అంతరముంది. ఆనాడు అవి బాధ్యతలు. ఈనాడు అవి అధికారాలూ, పదవులూ, సౌకర్యాలూ. ఈ మాట బహిరంగంగా మాటాడటానికి కానీ, అంగీకరించటానికి కానీ ఎవ్వరూ మొహమాటపడటం లేదు. బిడియపడటం లేదు. ఇతరులను ప్రలోభపెట్టడానికి వెనుకాడటం లేదు.

రాజచిహ్నాలూ, రాజ్యపాలనలూ పదవులు కావు. అని అందరి తరపున, అందరి బాధ్యతలూ తాము అంగీకరించటమే. పాలకులకుండవలసిన ప్రధాన భావన అది.

మళ్ళీ మరొకసారి మన పాలకులను నిర్ణయించుకోవలసిన అవసరం మనకు ఏర్పడింది. ఆలోచించండి. ప్రజాపాలనను బాధ్యతగా గుర్తించి, ప్రవర్తించగలవారిని మాత్రమే పాలకులుగా ఎన్నుకొనే ఆలోచన చేయండి.

(ఏప్రియల్, 2004)

# వైరాగ్య మార్గం

మనిషికి వైరాగ్యం కలగటానికి మహర్షులు, జ్ఞానులు అనేక మార్గాలు చెప్పారు. శమదమాది సాధన సంపత్తి దానికి అవసరమన్నారు. సంసార లంపటత్వాన్ని విడిచి తామరాకు మీది నీటిబొట్టులాగా బ్రతకటం చేతకావాలన్నారు. ఇన్ని సాధించినా ఆ వైరాగ్యం, తత్ఫలమయిన మోక్షం ఈ జన్మలోనే సిద్ధిస్తాయని నమ్మకం లేదన్నారు. పుట్టిన ప్రతివ్యక్తీ మోక్షాన్ని పొందవలసిన అవసరముందో లేదో తెలియదు. కానీ, అవసరముంటే మాత్రం అది చాలా కష్టసాధ్యమన్న భావాన్ని మనలో కల్గించారు. అయితే ఈ మధ్య ఇంతింత శ్రమపడవలసిన అవసరం లేని వైరాగ్య మార్గం తటస్థిస్తోంది.

ఇప్పుడు దేశంలో, కొన్ని రాష్ట్రాల్లో మళ్ళీ ఎన్నికల పండుగ జరుపుకొంటున్నాం. నిల్వలో వున్న డబ్బులో చాలా భాగం చెలామణిలోకి వచ్చి - మంచైనా చెడైనా సరే - పదిమంది దగ్గరకు చేరుతుంది. కాబట్టి ఇది పండుగ వాతావరణమే. ఈ సమయాన్ని జ్ఞానసిద్ధి పొందదలచినవారు సద్వినియోగం చేసుకుంటే వైరాగ్యానికి ఇంతకంటే దగ్గర దారి దొరకదు.

'అందరూ శాకాహారులే, కానీ రొయ్యల బుట్ట మాత్రం మాయం' అన్నది. తెలుగు సామెత. రాజకీయపార్టీలు - వ్యక్తులకే గానీ, వాటికి విలువ పోయిందంటారా?

- పోనీ రాజకీయవ్యక్తులు అందరూ మనకోసం ప్రాణాలు, రక్తాలు, చెమటబిందువులూ అర్పించే వాళ్ళే అధికారం, పదవీవ్యామోహం తప్ప. అసెంబ్లీకి, పార్లమెంటుకు చాలా తక్కువ స్థానాలు నిర్ణయించి రాజ్యాంగవేత్తలు పొరపాటు చేసినట్టుంది. త్యాగమూర్తుల సంఖ్య పెరిగే సరికి స్థానాలు సరిపోవటం లేదు.

టిక్కెట్టు రాలేదని దహనకాండలకు సిద్ధపడుతూంటే, పార్టీ కార్యాలయాల నుండి ప్రజాజీవితాలమీద కూడా దాడి చేస్తుంటే, కనీస మర్యాదలను కూడా పాటించకుండా భావ-భాషా-కాలుష్యాలను వ్యాపింపజేస్తుంటే, "తాను చేస్తే శృంగారం, ఇతరులు చేస్తే వ్యభిచార"మన్న సామెతకు సజీవ ఉదాహరణలుగా నిలుస్తుంటే జాతిని గురించీ, దేశాన్ని గురించీ, నిజాయితీతో కూడిన ప్రజాజీవితాన్ని గురించి ఆలోచించేవాడికి జీవితం మీద విరక్తి కలగటానికి ఇంతకంటే మంచి మార్గం వుంటుందా?

(మే, 2004)

## ఈరోజుల్లో కూడా భారతాన్ని వినాలా?

**"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్" "యన్న భారతే తన్న భారతే".**

"ఏది ప్రపంచంలో జరుగుతున్నదో, అది నా భారతంలో వున్నదే. ఏది భారతంలో వున్నదో అది ప్రపంచంలో జరుగుచున్నదే", "భారతంలో లేనిది మరెక్కడ లేదు" అని సధైర్యంగా వ్యాసుడు చెప్పాడంటే ఇంకా భారతాన్ని చదవాల్సిఉందా అని ప్రశ్నించటమేమిటి? మనని గురించి మనం తెలుసు కోవాలంటే, అలాగే ప్రపంచంలో ఎలా జీవించాలో అర్థం చేసుకోవాలంటే భారతాన్ని చదవాల్సిందేనని అర్థం కావట్లేదూ?

పిల్లల్ని పట్టించుకోని తల్లిదండ్రు లెందరున్నారో వారంతా ధృతరాష్ట్రులు కారూ? తండ్రి భయం లేని కారణంగా చెడిపోయిన పుత్రులంతా దుర్యోధనులు కారూ? తగినంత విద్య ఉండీ, పరాక్రమం, బుద్ధినైపుణ్యం ఉండికూడా వంచనకి

గురిఅయి కష్టాలని అనుభవిస్తున్నవాళ్లంతా పాండవులు కారూ? అన్ని విధాలైన అండదండలూ ఉండి, విశేషించి దైవబలం కూడా తోడుగా వుండి ఏ చరిత్రలోనూ, ఏ యుగంలోనూ పడరాని కష్టాలనీ, అవమానాలనీ పొందిన వాళ్లంతా ద్రౌపదులు కారూ? తాము చేసేది తప్పేనని తెలిసినా మిత్రుని మాటకి కట్టుబడి ఎదుటు వాళ్లని కష్టాలకు గురిచేసేవాళ్లంతా దుష్టచతుష్టయంలోని కర్ణ, శకుని, దుశ్శాసనులు కారూ?..... సమాజానికి అర్థమూ, సంఘానికి అద్దమూ మన భారతం.

ఎవరు ఏ దృష్టితో పరిశీలిస్తే వారికి ఆ విషయాన్ని అందించే ప్రపంచ విజ్ఞానసర్వస్వం, పంచమవేదం మహాభారతం. భారతం ఒక కథ కాదు. ధర్మశాస్త్రం తెలిసిన వారి కది ధర్మశాస్త్రం, ఆత్మవిద్య తెలిసిన వారికి వేదాంతం, నీతి తెలిసిన వారికి నీతిశాస్త్రం, కవులకు మహాకావ్యం, పౌరాణికులకు బహుపురాణసంకలనం, కావ్యలక్షణాలు తెలిసిన వారికి లక్షణ గ్రంథం. దీని ప్రశస్తికి కారణం భవిష్యత్ ద్రష్ట అయిన వేదవ్యాసమహర్షి దీనిని వ్రాయటం. ఆయనంతటి, ఆయనవంటివాడు మరొకడు లేడంటే అతిశయోక్తి కాదు. జీవితమంతా ధర్మప్రబోధానికే వినియోగించిన నిస్స్వార్థమహాపురుషుడు ఆయన. వ్యాసుడు ఆశువుగా ఆపకుండా చెప్పగా సకలవిద్యాధిష్ఠాత అయిన గణపతి అర్థంచేసుకుంటూ వ్రాయటం మరో విశేషం. వినాయకు డంతటివాడు అర్థంచేసుకుని వ్రాశాడంటే అందులో ఒక్క అక్షరం కూడా తప్పు ఉండదని, లేనేలేదని అర్థం కాదా? భారతం వ్రాయబడిన విధానం కూడా అంతకు ముందు కానీ, ఆయన తరువాత గానీ ఎవరూ అవలంబించినదీ, అనుసరించగలిగినది కాదు. ఇక విషయందృష్టితో చూస్తే ఇహపరసర్వవిషయాలూ ఇందులో నిక్షిప్తం చేయబడ్డాయి.

దుర్యోధనుని చూచి ద్రౌపది నవ్విందనీ, ద్రౌపది కర్ణుని ఆరవభర్తగా స్వీకరిస్తానన్నదని తరువాత వారు అనేక అభూతకల్పనలు భారతాని కంటగట్టారు. వ్యాసభారతం చదివితే ఇటువంటి సందేహాలకు తావుండదు. ఉంటే మన అన్వయలోపమేనని గ్రహించాలి.

(జూన్, 2004)

# అహంకారం

సూర్యచంద్రుల గమనమున్నంతకాలం, కాలం లేదా కాలపరిగణనం వుంటుంది. కాలమున్నంతకాలం దానికి సంబంధించిన పరిణామ వికారాలుంటాయి. మొగ్గ విరియాలన్నా, పూవునుండి పిందె, కాయగా పండుగా మారాలన్నా దానికి ఎవరి ప్రయత్నం, తీవ్రకృషీ అవసరం లేదు. అదంతా కాలపరిణామంలో భాగం. అయితే, అది కూడా తమ కర్తృత్వం వల్ల, కృషివల్ల జరుగుతోందని భావించేవాళ్ళు లేకపోలేదు. ప్రయత్నపూర్వకంగానో, వేగంగానో కొన్నింటిని మనం సాధించినట్టు భావించే అవకాశం కొన్ని సందర్భాలలో ఉంటుంది. కానీ, అక్కడ కూడా ప్రకృతిసిద్ధమైన కొన్ని దోహదాలే కారణమవుతాయి. ఇదంతా గమనించకుండా మనిషి పతనం కావటానికి అహంకారం - కర్తృత్వ భావన చాలా సందర్భాల్లో మనిషిలో కలుగుతుంది. అటువంటివాడినే **'అహంకార విమూఢాత్మా'** అని గీత సూచించింది.

ఈ అహంకారపుతెర నుండి, ఈ కర్తృత్వ భ్రాంతి నుండి బయటపడటం మానవునకు అవసరం. అది అంత తేలికయిన విషయం కాకపోవచ్చు. అహంకారంతో నహుషుడంతటివాడు కూడా పతనం కావటం పౌరాణిక గాథ తెలియజేస్తోంది. చరిత్రలో ఎందరో వ్యక్తులు, చరిత్రను సృష్టించినవారు సైతం అహంకారకారణంగా చరిత్రహీనులైన విషయాలు మనకు తెలుసు. అయినా ఈనాటికీ అహంకార ప్రభావం అన్ని స్థాయిల ప్రజల మీదా పడుతూనే వుంది. ఆర్థికవ్యత్యాసాలు కానీ, వయోభేదాలు కానీ, అధికారభేదాలు కానీ అహంకారాన్ని ఆపలేవు. పాలకపాలితభేదం కూడా అహంకారానికి, పతనానికి అడ్డురావు.

ఒక దేశాభివృద్ధి లేదా రాష్ట్రాభివృద్ధి ఒక్క రోజులోనో, ఒక దశాబ్దంలోనో హఠాత్తుగా జరిగిపోయేది కాదు. కాలవిపరిణామంవల్ల జరిగే సహజమైన అభివృద్ధిని ప్రక్కన పెడితే మిగిలిన భాగమే మన కృషి. అది అపారంగా, అనర్థరహితంగా వుంటే దాన్ని స్వకర్తృకంగా భావించి అహంకరించవచ్చు. ఒకవైపు గోడ కద్దుంటే, మూడు వైపులా గోడలు కూలుతుంటే నిలిచిన గోడనే చూసి తన గొప్పతనమని అహంకరిస్తే, ఎటువంటి వ్యక్తికయినా పతనం తప్పదు.

కర్తృత్వభావాన్ని ఒకవేళ పైకి నటిస్తున్నా ఆంతర్యంలో అయినా వాస్తవికజ్ఞాన ముంటే పతనాన్ని కొంతమేర ఆపుకొనవచ్చు. కానీ, లోనా బయటా కూడా ఒకే అహంకారభావం, ప్రదర్శనం అయితే పడిన తర్వాత పునరాలోచనలే కానీ పడకుండా నిలిచే అవకాశం లేదు.

అహంకారం ఆత్మవినాశహేతువు కాకుండా మనలను మనం కాపాడుకొందాం. (జూలై, 2004)

## భావబంధమే భవబంధం

యౌవనంలోనే సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన ఇద్దరు యతులు కలిసి నడుస్తున్నారు. దారిలో ఒక కాలువ దాటవలసి వచ్చింది. ఆ సమయంలో ఒక యువతి అక్కడే కాలువ దాటటానికి జంకుతూ ఒడ్డునే నిలిచివుంది. ఆ యతుల జంటలో నొకడు ఆ యువతిని భుజాని కెత్తుకొని కాలువ దాటించి దించి తన మానాన తాను ముందుకు సాగాడు. రెండవ యతి ఆ సన్నివేశాన్ని గమనించాడు. అతని మనస్సు తన సహచరుని ప్రవర్తనను అంగీకరించలేకపోయింది. యతియై జీవిస్తూ ఒక యువతిని భుజాని కెత్తుకొని మరీ దించటం తనకు అసమంజస మనిపించింది. సహచరునితోపాటు ముందుకు నడుస్తున్నా ఆ విషయాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. తన సహచరునిలో వివేకాన్ని మేల్కొల్పటం తన కర్తవ్యంగా భావించాడు. అలా కొంత దూరం సాగిన తర్వాత మెల్లగా తన మనస్సును ఆవిష్కరించే ప్రయత్నం ప్రారంభించాడు. తన సహచరుడు ఆ యువతిని భుజాని కెత్తుకొనటాన్ని సూటిగా ప్రశ్నించాడు. దానికా మొదటి యతి "స్వామీ! ఆ స్త్రీని నేను కాలువ దాటగానే భుజం నుండి దించేశాను. కానీ, తమరు అప్పటి నుండి ఇప్పటిదాకా ఆమెను మోస్తూనే వున్నారు" అని సమాధాన మిచ్చాడు.

ఆ యువతిని కాలువ దాటించిన వ్యక్తికి ఆమెతో శరీర స్పర్శ మాత్రమే ఏర్పడింది. అది కూడా ఒక కర్తవ్యనిర్వహణలో భాగంగా, అసంకల్పితంగా అనభిలషితంగా ఏర్పడిన బంధం. కాలువ దాటగానే ఆమెను వదిలాడు. ఆమె తన

శరీరానికి తగిలిందే కానీ మనస్సుకు కాదు. అయితే ఆయన ప్రవర్తనను అధిక్షేపించిన రెండవ యతి, ఆమెను గురించే అంతసేపూ ఆలోచిస్తూనే వున్నాడు. ఆ ఆలోచనను మానలేని, నిరోధించలేని మానసిక స్థితికి లోనయ్యాడు. ఆమె అతని మనస్సునే స్పృశించింది. ఆ అంశాన్నే మొదటి యతి ఎత్తిచూపవలసి వచ్చింది.

సన్యాసాశ్రమానికి అవసరమైన అంశం భావబంధ రాహిత్యమే, కానీ తనుబంధం లేకపోవటమో, వస్తుసంబంధం లేకపోవటమో కాదు. పదార్థస్థితి కన్నా పదార్థభావనకు ప్రభావ మెక్కువ. జ్ఞానస్థితికన్నా జ్ఞానానుభవానికి విలువ ఎక్కువ.

(ఆగష్టు, 2004)

## నాలుగు చినుకులు

నాలుగు చినుకులు కంటపడితే వెన్నెల వెల్లువలు గుండెమీద పారినట్టనిపిస్తోంది మనకు. ఆపాటి పలకరింపుకే నేల పులకరించినట్టు కనిపిస్తుంది. నాట్లు, పంటలు, కోతలు, కుప్పలు తరువాత విషయం. ముందు త్రాగటానికి గ్రుక్కెడు నీళ్ళు దొరుకుతాయన్న ఆనందం. తిండిలేక ఆకలితో పోవటం కాదు, నీరులేక దప్పికతోనే పోతామేమో అన్న అనుమానంనుండి బయట పడటం. ఈ నిస్సహాయత, ఈ దీనత్వం చూస్తుంటే మనిషి ఎంత బలహీనుడో అర్థమవుతుంది. అయితే ఆ అవగాహన ఆ క్షణాలలోనే, నాలుగు నీటి చుక్కలతో అంతరించిపోవటం మనమీద మనకే జాలి కలిగిస్తుంది.

నిస్సహాయతనుండి కొంచెం బయటపడితే చాలు, అసహాయ శూరులం అన్నట్లుగా మనం అహంకరించటం; దేనినీ, ఎవ్వరినీ చివరకు ప్రకృతినీ, కాలాన్నీ కూడా లెక్కచేయకపోవటం మానవజాతికి దైవ మిచ్చిన వరమో! శాపమో! గతాన్ని మరచి వర్తమానంతో సమన్వయపడటమంటే అది వరమే అనవలసివస్తుంది. గతం వర్తమానానికి మార్గదర్శనం చేయలేకపోవటమన్న కోణంలో ఆలోచిస్తే అది దుర్భరశాపమవుతుంది.

గత జన్మల పుణ్యపాపాలను ఈనాడు అనుభవిస్తున్నామన్న ప్రగాఢ విశ్వాసంగల మనలో, ఆ జన్మలలోని పనులు గుర్తులేకున్నా ఈనాటి ఫలితాలను బట్టి ఊహించుకొని ఎప్పటి కప్పుడు అన్వయించుకొనజాలిన మనలో నిన్న మొన్నటి విషయాలే గుర్తులేకుండా పోవటం విచిత్రవిధివిన్యాస మేమో! అజ్ఞానం అహంకారం వైపు నడిపించకుండా వర్తమానం గతాన్ని విస్మరింపజేయకుండా జాగ్రత్తపడదాం. (సెప్టెంబరు, 2004)

# న కంచన.....

**"న కంచన పసతౌ ప్రత్యాచక్షీత"** అని తైత్తిరీయోపనిషత్తు నిర్దేశించింది. ఇంటిలో ఎవ్వరిని తిరస్కరించరాదని తాత్పర్యం. అంటే కుటుంబ సభ్యులు అని మాత్రమే కాదు అర్థం. ఇంటికి వచ్చిన అతిథులను కూడా తిరస్కరించరాదని భావం.

మానవీయ సంబంధాలు బలపడటంలో మనుషుల మధ్య అవగాహన పెరగటంలో సాహచర్యం, సాన్నిహిత్యం ప్రధానపాత్ర వహిస్తాయి. ఏ ఇద్దరు వ్యక్తులూ ఒకటి కాదన్నట్లు మానవమనోనిర్మాణం కనిపిస్తున్నా, ఏ ఒక్కడూ ఒంటరిగా జీవించగలగటం అసాధ్యం అని భౌతికపరిస్థితులు నిరూపిస్తుంటాయి. ఈ రెండింటి మధ్య గల అంతరాన్ని వీలయినంతమేర తగ్గించి కలిసి జీవించటం మానవజాతికి అపరిహరణీయం.

కానీ భౌతికంగా సుఖాలూ, సౌకర్యాలూ, పెరిగే కొద్దీ మనిషి ఒంటరివాడయిపోతున్నాడు. తన పరిధిని వీలయినంతగా కుదించుకొని బ్రతుకుతున్నాడు. అయితే ఇది ఇతరులకు తాను సహకరించవలసినప్పుడే. ఇతరుల నుండి తాను లాభపడదలచుకొన్నప్పుడు మాత్రం విశ్వమానవునిగా తనను తాను భావించుకొంటున్నాడు. ఈ ద్వంద్వ ప్రమాణాలు అనేక సందర్భాలలో మానవజాతి తలదించుకొనవలసిన స్థాయిలో కనిపిస్తున్నాయి.

ఎక్కువ కాలం బ్రతకాలనీ, ఎక్కువ ఆనందంగా బ్రతకాలనీ, ఇతరులకన్నా మిన్నగా నిలవాలని మనిషి ఆశించటం సహజం. అది అవసరం కూడా. అయితే

మన హక్కులూ, మన అవకాశాలూ, మన అవసరాలూ ఇతరుల హక్కులకూ, అవకాశాలకూ, అవసరాలకు అడ్డు రాకూడదు. ఇతరుల హక్కులు ప్రారంభమయ్యే రేఖ దగ్గరే మన హక్కులు ఆగిపోతాయన్న సత్యాన్ని గుర్తించగలగాలి.

ఇదంతా సవ్యంగా జరగాలంటే మనిషినీ, మానవజాతినీ, ధర్మాన్నీ ప్రేమించటం, గౌరవించటం, ఆచరించటం నేర్చుకోవాలి. ఎవ్వరూ తక్కువా కాదూ, ఎవ్వరూ గొప్పా కాదు అన్న విషయం అర్థం కావాలి. సాపేక్షమైన విలువలు నియత ప్రమాణాలు కావని తెలిసికోవాలి. అప్పుడు అందరిమీదా ఒకే దృష్టి, ఒకే భావం, ఒకే గౌరవం. ఎవ్వరినీ తృణీకరించం. కలిసి నడవటంలోని ఔన్నత్యాన్ని గ్రహిస్తాం.

(అక్టోబరు, 2004)

## జ్ఞానఫలం

అనాదిగా ప్రాణికోటిని పట్టి పీడిస్తున్న సమస్య అహంకారం. సమస్త జీవరాసులలోనూ ప్రాథమికలక్షణంగా, జీవనానికి అవసరమైన ఒక గుణంగా వున్న ఈ అహంకారం మానవజాతి విషయంలో మరికొంత పెరిగి సమస్యగా మారింది. తమ ప్రమేయం లేకుండానే ఎన్నో విషయాలు జరుగుతూ, ఎన్నో మార్పులు, చేర్పులు కాలధర్మంగా సాగిపోతున్నా, మానవుని నిస్సహాయతను హేళన చేస్తున్నా, మానవుడు మాత్రం వాస్తవికతను గుర్తించటానికి వెనుకంజ వేస్తున్నాడు.

సృష్టి గతి అనంతం. విధినిషేధాలు దానికి లేవు. ధర్మాధర్మ విభాగం దానికి లేదు. దానికి తెలిసిన ఒకే ధర్మం – ఉత్పత్తి, పరిణతి, వినాశాలు మాత్రమే. ఏ జీవపదార్థాని కయినా తప్పనిసరి ధర్మాలు అయిన పై మూడింటికీ విధినిషేధాలతో పని లేదు. మొక్కల కొమ్మలను కత్తిరించి ఎదగకుండా చేయగలమేమో కానీ వయోధర్మంగా దానిలో కలిగే పరిణామాలను మార్చలేము. అయితే, ఈ భావం కూడా నిక్కచ్చిగా నిలుస్తుందనే అవకాశం లేదు. వాటికి అతీతంగా కాలం తనపని తాను చేసికొనిపోతుంది. దాన్ని అంచనా వేసి ఆత్మరక్షణకు, లేదా ఆత్మపరిణతికి

మనం సిద్ధపడేలోగానే తాను అంతర్ధాన మవుతుంది. గడచిన క్షణమే కాదు, తక్షణసంఘటన కూడా యథాతథంగా పునరావృతం కాదు.

ఇంత స్పష్టమైన జ్ఞానాన్ని సంపాదించి కూడా మానవజాతి సమష్టిగా కానీ, వ్యష్టిగా కానీ పట్టించుకోవటం లేదు. తన కర్తృత్వంతో సంబంధంలేని అంశాలకు కూడా తానే కర్తనని అనిపించుకోవాలన్న తపన (అది గొప్ప విషయంగా కనిపిస్తే) ఇప్పటికీ రోజురోజుకూ పెరుగుతూనే వుంది. కానీ, ఏపాటీ తగ్గినట్టు కనిపించదు.

ఈ సందర్భంగా మరొక ప్రధానాంశాన్ని మనం మననం చేయాలి. ఈ అహంకారవిజృంభణ పామరులనబడే వారిలో కన్నా పండితులుగా, జ్ఞానులుగా, మేధావులుగా చెలామణి అవుతున్న వారిలో తీవ్రంగా వుండటం జాతి యావత్తూ సిగ్గుపడవలసిన విషయం. ఏ లక్షణంనుండి బయటపడటానికి జ్ఞానసముపార్జన చేస్తున్నామో ఆ లక్షణాన్నే మనం జ్ఞానంతో పెంచి పోషించుకొనటంకన్నా మూఢత్వానికి పరాకాష్ట మరొకటి వుండదేమో!

(నవంబరు, 2004)

## ఆధ్యాత్మికత

భారతీయ సంస్కృతిలో ఆధ్యాత్మికభావనకు విశిష్టమైన స్థానముంది. ప్రపంచంలోని ఏ ప్రాంతంలోనూ కనిపించని ఆలోచనారీతికి అది పెట్టింది పేరు. మానవుని జీవనదశనూ, జీవితానంతర పరిస్థితిని కూడా కూలంకషంగా చర్చించి, అమర్చిపెట్టిన భావపరంపర అనాదిగా అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంది.

ఈమధ్యకాలంలో ఆధ్యాత్మికత అన్నది శరవేగంతో అందరి మనస్సులనూ తాకుతోంది. వివిధసంస్థలూ, వివిధవ్యక్తులూ, పీఠాలూ, ఆశ్రమాలూ ఈ భావాన్ని వ్యాప్తిచేయటంలో గతంలో ఎన్నడూ లేనంతగా ప్రయత్నం చేస్తున్నాయి. కాల్పనికసాహిత్యం కనుమరుగై ఆధ్యాత్మిక సాహిత్యానికీ, పత్రికలకూ అందలంలో చోటు కల్పిస్తోంది. ఇది ఆహ్వానించదగిన శుభపరిణామం.

అయితే అది వాపా? బలుపా? అని అనుమానించటానికి అవకాశం లేకపోలేదు. నిరాశానిస్పృహలకు లోనై పరిష్కారప్రయత్నంలో ఆధ్యాత్మికత వైపు అడుగు వేస్తున్నారా? లేక ఆత్మజ్ఞానం కలిగి దానిని ఆచరణలో పెట్టే ప్రయత్నం చేస్తున్నారా? అని ఆలోచిస్తే మొదటి సమాధానం వైపే మొగ్గు కనిపిస్తుందేమో!

ఎందుకంటే అసలు ఆధ్యాత్మికత ఇహజీవనానికి సంబంధించిన అంశమా? పరలోకజీవనానికి సంబంధించినదా? అన్న విషయంలోనే మనకు స్పష్టమైన అవగాహన గానీ, ఆచరణకు నియతమైన ప్రణాళిక కానీ లేదు. ఆత్మస్వరూపాన్ని గురించి చెప్పుకొంటున్న మాటలకూ, ఆధ్యాత్మికత అంటూ చేస్తున్న పనులకూ సంబంధం కనిపించటం లేదు.

జీవితానంతరం ఏమవుతుంది అనేది పరోక్షసాక్ష్యాలతో సాధించిన విషయమే, కానీ ప్రత్యక్షసాక్ష్యం దానికి లేదు. ఆ స్థితిలో ఆ దశను గురించి అంత ఎక్కువగా చర్చ జరిగిందంటే, అంత ఎక్కువ వాఙ్మయం ఉద్భవించిందంటే దానికి జీవితదశతో తప్పనిసరిగా సంబంధముండి తీరాలి. ఆ ఆత్మజ్ఞానం - ఆధ్యాత్మికజ్ఞానం - జీవనదశలో ప్రతిఫలించాలి. జ్ఞానం ఫలరూపాన్ని పొందాలి. ఆధ్యాత్మికమైన జ్ఞానం పొందిన తరువాత దాని వినియోగానికి వర్తమానజీవితం కన్నా తగిన ప్రదేశం లేదు. అందుకే ఆధ్యాత్మికత మన జీవనవిధానంలో ప్రతిఫలించనంత కాలం ఆధ్యాత్మికాభివృద్ధి వాపే కానీ బలుపు కాదు.

(డిశంబరు, 2004)

# అడంగునే పగంబగ

**'పగ యడగించు టెంతయు శుభం బది లెస్స, యడంగునే పగంబగ'** అని తిక్కన వచనం. పగను సహనంతో, శాంతంతో అదుపు చేసికొనే ప్రయత్నం చేయాలి. కానీ, పగను పగతో శాంతింపజేయలేము. అణచివేయలేము. నిప్పును నీళ్ళతో చల్లార్చగలమే కానీ, నిప్పుతో చల్లార్చలేము. గాయం మానాలంటే మందు వేస్తాం. కానీ, మరోగాయం చేసికొనే ప్రయత్నం చేయం. చరిత్ర అయినా,

సామాజికశాస్త్రమైనా ఈ అంశాన్నే మనకు ప్రబోధిస్తుంది. అయినా, మనిషి మళ్ళీ పగ వైపే అడుగు వేస్తుంటాడు.

పగబట్టడంలో లక్ష్యం ప్రతీకారం తీర్చుకోవటమే అయితే అదొక పద్ధతి. దాని ఫలితం విషాదాంతమే అయినా వ్యాప్తి పరిమిత మవుతుంది. కాని, పగ వెనుక లక్ష్యంగా ధనం, అధికారం, వ్యామోహం వంటివి నిలిస్తే మాత్రం పరిణామాలు విలక్షణమై వుంటాయి. అవి వ్యక్తులకు పరిమితం కావు. వాటి వ్యాప్తి సమాజాన్ని మొత్తాన్ని కలుషితం చేస్తుంది. ఇబ్బందులకు గురిచేస్తుంది.

రాజులు యుద్ధాలు చేసేవారు. అక్కడ లక్ష్యం తమ ప్రజలరక్షణ, వారి సుఖసంతోషాలే. అందువల్లనే వాటిలో కూడా విషాదం అనివార్యమైనా ఈనాడూ అవి చట్టం అంగీకరించిన అంశాలుగా చెలామణి అవుతున్నాయి. అయినా సరే, అటువంటి యుద్ధకాంక్షలను సైతం ఈనాటి శాంతికాముకవ్యక్తులు అయినా, దేశాలయినా అంగీకరించటం లేదు.

ఆ పరిస్థితిలో వ్యక్తుల మధ్య పగలూ, ప్రతీకారాలూ ఉండటం, వాటి పరిణామాలు సమాజాన్ని చుట్టబెట్టడం ఈనాడు జరుగుతోంది. 'చెప్పేవాళ్ళు లేక చెడిపోతున్నారు' అన్న ఎప్పటి తెలుగు సామెతో ఈనాటి సామాజిక వాస్తవంగా రూపుదిద్దుకొంటోంది. వ్యక్తులూ, నాయకులూ, మార్గనిర్దేశకులూ, తేడా లేకుండా ద్వేషాగ్నిజ్వాలల్లో మాడిపోతున్నారు. 'తాను చేస్తే శృంగారం, ఇతరులు చేస్తే వ్యభిచారం' సామెత కొంత కటువుగా కనిపిస్తున్నా, అంతకు మించిన స్థాయిని మనం అందుకోలేకపోతున్నాం. సునామీలు, భూకంపాలు ఏ క్షణాన అయినా రావచ్చు. ఎక్కడయినా ఏమయినా జరగవచ్చునని వైజ్ఞానికులు ఒకవైపు భయపడుతుంటే, ఈ లోపే మన తపనలను మనం తీర్చేసుకొందామని మనుషులు మథనపడుతున్నారు.

తాను ఆనందంగా జీవిస్తూ నలుగురు ఆనందంగా బ్రతికేటట్లు చూడటానికి ఎక్కువ చదువు అవసరం లేదు. మితిమీరిన డబ్బు అవసరం లేదు. అలవిమాలిన అధికారం అక్కరలేదు. ఇదంతా తెలియనివారూ ఎవ్వరూ లేరు. అయినా, మనం అహంకారంతో పెట్రేగిపోతున్నామంటే మనలను దేవుడే కాపాడుకోవాలి. తన ఆటలోని పావులను పదిలపరచుకొనవలసిన అవసరం ఆయనదే గదా మరి!

(ఫిబ్రవరి, 2005)

# నిత్యం సన్నిహితో మృత్యుః

చప్పుడు చేయటం ప్రారంభమైన తర్వాత గుండె ఎప్పుడైనా ఆగిపోవచ్చు. దానికి నిర్దిష్టంగా ఏ కారణమూ అవసరంలేదు. శరీరంలోనో, పరిసరాలలోనో, ప్రకృతిలోనో ఎక్కడ ఏపాటి వైపరీత్యమయినా గుండెను పట్టేసే అవకాశముంది. ఇదేదో క్రొత్తగా బయటపడిన సత్యం కాదు. ఎవ్వరికీ తెలియని అంశమూ కాదు. కాకపోతే అది సంభవించి తన ఉనికిని తానే నిరూపించుకొనేదాకా దాదాపు అందరూ పట్టించుకోని అంశం.

మానవజీవితానికి చుట్టూ ఇంటా, బయటా కూడా మృత్యువు సంచరిస్తూనే వుంటుంది. మన ఇళ్ళలో మనం మృత్యుహేతువులను ఎన్నింటిని దగ్గరగా వుంచుకొని బ్రతుకుతున్నామో ఊహిస్తే అద్భుతమనిపిస్తుంది. చిన్న చిన్న కారణాలను వదిలివేస్తే వంట కుపయోగించే గ్యాసు, అనుక్షణం అవసరమైన విద్యుచ్ఛక్తి ఎంత ప్రమాదకరమైనవో అందరికీ తెలుసు. అయినా, వాటితో సహజీవనం చేస్తూనే వున్నాం.

క్షణక్షణావసరాలయిన గాలి, నీరు, నిప్పు మన అవసరానికి మించి ఏపాటి మనకు సన్నిహితమైనా భరించలేం. ఎప్పుడో విన్న గాలివానలు, కథల్లో చదువుకొనే జలప్రళయాలు నిన్నమొన్న మనను తాకిపోయాయి. జీవితానికి చరమగీతం పాడటానికి ఒకే ఒక్క క్షణం చాలు అన్న సత్యం మరోమారు నిరూపణకు వచ్చింది. ప్రకృతి ముందు మనిషి ఎంత నిస్సహాయుడో అర్థమయింది. ఇది మొదటిసారి కాదు. చివరిసారి కూడా కాదనే అనిపిస్తోంది. క్షణక్షణానికి వణికిపోతూ ఎంతకాలం బ్రతకవలసివస్తుందో అని ప్రజలలో ఆందోళన ఇంకా తగ్గటం లేదు.

అయినా ఈ భయం, ఈ ఆందోళన, ఈ ఆత్మపరిశీలన అంతా క్షణికమే. నాలుగు రోజులు గడిస్తే అంతా మామూలే. అందరూ ప్రకృతిని తలదన్నగల వారే, అందరూ చిరంజీవులే, అందరూ ఎదురెరుగని మగధీరులే మళ్లీ మరో విపత్తు సంభవించేదాకా, మళ్లీ మన నిస్సహాయత మన కర్థమయ్యేదాకా. మృత్యువు మీద పడితేనే భయపడాలా? ప్రక్కనే తిరుగు తున్నప్పుడు ఆపాటి భయభక్తులు అవసరం లేదా?

(జనవరి, 2005)

# ఆశలూ - భయాలూ

మనిషి మనుగడను శాసిస్తున్న అంశాలు రెండే రెండు. అవే ఆశలూ, భయాలూ. అవధులను, పరిధులను అతిక్రమించిన సంకల్పాలు ఆశలు. ప్రాణి మాత్రానికి సహజాతాలతోపాటు సంకల్పాలు కూడా వుంటాయి. అవి వ్యక్తి పురోగతికి, జాతి ఉనికికి కారణమవుతాయి. అయితే, ఆ సంకల్పాలు ఒక్కొక్కసారి విస్తరించి ఆశలుగా రూపొందుతాయి. ఆ దశలోనే మనిషి మనస్సును, తద్వారా మనుగడను శాసిస్తాయి. అప్పుడే క్లిష్ట పరిస్థితులు ఏర్పడతాయి. వాటినుండి బయటపడవలసిన అవసరమేర్పడుతుంది. ఎలా బయటపడడమో తెలియక సంఘర్షణకు లోనవుతాడు మనిషి. దిక్కుతోచని స్థితినుండి ఆ భయం ప్రారంభమవుతుంది. ఆశ ఆలోచనల పరిస్థితిని విస్తరింపజేస్తే, భయం కుదింపజేస్తుంది. ఆ కుదింపు శారీరకమానసికశక్తులను నిర్వీర్యం చేస్తుంది. అక్కడికి మనిషి ఉనికి ప్రశ్నార్థకం అవుతుంది.

ఆశలన్నీ దైవికంగానో, ప్రయత్నం వలననో నెరవేరుతూ వుంటే అదొక అద్భుతానుభూతి. ఆ అద్భుతానుభూతిలో మంచిచెడులను గురించి, కష్టనష్టాలను గురించిన ఆలోచనలు కూడా వుండవు. భవిష్యత్పరిణామాలను పరిశీలించే క్రమం కూడా వుండదు. అయితే అనుభూతులు మానసికాలు. వాస్తవికతకు అవి సరిపోవచ్చు లేక సరిపోకపోవచ్చు. కలలో కనిపించే అనుభవాలు మరో ప్రపంచంలాగా వుంటాయి. అవి వాస్తవాలు కావు. మనిషి ఆశలలో చాలా భాగం కలల వంటివే.

ఆశలను అణచటం కష్టం, అనవసరం కూడా. కానీ వాటిని నియంత్రించవలసిన అవసరం మాత్రం తప్పనిసరి. గుఱ్ఱాలు ఎంత గొప్పవైనా కళ్లాలు తప్పనిసరి, లేకపోతే గమ్యాన్ని చేరలేకపోవచ్చు. గమ్యాన్ని దాటి కూడా పోవచ్చు.

ఆశలను నియంత్రించలేనపుడే భయానికి అవకాశం. పిరికితనాన్ని వదిలి జీవితంలో పోరాడాలి. మహాత్ములు చెప్పింది అదే. అయితే పోరాటమంటే

విశృంఖలత్వం కాదు. ఎదురీత కాదు. పట్టాల మీదనే రైలుబండి వెళ్లాలి. భయం లేకపోతే వేగాన్ని పెంచుకోవచ్చు. అనుకూలంగా గాలి వీచే దిశలో పడవ సాగాలి. అక్కరలేకపోతే తెరచాపను దించివేయవచ్చు.

అందుకే ఆశలనూ, భయాలనూ అదుపులో వుంచలేకపోతే జీవితం దుర్భరమనిపిస్తుంది. (మార్చి, 2005)

# ద్వంద్వాల మధ్యలో.......

మానవ జనసంఖ్య పోయిన కోటానుకోట్లను వదిలిపెట్టినా ఇప్పటికీ వందల కోట్లలో వుంది. అయినా సరే, ఎక్కడో ఏవో చిన్న చిన్న పోలికలు తప్ప ఏ ఇద్దరూ ఒకేలా వుండకపోవటం విచిత్రం, విలక్షణం. రూపాలే కాకుండా భావాలూ, అభిప్రాయాలూ కూడా ఏ ఇద్దరివీ సంపూర్ణంగా, సమానంగా వుండక పోవటం ప్రత్యక్షసత్యం.

అనాదిగా మానవులంతా సుఖంగా, సంతోషంగా జీవించాలన్న ప్రబల సంకల్పం మానవజాతిలో వేళ్లూనుకొనివున్నది. జాతిగతంగా ఈ సంకల్పంలోని పవిత్రతను కాని, నిజాయితీని కానీ శంకించవలసిన అవసరం లేదు. అయినా సరే, యుగాలు గడిచిపోతున్నా అది అందని ద్రాక్షపండులా ఊరించటమే కానీ ఊపిరిపోసుకున్న లక్షణం కనిపించటం లేదు.

పైన ప్రస్తావించిన రెండు అంశాలూ వాస్తవాలే. ఈ రెండింటి మధ్య సమన్వయాన్ని సాధించగలిగితే మానవజాతీయసంకల్పం సఫలమవుతుంది. అయితే, ఆ సమన్వయ సాధనలోనే మానవజాతి సమస్తం విఫలమవుతోంది. ఒకటి రెండుగా మారటం ఎప్పుడు ప్రారంభమయిందో అప్పుడే సమస్య మొలకెత్తింది. శుద్ధచైతన్యరూపమైన పరమాత్మ విలాసార్థంగా ద్వైధీభావాన్ని పొందిన రోజే ఈ సమస్యకు అంకురార్పణ జరిగింది. అయినా, ఆనాటినుండి దానిని మానవజాతి పెంచుకొంటూ పోవటం సమస్య జటిలతను సూచిస్తుందో, మానవుని అజ్ఞానాహంకారాలకు అద్దం పడుతోందో ఆలోచించవలసి వుంది.

ప్రాణికోటిలోనే మనకు అనంతమైన వైవిధ్యం వైరుధ్యంలాగా కనిపించటం సహజమే. మిగిలిన సృష్టిని మొత్తాన్ని ప్రక్కన పెట్టినా మానవులం మనకోసం, మన సుఖశాంతులకోసం ఈ విషయాన్ని ఆలోచించుకొనవలసిన అవసరం ఏర్పడుతోంది. జ్ఞానం పెరిగే కొద్దీ ప్రాణుల మధ్య సమన్వయం పెరగాలి. సంకల్పశుద్ధి పెరగాలి. కానీ, ఆ దిశగా అడుగు కూడా కదల్చలేని స్థితిలో మనమున్నాం. పరస్పర వైరుధ్యాలతో ఆవేశకావేశాలతో సంఘర్షిస్తున్నాం. విషయాల మధ్య ఏర్పడవలసిన భేదాలు వ్యక్తులమధ్యకు దూసుకువస్తున్నాయి. వ్యక్తుల వినాశనానికి మారణకాండలకు దారితీస్తున్నాయి.

ముందు ప్రస్తావించినట్లు జాతీయ సుఖసంతోషాలే అందరి లక్ష్యమైనప్పుడు అందరం కలిసి కూర్చొని ఆలోచించి, ఆచరించగల రోజు ఎప్పటికీ రాదా? ఈ అవసరం ప్రతి ఇద్దరి మధ్యా, ప్రతి కుటుంబసభ్యుల మధ్యా ... ఇలా పైపైకి వెళ్ళి ప్రతి రెండుభావాలమధ్యా, జాతులమధ్యా ఏర్పడి వుంది గదా! జ్ఞానం విస్తరించిన మాట నిజమే, కానీ కేంద్రీకరణ దెబ్బతిన్నది. ప్రక్కదారులలో పడింది. ఆ సమస్యనుండి ప్రళయకాలంలోగా ఏనాడైనా బయటపడితే ఆ మిగిలిన కాలమైనా మానవజాతి సుఖసంతోషాలతో బ్రతుకుతుంది.

(ఏప్రిల్, 2005)

# వార్తా ప్రసారం

**వార్తయందు జగము వర్తిల్లుచున్నది.**
**యదియ లేనినాడు నఖిలజనులు**
**అంధకార మగ్నులగుదురు గావున**
**వార్త నిర్వహింపవలయుఁ బతికి,**

- ఇది మహాభారత కాలంనాటి విషయం. వార్తా నిర్వహణం రాజకర్తవ్యాలలో ప్రధానమైనది. రాజులు గూఢచార వ్యవస్థను ప్రధానాధారంగా

చేసికొని వార్తలను సేకరించి, ప్రజలకు ఇబ్బందులు కలుగకుండా, రాజ్యానికి ప్రమాదాలు వాటిల్లకుండా జాగరూకత వహించేవారు.

పాలనావిధానాలు మారి ప్రజాస్వామ్యవ్యవస్థ ఏర్పడిన తర్వాత వార్తా ప్రసారం మరింత ప్రాధాన్యాన్ని సంతరించుకొన్నది. ప్రజాస్వామ్యం మనుగడకు మూలస్తంభాలలో ఒకటిగా వార్త ప్రాధాన్యాన్ని పొందింది. అది నిన్నటి నిజం.

ఈ రోజుల్లో వార్తాప్రసారం, ప్రచారం బాగా వెర్రితలలు వేస్తోంది. పత్రికారంగంలో, ప్రసారమాధ్యమాలలో పోటీబాగా పెరిగినందువల్ల పరమపద సోపానపటాల్లోని నిచ్చెనల మీదనే దృష్టిని కేంద్రీకరించి ప్రజలను పాముల బారిన పడవేస్తున్నారు.

ఏ వార్త పరిధి ఎంతో ఈనాడెవ్వరికీ పట్టదు. తన పేరు తాను చూచుకొని మురిసిపోవటానికి తప్ప మరెందుకూ పనికిరాని అంశాలు సైతం వార్తలయి పోతున్నాయి. వార్తలలో విషయానికన్నా వ్యక్తులకు ప్రాధాన్యం పెరిగింది. ప్రసారమాధ్యమాలతో వ్యక్తులకున్న సంబంధాలు వార్తలకు రూపకల్పన చేస్తున్నాయి. రాజకీయనాయకుల ప్రకటనలు, ఊహలు, కలలు, బెదిరింపులు కూడా శీర్షికల స్థానానికి ఎదిగాయి. దాదాపుగా వార్తలంటే రాజకీయాంశాలేనేమో అని సామాన్య ప్రజలు అనుకొనే పరిస్థితి వచ్చింది.

ఇదంతా నా ఒక్కడి ఆలోచనలో పుట్టిన మహత్తర విషయ మేమీ కాదు. అందరికీ తెలిసీ 'నా లాభం నాది' అని ఎవరిమట్టుకు వారు దానిలో వాటాకై పరువులెత్తటం ముంజేతి కంకణం. అయినా అందరూ అంతా బావుందని భావించినట్లు నటించటం భారతీయులు ఈనాడు నేర్చుకొంటున్న నాగరికతలో ప్రధానాంశం. 'దేశభక్తి' అనే ప్రకల్పాన్ని ప్రక్కన పెట్టి ఆలోచిస్తే 'ఏవిధంగా నయితే ఏం, బ్రతకటమే ముఖ్యం' అనుకొనేవారికి ఈ దేశంలో పుట్టడం వరం. ఒక పద్ధతి ప్రకారం బ్రతకాలనుకొనేవారికి మాత్రం అదొక శాపం. శాపవిముక్తికి ఎవరిని ఆశ్రయించాలో మరి!

(మే, 2005)

# ఆచారాలు - ధర్మం

ప్రతి మనిషికీ వ్యక్తిగతంగా కొన్ని లక్షణాలు, కొన్ని ఆలోచనలు, కొన్ని పద్ధతులు ఉంటాయి. ఆ పద్ధతులు ఒక క్రమవిధానంలో కనిపిస్తుంటే అలవాట్లు అవుతాయి. వ్యక్తిగతంగా అలవాట్లుగా ఉన్న పద్ధతులు ఒక తెగలోనో, ఒక జాతిలోనో అనువర్తిస్తే అవి ఆచారాలుగా రూపొందుతాయి. అంటే వ్యక్తిగతమైన ఆచారం అలవాటు అనబడుతుంది. జాతిగతమైన అలవాటు ఆచారంగా వ్యవహరించబడుతుంది.

ప్రతి జాతికీ, అన్ని తెగలకూ ఈ విధంగా కొన్ని ఆచారాలు ఏర్పడి వుంటాయి. ఆ ఆచారాలలోని ఔచిత్యాలను పరిశీలించి అందరికీ యోగ్య మనిపించేటట్లు వాటిని నియంత్రించుకొంటే అదే ధర్మమనే విస్తృతార్థంలో కనిపిస్తుంది. "ఆచారప్రభవో ధర్మః, ధర్మస్య ప్రభు రచ్యుతః" అని విష్ణు సహస్రనామంలో స్పష్టమైన ప్రతిపాదన వుంది.

కాబట్టి ధర్మమనేది ఆచారనియంత్రణకు సంబంధించినదై ఆచారంలో నుండి పుట్టిందే. కానీ, ఏ ఒక మనిషో నిర్దేశించిందో, శాసించిందో కాదు. ఒక జీవనవిధానంనుండీ అందరిసమ్మతితో, అందరికీ ప్రయోజనం కలిగే లక్ష్యంతో, అసంకల్పితమైన ఆమోదంతో రూపొందినది. అందుకే సంకల్పాలతో కలిసి చూచినప్పుడు ధర్మం మనకు కొరుకుడుపడనట్లు చాలా సందర్భాలలో కనిపిస్తుంది.

జాతిభేదాన్ని బట్టి ఆచారభేదాలుంటాయి. జీవనలక్ష్యంలో తేడాలుంటాయి. వాటిని సాధించుకొనే విధానంలో వైవిధ్యముంటుంది. ఒక జాతిలో ధనసంపాదనదృష్టి గొప్ప విషయంగా కనిపిస్తే, మరొక జాతిలో అది అధమవిషయంగా కనిపిస్తుంది. ఈ తేడాలను బట్టే ధర్మవిషయంలోనూ తేడాలున్నట్టూ, ప్రతి జాతీ మరొక జాతినుండి వేరుపడుతున్నట్టూ అనిపిస్తుంది. అయితే, ఈ భేదాలన్నీ బాహిరమైనవే, కానీ ఆంతర్యంలో అన్నింటితో ఆశించే ఫలితం ఒక్కటే ఉంటుంది. గమనంలో భేదాలే కానీ ప్రధానగమ్యంలో కాదు. ఆ కోణంలోనుండీ ఏ జాతికైనా ప్రాణిసుఖంగా ఇబ్బందులు లేకుండా జీవించగలగటమే ప్రధానగమ్యం, వాస్తవానికి ఇది సర్వప్రాణులలో కనిపించే లక్షణం.

అయితే జీవించగలగటంతోపాటు జీవింపజేయగలగటం కూడా మనిషి ఆలోచనలో చోటుచేసుకొన్నప్పుడే ధర్మం, ధర్మస్వరూపనిర్ణయం, ధర్మప్రచారం అవసరమయ్యాయి. జీవించగలగాలన్న దృష్టి సహజాతం. కాబట్టి అక్కడ అదే ధర్మం. మరో విషయానికి అవకాశం లేదు. జీవింపజేయగలగటం మానవజాతి సాధించుకొన్న నాగరికతాసంస్కారాల ఫలం. ఆ దశలోనే ధార్మికచర్చ. కాబట్టి ధార్మికచర్చలు ఎన్ని చేసినా వాటి లక్ష్యం ఇతరులను కూడా జీవింపజేయగలగటమే, కానీ మరేమీ కాదు. దీనిని గుర్తుంచుకోవలసిన అవసరం ఈ సమాజానికి ఈనాడుంది.

(జూలై 2005)

# కాలక్షేపం వల్లింపులు

మన దేశంలో జాతీయస్థాయిలో గానీ, ప్రాంతీయస్థాయిలో గానీ రాజకీయపక్షాలు చాలా ఉన్నాయి. ఎవరి సిద్ధాంతాలు వారికున్నాయి. ఎవరి ఆలోచనలు, మార్గాలు, ప్రణాళికలు ఎన్నికల సమయంలో ఎన్నికల మేనిఫెస్టోలు చాలా ఉన్నాయి. అయితే పరిపాలన, ప్రజాసంబంధాలు, స్వార్థప్రకోపం, ఆశ్రితపక్షపాతం, ఆత్మస్తుతి, పరనిందల విషయానికి వచ్చేసరికి అన్నీ ఒకటిగానే కనిపిస్తాయి. ఏ పక్షాన్నీ విలక్షణంగా గుర్తించగల అంశం మచ్చుకైనా కనిపించదు.

ఆధ్యాత్మికరంగంలో అనేక సిద్ధాంతాలు, మతాలూ, ఉన్నాయి. ఎవరి విశ్వాసం వారిలో ఉంది. ప్రతి సిద్ధాంతానికి ప్రచారకులు, ప్రయోజకులు, దీక్షాపరులూ, వీరావేశంతో ఊగిపోయేవారూ బహుళంగానే కనిపిస్తారు. అయితే వ్యక్తిగత లాభాలు, సంపాదనలూ, రాగద్వేషాలూ ప్రసక్తమయ్యే సమయంలో మాత్రం అందరూ సమానంగానే ప్రవర్తిస్తారు. ఏరి చూడటానికి గానీ, వేరుచేసి చూపటానికి గానీ ఏమీ కన్పించటం లేదు.

సమాజహితాన్ని కోరే మేధావులలో ఆస్తికులు, నాస్తికులు, అభ్యుదయవాదులు, విప్లవకారులు, హేతువాదులు, శాస్త్రీయతావాదులు

విశ్వసమైక్యవాదులూ.... ఇంకా ఇంకా ఎన్ని రకాలవారో కనిపిస్తారు. అయితే తామూ, తమ ఇళ్ళూ, వాకిళ్ళూ, పిల్లలూ, చదువులు, ఉద్యోగాలూ, సంపాదనలూ, విదేశాలూ, స్వదేశాల ప్రస్తావనలో అందరి ప్రవర్తనా ఒకే రకంగా ఉంటుంది. మచ్చుకు కూడా విభేదక లక్షణం కనిపించటం లేదు.

వ్యక్తిగతంగా ఎదిగే క్రమంలో, లాభపడే సందర్భంలో అందరిదీ ఒకే దారి అయినపుడు ఎవరిమట్టుకు వారు తాము వాగేది - క్షమించండి - మాత్రమే గొప్ప సిద్ధాంతమనీ, తాము మాత్రమే సమాజానికి ప్రతినిధులమనీ, ఇతరులంతా తిరోగమనంలోనో, స్వప్రయోజనదృష్టితోనో ప్రవర్తిస్తున్నారనీ నిందించటం ఎంత వరకు సమంజసం.

మన సిద్ధాంతం మన జీవనంలో, జీవనవిధానంలో ప్రవర్తించవలసిన అవసరం లేదా? స్వలాభవిషయంలో అందరూ ఒకటే అయితే సిద్ధాంతాలు కాలక్షేపం వల్లింపులేనా? (ఆగష్టు, 2005)

## ఒకటో... రెండో...

మానవజాతి పుట్టినప్పటినుండి ఎదుగుదలకోసం ప్రయత్నించి ఉండవచ్చు. భాష లేకముందు కూడా భావం లేకపోలేదు. భావనలో స్వసుఖం, పరహితం రెండూ ప్రధానాంశాలయి ఉండవచ్చు. వాటిని అందుకొనేందుకు ప్రయత్నించే క్రమంలో ఎన్ని మలుపులో, ఎన్ని మజిలీలో, ఎన్ని నిరోధాలో, ఎన్ని ఉత్ప్లవనాలో.

భాష నేర్చుకొన్ననాటినుండి ఆ భావాలకు స్వరూపకల్పన చేసిఉంటారు. అక్షరనిర్మాణం కూడా జరిగిన తర్వాత అవి అవిచ్ఛిన్నంగా మనదాకా వచ్చాయి. వాటినే పరిగణనలోనికి తీసికొని ఆలోచిస్తే ఆ వాఙ్మయం ఎంత బరువుగా ఉంటుందో!

ఒక్క వ్యాసమహర్షి అపారమైన వాఙ్మయాన్ని సృష్టించి ఇచ్చాడు. దానికి పిలకలుగా, ఊడలుగా, ఆ గింజలు నాటితే పుట్టిన మొలకలుగా, వాటి ఫలాలుగా, ఫలరసాలుగా ఎన్ని విధాలుగా రూపాంతరీకరణం జరిగిందో.

ఆ భావాలూ, ఆ కథలూ, ఆ కథనాల ప్రభావంతో దేశభాషలలో అపార వాఙ్మయముంది. ఆ యా భాషల్లోని పదబంధాలలో, జాతీయాలలో, సామెతల్లో అంతులేని అనుభవం, జీవనశైలీనిర్మాణం కనిపిస్తోంది. వీటికి తోడు ఈనాటికీ మాటల కందని భావరూపమైన విజ్ఞానం అనంతం.

ఇంత వాఙ్మయాన్ని, ఇంత విజ్ఞానాన్నీ చూచిన తర్వాత, ఇదంతా మన సంపద అని భావించిన తర్వాత అదంతా మనదయిపోతే ఎంతలా వుంటుందో అన్న ఆలోచన, మనదే కావాలన్న ఆశ అందరిలో ఉంటుంది. ఇది భావసంపదకు సంబంధించిన ఆశ కాబట్టి దాన్ని తప్పుపట్టడం అవసరమా? అని కూడా అనుమానం కలుగవచ్చు.

చిన్నపిల్లలముందు చిరుతిండ్లు కుప్పలు కుప్పలుగా పెట్టినట్లు ఆ భావసంపదను మనముందు పెట్టినందువల్ల కావాలనే ఆశ తప్ప అనుభవించగల శక్తిని మనం కోల్పోతున్నాం.

అందుకే, జ్ఞానసంపదలో ఒకటో రెండో వాక్యాలు ఏరుకోండి. వాటిని ఆచరించి, ఆరాధించే ప్రయత్నం చేయండి. మన జన్మ, మహర్షుల కృషి, జ్ఞానుల బోధ అన్నీ సార్థకమవుతాయి.

(సెప్టెంబరు, 2005)

# క్రొత్త ఆయుధం - పుకారు

జనం గుంపులుగా గుమిగూడే సందర్భాలు అనేకం కనిపిస్తాయి. గుంపులో ఉన్నప్పుడు మంచివాళ్లు కూడా చెడ్డవాళ్లుగా మారటం సర్వసాధారణం. ఎవరిని గురించి వారే ఆలోచించుకొని అన్ని రకాలుగా ఆత్మరక్షణకు సిద్ధం కావాలి. లేకపోతే ఎప్పుడైనా ఏదైనా జరుగవచ్చు. కానీ, గుంపులో ఉన్నప్పుడు ఆత్మరక్షణ అంత తేలికయిన విషయం కాదు. ఎవరిమట్టుకు వారికి తమ ప్రాణాలు ఇతరుల ప్రాణాలకంటే విలువైనవి కాబట్టి, తమను తాము కాపాడుకొనే క్రమంలో ఇతరుల ఇబ్బందులను, నష్టాలను గుర్తించరు. ఆత్రుతను వారిలో కలిగించగలిగితే ఎంత అనర్థాన్ని అయినా సృష్టించవచ్చు.

'పుకారు' అత్యంత శక్తిమంతమైన ఆయుధం. లేనిదానిని ఉన్నట్లుగా అనిపింపజేసి ప్రచారంలోనికి తెస్తే అది పుకారు. అది తక్షణచర్యనుకోరే అంశమైతే దాని బలం మరీ ఎక్కువ. రైళ్ళలోనో, వినోదశాలల్లోనో, విమానాల్లోనో బాంబులున్నట్లు ఫోను చేసి కల్పిస్తున్న ఆందోళన తక్కువేమీ కాదు. అటువంటి సమయంలో ప్రజలు నష్టపోవటానికీ, ప్రాణాలు పోగొట్టుకొనటానికీ ఇతరుల జోక్యం అసలు అవసరం ఉండదు. తమ స్థితిని తామే కూల్చుకొనే పరిస్థితి అక్కడ కేంద్రీకృతమవుతుంది.

లక్షల మంది గుమిగూడిన చోట ఎవరో ఒకరు ఎవరినో చూపించి, 'మానవ బాంబు' అనగానే జరిగిన ఘోరం నిన్న మొన్న చూచింది. అసలు ఆ రీతిగా గుమిగూడటంలో ఉన్న ఇబ్బందిని ప్రజలు గుర్తించరు. ఆ వైనాన్ని ఆసరాగా చేసికొని చేసిన దారుణమారణకాండ సమాజంలో దుర్మార్గులకు, సంఘద్రోహులకు ఒక క్రొత్త ఆయుధాన్ని అందించినట్లయింది.

ఒక పుకారు బలమెంతో తెలిసింది ప్రజల కిప్పుడు. అందుకే శాంతికాముకులు ఎవ్వరూ పుకారులు సృష్టించే ప్రయత్నం చేయకూడదు. ఇతరులు కల్పించే పుకారులనుండి ఆత్మరక్షణ చేసుకోవటానికి ఎప్పుడూ అప్రమత్తంగా ఉండాలి.

(అక్టోబరు, 2005)

# సంపాదకీయం

మహర్షులు, మహాత్ములు ఎన్నో దర్శించారు. గ్రంథాలుగా రచించారు. దొరికినన్ని దొరికాయి. కాలగర్భంలో కలిసిపోయినవి పోయాయి. అటూ ఇటూ కాని దశలో ఎన్నో మిగిలివున్నాయి. ఇప్పటికీ వివిధ భాషల్లో వివిధ గ్రంథాల అనువాదాలో, అనుకరణలో, సంక్షిప్తీకరణలో, వివరణలో, వ్యాఖ్యానాలో, వ్యాసాలో కనిపిస్తూనే ఉన్నాయి. పత్రికలు, రేడియో, ఇతరప్రసార మాధ్యమాలూ

శక్తివంచన లేకుండా విజృంభిస్తూనే ఉన్నాయి. నైతిక ప్రమాణాలను పెంచే ఆధ్యాత్మిక కార్యక్రమాలూ, ఆధిదైవిక కార్యక్రమాలూ, ప్రక్కనే నైతికప్రమాణాలు పతనమైన అవినీతి పరిశోధనలూ ప్రసారమవుతూనే ఉన్నాయి. ఇన్ని శతాబ్దాలుగా సాగుతున్నా ఇంతమంది కృషి ఎక్కడ ప్రతిఫలిస్తోంది? ఎప్పుడు ఫలిస్తుంది?

కొన్ని వాస్తవాలను పరిశీలించేందుకు సిద్ధపడితే, ఆలోచించటానికి మనస్సు అంగీకరిస్తే వీటివలన తగినంత ఫలితం సమాజంలో కలగదన్నది తేలే విషయం. జ్ఞానులకు ఈ గ్రంథాలూ, కార్యక్రమాలూ అవసరం లేదు. జ్ఞానులంటే ముందే గ్రంథాలను చదివేసినవారు కారు. జీవితంలోని సత్యాలను నిష్పాక్షికంగా బేరీజువేసి అనుసరించగలవారు. వారి వలన సమాజానికి ఎప్పుడూ ఇబ్బంది లేదు. ఇక అజ్ఞానులు. వారికి వారి జీవితం తప్ప మరేమీ పట్టని స్థితి. ఒక్కొక్క మారు వారిని వారే పతనం చేసుకొనే స్థితి సహజసిద్ధం. కాబట్టి వారిని గురించీ ఇబ్బంది పడవలసిన అవసరం లేదు.

ఇక మూడవ తెగ - అటూ, ఇటూ కానివారు. వారు జ్ఞానానికీ, అజ్ఞానానికీ మధ్య కొట్టుమిట్టాడే వారు. లేదా రెండింటికి సంధికర్తలుగా తాము నటించేవారు. అజ్ఞానులై జ్ఞానులుగా చెలామణి కావటానికి అవసరమైన ఏర్పాట్లు చేసుకొనేవారు. ప్రస్తుతం సమాజంలో ఈ మూడవ తెగవా రెక్కువ. వీరి ప్రభావం జ్ఞానాజ్ఞానాల మధ్య విభజనరేఖ గీచుకోవటం చేతకానివారిమీద చాలా పడుతోంది. పర్యవసానంగా జ్ఞానులుగా చెలామణి అవుతున్న అజ్ఞానులచేత నడిపించబడుతున్న అజ్ఞానులసంఖ్య పెరుగుతోంది. "అంధేనైవ నీయమానా యథాంధాః?" అని కఠోపనిషత్తు చెప్పిన దానికంటే వీరు ప్రమాదకరమైనవారు. తెలిసి మెలగవలసిన అవసరం సమాజానికే ఉంది.

(డిశంబరు, 2005)

# పూజశ్రీ దలైలామావారి సందేశం

(1979 జనవరి 25న ద్వితీయ ప్రపంచ హిందూ మహాసమ్మేళనం, ప్రయాగలో వారి ప్రసంగం నుండి)

సంకుచితదృష్టితో చూస్తే - నావంటి బౌద్ధభిక్షువు హిందూ సమ్మేళనంలో పాల్గొనడం విడ్డూరంగానే కనిపించవచ్చు. కానీ, విశాలదృష్టికి ఇదేమీ విడ్డూరం కానేకాదు. కారణమేమంటే, భారతవర్షంలో పుట్టిన అన్ని మతాలకు చెందినవారూ ఈ సమ్మేళనంలో పాల్గొంటున్నారు. టిబెట్లో వికసించిన బౌద్ధధర్మం నిజానికి బుద్ధ భగవానునిచే ప్రవర్తితమైన భారతీయధర్మమే. అయితే కారణాంతరాలవల్ల బౌద్ధమతం భారతదేశంలో సురక్షితంగా ఉండలేకపోయింది. టిబెట్లో మేమాధర్మాన్ని శ్రద్ధాభక్తులతో రక్షిచడమేకాక వికసింపజేశాం. భారతదేశానికి వచ్చి భారతీయ విద్వాంసులతో సంభాషించిన మీదట - దర్శనంలో, సాధనలో, ఇతర అంశాలలో వారి దృక్పథానికి, మా దృక్పథానికి ఏమాత్రం అంతరం లేదని స్పష్టమయింది. ఈ రంగంలో వేలాది సంవత్సరాలుగా మేము కూడబెట్టిన నిధి అంతా మూలతః భారతదేశానిదే.

ఇంతే కాదు. మరో దృష్టితో చూసినా నేనీ సమ్మేళనంలో పాల్గొనడం సముచితమే. జీవులను దుఃఖంనుండి విముక్తిచేయడం సకలధర్మాలకూ గమ్యం. కనుక భారతీయధర్మావలంబులు అందరూ సంఘటితరూపంలో బహుజనులకు సుఖాన్ని, హితాన్ని చేకూర్చే కార్యంలో నిమగ్నులు కావడం సముచితం. అవసరం కూడా.

ఈ ఇరవైయవ శతాబ్ది చివరిపాదంలో విజ్ఞానశాస్త్రం, సాంకేతిక విజ్ఞానం పరిపూర్ణతను అందుకున్నా, అవి మానవుని దుఃఖాన్ని దూరం చేయలేక పోతున్నాయి. అంతే కాదు, భౌతికశక్తుల ఈ వికాసం మానవుని అస్తిత్వానికే ప్రమాదకారిగా పరిణమిస్తున్నది. కనుక అన్ని మతాలవారూ సంఘటితమై, విశ్వంలో సమత, స్వేచ్ఛ, ఔదార్యం, న్యాయం మున్నగు మానవత్వపు విలువలను ప్రతిష్ఠించవలసిన అవసరం నేడు ఎంతైనా ఉన్నది. తద్వారా సుసంస్కృతమైన మానవసమాజాన్ని నిర్మించాలి. ధర్మం అందించే ఆధ్యాత్మిక ప్రేరణ ఆధారంగా మనిషినీ మనిషినీ వేరుచేసే అడ్డుగోడలను కూలద్రోయకపోతే - మన భావాలకు విభిన్నమైన భావాలు గల వ్యక్తులపట్ల మనం న్యాయంగా ఉదారంగా వ్యవహరించలేకపోతే - మానవకళ్యాణం ఒక ఎండమావియే కాగలదు.

(జనవరి, 2006)

# బాధ్యత గల మనిషి

స్ఫోటనంనుండీ విశ్వం పుట్టిందట. పరమాత్మ తాను అనేకంగా విభజించుకొన్నందువల్ల సృష్టి ఏర్పడిందట. అణువులు విచ్ఛిన్నమయితేనే శక్తి ఉద్భవిస్తుందట. గింజ బ్రద్దలయితేనే మొలకెత్తుతుందట. విచ్ఛేదంవల్ల ఇంత ఉపయోగం జరుగుతుంటే మనం మాత్రం కలిసి ఉందామని అనుకొంటూంటాం. ఉండగలుగుతున్నామా లేదా అన్నది మరలా ప్రశ్నాత్మకం. అసలు అవసరమా అన్నదాన్ని గురించి ఆలోచించాలి.

సంఘర్షించే శక్తుల్లో నుండి చరిత్ర పుట్టవచ్చు. చారిత్రిక వ్యక్తులుగా, చరిత్రగా మిగిలిపోవాలనుకొనేవారికి సంఘర్షణ అనివార్యం కావచ్చు. అయితే ప్రతివ్యక్తి జీవితం చరిత్ర కాలేదు. కాకూడదు కూడా. అందరూ చారిత్రిక పురుషులయితే చరిత్రపుస్తకాలు మరీ పెద్దవవుతాయి. చదివేవాళ్ళ సంఖ్య అసలు ఉండదు.

కాబట్టి అందరి జీవితాలకూ సంఘర్షణ ప్రధానాలంబనం కాలేదు.... అందరి శక్తికి విచ్ఛిత్తి అవసరమూ లేదు. విచ్ఛిన్నపదార్థాలనుండి పుట్టిన శక్తి అయినా ఫలరూపాన్ని పొందగలిగేది మరో పదార్థంతో సంయోగం ద్వారానే. కాబట్టి విచ్ఛిత్తిఫలం సంసక్తి.

అందుకే విడివడ్డ పరమాత్మ నుండి విశ్వమంతా ఏర్పడితే ఆ విశ్వమంతా పరమాత్మలో లీనమయ్యేందుకే తిరిగి ప్రయత్నిస్తోంది. ఆ సంసక్తిని సాధించటానికి మనుషులు విడిపోవటానికి పాత్రులు కావటం కానీ, విడిపోవటానికి ప్రేరకులు కావటం కానీ జరిగితే జాతి క్షమించదు.

దేశాలూ సరిహద్దులూ వేరైనా, కులాలూ కొలమానాలూ వేరుగా కనిపిస్తున్నా మానవజాతి మాత్రం ఒక్కటే. కుదురుగా ఉన్న మానవజాతి భౌతికావసరాలవల్ల విచ్ఛిన్నమై విభిన్న ప్రాంతాలకు చేరి, మానసికావసరాలకోసం సంస్కృతిని నాగరికతను ఏర్పరచుకొని ఆచారాలు వేరయినా ఆంతర్యాలు ఒకటిగా జీవిస్తోంది. ఈ సహజీవనవిధానం నచ్చనివారు, ఇతరులను రెచ్చగొట్టి తమ పబ్బం గడుపుకోవాలనుకొనేవారూ ఆంతర్యాలను కాలదన్ని, ఆచారభేదాలను ఎత్తిచూపుతూ, అందరినీ వేరుచేసి చూచే, చూపే ప్రయత్నం చేస్తారు. వారి బారి నుండి మనిషిని కాపాడుకోవలసిన బాధ్యత, బాధ్యత తెలిసిన ప్రతి ఒక్కరి మీదా ఉంది.

(ఫిబ్రవరి, 2006)

# ఏకాత్మత

మన శరీరంలో ఎన్నో అవయవాలున్నాయి. ఏ అవయవానికి ఆ అవయవానికి విడివిడిగా విధులు, చలనాలు ఉన్నాయి. దేనిపని అది చేసుకుంటూ పోతుంటుంది. అవి పని చేసినా, చేయకపోయినా వాటిపై మనకు మమకార ముంటుంది. అంగవైకల్యం కానీ, అంగవిహీనత కానీ మనలను బాధిస్తుంది. అయితే, అంగవిహీనులైనా జీవితవిధానంలో తేడా లేదు. అందరిలాగా వారూ భావిస్తారు, ఆశిస్తారు, ఆవేశకావేశాలకు లోనవుతారు. అందరిలాగే జీవితాన్ని ముగిస్తారు. కాబట్టి అవయవాల ప్రతిపత్తిని విస్మరిస్తే మానవశరీరం మొత్తంగా ఒక అంశమవుతుంది. రూపాన్నో, లక్షణాలనో, సంబంధబాంధవ్యాలనో మానవశరీరం మొత్తం ఒకే అంశంగా భావించి మాత్రమే పరిగణిస్తున్నాం..

కళ్లకు కనిపించే చరాచరజీవకోటిలో మనిషి ఒక అంశం. విడివిడిగా మానవులకు ప్రతిపత్తి కనిపిస్తున్నా జంగమజీవజాతిలో మనిషి ఒక భాగం మాత్రమే. జంగమాలను అన్నింటినీ ఒకే అంశంగా భావిస్తే చైతన్యలక్షణాలు సమానంగానే కనిపిస్తాయి. జీవనసరణి ఒకటిగానే కనిపిస్తుంది. స్థావరాలైన జీవనకోటిని కూడా కలిపితే చరాచర జీవసమూహమంతా ఒకటిగానే కనిపిస్తుంది. ప్రాణరహితమైన పదార్థాలను కూడా కలిపి ఆలోచిస్తే విశాల విశ్వమంతా ఒకటే. ప్రాదేశిక భేదాలు, కాలభేదాలు అస్థిరాలు. స్థిరంగా కనిపించేది సంపూర్ణ విశ్వం.

ఈ విశ్వమైనా స్థిరమా అంటే అనుమానమే. కలలో కనిపిస్తున్న జీవ నిర్జీవపదార్థాలు ఎంత వాస్తవాలో, బాహ్యంగా కనిపిస్తున్న ఈ విశ్వం కూడా అంతే వాస్తవం. నేడు కాకపోతే రేపయినా అదృశ్యమయ్యేదే.

ఈ విధంగా స్వల్పవిషయాలనుండి ముందు విశిష్టప్రతిపత్తిని తొలగించ గలిగితే మహావిషయాలనుండి కూడా అది తొలగిపోతుంది. సర్వపదార్థాలలోని విశిష్టలక్షణాలను వదిలి చూడగలిగితే అద్వైతభావన కలుగుతుంది. అదే పరమాత్మ సందర్శనం.

అందుకనే విడివిడిగా చూడటం మానేప్రయత్నం చేద్దాం. మొత్తంగా చూడటం అప్రయత్నంగా సిద్ధిస్తుంది. (ఏప్రిల్, 2006)

# మంచితనం

మనం సంఘంలో నివసిస్తున్నాం. వివిధ స్థాయిలలో రకరకాల మనుష్యులతో మన సంబంధం అనివార్యం. ఒక్కడుగా జీవించగలగటం అసాధ్యం. అందరితో కలిసిపోగలగాలి.

దీనికి మూలసూత్రం మనం మంచిగా ఆలోచిస్తూ, మంచిగా మాట్లాడుతూ, మంచిగా ప్రవర్తించటమే. వాస్తవానికి ఏది మంచి, ఏది చెడు అని నిర్ణయించటం అంత తేలికైన విషయం కాదు. ఫలితాన్నిబట్టి మంచిచెడుల స్వరూపస్వభావాలు మారుతుంటాయి. మనం అంత లోతుగా ఆలోచించగలిగినా అందరూ అలా ఆలోచించాలని శాసించలేము, ఆశించలేము. అందుకే కొన్ని సందర్భాలలో అది మంచి కాదని మనం భావిస్తున్నా, లోకమర్యాదను బట్టి అటువంటిపనులు చేయవలసివస్తుంది. ఎవరికీ కీడు కలగనంత వరకు మనం అటువంటి పనులు చేయవచ్చు. ఉదాహరణకు - భావానికీ భాషణకు తప్పనిసరిగా పొందు ఉండాలనీ, అదే ఉత్తమవ్యక్తిత్వానికి సంకేతమనీ పెద్దలు అందరూ అంగీకరించారు. ఉద్బోధించారు. కానీ, ప్రస్తుతం ఆ రెండింటికీ సమన్వయం లేని ప్రవర్తన చిన్నా, పెద్ద తేడా లేకుండా; పండితపామరభేదం లేకుండా దాదాపు అందరిలోనూ గమనిస్తున్నాం. లౌక్యం పేరుతో కొందరూ, పాండిత్యబలంతో కొందరూ, మూర్ఖత్వంతో కొందరూ, జీవితావసరమని కొందరూ ఆ ముసుగులను గట్టిగా వేసుకొంటున్నారు. భావానికి, భాషణకు సమన్వయం కల్పించి బ్రతికే వారిని ఇబ్బందులు పెడుతున్నారు కూడా.

అయినా సరే, మనం మంచిగానే ఆలోచించాలి, మాటాడాలి, చేయాలి. మనం మంచిచేసిన తరువాత ఇతరులు కూడా మనకు అలాగే మంచి చేయాలని ఆశిస్తాం. చేయకపోతే బాధపడతాం. ఇది లోకసామాన్యవిషయం.

కానీ, మంచి చేయటం మన స్వభావమైతే దానిని విస్మరించటం ఇతరుల స్వభావం కావచ్చు. ఇది స్వభావాల స్పందనలకు సంబంధించినదే కానీ మంచి చెడుల బలాబలాలకు సంబంధించిన విషయం కాదు. ఇతరుల ప్రవర్తన కూడా - పర్యంతఫలితాన్ని బట్టి ఆలోచిస్తే - ఏదో కోణంలో అదీ మంచిదే కావచ్చు. మంచి చేసినవాడు ఎప్పుడూ చెడిపోడని రామాయణం ఉద్బోధిస్తోంది. కాబట్టి మంచిగా ఉండటం మన రక్తంలో భాగంగా స్వీకరిద్దాం. ఫలితాలను పరమాత్మకు వదిలేద్దాం.

(జూన్, 2006)

# నీటి మూటలు

నీటిని మూట కట్టడ మేమిటి? అని చాలామందికి అనిపిస్తుంటుంది. పాతరోజుల్లో ఏ వస్తువునైనా మూటలు కట్టి మోసుకొనిపోవటం లేక దాచుకోవటం అలవాటు కాబట్టి, నీటిని కూడా అదే విధంగా మూటకట్టే ప్రయత్నం చేసేవాణ్ణి చూచి ఆ అజ్ఞానానికి ఆవేదనపడుతూ ఏర్పడిన మాట 'నీటిమూటలు', నీటిని మూటకట్టి నిల్వచేయటం అసాధ్యం. కాబట్టి అది అజ్ఞానానికి సంకేతమైంది.

అయితే, మారుతున్న సామాజిక విధానాలలో నీటిని మూటకట్టడమూ కుదురుతోంది. నీటితో మూటలు కట్టడమూ పెరుగుతోంది. పండ్లరసాలు అమ్మి నష్టపోయినవాడు మంచినీళ్ళు అమ్మి లాభపడుతున్నాడు. అంతులేని ధనాన్ని ఆర్జించగలుగుతున్నాడు.

వ్యాపారసంస్కృతిలో అవసరాన్ని తీర్చటంతోపాటు అవసరాన్ని సృష్టించటం కూడా ఒక భాగం, కాబట్టి ఆ ఏర్పాట్లు అందరూ కలిసి చాలా జాగ్రత్తగా చేసుకొన్నారు. మంచినీళ్లుకొనటం తప్పని పరిణామ మన్నట్లుగా సమాజాన్ని, సామాజిక కార్యకలాపాలనూ రూపొందించుకొన్నారు. పదిమందీ సమకూడే చోట త్రాగటానికి తగిన రీతిగా, తగినంతగా నీళ్లు సమకూర్చక పోవటంతో ప్రారంభమైన ఈ ప్రక్రియ ఇంటికీ, ఊరికీ ప్రాకి ఎక్కడి కక్కడ నీళ్లు కొనుక్కొంటేనే బావుంటుందన్న భావానికి పెద్ద పీటలు వేశారు. వ్యాపార సంస్కృతిని జనజీవనసంస్కృతిగా మార్చారు. మరచెంబులతో నీటిని పట్టుకొని ప్రయాణాలు చేస్తున్న బామ్మలను చూచి నవ్వుకొన్నవారే ఈ రోజు నీటిసీసాలతో ప్రయాణాలు చేస్తున్నారు. 'నీటిని కొనాలా' అని అనుమానించేవాడిని అమాయకుడి క్రింద జమచేస్తున్నారు. లీటరు పాలు, లీటరు నీళ్లు దాదాపు ఒకే ధర పలుకుతుంటే పరుగెత్తుతూ నీళ్లు త్రాగటం అలవాటు చేసికొంటున్నారు.

నీటిని గురించి తెలిసికోవటం పెరిగేకొద్దీ బ్రతుకుమీద భయం కూడా పెరుగుతోంది. ఆ భయం మూల్యాన్ని చెల్లించమంటోంది. గతానుగతికంగా అందరూ అటు మొగ్గుతున్నారు. నీళ్లను కూడా రోజూ కొనిత్రాగే స్థితికి అందరూ ఎదిగినందుకు ఆనందిద్దామా? నీటిని కొని త్రాగితే తప్ప ఆరోగ్యానికి అవకాశం లేని స్థితిని కొనితెచ్చికొన్నందుకు బాధపడదామా? (మే, 2006)

# షష్టిపూర్తి కాకముందే

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి చాలా సంవత్సరాలైంది. స్వతంత్ర భారతం అరవైలోకి అడుగు పెట్టి షష్టిపూర్తి చేసుకోబోతోంది. స్వాతంత్ర్యానికి షష్టి పూర్తి అంటే ఆశ్చర్యపడవలసిన అంశమేమీ లేదు. అరవై సంవత్సరాలు బ్రతికి బట్టగట్టటమంటే మనలాంటి వారి మధ్య అది ఘనకార్యమే.

వాస్తవానికి స్వాతంత్ర్యం రాక ముందూ, వచ్చిన తరువాత ప్రత్యక్షంగా భేదం కనిపించటం లేదనేవాళ్ళ సంఖ్య తక్కువేమీ కాదు. ఆ సంఖ్య దాదాపు కనుమరుగయ్యే పరిస్థితి వచ్చేసింది. సాంస్కృతికంగా కానీ, ఆర్థికంగా కానీ, నాగరికంగా కానీ, ప్రజాజీవనభావనశైలులలో కానీ స్వాతంత్ర్యం వలన పెద్దగా ఒరిగిందేమీ లేదు. మార్పు జరిగిందేమీ లేదు. కనిపిస్తున్న మార్పులు ఎక్కువమంది జీర్ణించుకొనలేనివే.

స్వాతంత్ర్యఫలంగా మనకు ప్రత్యక్షంగా కనిపిస్తున్న అంశం రాజకీయ స్వాతంత్ర్యమే. ఇతర దేశస్థులు పాలకులుగా ఉండకూడదని పోరాడి మనమే పాలకులం కాగలిగాం. కాబట్టి పాలకులలో, పాలకుల జాతీయతలలో వచ్చిన మార్పు మాత్రమే ఇది. పాలితుల విషయానికి వస్తే పెద్దగా సంతృప్తిగా జీవిస్తున్న లక్షణాలేమీ కనిపించటం లేదు.

పాలితులంతా స్వేచ్ఛావాయువులు పీల్చుతూ, ఆనాటి బాధల నుండి విముక్తులై, ఆనందంగా గడుపుతున్నారని పాలకులు ప్రగల్భిస్తుంటే, పాలితులంతా ఆనాటి పాలకులే మెరుగనిపిస్తున్నారని భావించే పరిస్థితి ఇప్పుడు కనిపిస్తోంది. మనలను మనమే పరిపాలించుకోవటమంటే మన చేతులతోనే మన కళ్లు పొడుచుకోవటం కాకూడదు గదా! అన్న మీమాంస చాలా మందిలో కనిపిస్తోంది.

ప్రపంచదేశాలలో చాలా పెద్ద ప్రజాస్వామ్యదేశంగా గణింపబడే భారతదేశంలో రెండో స్వాతంత్ర్య సమరానికి ప్రజలు సన్నద్ధులు కావాలన్న అభిప్రాయాలూ, ఆకాంక్షలు కూడా అరవైలోకి అడుగిడక ముందునుండే

ప్రారంభమయ్యాయి. ఒడ్డున ఉండి సిద్ధాంతాలు చెప్పేవాళ్లకూ, నీటిలో దిగి ఈదుతూ గడిపేవారికీ మధ్య కనిపించే తేడా ఈ దేశంలో పాలకులకూ, పాలితులకూ మధ్య కనిపిస్తోంది. ఇదంతా షష్టిపూర్తి కాకముందే.

ఇకనైనా ఎవరి పాత్రను వారు సరిగా పోషించి నాటకాన్ని రక్తికట్టించే ప్రయత్నం చేయక తప్పదు.

(జూలై, ఆగష్టు, సెప్టెంబరు, 2006)

# జీవితం సంక్లిష్టం

మనిషి సృష్టిలోని ప్రాణులన్నింటిలాగా పుట్టి మరణిస్తాడు. అయితే, వివిధ కారణాలవల్ల తనను తాను ఇతర ప్రాణులకన్నా ఉన్నతంగా భావించాడు. నిజమో, అబద్ధమో నిర్ణయించగల ప్రమాణాలు నియతంగా లేకపోయినా ఈనాటికీ అలాగే భావించుకొంటున్నాడు. ఇది నైసర్గికంగా ఏర్పడిన ఔన్నత్యమయితే కృత్రిమంగా మనుషులలోనే గొప్పవారినీ, సామాన్యులనూ వేరుచేసి చూపటానికీ, చూడటానికి మరికొన్ని ప్రమాణాలను చెలామణిలోనికి తెచ్చుకొన్నాడు. ఆ ప్రమాణాలలోనూ నియతిలేదని తెలిసి కూడా అటో ఇటో సర్దుకొంటూ ఏదో రీతిగా ఆధిక్య - అల్పత్వ విభాగానికి ప్రాణంపోసి జీవిస్తున్నాడు.

ఈ నేపథ్యంలో మనుషులు మూడు తెగలుగా విడిపోయారు. ప్రాచీన జీవనశైలిని యథాతథంగా పాటిస్తూ లేదా పాటిస్తున్నట్టు కనిపిస్తూ నిశ్చింతగా బ్రతుకుతున్నవారొక తెగ. తన జీవితం, తన అవసరాలు, తన ఆనందం ప్రధానంగా, దాని కనుగుణంగా అంతా మలచుకొని జీవిస్తున్నవా రొక తెగ. వీరు ప్రాచీనతను కాదనటానికీ వెనుకాడరు. క్రొత్తదనాన్ని స్వీకరించటానికి వెనుకాడరు. తమ మనస్సు ఎలా ఉన్నా లోకానికి దానికి భిన్నంగా కనిపించటానికి వెనుకాడరు. ఈ రెండు తెగలవారూ సంఘంలో ఆనందంగానే జీవిస్తున్నారు.

ఇక మూడవ తెగవారికే సమస్యలన్నీ. వీరు ప్రాచీనతను కాదనలేరు, నవీనతను అవుననలేరు. ఎటు మొగ్గాలన్న సంకోచమే. దేనినీ పూర్తిగా నమ్మరు. నమ్మకుండా ఉండలేరు. పెద్దవాళ్ల మాటలు వింటుంటే అవే వాస్తవాలు అనిపిస్తుంటాయి. మామూలు జీవితాలను చూస్తుంటే అవన్నీ ప్రశ్నార్థకాలుగా కనిపిస్తుంటాయి. ఎలా బ్రతకాలో తెలియక, సంక్లిష్టతకు తట్టుకోలేక బాధలు పడుతుంటారు. వీరిని ఈ సంక్లిష్టతనుండి బయట పడవేస్తే మిగిలిన రెండు తెగలవారూ ఆనందంగా బ్రతికే అవకాశముండదు. అందుకని వారు ఎట్టి పరిస్థితులలోనూ వీరిని సందేహరహితంగా, ప్రశాంతంగా బ్రతకనీయరు. అందుకని ఎవరి ఆనంద ప్రశాంతతలకోసం వారే ప్రయత్నం చేయవలసిన అవసరముంది. అన్నీ వినాలి. నిర్ణయం సొంతంగా తీసికోవాలి. వినటమే మానితే అంతా కలిసి వెలివేస్తారు. అన్నింటినీ నమ్మితే మనకు శాంతి ఉండదు. జీవనాన్ని వాస్తవానికి దగ్గరగా పరిశీలించండి. ప్రశాంతతకు భంగం రాకుండా ప్రవర్తించండి.

(అక్టోబరు, 2006)

## కుండీ మొక్కలు

గింజ నాటితే మొక్క మొలుస్తుంది. పరిసరాలు, వాతావరణం అనుకూలంగా ఉంటే ఎదిగి పెద్ద చెట్టై పైకి, ప్రక్కలకూ విస్తరిస్తుంది. కొమ్మలు ఎంత నరికినా వేరు ఉన్నంత కాలం చిగురిస్తూనే ఉంటుంది. అదే మర్రిచెట్టయితే ఊడలు దిగి, అవీ మ్రానులై, స్థలాన్ని ఆక్రమించుకొంటూ పోతుంది. తీగ సాగే మొక్కలయితే పైకి ఆలంబనం దొరికే కొద్దీ ఎగబ్రాకుతుంది. దానికి వ్యాప్తికన్న ఉన్నతి ఎక్కువ. వ్యాపించే లక్షణముంటే ఎంత చోటయినా చాలదు. దుంప నాటితే పైకి కనిపించే మొక్క చిన్నదే అయినా, ఆ దుంప లోపల్లోపల ప్రాకుతూ పోతుంది. పై మొక్కను పీకినా ఆ దుంప మళ్ళీ మొలుస్తుంది.

ఎక్కడెక్కడ ఎంతమేర అది వ్యాపించిందో తెలిసి అరికట్టడం కష్టసాధ్యం. మనిషి మనస్సులో ఆశను విత్తాడు దేవుడు. అది అవినీతిగా మొలిచింది. చిగుర్లు వేసుకొంటూ కొనసాగింది. ఎత్తుకు పోతున్నది తీగ కాబోలు అనుకొంటూ ఊడలు దిగటం ప్రారంభమైంది. ఊడలు నరుక్కొంటూ రావాలని ప్రయత్నించాం. అది ప్రక్కలకూ ప్రాకటం ప్రారంభించింది. మొత్తం నరికేశాం. చెట్టు మరో రూపంగా మరోచోట మొలకెత్తింది. ఇంకో చెట్టేమో అనుకొని త్రవ్విచూస్తే, నిజమే మరొకటిలానే ఉంది. కానీ, దుంప మాత్రం అదే. దుంప తెగే దారి కనిపించలేదు.

అందరూ అందరినీ పీడించే అవకాశముంది. కాబట్టి ఎవడికి వాడు ప్రక్కవారినుండి తనకు రక్షణ కావాలని సంకల్పించాడు. అందుకే అందరూ కలిసి ధర్మశాస్త్రాలూ, నీతిశతకాలూ, శాసనాలూ, చట్టాలూ చేశారు. అద్భుతమైన రూపకల్పన జరిగింది. ఇక తనను ఎవ్వరూ ఏమీ చేయలేరని అందరూ అనుకొన్నారు. మరి తాము ఎవ్వరినీ ఏమీ చేయలేని పరిస్థితి వచ్చేసింది. వెంటనే భయం పట్టుకొంది మనిషికి. అమ్మో అవన్నీ ఫలిస్తే?

అందుకే ఆ శాస్త్రాలనూ, శాసనాలనూ చక్కగా ముస్తాబు చేశాడు. కుండీల్లో పెరిగే క్రోటన్ మొక్కలుగా వాటిని మలిచాడు. కుండీ దాటకుండా మీలో మీరు పెరగండన్నాడు. అవి బుద్ధిగా మాట విన్నాయి. కుండీల్లోనే పెరుగుతున్నాయి. పాపం కష్టపడి పెరగటమే కానీ పుష్పించి, ఫలించుదామంటే ఏముంటుంది? అప్పుడో పువ్వు, అప్పుడో కాయ, పిల్లలు వ్రేళ్ళతో చూపించుకోటానికి ఉపయోగపడుతున్నాయి. ఊడల మట్టి క్రింద మరో మంచి మొక్క ఫలిస్తుందా?

(నవంబరు, 2006)

# అనుష్ఠానమే ధర్మం

భగవద్గీత మహాభారతంలోని భీష్మపర్వంలోనిది. కౌరవ పాండవులు యుద్ధానికి సిద్ధపడిన తర్వాత శత్రువర్గంలోని బంధుమిత్రులను చూచి చలించిన అర్జునుడు గాండీవాన్ని వీడి, కర్తవ్యమూఢుడైన సందర్భంలో కర్తవ్యోపదేశం చేయటానికి శ్రీకృష్ణుడు చేసిన బోధ భగవద్గీత. సవాలక్ష సందేహాలకు, సవాలక్ష శ్లోకాలకు ఆకరమైన మహాభారతంలోని ఒక చిన్న ముక్క విడిగా విశిష్టంగా విలువను పొందటమే విచిత్రమైన అంశం. మహాభారతంలోనే మరెన్నో గీతలున్నాయి. ఎన్నో విషయాలకు సంబంధించిన చర్చలున్నాయి. జీవన విధానానికి సంబంధించిన విశ్లేషణలు, వివరాలూ ఉన్నాయి. అయినా భగవద్గీత ప్రత్యేకంగా నిలువటానికి కారణమేమై ఉంటుంది?

అసలు భగవద్గీత విడిగా ప్రచారంలోనికి ఎలా వచ్చిందో తెలిసికొనేందుకు ఆధారాలు లేవు. మహామూలగ్రంథంతో విడివడటంతోపాటు, మహనీయుల బృహత్-వ్యాఖ్యలకు కూడా నోచుకొన్న దది. ఒక పవిత్ర గ్రంథం, ఒక పారాయణ గ్రంథంగా చెలామణిలో ఉన్న గ్రంథ మది. గీతాజయంతి సందర్భంగా అయినా గీతాధ్యయనంలోని మార్మికతను పరిశీలించవలసిన అవసరమున్నది.

ఎట్లా జరిగిందో తెలియకపోయినా, ఎప్పటినుండో గీత విశిష్ట గ్రంథమై 'ప్రస్థానత్రయం'లో చోటు సంపాదించింది. బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులతో కలిపి దానిని ప్రస్థానత్రయంలో భాగంగా స్వీకరించటంతో దానిని కూడా ఆధ్యాత్మికత, మోక్షప్రదాయకత్వాలను ప్రధానఫలంగా భావించి, పారాయణ స్థాయిని పెంచి, మన భారం తగ్గించుకొన్నాం.

ఆధ్యాత్మికత అయినా మోక్షమయినా అది ఒకానొక దశావిశేషమే కానీ, భౌతికస్థితివిశేషం కాదు. దానిని భౌతికస్థితిగా భావించి, ఐహికంగా కుదరనందువల్ల పారమార్థికమని తృప్తిపడి, పరమార్థమిహలోకానికి సంబంధించినది కాదు, కాబట్టి ఇప్పట్లో మన కర్తవ్య మేదీ లేదని నిశ్చింతగా జీవిస్తూ గీత దారి గీతది, మన దారి మనది అన్నట్లు బ్రతికేస్తున్నాం.

గీత అనుష్ఠానం ప్రధానంగా నిలిచే జీవనతత్త్వాన్ని ప్రబోధించిందే గానీ, సైద్ధాంతికచర్చలకు పరిమితమయ్యే మెట్టవేదాంతాన్ని బోధించలేదు. ఈ గీతా జయంతి సందర్భంగా అయినా గీతనూ, గీతాధర్మాన్ని అనుష్ఠానంగా భావించుదాం. అనుష్ఠానమే ఒక ధర్మంగా మనం నడచుకొనవలసిన అవసరాన్ని గ్రహించుదాం. (డిశంబరు, 2006)

## మకర సంక్రాంతి

సూర్యుడు మకరరాశిలోనికి ప్రవేశించటంతో ఉత్తరాయణం ప్రారంభ మవుతుంది. మరల కర్కాటకంలోనికి ప్రవేశించేంత వరకు ఉత్తరాయణమే.

అనేక శుభకార్యాలు - ప్రత్యేకించి ఉపనయనం వంటివి ఉత్తరాయణం లోనే జరుగుతాయి. భీష్ముడుకూడా రణరంగంలో పడిపోయినా స్వచ్ఛంద మరణం వరంగా పొందినవాడు కాబట్టి ఉత్తరాయణ పుణ్యకాలం ప్రవేశించేదాకా అంపశయ్యపై అసువులు బాయకుండా నిలిచాడు. ఒక ఖగోళ వాస్తవం, దాని చుట్టూ అల్లుకొన్న పారలౌకికవిశ్వాసం రెండూ మకర సంక్రమణానికి ప్రాధాన్యాన్ని కల్పిస్తున్నాయి.

మంచు విడిపోవటం, ఎండలు పెరగటం ఇప్పటినుండి ప్రారంభ మవుతుంది. ఇది శిశిర ఋతువయినా రాత్రిపూట ఆ లక్షణాలున్నా, పగలు ఉష్ణోగ్రతలు పెరగటం అందరికీ తెలిసిన విషయమే.

ఎండ ఎంత ఎక్కువగా కాస్తున్నా పనులు చేసికొంటూనే ఉండటం, చినుకు వాన పడినా అక్కడికక్కడే తల దాచుకొనే ప్రయత్నం చేయటం మానవ నైజం. అంటే ఉత్తరాయణ పుణ్యకాలం దాదాపు అంతా మనిషి ఆగకుండా, ఆపకుండా పనులపై దృష్టి పెట్టేందుకు అనువైన కాలం. పారమార్థిక విశ్వాసం దృష్ట్యా పవిత్రమైనకాలం. జీవనవ్యవస్థకు ఆటంకం లేకుండా వాతావరణముండే కాలం. కాబట్టి సత్ప్రణాళికలను ఆచరణలో పెట్టి, సత్ఫలితాలను సాధించటానికి అనువైన సమయంగా దీనిని గుర్తించి ఉపక్రమిద్దాం. (జనవరి, 2007)

# ఎప్పుడూ ఇంతేనేమో

చరిత్రను చూడండి. పురాణాలనూ, ఇతిహాసాలనూ చదవండి. పరిశీలించండి. ఆలోచించండి. ఎక్కడైనా పరిపూర్ణమానవుడు కనిపించాడా? కనీసం అవతరించాడా?

మనిషి ప్రాణికోటిలో ఒక భాగం. అన్ని ప్రాణులలాగా తనకూ కొన్ని లక్షణాలుంటాయి. వాటికి మన ఆనుకూల్యం కోసం ఏర్పరచుకొన్న గుణదోష విభాగాలుంటాయి. అయితే మనిషి తనను తాను సృష్టిలో అన్నింటికన్న గొప్ప ప్రాణిగా భావించాడు. నిజమేనేమో! అన్ని ప్రాణులూ ఈ మనిషి సుఖసంతోషాల కోసమే ఉపయోగపడుతున్నాయి గదా! ఆ ప్రాణులు ఏమనుకొంటున్నాయో తెలీదు మరి.

ఆ ఆధిక్యభావమే మనిషిని భౌతికంగా అభివృద్ధిపరిచినా, మానసికంగా అధోగతిలోనే నిలిపింది. ఇంకో రీతిగా చెప్పాలంటే సహజమైనప్రాణి లక్షణాలతోనే నిలిపింది. సహజాతాలయిన ప్రాణిలక్షణాలతోపాటు జ్ఞానం ద్వారా సంపాదించుకొన్న అవలక్షణాలు ఆ ప్రాణిలక్షణాలను బలపరిచాయి.

అందుకే, ఆకలివేస్తేనే ఆహారం తీసుకోవటం లక్షణమయితే ఆకలి లేకపోయినా, ఆకలి తీరిపోయినా ఆహారం తీసుకోవటం జ్ఞాని లక్షణమయింది. తన జీవితానికి - అదీ ఆనాటికో, అప్పటికో - సంపాదించుకోవటం ప్రాణి లక్షణమయితే తరతరాలకూ దాచుకోవటం జ్ఞాని లక్షణమయింది. ఆత్మరక్షణకు పరిమితం కావలసిన రాగద్వేషాలు ప్రాణి లక్షణమయితే ఇతరులపై ఆధిపత్యం చెలాయించటానికో, ఇతరులను అణచివేయటానికో రాగద్వేషాలను పతాకస్థాయికి తీసికొనిపోగలగటం జ్ఞాని లక్షణమయింది.

ఇదే జ్ఞానానికీ, జ్ఞానసంపాదనకూ పరాకాష్ఠ అయితే మనకు జ్ఞానం అక్కరలేదు. కనీసం నిఖార్సయిన ప్రాణులుగా బ్రతుకుదాం చాలు.

(ఫిబ్రవరి, 2007)

# సర్వజిత్తు

మరల నూతనసంవత్సరానికి స్వాగతం పలుకుతున్నాం. నిన్నటి అనుభవాలను నేడు స్మరించుకొంటూ రేపటి ఆచరణకు అనువైన ప్రణాళికలను సిద్ధం చేసుకొనే అవకాశం ప్రతి వసంతంలోనూ మనకు అందుతుంది. ఆకులు రాల్చుకొని తిరిగి చిగురించే ప్రకృతి వ్యర్థభావాలను వదిలి మనలను మనం నవీకరించుకొనేందుకు దారి చూపుతుంది. ఆ విధంగా కాలం తన ఉనికిని చాటి చెప్పుతుంది.

ఆ కాలానికి బద్ధులమై జీవించవలసినవారం మనం. కాలానికి ఎదురీదటం, కాలాన్ని కాదని ముందుకు నడవగలగటం సైద్ధాంతికంగా వినటానికి బాగుంటాయే కాని తట్టుకొని నిలబడగలగటం కష్టం. కేవలం వ్యామోహంతో కాలానికి ఎదురీదాలని ప్రయత్నించి, విఫలుడైన ధృతరాష్ట్రుడు కూడా అంగీకరించింది కాలాన్ని అతిక్రమించటం కష్టమనే. ఎప్పటికప్పుడు తమ వైఫల్యం కళ్లకు కట్టినట్లు కనిపిస్తున్నా, లెక్కచేయకుండా ముందుకే సాగి ధృతరాష్ట్రుడు వంశనాశనానికి కారకుడయ్యాడు. అయితే, అది ఆయన కొడుకు దుర్యోధనుడి మీదుగా వెళ్లిపోవటం ధృతరాష్ట్రునిపై కాలం చూపిన కరుణయే. కాలానికి విధేయులమై కార్యాచరణకు పూనుకొని కళ్యాణపరంపరల నందుకొనే ప్రయత్నం చేద్దాం.

రాబోయే సంవత్సరం సర్వజిత్తు. సర్వజిత్తు అంటే అందరినీ లేదా అన్నింటినీ గెలవగలది. కాలచక్రంలో ఇప్పటికి ఎన్నిసార్లు, ఎందరిని గెలిచి పోయిందో! ఇప్పుడు మనవంతు వచ్చింది. జయశీలమయిన కాలానికి మనలను గెలవటం కూడా సాధ్యమే. ఆ కాలం గెలుపులో మనమూ భాగస్వాములమై ఆనందంగా సంవత్సరాన్ని గడిపేద్దామని భావిస్తూ అందరికీ శుభాకాంక్షల నందజేస్తున్నాం.

(మార్చి, 2007)

# బ్రతుకు

లంకానగరంలో రామరావణసంగ్రామం సాటిలేని యుద్ధంగా పేరు పొందింది. అంత తీవ్రమయిన యుద్ధంలో ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించగా భరించలేక రామలక్ష్మణులు కూడా మూర్ఛిల్లారు. హనుమంతుడు తగిన రీతిగా బ్రహ్మాస్త్రాన్ని మన్నించి, విభీషణునితో కలిసి హతశేషులను అనునయించాలని బయలుదేరాడు.

విభీషణునికి జాంబవంతుడు కనిపించాడు. శరీరమంతా గాయాలు, కళ్లు కూడా కనిపించని పరిస్థితి. విభీషణుడు పలుకరించగానే జాంబవంతుడు **"హనుమాన్ వానర శ్రేష్ఠః ప్రాణాన్ ధారయతే క్వచిత్"** అని ప్రశ్నించాడు. హనుమంతుడు బ్రతికే ఉన్నాడా అని ప్రశ్న. విభీషణుడికి ఆశ్చర్యం కలిగింది. రామలక్ష్మణులను గురించి అడగకుండా ఆంజనేయునిగురించి అడగడ మేమిటని? ఆ విషయాన్నే అడిగాడు జాంబవంతుణ్ణి. అప్పుడు జాంబవంతుడు అన్న మాట ఇది

**అస్మిన్ జీవతి వీరే తు, హత మప్యహతం బలమ్ ।**
**హనుమత్యుజ్ఝితప్రాణే, జీవంతోఽపి మృతా వయమ్ ॥**

హనుమంతుడు బ్రతికి ఉంటే, బలగమంతా దెబ్బతిన్నా దెబ్బతిననట్లే. హనుమంతుడే ప్రాణాలు వదిలితే, మనం బ్రతికి ఉన్నా మరణించినట్లే.

జీవితమంటే అది. బ్రతకటానికి ఎవ్వరూ పెద్దగా శ్రమపడనవసరం లేదు. పిపీలికాది సర్వప్రాణులు బ్రతుకుతూనే ఉన్నాయి, విశేషించి మనలాగా హైరానా పడకుండా. అయితే ఆ జీవితానికి ఒక విలువ కావాలి. ఒక సార్థక్యం కావాలి. ఇళ్లూ, వాకిళ్లూ, సొమ్ములూ, షోకులూ, డబ్బూ, దస్కం, అధికారం, అహంకారం, ఇవన్నీ విలువను తెస్తాయని భావిస్తుంటాం. అవి కొంత సౌకర్యాన్ని కలిగించగలవేమో కానీ, విలువను కలిగించలేవు.

మనిషికి విలువ కావాలంటే తాను బ్రతకాలి - తాను బ్రతికితే పదిమంది బ్రతకగలగాలి. పదిమంది బ్రతుకుతోనే తన బ్రతుకు ముడిపడాలి. తనచుట్టూ ప్రపంచముండటం కాదు. ప్రపంచం మధ్యలో తానుండాలి. (ఏప్రిల్, 2007)

# రాజీ - ఘర్షణ

శరీరనిర్మాణాన్ని బట్టి చూస్తే మనుషులంతా ఒక్కటే. ఇది ఎంత వాస్తవమో, అంత అవాస్తవం. మనుషులంతా ఒక్కటే అయితే విడివిడిగా గుర్తింపదగిన రూపం ఎలా ఏర్పడుతుంది. ఆరడుగుల నిర్మాణంలో కోటాను కోట్ల భేదాలు కనిపిస్తూనే ఉన్నాయి. కాలమింకా గడుస్తున్నా తేడాలు అలాగే కొనసాగుతాయి. కాబట్టి చిన్న తేడా రూపాన్ని వేరుచేసి చూపినట్లు, చిన్న తేడా మనస్సులను కూడా వేరుచేసి చూపగలదు గదా! అందుకే జాతిగతంగా అంతా మనుష్యులమయినా వ్యక్తిగతంగా రూపాలు వేరయినట్లు, జాతిగతంగా మనస్సులన్నీ ఒకటే అయినా వ్యక్తిగతంగా మనస్సులన్నీ వేరువేరే.

మన ప్రవృత్తిలోకూడా కొంత సారూప్యం ఉంటుంది. అనాదిగా వస్తున్న ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, అనుభవాలు, సామాజికమైన సంస్కృతిరూపాన్ని సంతరించుకొని అందరిమీదా ప్రభావాన్ని చూపిస్తాయి. శాస్త్రవిధినిషేధాలు జీవనమార్గాన్ని నిర్దేశిస్తాయి. అయితే, ఇవన్నీ ఒక ఎత్తయితే, వైయక్తికమైన అభిరుచులు, అనుభవాలు, తాత్వికనైపథ్యం ప్రతి మనస్సునూ వేరుచేస్తాయి. కానీ, మనిషి సంఘజీవి కాబట్టి వ్యక్తిత్వాన్ని సమష్టితత్వంతో ముడిపెట్టుకొనవలసిన అవసర మేర్పడుతుంది.

సరిగ్గా ఈ బిందువు దగ్గరే మనిషి మనిషిగా తననుతాను నిరూపించుకొనవలసి వస్తుంది. దీనికి రెండే మార్గాలు. ఒకటి రాజీపడటం. మరొకటి ఘర్షణపడటం. ఈ రెండింటిలో ఎప్పుడు ఏ దారిని ఎంచుకోవాలో నిర్ణయించుకొనగలగాలి.

రాజీపడటమంటే ఒక విధమైన న్యూనతాభావం మనలో కనిపిస్తుంది. కానీ, అది సమంజసమైన ఆలోచన కాదు. మనకు తెలియకుండానే చాలా విషయాలలో మనం రాజీబాటలోనే పయనిస్తుంటాం.

ఘర్షణవైఖరి ఎంత విలువైనదో అంత ప్రమాదకరమైనది. సంఘర్షణ అవసరాన్ని గుర్తించకుండా ఘర్షణకోసమే ఘర్షణవైఖరిని అవలంబిస్తే సత్ఫలితాలు రావు. అందుకే రాజీతో ఘర్షణపడటం, ఘర్షణతో రాజీపడటం తప్పనిసరి అవుతాయి సామాజిక జీవితంలో. (జూన్, 2007)

# మనలను మనమే మలచుకోవాలి.

అనంత ప్రాణిసమూహంలో దేని లక్షణాలు దానికే వున్నట్లు మానవ సమూహంలో కూడా ఎవరి లక్షణాలు వారివే. జాతిలక్షణాలు మానవుల నందరినీ ఒకటి చేసినా, విశిష్ట లక్షణాలు ఎవరిమట్టుకు వారిని విడివిడిగా నిలిపేవే. అందుకే అవసరాలయినా, అభిరుచులయినా, న్యాయాలయినా, నీతులయినా, శాస్త్రాలయినా, ధర్మాలయినా ఎవరికి వారికి విడిగా అన్వయించుకోవలసినదే, కానీ అందరికీ వర్తిస్తాయి. కానీ, విశిష్టలక్షణాలు విభిన్నాలే. అందుకే మహాభారతం ధర్మాన్ని కూడా రాజధర్మమనీ, ఆపద్ధర్మమనీ, మోక్షధర్మమనీ విభజించి ప్రతిపాదించింది. అది కూడా వాస్తవానికి ఒక అవాంతర విభాగమే. కానీ అందులోనూ వ్యక్తి వ్యక్తికీ వైవిధ్యమే.

కాబట్టి ఎవరి జీవితాన్ని గురించి అయినా వారికి తెలిసినంతగా మరెవ్వరికీ తెలియదు. సమాజంలోని వివిధాంశాలలోనూ, వివిధవ్యక్తులతోనూ, వివిధ సందర్భాలలోనూ తమను తాము మలచుకొనవలసిన రీతి తమకు తెలిసినంతగా మరెవ్వరికీ తెలియదు. ఆ రహస్యం గ్రహించి సమాజానికీ, తనకూ మధ్య జాతికీ, వ్యక్తికీ మధ్య ఉండవలసిన లక్షణాలను భంగపడనీయకుండా తనను తాను మలచుకొంటే జీవితం ఆనందమయమవుతుంది. ప్రశాంతత కొరవడకుండా వుంటుంది.

ఒక్కసారి మనను మనం మలచుకొన్న తర్వాత సమాజాన్ని మనలో ఇముడ్చుకొనటం చాలా తేలిక. ఏ మూర్తికయినా ఒక రూపాన్ని ఒక మాదిరిని తయారుచేయటం చాలా కష్టం. భావనాత్మకమయిన రూపాన్ని తీర్చటం కష్టం కానీ ఈ రూపానికి ఒక మాదిరి తయారయితే అటువంటి రూపాలను అనంతంగా తయారుచేయవచ్చు.

కాబట్టి మనలను మనం మలుచుకొనగలిగితే సమాజాన్ని మనం అనుకొన్న రూపం లోనికి తేగలగటం తేలిక. దాన్ని మనలో ఇముడ్చుకొనగలగటం మరీ తేలిక. అందుకే ముందుగా మన జీవితాలను మనమే మలచుకొందాం. అందరి ఆనందాలకూ కారణమవుదాం.

(జూలై, 2007)

# సమైక్యసూత్రం

పిపీలికాది బ్రహ్మపర్యంతమూ చైతన్యశక్తి ఒకటే. కేంద్రబిందువు నుండి ఏర్పడిన వ్యాసాన్ని బట్టి చైతన్యపరిధిలో మార్పు ఉండవచ్చు గానీ చైతన్యస్వభావంలో మార్పుండదు. ఆయా ప్రాణుల అవసరాలు, వాటి సాధనసామగ్రి, వాటి జీవలక్షణం స్వభావనిర్ణయములో కీలకపాత్రను వహిస్తాయి. స్వభావ వైవిధ్యానికి కారణమవుతాయి. అంతే కానీ, స్వభావసిద్ధికి కారణభూతమైన చేతనావస్థితిలో తేడా ఏమీ ఉండదు.

అది తీగ కావచ్చు, పువ్వు కావచ్చు, కదలాడే ఆకు కావచ్చు, కురిసే వాన కావచ్చు, మెరిసే మెరుపు కావచ్చు, విరిసిన వెన్నెల కావచ్చు. దేని సౌందర్యమైనా, సౌశీల్యమైనా కదలికలోనే ఉంటుంది. నిశ్చలంగా నిలిస్తే ఉనికికి గుర్తింపూ లేదు, ఉనికీ లేదు. అందుకే చైతన్యశీలమయిన పదార్థాల నన్నింటినీ ఆదరిద్దాం, గౌరవిద్దాం. ఆప్యాయంగా చూద్దాం.

కొంత మేలు చేయటం, కొంతమేర ఇబ్బంది కలిగించటం ప్రాణులన్నిటి సహజలక్షణం. మేలు, కీడు అన్నవి సాపేక్షమయిన విలువలు, జ్ఞానిగా భావించబడే మానవప్రాణి అయినా ఇతరులకు కష్టాలను, నష్టాలను కూడా కలిగించగలదే. ఇతర జాతుల జీవులకే కాక స్వజాతివారికి కూడా అసౌకర్యంగా మనగలిగినదే. తనకు ప్రపంచమంతా సహకరించాలి. తన సుఖంకోసం, తన సౌలభ్యం కోసం ప్రపంచమంతా మోకరిల్లాలని భావించటం, ఆశపడటం మానవప్రాణికున్న విశిష్టలక్షణం. అందరూ తన వలెనే ఆశిస్తారన్న ఆలోచనకూడా మనిషికి లేకపోవటం చిత్రం.

అందుకే గమనించుదాం. అంతా చైతన్యరూపమే. అందరూ సమానమే. పరిధిలోని తేడా పరిమితిలోనే నిలిపి సమైక్యంగా సాగటమే ధర్మసూత్రంగా భావిద్దాం.

(ఆగష్టు, 2007)

# పరమ తపస్సు

**'క్షమా హి మూలం సర్వతపసామ్'** అని పెద్దలు తపస్సులకు మూలం సహనం - ఓర్పు - అని తీర్పు చెప్పారు.

దుఃఖాన్ని దిగమ్రింగాలన్నా, సుఖాన్ని అనుభవించాలన్నా, క్రోధాన్ని అణచుకోవాలన్నా, సంతోషాన్ని పంచుకోవాలన్నా ఓర్పు చాలా అవసరం. అనాదిగా భారతీయ జీవనతత్త్వవేత్తలు ఈ ఓర్పుకు ఎంతో ప్రాధాన్యాన్నిచ్చారు. ఇతిహాసాలలో, పురాణాలలో ఓర్పును కోల్పోయి ఇబ్బందులపాలయిన మహాత్ములను గురించి చెప్పారు. **"క్రోధమ తపముం జెఱచును, క్రోధమ యణిమాదులయిన గుణముల చెఱచున్"** సహన ప్రాధాన్యాన్ని వక్కాణించారు. క్రోధానికి వ్యతిరేకంగాగాక అన్ని భావాలకూ నియంత్రణశక్తిగా పనిచేయవలసినది సహనమే.

సహనాన్ని కోల్పోయి పిల్లలనే శపించిన తల్లులూ, తండ్రులూ కూడా మనకు పురాణేతిహాసాలలో కనిపిస్తారు. ఒక కద్రువ, ఒక యయాతి, ఒక విశ్వామిత్రుడు ఇటువంటి కోవలోనివారే. తన మోసానికి సహకరించలేదని కద్రువ, తన సుఖానుభవాలకు యౌవనాన్ని ఇవ్వలేదని యయాతి, తన ఔదార్య ప్రకటనకు అనుగుణంగా ప్రవర్తించలేదని విశ్వామిత్రుడు తన బిడ్డలనే శపించారు. ఆ కథలన్నీ మనకు వినిపించటంలోని తాత్పర్యం - ఆ పాత్రలను తక్కువ చేయటం కాదు. అంతటి వారుకూడా అసహనానికి గురయి ఎంత వినాశానికి ఒడిగట్టారన్నదే! ఆ దారిలో మనం నడవకూడదన్నదే తాత్పర్యం.

ఆధునికకాలంలో భావవినిమయం వేగాన్ని పుంజుకొన్నది. వార్త వేగంగా ప్రసరిస్తోంది. మనస్సు తీవ్రంగా పని చేస్తోంది. ఈ సౌకర్యాలన్నీ మనుష్యుల శాంతికి సహకరించవలసిందిపోయి, అసహనానికి గురిచేస్తున్నాయి. లక్ష్యాలులేని పరుగులు, తీరికలులేని పనులు, అలలు అలలుగా ఎగిసిపడే కోరికలు, అమలుకు నోచుకోలేని నీతిసూత్రాలు, అంతుచిక్కని జీవనవిధానాలు, అగాధంలో పడిపోతున్న మానవీయ సంబంధాలు ఓర్పును నశింపజేస్తున్నాయి. విద్యతో, వయస్సుతో, ఆర్థికస్థితితో సంబంధంలేకుండా తానొక్కడూ బ్రతకగలడన్న భరోసా కలగగానే మిగిలిన అన్నింటినీ విస్మరించి అసహనానికి ఆహ్వానం పలుకుతున్నాడు మనిషి.

ఇది మారాలి. ఎవరు మారినా మారకున్నా ఏదీ ఆగదు. కాలంగానీ, ప్రపంచంగానీ ఆగిపోదు. కానీ, మనం బ్రతికినన్ని రోజులూ ప్రశాంతంగా బ్రతకాలంటే, సహనమే ఆయుధం కావాలి. ఆ పరమతపస్సు అందరూ అలవరచుకోవాలి.

(సెప్టెంబరు 2007)

## నూకలు పెడితే

'నూకలు పెడితే మేకలు కాస్తావా?.... పెద్దపులొస్తే భయపడవా?'... అంటూ చిన్నపిల్లల కళ్లలోకి ఊది, కనురెప్పల కదలికలలో కనిపించిన భయాన్ని చూచి పెద్దలు నవ్వుకొనే ఆట, చిన్నపిల్లలూ శ్రుతికలిపే ఆట - శతాబ్దాలుగా మన జాతికి పరిచయమే. అది ఆటగా నిలిచిపోయినా, దాని వెనుక ఈనాటి పథకాలు ఎన్నో ఆనాటికే రూపుదిద్దుకొని ఉండటం కనిపిస్తుంది. మొదటిది పనికి ఆహారం పథకం - రెండవది పరిస్థితులు నెదుర్కొనే ధైర్యాన్ని కల్గించటం- మూడవది వైఫల్యాలకు లొంగిపోకుండా కలిసి నవ్వుకోగలగటం. వీటన్నింటినీ మించి పెద్దవాళ్ళు చిన్నపిల్లలను ఆటపట్టించి ఆనందించే తత్త్వం. అయినా అది ఆత్మీయతానుబంధాల మధ్య కొనసాగే ఆనందానుభూతికి ఆలవాలమవుతోంది.

ఆ ఆటను ఇప్పటికీ పెద్దవాళ్ళు పిల్లలతో ఆడుతూనే ఉండటం, ఆట గెలుస్తుండటం విచిత్రమైన సన్నివేశం. 'బియ్యం పెడతాను ఓట్లేస్తావా'... 'మధ్యలో మానేస్తే ఆకలితో చావవా'... అంటూ పాలకులు పాలితుల కళ్లల్లోకి సూటిగా చూడలేకపోయినా రెప్పలు కదిలేంతగా ఊదగలుగుతూనే ఉన్నారు. పాలితులు లొంగిపోతున్నారు. లొంగిపోతున్నట్లు కనిపిస్తున్నారు అప్పుడప్పుడు.

పై ఆట తల్లీబిడ్డల మధ్యో, అన్నాదమ్ముల మధ్యో, వావివరసలేవయినా ఇద్దరు ఆత్మీయులమధ్యో జరిగేది. నూకలు పెట్టినా, పెట్టకపోయినా మేకలు కాచే పరిస్థితి అక్కడుంది.

ఇక్కడి పరిస్థితి అటువంటిది కాదు. కొందరి స్వార్థానికి, కొంత సమాజం అభ్యున్నతికి సంబంధించింది. ఇది ఆటగా మారితే ఆటగాడికి నష్టం లేకపోయినా, సమాజ పురోగతికి ప్రశ్నార్థకమే.

ఆకలివేసినవాడికి అన్నం పెట్టడాన్ని ఎవ్వరూ కాదనరు. అయితే అది ఒక అవసరం కావచ్చు. కానీ, ఒక ఆట కాకూడదు. మొండిగా ఆ ఆటలు గెలవాలని తపన పడకూడదు. మొండివాడు రాజుకంటె బలవంతుడు కావచ్చు. రాజే మొండివాడు కావచ్చు. తానెంత బలవంతుడయినా, మొండితనం కంటే బలవంతుడేం కాదు.

ఈ మొండి ఆటలు ఏదో ఒక రోజు అంతరిస్తాయని ఆశిద్దాం.

(అక్టోబరు, 2007)

# హద్దులో....

తుప్పర పడితే 'వానా వానా వల్లప్పా' అంటూ పాడుకొంటూ కేరింతలు కొడతాం. ఉన్నట్టుండి వడగళ్లవానపడితే వడగళ్లను ఏరుకొంటూ ఆటలాడుకొంటాం. కుండపోతగా పడుతుంటే దుప్పటి కప్పుకొని పంచలో కూర్చొని ఎంతసేపయినా సరే విసుగులేకుండా చూస్తాం. అయితే, పైనుంచి పడ్డ వాన క్రింద ప్రవాహంగా, వరదగా మారనంత వరకే ఈ ఆటలు, పాటలు, వినోదదృశ్యాలు. ఒక్కసారిగా చినుకూ, చినుకూ ఒక్కటై రూపాన్ని మార్చుకొన్న తరువాత ఉన్నచోట నిలువలేని పరిస్థితి ఎదురవుతుంది. ఆస్తులనూ, ఇళ్లనూ, చివరకు ప్రాణాలనూ కూడా రక్షించుకోలేని నిస్సహాయస్థితికి గురవుతాం. సంవత్సరాల తరబడి ధీరగంభీరులమయిన మనం క్షణాలలో బేలతనానికి లోనయి మానసికంగా కూడా క్రుంగిపోతాం.

గమనించారా? చినుకుగా ఉంటే ఆనందం, వానగా మారితే ఐశ్వర్యం, వరదగా పారితే విషాదం. పదార్థం ఒక్కటే అయినా దశావిశేషాన్ని బట్టి, స్థాయీ భేదాన్ని బట్టి విభిన్నఫలితాలు.

ఈ స్వభావం పంచభూతాలలోనూ ఇలాగే కనిపిస్తుంది. చిరుదీపముంటే చీకట్లను పారద్రోలుకొంటాం. కాంతి పెరిగేకొద్దీ గ్రుడ్డితనానికి దగ్గరవుతాం. నేలయినా, గాలయినా, నింగయినా కూడా ఇదే స్థితి. హద్దులో వుంటేనే ముద్దు. ఉంచగలిగితేనే!

ఇదే విధంగా హద్దుల్లో ఉండవలసిన మరో ద్రవ్యం మనస్సు. మానవ నైజమంతా దానిపై ఆధారపడి ఉంటుంది. స్వభావం నియంత్రించమని బుద్ధిని, రెండింటిని కలిపి వినియోగించుకొనమని మనిషిని సృష్టించాడు ఆ పరమాత్మ. కానీ, మనం మాత్రం ఎక్కువగా మనస్సు వైపే మొగ్గు చూపుతున్నాం. బుద్ధిని బలహీనంగా ఉంచుతున్నాం.

అందుకే జాగ్రత్త వహించాలి. మనస్సు చేసే చేష్టలు చినుకులా, వానలా ఉంటే జీవితం ఆటా పాటా అవుతుంది. వరదలా మారితే మాత్రం మొత్తం కొట్టుకొనిపోతాం. ఆనవాళ్ళు కూడా మిగలవు. (నవంబరు, 2007)

# పరస్పరం భావయంతః

గీతలో శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించిన జీవనసూత్రాలలో ఇది ఒకటి.

**దేవాన్ భావయతానేన, తే దేవా భావయంతు వః ।**
**పరస్పరం భావయంతః, శ్రేయః పరమవాప్స్యథ ॥**

యజ్ఞాలు చేసి మానవులు దేవతలకు ప్రీతిని కలిగిస్తే, దేవతలు వర్షాలు కురిపించి మనుష్యులకు సిరులు కలిగిస్తారు. ఈ రీతిగా ఒకరి నొకరు ఆనందింపజేస్తుంటే మహాశ్రేయస్సు కలుగుతుంది. ఈ సూత్రం అర్జునునికి ఎంతవరకు అర్థమైందో, కురుక్షేత్ర సంగ్రామం తరువాత దానిని ఎంతమేర అమలుపరచుకొన్నాడో సరిగ్గా తెలియదు. కానీ, ఆ సూత్రం ఈ యుగంలో చాలామందికి తారకమంత్రంకన్న మిన్నగా ఉపయోగపడుతుంది.

పరస్పర ప్రశంసలు, పరస్పర ప్రయోజనాలు ప్రధాన సూత్రంగా ఈనాటి సంఘంలో చాలా కార్యక్రమాలు జరుగుతున్నాయి. జరుగుతున్న వాటిలో ఎక్కువ శాతం వాటిదే. వాటిలో కొన్ని బహిరంగ విన్యాసాలు. 'నవ్విపోదురు గాక నాకేటి సిగ్గు' అన్న దేవులపల్లి స్థాయి ఆ తెగవారిది. మరికొన్ని రహస్యవిన్యాసాలు. ప్రణాళిక విశ్వజనీనంగా కనిపించినా ప్రయోజనంమాత్రం మనకే దక్కే పరిస్థితి ఇక్కడ ఉంటుంది. ఈ ఇద్దరూ కలిసి చేతులు పెనవేసికొని ఇద్దరి పనులూ చేసుకొనే సంస్కారం కూడా మనకు పుష్కలంగా ఉంది.

'గడ్డిపరకలు సైతం ఎంటిగా ఏర్పడి మదపుటేనుగును బంధించుచున్నవి' అని చిన్నయసూరి పంచతంత్ర భావాలను నీతిచంద్రికలో చక్కగా వ్యక్తీకరించారు. సంఘీభావప్రాధాన్యాన్ని వివరించే ఆ సూక్తి అద్భుతమైనది. అటువంటి సూక్తులు - మహాజీవన మార్గదర్శకాలు కావలసిన సూక్తులు - చవకబారు ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నాయి.

నలుగురం కలిసి పనిచేసుకొంటే తప్పేముంది? మా డబ్బుతో చేసికొంటే మీకేం నష్టం? ఇలాంటి ప్రశ్నలు వేసేవారు కూడా లేకపోలేదు ఈ పరస్పరస్తోత్ర పాఠకులలో, అయితే డబ్బు ఎవరిదయినా, ఫలితమేదయినా అది వ్యక్తిగతమో, వ్యష్టిపరిమితమో అయితే ఎవ్వరూ, ఎవ్వరినీ గురించి ఆలోచించనవసరమూ లేదు, తప్పుపట్టనవసరమూ లేదు. కానీ, సమాజం మొత్తాన్ని ప్రభావితం చెయ్యాలన్న ప్రయత్నంతో చేసే ఏ పని అయినా సామాజిక న్యాయానికి కట్టుబడి ఉండాలి. ఆ న్యాయాన్ని అతిక్రమించి, నిరాదరించి సొంత డబ్బుతో సంఘాన్ని ప్రభావితం చెయ్యాలని చూస్తూ, స్వప్రయోజనాలను కాపాడుకోవటం మాత్రం సామాజికమైన నేరమే అవుతుంది. (డిశంబరు, 2007)

## పెద్దలే మారాలి

'పిల్లలు చెడిపోతున్నారు', 'యువత దారితప్పుతోంది' వగైరా మాటలను మనం పదే పదే చదువుతుంటాం, వింటుంటాం, చూస్తుంటాం. పెద్దలు సమావేశమైన ప్రతిచోటా తరువాత తరాలను ఆడిపోసుకోవటం సహజంగానే జరుగుతుంటుంది. నిజంగా పిల్లలు అంతగా చెడిపోయారా? పోతున్నారా?

కాసేపు నిజమే అనుకుందాం. కానీ, పిల్లలు దేన్నో దాన్ని చూచి లేక చదివి లేక విని మాత్రమే చెడిపోగలరు. కానీ, స్వతంత్రంగా చెడిపోగల ఆలోచన పిల్లలందరిలో కలుగుతుందా? దానికి అవకాశముందా?

ప్రాణిజీవితంలో ప్రధానమైన అంశం అనుకరణం. మనతోపాటు సహజాతాలయిన భావాలు పుడతాయి. వాటి పుట్టుకలో ఎవ్వరిప్రమేయమూ

ఉండదు. కానీ, వాటికి బాహ్యరూపాన్ని కల్పించటంలో, వాటిని సంతృప్తిపరిచే విధానాలను ఎన్నుకోవటంలో మాత్రం అనుకరణశీలత ప్రధానపాత్ర వహిస్తుంది. మహాత్ముల జీవితచరిత్రను ఒక్కసారి చెప్పినంత మాత్రాన అది పిల్లలను ప్రభావితం చేయలేదు. అసలు నువ్వెందుకు అలా ఎదగటంలేదని ఎదురు ప్రశ్న వేస్తే సమాధానం చెప్పగల స్థితి ఉపదేశకులకు ఉండటం లేదు.

దప్పిక వేస్తే ఎదురుగా వున్న నీటితోనే దాహం తీర్చుకుంటాం. కానీ ఎక్కడో, ఎప్పుడో తీయటి నీళ్ళు దొరుకుతాయని ఆగలేం కదా! ఎదురుగా కనిపిస్తున్న పెద్దలలోనే దారి తప్పిన లక్షణాలు దండిగా కనిపిస్తుంటే వాటి ప్రభావాన్ని కాదని ఏవో దూరపు కొండలను ఆదర్శంగా తీసుకోగల స్థైర్యం పిల్లలకుండటం కష్టం. అందుకే మారవలసిన అవసరమేదైనా ఉంటే అది పెద్దలకు సంబంధించిన విషయం. మారవలసింది పెద్దలే. పిల్లల భవిష్యత్తును, జాతి భవిష్యత్తును ఏమాత్రం పరిగణనలోకి తీసుకున్నా, వాటిగురించి ఆందోళనపడుతున్నా, ఆవేదనకు లోనయినా వాటికి పరిష్కారం ఈనాటి పెద్దలు మారటమే.

అసలే త్రికరణశుద్ధి లోపించిన ఈనాడు మరీ పతనం కాకముందే పెద్దలమే మారుదాం. (జనవరి, 2008)

## దేహం - మోహం

మన పురాణాలూ, కథలూ, కావ్యాలూ అనాదిగా మనకు ఒకే సత్యాన్ని బోధిస్తున్నాయి. అదే - దేహముంటే మోహం తప్పదన్న సత్యం.

పురాణకథలు చదువుతున్నా, వింటున్నా మనకు ఆశ్చర్యం కలుగుతుంది. మనకే కాదు, ఆ యా కథలు వింటున్న పురాణపాత్రలకు కూడా ఆశ్చర్యమే కలుగుతుంది. ప్రాణికోటిలో నరజన్మ దుర్లభ మంటారు. నరులకన్నా దేవతలు గొప్పవాళ్లంటారు. మాయామర్మాలు, గొప్పగొప్ప సిద్ధులు ఆ దేవతల కుంటాయి. అయినా సరే, మామూలు మానవుల్లో కనిపించే లోపాలు, ఒక్కోసారి అంతకు

మించిన లోపాలు కూడా వారిలో కనిపిస్తాయి. సృష్టి, స్థితి, లయకారకులుగా మనం ఆరాధిస్తున్న బ్రహ్మవిష్ణుమహేశ్వరులనే గాక తత్పుత్రులను, లోకాధిపతులను అందరినీ విలక్షణంగా చిత్రిస్తూ, దేహమంటూ వుంటే మోహం తప్పదని నిరూపిస్తున్నాయి. అయితే, దేహాన్ని గురించిన ఆలోచన కూడా దేహధారులే చేయాలి. తప్పని మోహంనుండి తప్పించుకొనగలిగే ఉపాయాన్ని దేహధారులే అన్వేషించాలి. ప్రయత్నాలను దేహధారులే చేయాలి. ఈ నేపథ్యంలో ఆలోచించిన జ్ఞానులు దేహానికి విరుగుడుగా భావాన్ని కనుగొన్నారు. దేహంయొక్క వాస్తవిక స్థితి మోహానికి కారణమైతే భావనాత్మక స్థితి దానినుండి బయటపడవేసే అవకాశముంది.

అందమైన రూపంపై మనసు పడితే మోహం. వికారంగా ఉందనుకొంటే అసహ్యం. అయితే, మన భావనలో ఆ రెండింటినీ తారుమారు చేయవచ్చు. మనకు ఆ రెండింటిలో ఏ భాగం కావాలో దాని కనుగుణంగా, లేదా రెండింటికి సంబంధం లేని తటస్థస్థితిలో కూడా దానిని భావించవచ్చు. ఆ తటస్థస్థితికి భావం రావాలంటే వేరు వేరుగా కనిపించే పదార్థజాతమంతా ఒక్కటిగా మనకు కనిపించాలి. 'అణువులు కలిస్తే రూపం; విచ్ఛిన్నమైతే రూపనాశనం' అన్న జ్ఞానం కలగాలి. అప్పుడు విశ్వమంతా ఏకరూపమే. అంతా సత్యస్వరూపమే, శివస్వరూపమే, సుందరస్వరూపమే. నిజానికి ఈ మూడింటిని కూడా కలిపి చూడాలి. వ్యవహారం కోసమే విశ్లేషణ.

ఈ ఏకాత్మ ఏకరూప భావనకు దోహదం చేసే ప్రక్రియయే మహాశివరాత్రి రోజు మనం ఆచరిస్తున్న రుద్రార్చన, 'నారుద్రో రుద్ర మర్చయేత్' అన్న విధి ననుసరించి మహాన్యాస మంత్రపూర్వకంగా రౌద్రీకరణను పూర్తిచేసికొని రుద్రాభిషేకం చేస్తాం. ఆయనలో సమస్తాన్నీ చూస్తాం. మనమే ఆయనగా మారిపోయాం కాబట్టి మనలో మొత్తాన్ని చూస్తాం. రూపవైవిధ్యమే కానీ భావమొక్కటే అని గ్రహిస్తాం. దానిలో సఫలత కలిగితే దేహమున్నా మోహముండదు, మనసు ఉన్న రాగద్వేషాలుండవు.

(ఫిబ్రవరి, 2008)

# బ్రతకండి - బ్రతకనివ్వండి

రాజులు, రారాజులు, చక్రవర్తులు గతంలో యాగాలు చేసేవారు. వారి లెక్కలో యాగమంటే త్యాగమే. రకరకాల యాగాలు, నిర్వహణవిధానాలూ కనిపిస్తూ ఉన్నా వాటి అంతస్సూత్రం త్యాగమే. ప్రభువుల దగ్గర పేరుకొనిపోయి ఉన్న ప్రజాధనాన్ని మరల ప్రజలకు చెందేటట్లుగా ఏర్పరచుకొన్న ఆనాటి ఏకైక మార్గం యాగం. అందుకే ప్రజలలో అందరికీ ఏదో ఒకరీతిగా వాటిలో భాగస్వామ్యముండేది. ఖజానాను మొత్తంగా వినియోగించి రిక్తహస్తాలతో నిలిచిన రఘుమహారాజువంటివారెందరో.

ఈరోజు అంత విరివిగా యాగాలు లేవు. అంత ఉదారంగా త్యాగాలూ లేవు. మనిషికి ద్రవ్య వినియోగ మార్గాలు ఎక్కువయ్యాయి. కూడూ, గూడూ, గుడ్డలకు పోగా మిగిలిన ధనాన్ని ఏం చేయాలో తెలియని స్థితినుండి పై మూడింటికీ అత్యల్పంగానే కేటాయించి ఇతరావసరాలకు అదుపులేకుండా ధనాన్ని వినియోగించటానికి అలవాటుపడ్డాం. ఉప్పు, పప్పు కొనే చిల్లర దుకాణం పద్దుకంటే 'టూత్‌పేస్టు' వగైరా కొనే దుకాణాల్లో పద్దు ఎక్కువ చేస్తున్నాం. ఆనాడు కూడా కస్తూరి అనో, శ్రీచందనమనో ఖర్చులు లేకపోలేదు. అయితే అవి చాలా కొద్దిమందికే పరిమితం. ఇప్పుడు అందరి అవసరాలుగా అవి మారిపోయాయి.

వినియోగానికి దారులు పెరిగిన తర్వాత నేడు యాగాలు లేకపోయినా వివాహాలు ఆ స్థాయికి చేరాయి. మోజు కొద్దీ కొందరు, మురిపెం కొద్దీ కొందరు, ఒత్తిడి కొద్దీ కొందరు వివాహాలు జరిపించటంలో యజమాను లవుతున్నారు. అలంకరణల పేరుతో, ఆరగింపులపేరుతో, వినోదాలపేరుతో, వీడియోల పేరుతో స్థాయికి తగినట్లు కొందరయితే, స్థాయిని మరిచి / మించి మరి కొందరు ఖర్చు పెట్టవలసివస్తోంది.

వాస్తవానికి ఆర్జించి ఉన్నవారికి ఇది ద్రవ్యవినియోగమార్గం. లెక్కలేనంత డబ్బుంటే ఇది వదలించుకొనేందుకు అనువైనమార్గం. కానీ అప్పులు చేసి వినియోగించవలసిరావటం మాత్రం యాగం కాదు, ఆగం మాత్రమే.

అందుకే ఆర్జించిన దాన్ని ఎంతైనా ఖర్చు పెట్టండి, శుభకార్యాలు జరిపించండి. పది మందినీ బ్రతకనివ్వండి. ఆదర్శంగా నిలవండి. కూడబెట్టింది లేనపుడు వచ్చినవాళ్లే బంధువులు. అదుపుగా, పొదుపుగా బ్రతకండి.

(మార్చి, 2008)

# ఆశపడదాం

మళ్ళీ వసంతం ప్రారంభమైంది. మళ్ళీ చెట్లు చిగురించడం, మల్లెపూలు విరగపూయటం, తోటలన్నీ కళకళలాడటం, అవన్నీ కలగలిపి కవితలు, పాటలూ పాడుకోవటం, ఉగాది పచ్చడి గురించి ఉద్వేగంగా మాటాడుకోవటం అంతా మామూలుగానే జరిగిపోతుంది, జరిగిపోయింది.

పంచాంగాలు చూచి సంవత్సర ఫలాలు పరిశీలించుకోవటం, ఆదాయ వ్యయాలను చూచి ఆనందవిషాదాలకు లోనుకావటం అంతా మామూలుగానే జరిగిపోయింది.

క్రొత్త సంవత్సరం, క్రొత్త జీవితమంటూ కొద్దిసేపు మురిసిపోవటం తప్ప ఆలోచనల్లో, అధ్యయనాల్లో, జీవనశైలిలో ఏదైనా క్రొత్తదనం వచ్చిందా? వస్తోందా? వచ్చే అవకాశాలు ఏమైనా ఉన్నాయా? వాటిని చేతులారా పాడుచేయకుండా బ్రతుకుతున్నామా? ఇటువంటి ఆలోచనలకు అవకాశమే లేదు.

గతసంవత్సరపు ఆకులు రాల్చి, మళ్లీ చిగురించిన చెట్లు కొన్ని అంగుళాలైనా ఎదిగిఉంటాయి. తీగె పెరిగే కొద్దీ పూలలో వెలుగు పెరుగుతుంది. సంవత్సరం గడిచేసరికి తోట విస్తరించి దర్జాగా కనిపిస్తుంది.

మరి, మన పరిస్థితి ఏమిటి? సంవత్సరం గడిచిందంటే వయస్సు పెరిగింది. శరీరం పెరిగింది. అనుభవాల పాఠాన్ని స్వీకరించి, పరిశీలించగలిగితే జ్ఞానం పెరుగుతుంది.

కానీ, ఈ చివరి అంశంలోనే మనిషి ఎదగలేకపోతున్నాడు. 'శ్వః శ్వః పాపీయ దివసాః' (నేటి కన్నా రేపు పాపిష్ఠమై పోతోంది) అని వ్యాసుడు ఎప్పుడో అన్నాడంటే ఔనౌనని తలలూపుతున్నామే కానీ, వ్యాసుణ్ణి నిలదీసి సమాధానం చెప్పగల స్థాయిని మనం అందుకోలేకపోవటమటుంచి ఆ దిశగా ఆలోచనలు కూడా చేయలేక పోతున్నాం.

ఎదగటమంటే శరీరం పెరగటం కాదు. డబ్బు పెరగటం కాదు. పొగరు పెరగటం కాదు. మనస్సు పెరగటం. అది విశాలం కావటం. ప్రపంచమంతా పట్టగలిగినంత విశాలం కావటం, నాది పేరాశ అయితే కావచ్చునేమో కానీ, దురాశ మాత్రం కాదు గదా!

(ఏప్రిల్, 2008)

# చైతన్యమా? శాశ్వతత్వమా?

సృష్టిలో రెండు రకాల పదార్థాలున్నాయి. ప్రాణసహితాలు, ప్రాణరహితాలు. ప్రాణసహితాలు చైతన్యం, స్పందన, చలనం, అనుభవం, అభివ్యక్తి కలిగి ఉంటాయి. అయితే, వాటి మనుగడ చాలా స్వల్పకాలానికి పరిమితం. ప్రాణరహితాలలో అటువంటి వాటికి అవకాశముండదు. వాటి ఉనికి కూడా వాటికి తెలియని స్థితి. అయితే అవి చిరకాలం స్వరూపంతోనో, రూపాంతరం చెంది కానీ నిలిచే ఉంటాయి. కాబట్టి శాశ్వతత్వం కావాలంటే నిర్జీవపదార్థమై ఉండాలి. సజీవంగా మనుగడ సాగాలంటే శాశ్వతత్వానికి స్థానం లేదు.

అయితే, ఈ రెండింటిలో ఏది కావాలో ఎన్నుకొనే అవకాశం మనకు లేదు. మనకు తెలియకుండానే, పదార్థాలకు తెలియకుండానే, వాటి అభీష్టాలకు గుర్తింపులేకుండానే తొలినాటి పదార్థజాతాల విభాగం జరిగిపోయింది.

ఈనాడు మనమంతా సజీవులం. ప్రాణాలతో జీవిస్తూ అవి పోతాయేమో అని భయపడుతూ, వాటిని అరచేతిలో పట్టుకొని జీవిస్తుంటాం. మనం ఎంత గట్టిగా పట్టు బిగించినా అవి ఎప్పుడో ఒకప్పుడు ఎగిరిపోతాయని అందరికీ తెలిసిన సత్యమే. కాకపోతే ఎవరి మట్టుకు వారు తమ ప్రాణాలు మాత్రమే చిరంజీవులన్నట్లు భావించుకుంటూ, దానికి తగినట్లు ప్రవర్తిస్తుంటారు. ఈ భావన అనాదిగా మానవునిలో కొనసాగుతూనే ఉంది. ఈ శరీరం అశాశ్వతమన్న భయమే అటువంటి భ్రాంతికి కారణమవుతోంది.

అయితే ప్రాణం అశాశ్వతమైనా, శాశ్వతమైనా జ్ఞాపకంగా మిగిలి పోయేందుకు వీలుగా మానవులు కూడా నిర్జీవపదార్థాల నిర్మాణాలవైపు మొగ్గు చూపేవారు. వాటి ఉనికి స్వస్వరూపంతో తమ ఉనికి కన్నా ఎక్కువ కాలముంటుందనీ, అంత కాలమూ తాము సజీవంగా ఉన్నట్లేనని ఆశ.

అయితే అంత ఆశ ఆశయం, ఆలోచన అవసరమా! అందరూ అలా శాశ్వతంగా మిగిలిపోవాలనుకొంటే ఇప్పటికే ఈ నేల పట్టనంత జనం పోగయి ఉండేవారు గదా! కాబట్టి బ్రతికినంత కాలం బ్రతుకుదాం. బ్రతికించగలిగినంత మందిని బ్రతికిద్దాం. మనకు పోగా మిగిలిన దానిని మంచి కోసం వినియోగిద్దాం. ఇది ఇతరులు మనలను గుర్తుపెట్టుకోవటం కాదు, మనలను కూడా మరచిపోవటం కోసం. (మే, 2008)

# ఆశ

ఒకనాటి మానవుడి ఆశ ఆకలితీరటం వరకే. అది కూడా ప్రాణరక్షణ కోసం. కాలం గడిచేకొద్దీ దేహసంరక్షణ కూడా అవసరమయింది. దానికోసం గూడు కావాలని ఆశపడ్డాడు. తరువాత దశలో మాన సంరక్షణ కూడా మనిషి ఆశలగూటిలో చోటు చేసుకొంది. మొదటి రెండు దశలలో మానవుడి ఆశకు హద్దులుండేవి. మూడవ దశ మానసంరక్షణ దశ ప్రారంభంకాగానే ఆశ శాఖోపశాఖలుగా విస్తరించింది. మానవజాతి జీవనవిధానంలో వేగాన్ని పెంచింది. త్రిప్పటలు పెంచింది. స్పర్ధాసంఘర్షణలకు ఆజ్యం పోసింది. ఆ మానసంరక్షణమే నేడు అభిమానసంరక్షణగా, ఆత్మాభిమానసంరక్షణగా, అహంకారసంరక్షణగా విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోంది.

ఆశ లేకపోతే ఆనందం లేదు. అభివృద్ధి లేదు. ఔన్నత్యం లేదు. అయితే, అది హద్దులు మీరినా కూడా ఆనంద ముండదు. శాంతి ఉండదు. ఔన్నత్య ముండదు.

ఆశది విచిత్ర స్వరూపం, స్వభావం. మామూలుగా అయితే బంధనాల్లో చిక్కుకొన్నవారు కాలు కదపలేరు. ఆశాబంధంలో చిక్కుకొంటే మాత్రం పరుగులు పెట్టటమే కానీ, కాలు నిలుపలేరు. ఆశా విముక్తులయితే నిలకడగా ఉండగలుగుతారు.

వయస్సు పెరుగుతున్నప్పుడయినా, పెరిగిన తరువాత అయినా ఆశా స్వరూపం అర్థం కావాలి. పరుగులు మాని ప్రశాంతంగా బ్రతకగలగాలి. కానీ –

**దినయామిన్యౌ సాయం ప్రాతః, శిశిరవసంతౌ పునరాయాతః ।**
**కాలః క్రీడతి గచ్ఛత్యాయుః, తదపి న ముంచత్యాశావాయుః ॥**

- పగళ్లు రాత్రులు గడచిపోతూనే ఉంటాయి. ఉషోదయాలు, సంధ్యాసమయాలు సాగుతూనే ఉంటాయి. కాలం ఆడుకొంటుంటుంది. ఆయుష్షు అంతరించిపోతుంటుంది. కానీ, ఆశావాయువు కొనసాగుతూనే ఉంటుంది. అందుకే సుఖాల కోసం జీవించటంమాని, సుఖంగా జీవించడానికి అలవాటుపడదాం. (జూన్, 2008)

# చరిత్ర కావాలంటే ...

ఎప్పుడు పుట్టిందో తెలీదు. ఎందుకు పుట్టిందో తెలీదు. ఎవరి ప్రమేయంతో పుట్టిందో తెలియదు. తనకంటూ రూపం లేదు. తనకంటూ ఉనికి లేదు. దేనిమీదనో ఆధారపడి దానిని గుణిస్తుంటాం. అయినా, దాన్నే అన్నిటికీ ఆధారంగా నిలుపుకొంటాం. అదే కాలం. పదార్థాల చలనశీలతకు అది ఒక కొలబద్ద, అంతే.

ఆద్యంతాలు కనిపించని ఆ సరళరేఖలో మనం ఒక బిందువునుండి అత్యంతమూ దగ్గరగా ఉండే మరో బిందువు దాకా ప్రయాణిస్తాం. అంతకు ముందు మనం లేము. ఆ తర్వాత మనముండము. సరళరేఖ సాగుతూనే ఉంటుంది.

రెండు బిందువుల మధ్యనుండే మనం సరళరేఖను మొత్తాన్ని కదిలించాలని ప్రయత్నిస్తుంటాం. దానిని మనమే నియంత్రించాలని దానిమీద చిందులు వేస్తుంటాం. మనం ఎగిరి కాలాన్ని కదిలించగలిగామని సంబరపడుతుంటాం. ఎగురుడు ఎక్కువయితే జారిపడేది మనమేనని మరచిపోతుంటాం. చరిత్రను శాసించగలుగుతున్నామని భ్రమిస్తుంటాం.

అంతా మనుషులమే. సమకాలీనులమే. ఒకే ఆహారం, ఒకే శ్వాస, ఒకే జాతీయత కలిగి జీవిస్తున్నాం. ప్రక్కప్రక్కనే ప్రయాణిస్తున్నాం. అయినా భాష మారితే (భాషంటే కేవలం ఉచ్చరించే ధ్వనులక్రమం మాత్రమే) అయోమయంగా చూస్తున్నాం. కోట్లకొలది సంవత్సరాలనుండి జాతులు జీవిస్తున్నా మన భాష నిన్నటిదని కొందరూ, కాదు మొన్నటిదని కొందరూ వాదించుకొనే స్థితిలోనే ఉన్నాం. కాలం అనంతం కావటంతోపాటు దేశం అతివిస్తృతం అన్న విషయాన్ని విస్మరిస్తున్నాం. దేశకాలాలతోపాటు చరిత్ర కూడా అనంతం, అతివిస్తృతం. దానిలో కొత్తపొరలు కలిసేకొద్దీ పాతపొరలు కనుమరుగవుతుంటాయి. ప్రతి జీవి గురించి వ్రాసి పెట్టడానికి అది జనాభా లెక్క కాదు. చిట్టా ఆవర్జా కాదు. పొరలు విడిపోతున్నా మన పొర మాత్రం మిగలాలంటే మనం మనంగా కాకుండా జనంగా మారగలగాలి. మన ఉనికిని ఇతరుల ఉనికిలో చూచుకొనగలగాలి.

అంతేగాని, చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష అనుకొని జీవిస్తుంటే శ్రీరాముడు బొజ్జ నింపవచ్చు కానీ, చరిత్ర నిన్ను చేరనీయదు. (జులై, 2008)

# మూల్యం ఎంత చెల్లించాలి?

సూర్యరశ్మి, చల్లగాలి, వర్షపునీరు మినహా లోకంలో ఏ వస్తువూ ఉచితంగా లభించదు. ఏదీ డబ్బు పెట్టి కొనకుండా చేతిలో పడదు. ప్రతి వస్తువుకూ వెల చెల్లించాలి. వేసవిలో కొన్నిచోట్ల బిందెడు నీళ్లు రూపాయికి అమ్ముతారు. పన్నుతోము పుల్లల మొదలు బొగ్గుల బస్తావరకు, స్నో సీసా మొదలు కూల్ డ్రింక్స్ వరకు డబ్బులక్కడ పెట్టి మరీ తీసుకోవాలి. రేపిస్తానంటే రేపే వచ్చి తీసుకోమంటారు.

ఇంట్లో ఉన్నందుకు అద్దె; ఫోను చేసినందుకు చార్జీ; ఇలా కదిలితే డబ్బు, మెదిలితే డబ్బు చెల్లిస్తూ ఉంటాం. మందు పుచ్చుకున్నందుకే గాక డాక్టరుతో మాట్లాడినందుకు ఫీజు చెల్లిస్తాం. అయితే ఒక దేశంయొక్క భూభాగంలో నివసిస్తున్నందుకు, ఆ దేశానికి చెందిన భూమిలో పంట పండించు కుంటున్నందుకు, ఆ నేలమీద ఇల్లు కట్టుకున్నందుకు, అక్కడి నీటిని త్రాగుచున్నందుకు, అక్కడి మలయమారుతం అనుభవిస్తున్నందుకు మనమేమి మూల్యం చెల్లిస్తున్నాం? 'దీని వెల ఎంత' అనే సందేహం కొందరికి వస్తుంది. తల్లి బిడ్డలను పెంచినందుకు ఖరీదెంత అంటే ఏమి చెప్పగలం? తన రక్తాన్ని పాలుగా మార్చి బిడ్డను పెంచి పెద్ద చేసినందుకు ఖరీదెంత? రూపాయలలో విలువ కట్టలేనిది, అమూల్యమైనది.

ఏది లేకుంటే మనము లేమో అటువంటి మాతృభూమినుండి మనం పొందుతున్న ప్రయోజనాలకు ఖరీదెంత? ఎంత సొమ్ము చెల్లించాలి? ఏ రూపంలో చెల్లించాలి? అనే విషయాన్ని మనసులోకి తీసుకోవలసిన అవసరం ఉన్నది.

'ఇవి వాటంతటవి వచ్చిన అవకాశాలు. ఉచితంగా లభించేవి. వీటికి మనమేమీ తిరిగి ఇవ్వనవసరం లేదు' అని పలువురి ఉద్దేశ్యం. అది పొరపాటు. డాక్టరు మందిచ్చినందుకుగాక అతనితో సంభాషించినందుకే 'కన్సల్టేషన్ ఫీజు' చెల్లిస్తున్నప్పుడు మన ఉనికికి అవకాశ మిచ్చిన భూమికి ఏమీ చెల్లించనవసరం లేదా?

దేశమంటే మనతో మాట్లాడలేని నేల మాత్రమే కాదు; దేశమంటే మనకు అనుదినమూ కనిపించే సజీవమైన సమాజం. 'ఈ సమాజ క్షేమంలోనే నా క్షేమం

ఇమిడి ఉన్నది' అనే ఆలోచన, 'నాకు గల శక్తిసామర్థ్యాలు, మేధ, ధనము - వీటన్నింటిని నాకొరకే గాక సమాజంకొరకు గూడ వినియోగిస్తున్నాను' అనే గ్రహింపు అనుదినమూ మనస్సులోకి తెచ్చుకోవడమే దేశానికి చెల్లించే ఫీజు.

(ఆగష్టు, 2008)

## ప్రజాహితం - రాజమార్గం

కాగల కార్యాన్ని గంధర్వులు నెరవేర్చారన్న మాటను మహాభారతంలో భీమసేనుడు అంగీకరించాడు. కానీ, ధర్మరాజు అంగీకరించలేదు. "బయటివారు ఎత్తివస్తే మనం నూటయిదుగురం. మనలో మనకు తేడాలు వస్తే మనం అయిదుగురం. వారు నూర్గురు." అన్నది ధర్మరాజు సిద్ధాంతం. బయటివారి దగ్గర అంత దగ్గర కావాల్సిన అవసరమున్నదా? మనస్సులలో తీవ్ర వైషమ్యాలున్నప్పుడు అది సాధ్యమా? మనస్సులో లేనిది కౌగిలించుకొంటే మాత్రం వస్తుందా? అన్న అనుమానాలు ఎన్నో కలుగుతాయి. పోనీ, తప్పని పరిస్థితులలో కలిసి పనిచేసిన వారు, సహాయం చేసికొన్నవారు, సహాయం పొందినవారు సాధారణ పరిస్థితులలో కూడా కలిసి జీవించవచ్చును గదా, కొట్టుకొని చావవలసిన అగత్యమేమి వచ్చింది? ఎటు చూసినా సందేహాలే. భీమసేనుడిది సాధారణనీతి అయితే, ధర్మరాజుది రాజనీతి.

ఆనాటి ధర్మరాజు రాజనీతి నేడు విస్తృతంగా రూపాన్ని పరచుకొన్నది. రాజకీయాలలో శాశ్వత శత్రుత్వాలు కానీ, శాశ్వత మైత్రీబంధాలు కానీ లేవని ఎవరికి అవసరపడితే వారు సిద్ధాంతీకరించే పరిస్థితి ఏర్పడింది. నిజానికి రాజకీయాలలోనే కాదు, ఎక్కడా కూడా శత్రుత్వ మిత్రత్వాలు శాశ్వతాలేం కాదు. వివిధ కారణాల వలన అవి ఏర్పడుతుంటాయి. తొలగిపోతుంటాయి.

అయితే రాజనీతిలో మాత్రం అది విలక్షణధర్మంగా రూపొందుతోంది. ఒకనాటి - ధర్మరాజువంటి రాజులనాటి - రాజనీతిలో సుఖసంతోషాలకూ, యోగక్షేమాలకూ, పరరాజులనుండి తమ ప్రజలను కాపాడుకోవటానికి

వినియోగించే సంధి - విగ్రహాలు ప్రధానపాత్ర వహించాయి. మంచి రాజులుగా గుర్తింపు పొందిన వారెవ్వరూ స్వప్రయోజనాన్ని ప్రధానంగా దృష్టిలో ఉంచుకొని రాజనీతిని వాడుకొన్నట్లు కనిపించదు. ప్రజాహితమే. వారి లక్ష్యం.

మారుతున్న కాలంలో విలువలూ మారుతున్నాయి. మార్చుకొని ఆనందిస్తున్నాం. ఉబ్బితబ్బిబ్బవుతున్నాం. ఈనాటి రాజనీతిలో ప్రజలు వెర్రిబాగులవాళ్లు. ఎవరేం చెప్పినా 'కాబోలు' అనుకొని తలలూపుతూ వినగలవాళ్లు. అందుకే రాజనీతిచేత విచిత్రవిన్యాసాలు చేయించగల సత్తా మనకు వెన్నతో పెట్టిన విద్యలా అబ్బింది. చూద్దాం ఇంకా ఏమేం జరుగుతుందో?

(సెప్టెంబరు, 2008)

## వ్యాస వాణి

మానవ జీవనశైలి సంక్లిష్టచిత్రంగా రోజురోజుకు రూపుదిద్దుకొంటుంది. శరీరం, బుద్ధి, మనస్సు అన్ని అలసటకు గురవుతున్నాయి. అహంకారం మాత్రమే నిత్యయౌవనంతో కనిపిస్తున్నట్లు అనిపిస్తోంది. కానీ అది కూడా అలసిపోయిన లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

శరీరానికి తగిన పనిని శరీరానికి, బుద్ధికి తగిన ధర్మాన్ని బుద్ధికి, మనస్సుకు తగిన ఆలోచనను మనస్సుకు అందించగలిగినప్పుడు అవి అలసిపోయే పరిస్థితి రాదు. కానీ, ఆ వాతావరణం సంఘంలో కొరవడుతోంది. శరీరం అలసిపోయే దాకా పనిచేయటం చక్కని సంస్కృతి. కానీ, శరీరం అలసిపోయిన తర్వాత కూడా మనస్సు శరీరాన్ని ముందుకు తోస్తూనే ఉంది. బంధమోక్షాలకు కారణమైన మనస్సు శరీరానికి ఇబ్బంది కలిగించటంతోపాటు తనకు తానుగా అలసటకు గురయ్యే వరకు ఆలోచిస్తూనే ఉంటోంది. గమ్యాల వైపు, లక్ష్యాల వైపు పరుగులు తీస్తూనే ఉంటోంది. అది కూడా మంచి అలవాటే, కానీ గమ్యాలను, లక్ష్యాలను నిర్దేశించుకొనటంలోనే చాలామంది విఫలమవుతున్నారు. ఆశలు, దురాశలు, పేరాశలు - గమ్యాలు, లక్ష్యాలుగా మారి అనుక్షణమూ ఆరాటానికి లోనవుతున్నారు.

కళ్లు మూసుకొని నిద్రకుపక్రమించాం. నిదురించే వేళలో ఏవేవో కలలు కంటున్నాం. ఎన్నో దృశ్యాలు, ఎన్నో ప్రపంచాలు, ఎన్నో లోకాలు అన్నీ క్షణాల వ్యవధిలో సందర్శించగలుగుతున్నాం. ఇంతలో మెలకువలోనికి వచ్చాం. ఎదురుగా మనమూ, నిత్యమూ మనం చూస్తున్న వాతావరణమే. కలల ప్రపంచాన్ని విడిచి వాస్తవ స్థితిలోనికి అడుగుపెట్టక తప్పదు.

మన కోరికలూ, ఆశలూ కలల వంటివి. కంటున్నంత సేపు ఎంతో అద్భుతంగా కనిపిస్తాయి. ఆరాటపెడతాయి. అయితే, మన వాస్తవజీవితం కోరికలకన్నా భిన్నంగా ఉంటుంది. కోరుకోవటానికి ఖర్చు, శ్రమ, కాల సహకారం అవసరం లేదు. కానీ, ఆ కోరికలు తీరటానికి అవన్నీ కావాలి. తీరకపోతే బాధపడటానికైనా కాలం కలిసిరావాలి. ఒక్కోసారి ఆ అవకాశం కూడా మిగలదు. అందుకే ఏది ఎలా జరిగినా, ఫలితం ఎలా ఉన్నా సమానంగా స్వీకరించటం నేర్చుకోవాలి. అప్పుడు సుఖం, ప్రశాంతి దక్కుతాయి. ఇది నామాట కాదు. వ్యాసుని వచనం. గమనించండి

**సుఖం వా యది వా దుఃఖం, ప్రియం వా యది వా సుఖమ్ ।**
**ప్రాప్తం ప్రాప్త ముపాసీత, హృదయేనాపరాజితః ॥**

(అక్టోబరు, 2008)

## రాజనీతి

ధర్మస్వరూపం విస్తృతమయింది. దేశకాలాలకు అతీతంగా నిలువగలది ధర్మఫలం. ఆ ధర్మఫలాన్ని సాధించటంలో ధర్మాన్ని సాపేక్ష లక్షణంగా స్వీకరిస్తాం. అందుకే భూతహితం కలిస్తే బొంకు కూడా సత్యఫలాన్ని ఇస్తుంది అన్నారు. వాస్తవానికి అది బొంకు అయినా ఫలితాన్ని బట్టి దాన్ని ఒప్పుగానే భావిస్తారు. అదే రీతిగా వర్ణాశ్రమ వ్యవస్థను బట్టి వ్యక్తి వ్యక్తికీ విశిష్ట ధర్మాలను ఏర్పరచారు. రాజు తన సుఖసంతోషాలను అప్రధానంచేసి, తన ప్రజల సుఖసంతోషాలకై ప్రయత్నిస్తాడు. కాబట్టి, ఆ రాజధర్మం సాధారణ ప్రజలధర్మంకన్నా భిన్నంగా వుంటుంది. ఆ రాజధర్మం క్రమక్రమంగా పల్చబడుతూ వస్తోంది.

రాజధర్మం తరువాతి దశలో రాజనీతిగా చెలామణిలోకి వచ్చింది.. అర్థశాస్త్రం ప్రధానమైన రాజనీతిలో ఎత్తులు, పైఎత్తులు, హత్యలు, దోపిడీలు కూడా రాజనీతిలో భాగాలుగానే చెల్లుబాటు అయ్యాయి. అయినా సరే, అప్పట్లో కూడా వాటి లక్ష్యం జనబాహుళ్య సుఖశాంతులే. తరువాతి దశలో అది రాజకీయంగా వ్యవహారంలోకి వచ్చింది. రాజకీయానికి ప్రస్తుత నాయకులెవ్వరూ నిక్కచ్చిగా నిర్వచనాలు చెప్పలా! అప్పుడప్పుడు వారు మాట్లాడే మాటలను బట్టి చూస్తే స్వప్రయోజనం లక్ష్యంగా వేసే అడుగులు, చేసే చేష్టలు అని మనం భావించటానికి అవకాశం కనిపిస్తోంది.

ఆ రాజకీయంలో వ్యూహప్రతివ్యూహాలు అన్నవి అంతర్భాగా లయ్యాయి. వ్యూహప్రతివ్యూహాలలో నైతికత ప్రశ్నే తలెత్తదన్న విశిష్టసిద్ధాంతం తెరమీదకు వచ్చింది. ఇప్పటికే రాజకీయాలలో శాశ్వత శత్రుత్వం, శాశ్వత మిత్రత్వం ఉండవు అంటూ మనకు మనమే ఒక విలువను తయారుచేసుకొని దాని వికారాలను అనుభవిస్తున్నాం. ఇప్పుడు ఇది మరొక క్రొత్త విలువ - వ్యూహప్రతివ్యూహాలలో నైతికత ప్రశ్నే లేదని. ఇది మనలను ఎంతవరకు ఎలా నడిపిస్తుందో వేచి చూడవలసిందే.

పాలకులు ఎన్ని ఎత్తుగడలు పన్నినా, ఎన్ని పాట్లు పడినా మనసా - వాచా - కర్మణా అది ప్రజాహితం కోసమే అయ్యుండాలి. అయితే వాక్కు కన్నా బలహీనంగా చేష్ట, చేష్టకన్నా బలహీనంగా మనస్సు చాలామంది నాయకులలో ప్రస్ఫుటంగా కనిపించటం మాత్రం జాతికి సిగ్గుచేటు.

(నవంబరు, 2008)

# మౌనం

బిడ్డ పుట్టినప్పటినుండి మాటలు ఎప్పుడు వస్తాయా అని ఎదురు చూస్తుంటాం. ఒక్కొక్క పదం పలుకుతూ ఉంటే ఎంతెంతో మురిసిపోతుంటాం. అది మూగతనంలో నుండి మాటల వైపు సాగే ప్రస్థానంలో ప్రధానాంశం.

అయితే మాటాడటం వచ్చిన తర్వాత, మాటకారి అనిపించుకొన్న తర్వాత, మాటలతో పదిమందినీ ఒప్పించగలగటం, ఆనందింపజేయగలగటం చేతనైన తర్వాత మనమంతా గొప్పవాళ్ళమై పోయినట్లు భావించుకొంటాం.

కాలం గడిచేకొద్దీ మాట అనుకొంటే వచ్చే ఇబ్బందులూ, అనర్థాలూ, అర్థమయ్యే కొద్దీ "మాటకు ప్రాణము సత్యము" అని గ్రహించి, దానిని పాటించవలసిన అవసర మేర్పడేకొద్దీ మనిషికి మాటకన్నా మౌనమే గొప్పదేమో అనిపిస్తుంది. ఎంతగా ఆలోచించి ఆచితూచి మాటాడినా "ఇలా మాట్లాడకుండా ఉంటే బావుండేదేమో" అని దాదాపు అందరికీ ఎప్పుడో ఒకప్పుడు అనిపిస్తుంటుంది.

"మౌనేన కలహో నాస్తి" అని పెద్దల మాట. మౌనంగా ఉండగలిగితే జగడాలకు అవకాశముండదు. ఇది ఏ ఇద్దరిమధ్య అయినా పాటించవలసిన అంశమే. కుటుంబ సభ్యుల మధ్య అయినా, పదిమంది పరిచితుల మధ్య అయినా, అపరిచితుల మధ్య అయినా మౌనం ఎంతో అవసరం. మౌనం అంటే మాటాడకుండా వుండడం కాదు. అవసరానికి మించి మాటాడకపోవటం, అయితే ఆలోచించకుండా ఉండగలగటం ఎంత కష్టమో మాట్లాడకుండా ఉండగలగటం అంతే కష్టం. అందుకే అవసరానికి మించి మాటాడకపోవటమే మౌనం.

కానీ, మౌనం లేదా మితభాషణ, అందునా మితహితభాషణ, ఆపై మితహితసత్యభాషణ అంత తేలికయిన దేమీ కాదు. అయినా ప్రయత్నించుదాం. అలవాటుచేసుకొందాం. (డిశంబరు, 2008)

# నచ్చకపోతే

అభద్రతాభావంలో నుండి బయటపడటానికి ఒంటరిగా సంచరిస్తున్న మానవుడు సంఘజీవనానికి అలవాటుపడ్డాడు. సాంఘిక జీవితంలో ఏర్పడిన అభద్రతాభావంతో మరల మతాలు, కులాలు, సంఘాలు, సమావేశాల పేరిట విడిపోవడం ప్రారంభించాడు. ఒంటరిగానూ, సమష్టిగానూ కూడా బ్రతకలేక ఒక విచిత్ర స్థితికి మానవుడు లోనవుతున్నాడు.

కొన్ని సందర్భాలలో తనకు తాను నచ్చడు. మరికొన్ని సందర్భాలలో తనకెవ్వరూ నచ్చరు. మరీ తీవ్రతకు లోనైతే లోకం నచ్చదు, బ్రతుకూ నచ్చదు. అక్కడినుండి మనకు వ్యతిరేకంగా ఏదో జరిగిపోతున్నదనో, జరగబోతున్నదనో

ఆందోళన మనస్సులో మొదలవుతుంది. తత్ఫలితంగా ప్రతిదాని మీద కోపం, అది దగ్గరవుతున్నకొద్దీ భయం మొదలవుతాయి. అశాంతి మనిషిని అగాధాలలోనికి నెట్టివేస్తుంది.

అసలు తానైనా, తన చుట్టూ ఉన్న లోకమైనా ఎప్పుడూ తనకు నచ్చాలన్న ఆలోచన అన్ని అనర్థాలకు మూలం. అసంఖ్యాకంగా, నిజంగా లెక్క పెట్టటానికి వీలుకానన్ని రంగులు, రూపాలు, రసాలు, వాసనలు, భావాలు, శూన్యాలు వున్న ఈ విశ్వంలో నువ్వు, నీ మనస్సు, నీ అభిరుచి ఎంత? నువ్వు ఆస్వాదించగలిగిన దెంత? అనుభవించగలిగిన దెంత? లెక్కలోకి కూడా రాదు. దీనిని గురించి కొంతలో కొంత మనిషికి అవగాహన ఉంది. అందుకే వస్తుసముదాయాన్ని విభిన్నరూపాలలో, రంగులలో, రసాలలో, వాసనలలో తయారుచేసుకొని ప్రశాంతంగానే ఉండగలుగుతున్నాడు.

కానీ భావాల దగ్గరకు వచ్చేసరికి అది సాధ్యపడటం లేదు. అది సాధ్యపడదని తెలిసిన తర్వాత కూడా సమన్వయం చేసుకోక తప్పని పరిస్థితి మనిషికి కలిగింది. అక్కడనుండే ఘర్షణలు, వైషమ్యాలు ప్రారంభ మవుతున్నాయి.

ఎన్నో భావాలు మనకు నచ్చవు. ఎన్నో పరిష్కారాలు, ఎన్నో ప్రయత్నాలు, ఫలితాలు మనకు నచ్చవు. నచ్చనప్పుడు రాజీపడక తప్పని పరిస్థితి. రాజీకి అంగీకరించని మనస్సులలో అంతస్సంఘర్షణ. దాని కొక్కటే పరిష్కారం. భావాలు కుదరనప్పుడు రాజీ అవసరం లేదు. ఆ భావాలు మనకు నచ్చటంలేదని సూటిగా చెప్పవచ్చు. అయితే మనకు నచ్చనివి భావాలే కానీ, భావాన్ని ప్రతిపాదిస్తున్న వ్యక్తి కాదని స్పష్టం చేయగలగాలి. అప్పుడే, సమన్వయం తప్పనప్పుడు నచ్చని విషయాలలో అయినా ఘర్షణకు అవకాశముండదు.

(ఫిబ్రవరి, 2009)

# శక్తి వినియోగం

ప్రాణి శక్తిమంతం, ప్రాణుల శరీరాలలోని సర్వావయవాలు శక్తిసంపన్నాలు. ప్రాణులలో మనిషి మరీ శక్తిసంపన్నుడు. అయితే, ఏ ప్రాణిలో అయినా శక్తి స్థితికి విలువలేదు. దృశ్యమానత లేదు. ఉన్నా లేకున్నా తేడా ఏం లేదు. కానీ, వినియోగ దశలో మాత్రం శక్తికీ, దాని స్థితికీ, దాని దృశ్యమానతా చలనానికి విలువ లేర్పడతాయి.

చేతులు పనిచేసినప్పుడే చేతులలో శక్తికి గుర్తింపు, సార్థక్యం ఏర్పడతాయి. నడిస్తేనే కాళ్ళకు, రూపాన్ని గ్రహించగలిగితేనే కళ్ళకు, వాసన చూడగలిగితేనే నాసికకు, స్పర్శననుభవించగలిగితేనే చర్మానికి, వినగలిగినప్పుడే చెవికి గుర్తింపు. కొండంత శక్తికయినా గోరంత వినియోగముంటేనే సార్థకత.

మనస్సు కూడా ఒక ఇంద్రియం. అయితే, దాని ఉనికిని నిరూపించే ప్రయత్నాన్ని మనం చేయవలసిన అవసరం లేదు. అది విశ్వవ్యాప్తమై తన అస్తిత్వాన్ని తానే చాటుకొంటూ, తనశక్తి ఎంత గొప్పదో ప్రకటిస్తూనే వుంటుంది. అందుకే ఇతరేంద్రియాల ప్రవృత్తిలో కూడా మనస్సు సహకారముంటుంది. మనః ప్రేరణలో ఇంద్రియ ప్రవృత్తి ఉంటుంది. స్వాభావికంగా ఉన్నా అది గమనానికి రాదు.

అందుకే ఇంద్రియాలను ప్రవర్తింపజేయటంలో శక్తిని ప్రదర్శించవలసిన మనిషి మనోవిషయంలో మాత్రం నివర్తింపజేయటంలో శక్తిమంతుడు కావాలి. మనస్సును నిశ్చలంగా నిలపటంలో శక్తిసంపన్నుడు కావాలి. సదసన్నిర్ణయంలో సహజంగా చంచలమైన మనస్సును కూడా నిశ్చలప్రమాణంగా నిలపగలగాలి. తనదైన శైలిలో సుఖశాంతులను పొందటంలో మనస్సును ప్రవర్తింప జేయగలగాలి. తన సుఖశాంతులు సామాజిక హితానికి దోహదకారులు కావాలి. అప్పుడే మనకూ, మన శక్తికీ వినియోగం, సార్థక్యం లభిస్తాయి.

# వ్యక్తి - వ్యవస్థ

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు అంతశ్శత్రువులని పెద్దల హితోక్తి. అంటే మనలోనే వుంటూ మనపై శత్రుత్వాన్ని వహించి మన పతనానికి లేక వినాశనానికి దారితీస్తాయని అభిప్రాయం. ఈ సూచన, ఈ ప్రతిపాదన తిరుగులేని వాస్తవం. గీతలో శ్రీకృష్ణభగవానుడు కూడా ''సంగాత్సంజాయతే కామః, కామాత్ క్రోధోభిజాయతే... బుద్ధినాశాత్ప్రణశ్యతి'' అంటూ కామక్రోధాదుల శృంఖలాతత్త్వాన్ని, వాటి ఫలితాలను వివరించాడు. ఈ అరిషడ్వర్గాన్ని గురించి ఎన్నో విశ్లేషణలు, ఉదాహరణలూ, కథలూ పుంఖానుపుంఖంగా వున్నాయి. రావణ, కీచక, సుయోధనాదులు వీటికి లొంగి తమ నాశనాన్ని తామే కొనితెచ్చుకొన్నట్టు ప్రతిపాదించారు.

అయితే, ఈ అంతశ్శత్రువుల తత్త్వాలను, ఫలితాలను వివరించే సందర్భంలో ఒక అంశాన్ని విస్మరించారేమో అనిపిస్తోంది. అంతశ్శత్రువులు ఎవడి లోపల అవి ఉంటాయో వాడికే శత్రువులు కాబట్టి, వాడిని పతనం చేయటం బాగానే వున్నా ఆ లక్షణాల ఫలితాలు వారికి మాత్రమే పరిమితమై లేవు గదా! ఒకడి కామం వాడి పతనానికి ముందు మరెందరి జీవితాలనో నాశనం చేయవచ్చు. క్రోధంతో తాను నష్టపోవటం కన్నా ఇతరులకు ఎంతో నష్టం కలిగించవచ్చు. ధృతరాష్ట్రునిలోని లోభం, సుయోధనునిలోని మాత్సర్యం ఆ ఇద్దరి నాశనానికే పరిమితమైనాయా? బంధుమిత్రసుతహితాదులు సర్వనాశనానికీ కారణమైన తర్వాతనే గదా తమ పతనానికి కారణమైంది. అక్కడ కూడా అన్నింటికీ మూలకారణమైన ధృతరాష్ట్రుడు చివరిదాకా బాగానే వున్నాడు కదా!

కాబట్టి భారతీయుల ఆధ్యాత్మికదృక్పథంలో చాలాచోట్ల కనిపించే లోపం ఇక్కడ కూడా కనిపిస్తోంది. వ్యవస్థకన్నా వ్యక్తికి ప్రాధాన్యమిచ్చే లక్షణం భారతీయుల్లో అనాదిగా వుంది. కారణాలు ఏమైనా కావచ్చును. కానీ, వ్యక్తి వ్యవస్థ కన్నా ఎప్పుడూ గొప్పవాడు కాలేడు. కాకూడదు కూడా. వ్యవస్థలో ఇమిడిపోవచ్చు లేదా తాను వ్యవస్థగానే మారిపోవచ్చు. అంతే కానీ, వ్యవస్థ కన్నా తాను అధికుడనన్న భావం ఎట్టి పరిస్థితిలోనూ ఏర్పడకూడదు.

అలనాటి ఆ అశ్రద్ధ ఇప్పటికీ భారతజాతిని పట్టి పీడిస్తూనే వుంది. వ్యవస్థను పతనం చేసి లేదా నాశనం చేసి వ్యక్తులు బాగుపడటం, అదే గొప్పతనంగా భావించటం ఇప్పటికీ మనలను బాధిస్తున్న దురదృష్టం.

వ్యక్తి ప్రాధాన్యవ్యవస్థనుండి తత్త్వప్రాధాన్యవ్యవస్థకు ధర్మానుష్ఠానయజ్ఞాలు ఇంకా ఎన్ని చేయవలసియున్నవో!

## దివ్య విభూతులు

భారతీయజీవన విధానం, తాత్త్వికదృక్పథం కొన్ని విషయాలను విశ్వసించి అంగీకరిస్తుంది. అలాంటి వాటిలో గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన శ్లోక మొకటి -

**యదా యదా హి ధర్మస్య, గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్ ॥**

- 'ధర్మగ్లాని ఏర్పడినప్పుడు నేను అవతరిస్తా' నని పరమాత్మవచనం. కాబట్టి మనం అవతారాలుగా అంగీకరించేవన్నీ పరమాత్మయొక్క అవతారాలే, దివ్య విభూతులే. అయితే వాటిని స్వీకరించే విషయంలో మరలా మన జ్ఞానాన్ని వాటిలో చొప్పించే ప్రయత్నం చేస్తుంటాం. అలాంటి ప్రయత్నాలలో, ఆలోచనలలో ఒకటి శ్రీరాముడు చేసినట్లు చేయాలని, శ్రీకృష్ణుడు చెప్పినట్టు చేయాలని. ఇద్దరూ పరమాత్మావతారా లయినప్పుడు ఒకరు చేసినట్లు చెయ్యాలనీ, ఇంకొకరు చేసినట్లు చేయకూడదని నిర్ణయించటానికి మన స్థాయి ఎంత? మన నమ్మకంలోనైనా లోపముండాలి, మన అవగాహనలో అయినా లోపముండాలి, మన భావనలో అయినా లోపముండాలి లేదా మన శక్తి యుక్తులలోనయినా లోపముండాలి. ఇక్కడెక్కడా లోపం లేదంటే అటువంటి సాహసోపేత నిర్ణయాలు చేయటానికి చేస్తున్న సాహసమయినా అసంగతం కావాలి. పై పెచ్చు శ్రీకృష్ణుడు -

**యద్యదాచరతి శ్రేష్ఠ, స్తత్తదేవేతరో జనః ।**
**సయత్ప్రమాణం కురుతే, లోకస్తదనువర్తతే ॥**

- అంటూ శ్రేష్ఠునకు ప్రమాణమైనదే లోకానికి ప్రమాణమవుతుందని, తనకు ఏ అవసరమూ లేకపోయినా తాను పని చేస్తూనే వున్నానని వివరించాడు.

ఈ నేపథ్యంలో శ్రీకృష్ణుని ఆదర్శంగా తీసికొనరాదని, ఆయన మాటలనే అనుసరించాలని అనుకోవటంలో ఔచిత్య మేముంటుంది? ఆయన శ్రేష్ఠత్వాన్ని మనం శంకిస్తున్నామా? శంకిస్తుంటే ఈ పూజలూ, పుణ్యాలూ, పారాయణలూ, పరమార్థాలూ ఎందుకు? కాబట్టి అటువంటి శంక మనకు లేదు. ఉన్న లోపమల్లా అటువంటి శక్తియుక్తులు మనకు లేకపోవటమే.

మనం ఎదగాలి. మన ఆలోచనలు ఎదగాలి. శక్తియుక్తులను శారీరకంగా, మానసికంగా కూడా పెంపొందింపజేసుకోవాలి.

శ్రీకృష్ణుడు ఎనిమిదిమందిని పెండ్లి చేసుకున్నాడనో, గోపికలతో ఆడుకొన్నాడనో ఆయన్ను తక్కువ చేసి చూడటం గానీ, లేక ఆయన మానవాతీత శక్తులను ప్రదర్శించాడనో, ఆయన శ్రీకృష్ణపరమాత్మ అనో ఆయన చెప్పినట్లే చెయ్యాలని సమర్థించుకోచూడటం మన అవివేకం.

అర్జునుణ్ణి అంతగా వెనుకేసుకొని వచ్చిన ఆయన మరి అభిమన్యుణ్ణి పట్టించుకోకపోవటంలో ఆంతర్య మేమిటి? తానే ప్రపంచమైన పాండవులకు శ్రీకృష్ణుడు అరణ్యంలో తప్ప నీడ లేకుండా చేయటమేమిటి?

ఆ సమదృష్టిలో, సమభావనలో స్త్రీపురుషులూ, రాళ్ళూ-రప్పలూ, చెట్టూ-చేమలూ, మంచీ-చెడులూ అన్నీ ఒకటేనేమో? రెండుగా లేవేమో? అంతగా ఎదిగిన తర్వాత గదా మనం నిర్ణయించగలిగేది.



# కవి పరిచయం

## డా. సూరం శ్రీనివాసులు

| | |
|---|---|
| జననం | : 03-06-1951, నెల్లూరు |
| తల్లిదండ్రులు | : కడయింటి శేషమ్మ, సూరం హనుమంతయ్య |
| విద్యాభ్యాసం | : 20 సం॥ వయస్సు వరకు నెల్లూరులోనే |
| ప్రాథమిక విద్య | : 1-3 తరగతి ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూల్, అత్తితోట అగ్రహారం<br>4-5 తరగతి ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూల్, ఉస్మాన్ సాహెబ్ పేట |
| ఉన్నత విద్య | : 6-8 తరగతి - వి.ఆర్. హైస్కూల్<br>9-ఎస్.ఎస్.ఎల్.సి. - వేద సంస్కృత పాఠశాల - 1967, మూలపేట |
| కళాశాల విద్య | : సాహిత్య శిరోమణి, వేద సంస్కృత పాఠశాల - 1967, మూలపేట (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రథమ స్థానం) |
| ప్రైవేటుగా | : పి.ఒ.ఎల్. 1975, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.<br>భాషా ప్రవీణ 1976, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.<br>ఎమ్.ఎ. (సంస్కృతం) 1977, ఆంధ్ర విశ్వకళా పరిషత్.<br>ఎమ్.ఎ. తెలుగు 1978, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు. పి. హెచ్.డి. 1986, ఆంధ్ర విశ్వకళా పరిషత్ వాల్తేరు. |
| ఉద్యోగం | : 1971 - 1972, ఎన్.వి.ఎస్.ఓ.ఎన్. స్కూల్, చేకూరపాడు, ప్రకాశం జిల్లా. |

లెక్చరర్ : 1972 - 1976, ఓరియంటల్ కాలేజ్, ఏలూరు &
ఓరియంటల్ కాలేజీ, చిననింద్రకొలను.
1976 - 1080, ఓరియంటల్ కాలేజీ, పొన్నూరు.

ప్రిన్సిపల్ : 1980-1990, ఓరియంటల్ కాలేజీ, తాడికొండ.
1990-2009, ఓరియంటల్ కాలేజీ, తిమ్మసముద్రం

పార్ట్ టైమ్ లెక్చరర్ : ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం (1 సంవత్సరం)

Visiting Fellow : రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి. (2008-09)

Adjudicator : For Several Dessertations Submitted for Ph.D

పురస్కారాలు :
- ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉత్తమ గ్రంథం బహుమతి - 1979 'సంస్కృత భాణ సాహిత్య' గ్రంథం
- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ఉత్తమాధ్యాపక బహుమతి-1981
- తెలుగు వెలుగులు - శ్రీనాథపీఠం-1987
- పుష్పకిరీట సన్మానం, చెన్నై
- ఉగాది సాహితీ పురస్కారం, లలితకళా పరిషత్, చీరాల-2001
- బహుముఖ ప్రజ్ఞ పురస్కారం, సహజ సాహితి చీరాల-2009
- సి.పి.బ్రౌన్ సాహితీసేవాపురస్కారం, బెంగుళూరు - 2020 నవంబర్
- 1970 విద్యార్థి దశ నుండి వివిధ ప్రాంతాలలో అవధాన సభలలో సన్మానాలు, బిరుద ప్రదానాలు.

**వృత్తిపరంగా నిర్వహించిన బాధ్యతలు**

1. Member, Academic Council, Acharya Nagarjuna University.
2. Member, Academic Senate, Acharya Nagarjuna University.
3. Member, Board of Studies in Oriental Languages, Aharya Nagarjuna University.
4. Adhoc PG Board of Studies (Sanskrit), Acharya Nagarjuna University.
5. Person, Refresher Courses
6. P.R.O., Oriental College, Resource Teachers Association (AP)

## ప్రచురణలు

1. సౌమనస్యము (ఖండకావ్యం - పద్యం) - 1979
2. సున్నితపుత్రాసు  (వచనకవితాసంకలనం) - 2002
3. సంస్కృతభాణసాహిత్యము (విమర్శ)
   (ఆంధ్రప్రదేశ్ సాహిత్య  అకాడమీ బహూమతి 1979)
4. సంస్కృతప్రహసనసాహిత్యం (విమర్శ) - 1986
5. Hasya and Prahasana :  A Critical Study (Ph.D..thesis) - 1989
6. మత్తవిలాసప్రహసనము - తెలుగు అనువాదం - 1974
7. పూజాకుసుమమ్.          (రేడియో నాటకం..సంస్కృతం) - 1987
8. కరావలంబమ్.          (       ॥                ॥    ) - 1985
9. ధూర్తానుభవభాణః                              (సంస్కృతం)
10. గురువరరంజనభాణః                              (     ॥     )
11. కవిజనమండనభాణః                              (     ॥     )
12. నటసమాగమభాణః                              (     ॥     )
13. నికష( విశ్వధర్మవాణి మాసపత్రిక సంపాదకుడుగా వ్రాసిన
    సంపాదకీయాల సంకలనం) - 2009
14. రుక్మిణీశవిజయమ్ (సంస్కృతమహాకావ్యానికి విస్తృతంగా తెలుగు వ్యాఖ్య)
15. భవానీ భారతి (అరవిందుని సంస్కృతకావ్యానికి తెలుగు వ్యాఖ్య) - 2019
16. దశావతారస్తోత్రమ్ (వాదిరాజతీర్థరు రచనకు తెలుగువ్యాఖ్య) - 2019
17. శివానందలహరికి జ్యోతిష్మతీ వ్యాఖ్య
    ( సంస్కృతంలోనే - వ్యాకరణవిశేషప్రస్తావనతో) - 2020
18. రాధాషోడశ నామస్తోత్రం (అర్థతాత్పర్యాలు) - 2020
19. కుమారసంభవమ్(కాళిదాసరచితమ్) (అష్టమసర్గ - తెలుగులో వ్యాఖ్య) - 2021
20. ధాతృప్రశ్నః అథవా వేదాన్తమణ్డనమ్ - 2021
21. స్థావరజంగమం (గిరి,తరు, జల గీతలు - వచనకవిత) - 2021
22. భారతనిరుక్తి - నన్నయరుచిరార్థసూక్తి - 1983
23. భారతనిరుక్తి - తిక్కన సరసోక్తి
24. భారతనిరుక్తి - ఎఱ్ఱన ధర్మోక్తి
25. జనహిత వ్యాఖ్య  (ఆంధ్రమహాభారతము - విరాటపర్వము) - 1989
26. జనహితవ్యాఖ్య  (ఆంధ్రమహాభారతము - ఉద్యోగపర్వము) - 2000
27. జనహితవ్యాఖ్య..(నిర్వచనోత్తరరామాయణము - తిక్కన) - 2005

28. వ్యాసమహాభారతం - తెలుగువచనం - 2010
   (వ్యాసభారతానికియథాతథానువాదం) 20 సంపుటాలు(6000 పుటలు)
29. మహాభారతము - తెలుగు (మూలం..అనువాదం..విశేషాంశాలు..గీతాప్రెస్..గోరఖ్ పూర్ ప్రచురణ) A4 సైజులో. 7.సంపుటాలు..7250 పుటలు - 2018
30. శ్రీమహాభారతము(సంస్కృతం) విరాటపర్వము
   (జనహితవ్యాఖ్య - తెలుగులో - గీతాప్రెస్,గోరఖ్‌పూర్ ప్రచురణ) 2005

(22 - 30 గ్రంథాలకు సహరచయిత డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి)

**ఇతరాలు:**

1973 నుండి ఆకాశవాణి ద్వారా సంస్కృత పాఠాలు, సంస్కృత ప్రసంగాలు కథలు, ఏక పాత్రలు, సూక్తి సుధ, సద్వాణి, తెలుగు సాహిత్య ప్రసంగాలు

1973 నుండి జాగృతి, భారతి, నాట్యకళ, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, రచన, సమాలోచనమ్, గైర్వాణి, సుధర్మా, ఆత్మజ్యోతి, సంవిత్, సంస్కృత సమ్మేళనమ్ మొదలైన పత్రికలలో వచన కవితలు, విమర్శ వ్యాసాలు, శ్లోకాలు, నాటికలు ముద్రితాలు, బొమ్మలకొలువు - అసంపూర్ణ నవల - విద్యాజ్యోతిలో సీరియల్

1991 నుండి 'విశ్వ ధర్మ వాణి' పత్రికా సంపాదకత్వం

**కుటుంబ వివరాలు:**

శ్రీమతి : సులోచన

కుమార్తెలు : 1. మాధవి, BE (Hons) M.S
అల్లుడు : కావూరి శ్యామ్ సుందర్
మనవడు : శ్రీహర్ష
మనవరాలు : గాయత్రి

2. డా॥ సుషమ., M.B.B.S.,D.O
అల్లుడు : డా॥ ప్రవీణ్ కుమార్
మనవరాలు : వాహిని

**అభీష్ట విషయాలు** : 1. అధ్యయనం, అధ్యాపనం
2. ఆధ్యాత్మిక, అది భౌతిక జీవితాల మధ్య సమన్వయాన్ని సాధించేందుకు అనుగుణంగా విశ్లేషణాత్మక పరిశీలన
3. ఆచరణ ప్రాధాన్యం